...సిడమ్
...ంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



చందా వివరాలు:

| | |
|---|---|
| ...సంవత్సరాల చందా | రూ. 140/- |
| ...ంవత్సర చందా | రూ. 48/- |
| ...యిర్‌మెయిల్ (1 సం) | రూ. 200/- |
| ...మెయిల్ (1 సం) | రూ. 100/- |


చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
... దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద
చెన్నై - 600 004
ఫోను: 4990327


## ఈ సంచికలో


డిసెంబరు 1997
Vol. 16 No. 12




ముఖచిత్రం: కలర్‌ట్రాన్స్‌పరెన్సీ: ...కి హిందా

★ తెలుగు విస్‌డమ్‌కు ఇది 16వ సంవత్సరం ★

## ధ్యానం

# మీ బాధ్యతలను సక్రమంగా నిర్వహించండి



జేమ్స్ ఎలెన్

మీరు ప్రస్తుతం నిర్వహిస్తున్న పదవి, ఉద్యోగం మీ అభిరుచికి అనుకూలంగా ఉండని పక్షంలో, మీరు చేస్తున్న పనిలో మీ హృదయం ఇమడని పక్షంలో, మీరు మీ బాధ్యతలను అకుంఠిత దీక్షతో, శ్రద్ధతో నిర్వహించండి. అలా నిర్వహిస్తున్నప్పుడు దీనికంటే మెరుగైన పదవి, గొప్ప అవకాశం మీకోసం వేచి ఉంటాయన్న భావనను మీ మనసులో పెంచుకుంటూ రండి. చిగురించే అవకాశాల కోసం నిర్విరామంగా ఎదురు చూస్తూ ఉండండి. అలా చురుగ్గా ఉన్నప్పుడే కొత్త అవకాశం దొరికిన వెంటనే మీరు

(మిగతా3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# వేళానియమాన్ని పాటించడమే మన జీవిత ల

మన స్వభావంలో వేళానియమాన్ని పాటించడమే లక్ష్యంగా ఉండాలి. కాలానుగుణంగా సూర్యుడు సమయం తప్పకుండా ఉదయిస్తాడు. సమయం ప్రకారమే అస్తమిస్తాడు. ఈ కాలాలూ, ఋతువులూ క్రమబద్ధంగా మారుతుంటాయి. ఈ మార్పులలో కూడా ప్రకృతి ఒక వేళానియమాన్ని పాటిస్తుంది. పెద్ద నక్షత్రాలు తమ మార్గంలో ఎంత సక్రమంగా తిరుగుతున్నాయంటే అవి ఆకాశంలోనే తమ స్థానంలోనే ఉంటాయి. ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కటి సజావుగా క్రమబద్ధంగా ఉన్నట్లు మనకు అనిపిస్తుంది.

పాడే కోయిలలూ, వలసవచ్చే పక్షులూ, పూలుపూచే చెట్లూ, పండ్లుకాసే చెట్లూ, తమ తమ ఋతువులలో పుష్పించి ఫలిస్తుంటాయి. ఈ చెట్లు చేమలు, పక్షులు వేళానియమాన్ని పాటిస్తూ మనకు దాన్నే నేర్పిస్తున్నాయి. నిజం చెప్పాలంటే మన జీవితం, పెరుగుదల, వయసు, మరణం అన్నింటి ప్రణాళికను సృష్టికర్త తయారు చేసి ఉంచాడు. ఇవన్నీ కూడా సక్రమమైన వేళానియమాన్ని పాటిస్తూ ఒకటి తరువాత ఒకటిగా వస్తూ ఉంటాయి.

వ్యాపారానికి సంబంధించినంతవరకు వేళానియమాల పాలన అన్నది విడదీయ

"కృతజ్ఞత గొప్ప సుగుణం మాత్రమే కాదు, అది అన్ని సుగుణాలకు తల్లివంటిది."

— సిసెరో

రాని అంశం. ఇది మన సౌజన్యానికీ, చిత్తశుద్ధికీ, క్రమశిక్షణకూ చిహ్నం. నగరాలలో జీవితం వేగంగా ముందుకు సాగుతున్న రోజులు ఇవి. అన్ని పనులు గడియారపు



ముల్లులాగా క్రమం తప్పకుండా జరగడం అన్నది ఇక్కడ తప్పనిసరి. ఇక్కడ ప్రతి పని నిర్ణయించబడిన సమయం లోపల పూర్తి కావాలి. మీరు ఆలస్యం చేసారంటే వెనకపడిపోతారు. కొన్ని సెకండ్లలో మీరు బస్సు ఎక్కడం తప్పినప్పుడు చేరవలసిన స్థలాన్ని కొన్ని గంటల ఆలస్యంగా చేరుతారు.

వేళానియమపాలనను తమ సుగుణంగా స్వీకరించి విజయాన్ని సాధించిన వ్యక్తులు ఆలస్యంగా చేయడమనే సిద్ధాంతాన్ని ససేమిరా స్వీకరించరు. చేరవలసిన స్థలంకు కొంచెం ముందుగా చేరుతారే కానీ ఆలస్యంగా మాత్రం చేరరు.

(2వ పేజీ తరువాయి)

ఆ బాధ్యతను పూర్తిగా స్వీకరించగలరు. మీ మానసిక క్రమశిక్షణ, వివేకం, ముందుచూపు కారణంగా మీరు అక్కడ రాణించగలుగుతారు.

బాధ్యత ఏదైనా మొత్తం మనసును దానిపై లగ్నంచేసి నిర్వహించండి. మీ సామర్థ్యాన్నంతా ఆ పనిని చేయడం కోసం వినియోగించండి. చిన్న చిన్న పనులను లోపరహితంగా పూర్తి చేయగలిగినప్పుడే అది తప్పనిసరిగా గొప్ప బాధ్యతలను స్వీకరించేందుకు బాధ్యుల్ని చేస్తుంది. ఆ బాధ్యతల నిర్వహణలో మనకు గెలుపు, ఆనందం రెండూ లభిస్తాయి. ●

తాము ఇతరులను కలిసేందుకు ఇచ్చిన సమయాన్ని పాటించనప్పుడు ఇతరులను ఇబ్బందులకు గురి చేస్తారు. వారి దృష్టిలో వీరు తమ గౌరవాన్ని కూడా కోల్పోతారు.

"నేనెప్పుడు నాకివ్వబడిన సమయం కంటే అరగంట ముందుగా ఉంటాను. ఈ నియమపాలన నన్ను ఒక మనిషిగా తీర్చి దిద్దింది" అని నెల్సన్ అన్నాడు. ఆయన ఉపదేశాన్ని పాటించి గెలుపును పొందే మనిషిగా మిమ్మల్ని మీరు మలచుకోండి.

## బాగా వాసనను పట్టగల పోలార్ ఎలుగుబంటు




*తేలే మంచుకొండల (Ice floes) మధ్య పోలార్ ఎలుగుబంట్లు ఈదగలవు. మంచుపై ఇవి గంటకు 40 కి.మీ.ల వేగంతో పరుగెత్త గలవు. వాసనను పసిగట్టే శక్తి వీటికి చాలా ఎక్కువగా ఉంటుంది.*

## సుప్రసిద్ధ నవలాకారుడు

*తపాలాపెట్టి (Pillar Box)ను కనుగొన్న ఆంథోనీ ట్రొల్లోప్ (Anthony Trollope) సుప్రసిద్ధ నవలాకారుడుగా పేరు ప్రఖ్యాతులను ఆర్జించాడు. బారిస్ట్షైర్ (Barestshire) నవలతో సహా చాలా పుస్తకాలను ఇతడు రాసాడు.*

## విస్డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, సెప్టెంబరు '84 నుంచీ నవంబరు '84 (రూ. 6.50); మార్చి '85 నుంచీ జూన్ '85 (రూ. 5.50); ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, అక్టోబరు '86 (రూ. 6.00); జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, డిసెంబరు '87 (రూ. 8.50); జనవరి '88, ఏప్రిల్ '88 నుంచీ డిసెంబరు '88 (రూ. 17 00); జనవరి '89 నుంచీ డిసెంబరు '89 (రూ. 24.50); ఫిబ్రవరి '90 నుంచీ మే '90, ఆగస్టు '90, సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90 (రూ. 18.00); ఫిబ్రవరి '91 నుంచీ జూలై '91, సెప్టెంబరు '91 నుంచీ డిసెంబరు '91 (రూ. 24.00); జనవరి '92 నుంచీ డిసెంబరు '92 (రూ. 33.00); జనవరి '93 నుంచీ అక్టోబరు '93, డిసెంబరు '93 (రూ. 30.00); జనవరి '94 నుంచీ డిసెంబరు '94 (రూ. 35.00); జనవరి '95 నుంచీ డిసెంబరు '95 (రూ. 36 00); జనవరి '96 నుంచీ డిసెంబరు '96 (రూ. 36.00) కాపీలు మావద్ద ఉన్నాయి. రిజిస్టర్డ్ పోస్ట్లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 10.00 చేర్చి M.O. "రత్నా ఏజన్సీస్", 9, దేశికా రోడ్డు (ఆళ్వారు పేట వద్ద) చెన్నై - 600 004కు పంపాలి. - సర్క్యులేషన్ మేనేజర్*

"ముళ్ళమధ్యలో ఉన్న రోజాకు ముళ్ళు గుచ్చుకోవు. మరి మీ సంగతి?

# భూ ప్రదక్షిణం

౧.

ఫిజీ (Fiji) పడమటి దక్షిణ పసిఫిక్ మహాసముద్రం (Western Southern Pacific Ocean)లోని ఒక చిన్న దేశం. ఈ దేశంలో చిన్న, పెద్ద దీవులు మొత్తం 332 ఉన్నాయి. ఇందులోని 106 దీవులలో




జనసంచారం అసలు లేదు. ఈ దేశంలోని చాలావరకు దీవులు కొండలతో కూడుకున్న ఉష్ణ అరణ్యాలతో నిండి ఉన్నాయి. ఈ దేశంలోని భూములు చాలావరకు సారవంతమైనవి. ఇక్కడి వాతావరణం సామాన్యంగా వేడిగా ఉంటుంది.

ఫిజీ దీవులు న్యూజిలాండ్‌కు ఉత్తరాన సుమారు 1750 కి.మీ.ల దూరంలో ఉన్నాయి. ఈ దేశం మొత్తం విస్తీర్ణత 18,376 చ.కి.మీటర్లు. ఈ దేశం జనాభా ఎనిమిది లక్షలకు పైగా ఉంటుంది.

డచ్ దేశీయుడైన అబెల్ టాస్‌మన్ (Abel Tasman) ఈ దేశాన్ని 1643వ సంవత్సరంలో కనుగొన్నాడు. ఈ దేశం 1874వ సంవత్సరంలో ఒక కాలనీగా బ్రిటిష్ వారి అధీనంలోకి రావడం జరిగింది. స్వపరిపాలన కలిగిన కాలనీగా ఫిజీ దేశం 1963లో మారింది. 1970వ సంవత్సరం అక్టోబర్ నెల 10వ తారీఖున బ్రిటిష్ కామన్‌వెల్త్ దేశాలలో చేరి స్వతంత్ర దేశంగా మారింది. కామన్‌వెల్త్ బంధాలను తెంచుకుని ఈ దేశం 1987లో రిపబ్లిక్ దేశంగా మారింది.

ఫిజీ దీవుల అత్యధిక భాగం పుట్టుక అగ్ని

---

## ధనం యొక్క సదుపయోగాలు

*ధనం విలాసాల కోసమో లేదు సకల సౌకర్యాలను సమకూర్చుకోవడం కోసమో లేదా సంఘంలో ఒక హోదాను సంపాదించుకోవడం కోసమో ఉద్దేశించబడినది కాదు. ధనం మనిషిని ఆహార పానీయాలను కొనగలిగేలా చేస్తుంది. అది గృహనిర్మాణానికి, ఆలయ పూజకు పనికి వస్తుంది. భక్తుల, సజ్జనుల, మహాత్ముల సేవలకు ధనం ఉపయోగపడుతుంది. పేదలను సందర్శించినప్పుడు వారికి సహాయం చేసేందుకు పనికివస్తుంది. వీటినే మనం ధనం యొక్క సదుపయోగాలుగా భావించాలి.* —శ్రీరామకృష్ణ

"కార్యరూపం దాల్చని సిద్ధాంతం ప్రయోజనం లేనిది."

---

పర్వతాలతో ముడిపడి ఉంది. ఈ దేశం చుట్టూ నీటిలో మునిగిన రాతి బండలను (Coral Reefs) చూడవచ్చును. అప్పుడప్పుడు ఈ దేశం పెనుగాలులకు, పెను తుఫానుకు గురి అవుతూ ఉంటుంది.




ఫిజీలో నాలుగు మండలాలూ మరొకరి పాలనలో ఉన్న ప్రాంతాలుగా ఉన్నాయి ఈ దేశపు రాజధాని నగరమైన, సువా (Suva) ఆ దేశపు ప్రధాన నౌకా కేంద్రం కూడా. ఈ సువా నగరంలో సుమారు 71,300 మంది నివసిస్తూ ఉన్నారు. లవుటోకా (Lautoka) అని పేరున్న నగరం మరో ప్రధానమైన రేవు పట్టణం. ఈ దేశపు ప్రజలు తమ కార్యకలాపాలను నాలుగు భాషలలో - అధికార భాష ఇంగ్లీషు, ఫిజియన్, హిందీ, చైనీస్ - నిత్యం కొనసాగిస్తూ ఉంటారు. ఈ దేశపు అక్షరాస్యత శాతం 85కు చేరింది. జనాభాలో 52 శాతం క్రైస్తవులు, 38 శాతం హిందువులు, 8 శాతం మహమ్మదీయులు ఉన్నారు. ఈ దేశపు ప్రజల తలసరి ఆదాయం సాలీనా 1,945 డాలర్లు. డాలరే ఇక్కడి కరెన్సీ.

రాజ్యాంగ బద్ధమైన ప్రజాస్వామ్యాన్ని ఈ రిపబ్లిక్ దేశం ఆచరిస్తోంది. ఈ దేశపు రాష్ట్రపతి పేరు రటు సర్ కమిసరే మారా (Ratu Sir Kamisere Mara). ఈ దేశపు ప్రధానమంత్రి సిటీవెనీ రబుక (Sitiveni Rabuka) సైన్యానికి చెందిన బలవంతుడు. ఇతడు ఫిజీ దేశాన్ని 1987వ సంవత్సరం అక్టోబరు నెలలో రిపబ్లిక్‌గా ప్రకటించాడు.

ఫిజీకు చెందిన బహు సంఖ్యాకులు ఆ దేశపు రెండు విశాలమైన దీవులలో - విటి లెవు (Viti Levu), వనువ లెవు (Vanua Levu)లలో నివసిస్తున్నారు. ఫిజియన్లు వాస్తవంగా మెలనేసియన్లు (Melanesians) అనే స్థానికులు. ఫిజీ దీవులలోని మొత్తం జనాభాలో వీరి శాతం

---

## భగవంతుడు సరైన పక్షాన్నే వహిస్తాడు

*అనేక సమస్యలతో సతమతమౌతున్న అబ్రహాం లింకన్‌ను ఓదార్చేందుకు అతడి మిత్రుడు "మన వైపు భగవంతుడున్నాడు అన్న ఆశ నాకుంది" అని అన్నాడు.*

*తన ఆశ అది కాదని ఖచ్చితమైన మాటలలో లింకన్ సమాధానం ఇచ్చాడు: "నేను దానిని గురించి ఏమాత్రం దిగులు పడటం లేదు. కారణం భగవంతుడు సరైన పక్షాన్నే వహిస్తాడని మనకు తెలుసు. కానీ నా దిగులంతా నేనూ నా దేశం ఎప్పుడు భగవంతుడి పక్షం ఉండాలన్నదే."*

---

"జీవితం బంతిలాంటిది. ఎంత విసురుగా విసిరితే అంత విసురుగా తిరిగి వస్తుంది."
— డేల్ కార్నెగీ

43 దాకా ఉంది. యురోపియన్ల చెరుకు తోటలలో పనిచేసేందుకు 19వ శతాబ్దం చివరలో ఫిజీకు వచ్చిన భారతీయుల సంతతితో ప్రస్తుతం ఇది నిండి ఉంది. ఆ దేశ జనాభాలో ఈనాడు వీరి జనాభా 50 శాతం దాకా ఉంది. వీరు మాత్రమే కాకుండా యూరోపియన్లు, చైనీయులు కూడా ఉన్నారు.

చాలామంది ప్రజల ముఖ్యవృత్తి ఒకటి వ్యవసాయం లేదా మత్స్య పరిశ్రమ అయి ఉంటుంది. ఇక్కడి వారు తమ దేశంలో అరటిని, కొబ్బరి కాయలనూ, చెరకునూ పండిస్తున్నారు. ఈ వస్తువులను ఎగుమతికి వాడుకుంటున్నారు. మొక్కజొన్న బియ్యం, టారో అనబడే వేర్లతో ముడిపడిన ఆకుకూరలు, కాస్సావా (Cassava),



Roadside stalls in Suva, Fiji Islands

యామ్ (yam)లను తమ ఆహారంగా వాడుకుంటున్నారు. దేశ జనాభాలోని 25 శాతం ప్రజలకు ఈ చెరకు పరిశ్రమ జీవనోపాధిని కల్పిస్తోంది.

ఈ దేశంలో వస్త్రాలను తయారుచేసే మిల్లులు, చక్కెర మిల్లులు, కలపను కోసే మిల్లులు, వివిధాయత ఆహార పదార్థాలను తయారుచేసే మిల్లులూ, బంగారు గనులూ చాలా ఉన్నాయి.



Sitiveni Rabuka – Prime Minister of Fiji

ఫిజీ జగత్ ప్రసిద్ధిగాంచిన పర్యాటక కేంద్రం. ఉత్తర అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌కు పోయే వాయుమార్గానికి ఈ దేశం మధ్యలో ఉంటోంది. టూరిజం ద్వారానే ఈ దేశానికి ఎక్కువగా విదేశీ మారక ద్రవ్యం లభిస్తోంది. ఈ దేశంలో మొత్తం 19 విమాన కేంద్రాలు ఉన్నాయి. విదేశీ పర్యటకుల సౌకర్యార్థం ఈ దేశంలోని విమానాల సర్వీసులను వీరు చాలా పకడ్బందీగా నిర్వహిస్తున్నారు.

## బురదను చల్లకండి

*బురదను చల్లకండి. మీ గురి తప్పినా మీ చేతలు మాత్రం బురదమయం అవుతాయి.*

"ఓర్పు వివేకానికి సహవాసి." — సెయింట్ అగస్టిన్

# వైద్యశాస్త్ర దేవుడు - ధన్వంతరి ఆలయం

ఆచార్య డి. వైద్యనాథన్

వైద్యశాస్త్ర దేవుడుగా భావింపబడుతున్న ధన్వంతరి పేర కేరళ రాష్ట్రంలోని అతి ప్రాచీనమైన నెల్లువాయ దేవాలయం వెలసింది. వడక్కన్ చేర్రి రైల్వేస్టేషన్‌కు పడమటి వైపు 9 కి.మీ.ల దూరంలో ఈ నెల్లువాయ కుగ్రామం ఉంది.




మనవారు ధన్వంతరిని విష్ణుమూర్తి అవతారంగా భావిస్తున్నారు. దేవ దానవులు కలిసి పాల సముద్రాన్ని వాసుకి సర్పాన్ని కవ్వంగా చేసి చిలికినప్పుడు ధన్వంతరి ఉదయించినట్లు ప్రాచీన హిందూపురాణం చెబుతోంది. ఆయన చేతిలో అమృత కలశం తీసుకుని తన దివ్య ఆకారంతో వెలువడినట్లు రాయబడింది. అన్ని రకాల రోగాలను ఈ అమృతం దూరం చేస్తుంది. ఆ కారణంగా ఆయుర్వేదాన్ని, అలోపతి మందుల్ని అధ్యయనం చేస్తున్న ప్రతి ఒక్కరితోపాటు రోగ విముక్తిని కోరే లక్షలాది రోగులకూ ఈ క్షేత్రం పవిత్రమైన ముఖ్య యాత్రాస్థలంగా మారింది.

ఈ దేవాలయం దేవుడు పడమటివైపు చూస్తున్నాడు. గర్భగృహం రాగిరేకులతో కప్పబడి ఉంది. సరిగ్గా మధ్య భాగంలో ప్రతి చేతిలోను అమృత కలశం ఉన్న నాలుగు భుజాల ధన్వంతరి విగ్రహం విరజిల్లుతోంది. ఈ నాలుగు చేతులలో వరుసగా అమృతం, జలగ, చక్రం, గద ఉన్నట్లు విగ్రహం చెక్కబడింది.

ఇంగ్లీషు నెలలు నవంబర్, డిసెంబరులో ఈ నెల్లువాయలో నెల్లువాయ ఏకాదశి పేరుతో వార్షికోత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవాలు 37 రోజులపాటు జరుగుతాయి.

## అసత్యంతో కూడుకున్న జీవితం మృత్యువు కంటే హీనమైనది

మంచి ఆలోచనలన్నవి పరిపూర్ణతకు మొదటి మెట్టు. మంచి మాటలన్నవి రెండవ మెట్టు. మంచి పనులు మూడవ మెట్టు. అసత్యంతో కూడుకున్న జీవితాన్ని జీవించడం మృత్యువు కంటే కూడా చాలా హీనమైనది.

— జొరాష్ట్రుష

"గొప్పవారి జీవితాలే మానవాళికి ఉత్తమ గురువులు."

ఈ ఆనందదాయక ఉత్సవాల సందర్భంగానే, ముఖ్యంగా ఏకాదశి రోజున మొత్తం కేరళ రాష్ట్రంలో ఉన్న ఆయుర్వేద వైద్యులు, అలోపతి వైద్యులు గుమికూడి ధన్వంతరి దేవుడి ఆశీస్సులను వ్యక్తిగతంగా పొందడానికి ఆరోజును నెల్లువాయలో గడుపుతారు.

ధన్వంతరి పేరిట వెలసిన ఈ నెల్లువాయ ఆలయం కేరళలోని అతి ప్రాచీనమైన దేవాలయం. అంతేకాదు మొత్తం దేశంలో కూడా త్రిస్సూర్‌కు 24 కి.మీ.ల దూరంలో ఉన్న ఇరింజలకుడ భరతుడి దేవాలయంలా ఈ దేవాలయం కూడ చాలా అద్వితీయమైనదే. — 'సప్తగిరి' సౌజన్యంతో సంక్షిప్తీకరించబడినది

## మీకు చేతనైనంత బాగా చేయండి

మీరు చేపట్టిన కష్టతరమైన పని అది ఏమైనా కానివ్వండి, మీకు చేతనైనంత బాగా చేయండి. బాగా చేసిన పని ఇవ్వగలిగే తృప్తి నిజంగా బ్రహ్మాండంగా ఉంటుంది. మీరు చేసే పని గొప్ప పనా? లేదా చిన్నపనా? అన్నది సమస్య కానేకాదు. చేసే పనిని చాలా బాగా చేయండి. లేదా అసలు చేయకండి. సరైన రీతిలో పనిచేసినప్పుడు మనం పొందే ప్రతిఫలం చాలా విలువైనది. ఆ పనిని చేయని వారికి ఏమాత్రం ప్రతిఫలం ఉండదు. మీరు చేయాలని సంకల్పించుకున్న పనికి మించిన పరీక్ష అంటూ ఏ ఒకటీ ఉండదు. మీ శక్తి సామర్థ్యాలను వినియోగించండి. ఎంతవరకు సాధ్యమౌతుందో అంతవరకు బాగా చేయండి.

## రచయితకు ఉన్న రెండు అద్భుత శక్తులు

కొత్త విషయాలను తెలిసిన విషయాలుగా మార్చడం, తెలిసిన విషయాలను కొత్త విషయాలుగా మార్చడమనే రెండు అతి అద్భుత శక్తులను రచయిత కలిగి ఉంటాడు.

— శామ్యూల్ జాన్సన్

## పని - శ్రమ




పని ప్రేమను కంటికి కనబడేలా చేస్తుంది. ఇతరుల పట్ల మీలో ఉన్న ప్రగాఢ ప్రేమను పని వ్యక్తపరుస్తుంది. నీరసమైన, సుఖకరం కాని, దుఃఖాన్నిచ్చే పని ముఖం మాడ్చుకునేలా చేస్తే అది శ్రమ అనిపించుకుంటుంది. సాధన అన్నది పని వలన లభిస్తుంది. శ్రమ వల్ల కానే కాదు. ప్రేమపూర్వకంగా పని చేస్తూ గొప్పను సాధించే గుణాన్ని అలవాటు చేసుకున్నప్పుడే తప్పక మనం జీవితంలో ముందుకు రాగలం. — స్వామీ చిన్మయానంద

"మీ వ్యవహారాలను బుద్ధితో పరిష్కరించుకోవాలి. ఇతరుల వ్యవహారాలను హృదయంతో పరిష్కరించాలి."

# భారతదేశపు సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## జగదీశ్ చంద్రబోస్

## మొక్కలతో మాట్లాడగలిగిన వైజ్ఞానికుడు

ఆచార్య కె.వి. గోపాలకృష్ణ

**మొక్కలు మనుషుల లాగానే విద్యుచ్ఛక్తికి స్పందిస్తాయని, రసాయనాల తాకిడికి చిఅచిఅలాడతాయని, వేడికి ప్రతిక్రియ చూపుతాయని తొలిసారిగా జగదీశ్ చంద్రబోస్ నిరూపించి సిద్ధాంతీకరించాడు. సున్నితమైన మొక్కలపట్ల అతనికున్న ప్రగాఢ భావాల కారణంగా అతడు మొక్కలతో మాట్లాడగలడు అని అతని విద్యార్థులు భావించేవారు!**





Bose's research on plant

Jagdis Chandra Bose – Famous Scientist

ప్రస్తుతం బంగ్లాదేశ్‌లో అంతర్భాగంగా ఉంటున్న మైమెన్‌సింగ్ (Mymensingh)లో జగదీశ్ చంద్రబోస్ 1858వ సంవత్సరం నవంబరు నెల 30వ తారీఖున జన్మించాడు. ఇతడి తండ్రి భగవాన్ చంద్రబోస్ డెప్యూటీ మాజిస్ట్రేట్‌గా పనిచేసాడు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు అధికారిగా పనిచేస్తున్నా తన భాష, సంస్కృతుల పట్ల అభిమానం కలిగి ఉండేవాడు. తన తండ్రి ప్రగాఢ విశ్వాసం కారణంగానే జగదీశ్ చంద్రబోస్ తన ప్రారంభిక విద్యను పాఠశాలలో బెంగాలీ భాష ద్వారా నేర్చుకున్నాడు. ఆ కారణంగా వివిధ మతాలకు, జాతులకు చెందిన పేద పిల్లలతో కలసిమెలిసి పోవడానికి అవకాశం దొరికింది. ఆ కలవడంవల్ల అతడు ఎంతో ప్రభావితుడయ్యాడు. ఆ ప్రభావం కారణంగానే జాతికుల అభిమానాలకు దూరంగా ఉండగలిగాడు. అవి గర్వకారణాలు కావు అన్న భావన ఆయనలో అంకురించింది. చిన్న వయసు నుండే మొక్కల పట్ల,

## ప్రపంచపు అతి ప్రాచీనమైన తపాలాపెట్టె

*ప్రపంచపు అతి ప్రాచీనమైన తపాలాపెట్టె (Pillar Box) లండన్ ఎన్. డబ్ల్యూ.ఐ. వద్దనున్న కంబర్‌లాండ్ టెర్రెస్ (Cumberland Terrace)లో ఉంది. ఈ తపాలాపెట్టె స్థాపన 1867వ సంవత్సరం డిసెంబర్ నెలలో జరిగింది.*

కోసం అన్నింటిని త్యాగం చేయవచ్చును కానీ సత్యాన్ని దేనికోసరమూ త్యాగం చేయకూడదు."

స్వామీ వివేకానంద

జంతువుల పట్ల ఆసక్తి అతనిలో అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఇవి అన్నీ కలసి అతనిపై నిర్ణయాత్మక ప్రభావాన్ని చూపగలిగాయి.

11 సంవత్సరాల బాలుడైన జగదీశ్ చంద్రబోస్ కలకత్తాలోని హరే పాఠశాలలో చేర్పించబడ్డాడు. 1875వ సంవత్సరం



Bose Research Institute, Calcutta

జగదీశ్ చంద్రబోస్ సెంట్ క్సేవియర్ (St. Xaviers) కళాశాలలో చేరాడు. గొప్ప అధ్యాపకుడు ఫాదర్ లఫ్పంట్ (Father Lafunt) కారణంగా జగదీశ్ చంద్రబోస్‌కు భౌతిక శాస్త్రం అధ్యయనం పట్ల ఉత్సాహం పెరిగింది. 1880వ సంవత్సరంలో వైద్య శాస్త్రాన్ని చదివేందుకుగాను శ్రీ బోస్ లండన్ ప్రయాణం అయ్యాడు. కానీ శవ పరీక్షల కోసం చాలా జాగ్రత్తగా కోసి భద్రపరచబడిన అంగాల నుండీ వచ్చే వాసన కారణంగా అతనిలో నిద్రాణంగా ఉన్న వ్యాధి బలాన్ని పుంజుకోసాగింది. దాంతో డాక్టరు చదువును అర్థాంతరంగా మానుకోవలసి వచ్చింది. ప్రకృతి విజ్ఞానం అధ్యయనాన్ని చేబట్టి కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం నుండి 1884లో జగదీశ్ చంద్రబోస్ పట్టభద్రుడయ్యాడు.

1885వ సంవత్సరంలో బోస్ భారత దేశంకు తిరిగి వచ్చాడు. కలకత్తా రాజధాని కళాశాలలో భౌతిక శాస్త్ర ఆచార్యుడిగా పదవీ బాధ్యత నిర్వహణ భారం అతనికి అప్పజెప్పబడింది. ఒకే సంస్థలో ఒకే రకం పదవీ బాధ్యతలను నిర్వహిస్తున్న ఆ రోజులలో భారతీయులకు తెల్లవారి జీతంలో 2/3 వంతుల భాగంను మాత్రం జీతంగా ఇచ్చేవారు. కుపితుడైన జగదీశ్ చంద్రబోస్ నిరసనగా మూడు సంవత్సరాల జీతం తీసుకోవడానికి నిరాకరించాడు. ఆ తరువాత ఈ నియమానికి సవరణ తేబడింది. సరిసమానమైన జీతం ఇవ్వడం ప్రారంభించిన తరువాతనే కాలేజీ నుండీ జీతం పుచ్చుకున్నాడు. ఈ మధ్య కాలంలో అతడిపై అదనపు బాధ్యత పడింది. 1887వ సంవత్సరంలో అతడి వివాహం అబల దాస్‌తో జరిగింది. వారి సుదీర్ఘ దాంపత్య జీవిత కాలంలో ఆమె అతడికి కొండంత అండగా నిలబడి అతడిని పూర్తిగా సమర్థించింది. ఎంతో శ్రమకు ఓర్చి అతడు ఒక ప్రయోగ శాలను నిర్మించాడు.

## మీ హృదయంలో తొలుత శాంతిని నెలకొల్పుకోండి

*విశ్వశాంతిని కోరుతున్నారా?*
*అయితే మీ హృదయంలో శాంతిని స్థాపించుకోండి.*
*ఈ ప్రపంచంలో కలయికను కోరుతున్నారా?*
*అయితే మీ శరీరంలోని వివిధ అంగాలను ఏకీకరించుకోండి.* — ది మదర్

"నెపమన్నది మీరివ్వగల ఎందుకూ పనికిరాని వస్తువు."

ఆ ప్రయోగశాలలో అనేక మంది శిష్యులను అగ్రశ్రేణి వైజ్ఞానికులుగా తీర్చిదిద్దాడు.

రేడియో తరంగాల (electro magnetic waves) వల్ల మొదట అతనిలో ఆసక్తి పెరిగింది. రేడియో తరంగాలపై పని చేస్తున్నప్పుడు రేడియో రిసీవర్లు సుదీర్ఘ కాలం వరకు వాడబడడంవల్ల అలసటను పొందుతున్నట్లు అతడు గమనించాడు. అదే కావలసిన మేరకు విశ్రాంతి తీసుకున్న తరువాత మొదటిలా చురుకుగా పని చేయగలుగుతున్నాయని కూడా తెలుసుకున్నాడు. దాంతో రేడియో రిసీవర్ల అలసటకు గల కారణాలను గురించి నిర్ధారించే పనిని చేబట్టాడు. సైక్లిక్ మోలిక్యులర్ (Cyclic molecular) మార్పుల కారణంగా రెండింటిలో (ప్రాణం ఉన్నవాటిలో, ప్రాణం లేని వాటిలో) అలసట పుట్టుకొస్తుందన్న నిర్ణయానికి అతడు రాగలిగాడు. ఇదొక విప్లవాత్మక భావనగా గుర్తించబడింది. 1900వ సంవత్సరం గాలై నెలలో ఫ్రాన్స్ దేశంలో జరిగిన ఒక సదస్సులో తాను తెలుసుకున్న విషయాలను బయటపెట్టాడు. అందరూ అతన్ని తీవ్రంగా ఎదిరించారు.

ప్రేరణ లేదా ఉత్తేజాన్ని కల్పించే వస్తువుల ప్రభావం మొక్కలపై ఎలా పడుతున్నదన్న అంశాన్ని తనకు ఇష్టమైన రెండవ అంశంగా జగదీశ్ చంద్రబోస్ గ్రహించాడు. మొక్కలకు కూడా నాడీమండలం ఉందని, ఆ సున్నిత స్వభావం కారణంగానే విద్యుచ్ఛక్తి, వేడి, రసాయనిక పదార్థాలు తాకిడికి గురియైనప్పుడు తమ స్పందనను తెలియజేస్తాయన్న విషయాన్ని అతడు కనుగొన్నాడు.

విషయం కొత్తది కావడంలో తన ప్రయోగాల కోసం కొత్త పరికరాలకు రూపకల్పన చేసి కొత్త కొత్త ఉపకరణాలను తయారు చేసుకోవడం లాంటి పనులు చేస్తూ మొక్కలు ఎలా స్పందిస్తాయని తెలుసుకోడానికి అతడు అన్ని విధాలా కృషి చేసాడు. అటువంటి కొత్త వస్తువులలో "రెసొనెంట్ కార్డియోగ్రాఫ్" (Resonant Cardiograph) -

## ఆస్కార్ అవార్డును తిరస్కరించిన మార్లన్ బ్రాండో




*'ది గాడ్ ఫాదర్' అన్న సినిమాలోని నటనకు గాను 1970వ సంవత్సరపు ఆస్కార్ అవార్డు 'మార్లన్ బ్రాండో'కు ఇవ్వబడింది. కానీ హాలీవుడ్ వారు అమెరికన్ ఇండియన్ల పట్ల ప్రకటించిన సానుభూతిరహితమైన వ్యవహారాన్ని నిరసిస్తూ ఆ అవార్డును అతడు తిరస్కరించాడు.*

"స్వేచ్ఛ అన్నది మీరు ఇతరులకు ఇవ్వడానికి ఇష్టపడనప్పుడు అది మీకు దక్కని విషయం అవుతుంది."

మొక్కలు ఎలా ప్రేరేపింపబడతాయో, ఏ మేరకు ప్రేరేపింపబడతాయో తెలుసుకుని నమోదు చేసే యంత్రం), "మాగ్నెటిక్ క్రెస్కోగ్రాఫ్" (Magnetic Crescograph - కంటికి కనబడనంత సూక్ష్మంగా మొక్కలు ఎలా పెరుగుతాయో నమోదు చేయగల యంత్రం) మొదలైనవి చాలా ముఖ్యమైనవి.

మొక్కల ప్రవర్తనకు సంబంధించిన అనేక పుస్తకాలను - శరీర ధర్మశాస్త్ర పరిశోధన సాధనంగా మొక్కల ప్రతిక్రియ (Plant response as a means of physiological investigation), మొక్కల కోపతాపాలకు సంబంధించిన పరిశోధన (Researches on the irritability of plants) మొదలైన - రాసాడు. తన మాతృభాష బెంగాలీలో కూడా అనేక వైజ్ఞానిక శాస్త్రానికి సంబంధించిన వ్యాసాలను ప్రచురించాడు.

వైజ్ఞానికంగా ఆలోచించడంలో భారతీయ శాస్త్రజ్ఞులు మరెవ్వరికీ తీసిపోరన్న విషయాన్ని తన నూతన ప్రయోగాల ద్వారా అటు విదేశీయులకు ఇటు స్వదేశీయులకు చాటి చెప్పడం అతని ఏకైక లక్ష్యంగా ఉండేది.

1915వ సంవత్సరం నవంబర్ నెలలో జగదీశ్ చంద్రబోస్ ఉద్యోగ విరమణ చేసాడు. కానీ తన పరిశోధనలవల్ల లేదా దేశాభిమానం వల్ల అతనికున్న చొరవను ఈ విరమణ ఏ మాత్రం తగ్గించలేక పోయింది. దేశంలోని యువకులలో మన జాతీయ సంస్కృతిని మరచిపోని విధంగా విజ్ఞానం పట్ల ఆసక్తిని పెంపొందింపజేయాలన్న ఉద్దేశంతో 'బోస్ పరిశోధనా సంస్థ'ను అతడు స్థాపించాడు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం అతన్ని 'సర్' అన్న బిరుదుతో 1916వ సంవత్సరంలో సత్కరించింది. ఫెలో ఆఫ్ ది రాయల్ సొసైటీ సభ్యుడిగా జగదీశ్ చంద్రబోస్ 1920లో ఎన్నుకోబడ్డాడు. 1937వ సంవత్సరం నవంబరు నెల 24వ తారీఖున - తన 80వ జన్మదినోత్సవానికి కొన్ని రోజుల ముందు - జగదీశ్ చంద్రబోస్ కన్నుమూశాడు.

అవకాశాలు చాలా వచ్చినా విదేశాలలో స్థిరపడాలన్న ఆలోచన అతడికి నచ్చలేదు. తన భారతీయతను అతడు గొప్పగా చాటుకునేవాడు. అతడు భారతీయుల పురోభివృద్ధికి ఎంతో పాటుపడ్డాడు. జాతీయ ఆత్మాభిమానాన్ని ఇనుమడింపజేసే ప్రయత్నాలలో తన జీవితం చివరి ఘడియల వరకు చురుగ్గా పాల్గొంటూ వచ్చాడు. ●

## అతి ఖరీదైన కారు

*1968వ సంవత్సరంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడి వాడకం కోసం లిమోసిన్ (Limousine) కారు ప్రత్యేకంగా తయారు చేయబడింది. ఈ కారు వెల 500,000 డాలర్లు. ఇంతవరకు తయారైన కార్లలో ఇంత ఖరీదైన కారు వేరొకటి లేదు. ఇదొక లింకన్ కాంటినెంటల్ ఎగ్జిక్యూటివ్ (Lincoln Continental Executive) కారు. దీని బరువు 5 టన్నులు. ఈ 5 టన్నుల బరువులో రెండు టన్నులు ఉన్న స్టీల్ ప్లేట్లు కూడా ఉన్నాయి. ఈ కొత్త కారు గంటకు 50 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుంది. దీని పొడవు 21 అడుగుల 6.3 అంగుళాలు.*

"ఆలోచించకుండా నేర్చుకోవడం శూన్యంతో సమానం. నేర్చుకోకుండా ఆలోచించడం ప్రమాదభరితం." — కన్‌ఫ్యూసియస్

# చీమలను చూసి నేరుకోండి

రాత్రికి రాత్రి మొత్తం ప్రపంచాన్ని మార్చగలను అని అనుకునే వ్యక్తి మూర్ఖుల ప్రపంచంలో నివసిస్తూ ఉంటాడు. "మనిషి గొప్పతనం గొప్ప పనులు చేయడంలో కాదు చేసిన పనులను గొప్పగా చేయడంలోనే ఉందని" ఒకసారి విన్స్టన్ చర్చిల్ అన్నాడు.



రోమ్ నగర నిర్మాణం ఒక రోజులో జరిగింది కాదు. ఆ నిర్మాణం అన్నది తాపీ పనివాడి పనితనంగా జరిగిందే కాని ఇటుకలను విసిరే వాడివల్ల కాదు.

చీమల నుండీ కూడా మనం నేర్చుకోగలం. చీమలు గొప్పగా నిర్మాణం చేయగలవు. అణువణువును పేర్చి అవి నిర్మాణాన్ని చేపట్టుతాయి. ఆ నిర్మాణాన్ని చాలా పకడ్బందీగా అవి చేస్తాయి. చేసే పనిని చాలా తెలివిగా, నిదానంగా అవి చేస్తాయి. అవి కావాలని కానీ, అర్థం లేకుండా కానీ ఎప్పుడూ దేన్నీ ధ్వంసం చేయవు. కానీ నిర్మాణాత్మకమైన పనిని అవి ప్రేరేపిస్తాయి. ఈ పనిని అవి చేర్చూ, కూర్చూ అన్న చిన్న విషయాల ఆధారంగా చేస్తాయి.

సంపూర్ణత అన్న గుణాన్ని అలవరచుకున్న వ్యక్తే ఉపయోగకరమైన వ్యక్తి అవుతాడు.

## మాట్లాడటం కంటే మెరుగైన మౌనం

మాట్లాడటం కంటే మౌనం మెరుగైంది. తప్పనిసరిగా మాట్లాడవలసినప్పుడు నిజాన్ని మాట్లాడండి. ఆ నిజము అన్నదాన్ని నీతి బద్ధమైన ఇంపైన నిజంగా ఉండేలా చూసుకోండి. ఏ ఒక్కరిపట్ల ఈర్ష్యా ద్వేషాలను పెంచుకోని వ్యక్తి అందరి మేలును కోరే వ్యక్తి నిజాయితీపరుడిగా ఉంటూ వినయగుణాన్ని కలిగిన వ్యక్తి తనపై నిగ్రహం గల వ్యక్తి నిజంగా ఉత్తముడు. ధనం లేనివాడు లోటు ఉన్న వ్యక్తి కాదు. సభ్యత లేని వ్యక్తే నిజంగా లోటు ఉన్న వ్యక్తి. తియ్యగా, ఒప్పించే విధంగా మాట్లాడే వ్యక్తులు చాలామంది ఉన్నారు. మనతో ఏకీభవించకపోయినా, మంచి సలహాలను ఇచ్చేవారు కొంతమంది మాత్రమే ఉన్నారు. తియ్యగా ఉంటూ ఆరోగ్యాన్ని సరిదిద్దగల మందులాంటి వ్యక్తులు ఈ ప్రపంచంలో చాలా అరుదుగా ఉంటారు.

— విదురనీతి

"రోజాలను అందించే చేతికి కొంత సువాసన అంటుకుంటుంది."

— చైనా సామెత

# సినిమా వాస్తవాలు

## గాయక నటుడిగా మారిన సేల్స్‌మన్




గాయక నటుడిగా మారక ముందు శ్రీ కుందన్‌లాల్ సైగల్ రెమింగ్‌టన్ టైప్ రైటర్స్‌కు సేల్స్‌మన్‌గా పనిచేసాడు.

## భారతదేశంలో తయారైన ఏకైక ఇరానియన్ సినిమా

దుఖ్‌తర్ హూర్ (Dukhtare Hoor) అనే ఇరానీ భాషా చిత్రం భారత దేశంలో తయారైన ఏకైక ఇరానీ చిత్రం. అర్దేషిర్ ఇరాని (Ardeshir Irani) ఈ చిత్రాన్ని 1933లో నిర్మించాడు.

## 'గోరా'కు సంగీత దర్శకత్వం వహించిన ప్రముఖ బెంగాలీ కవి

రవీంద్రనాథ్ ఠాగూర్ రచించిన సుప్రసిద్ధ నవల గోరాను దర్శకుడు నరేష్ మిత్ర సినిమాగా తీసాడు. సుప్రసిద్ధ బెంగాలీ జాతీయతావాది కవి కాజీ నజరుల్ ఇస్లాం దీనికి సంగీత దర్శకత్వం వహించాడు.

## అంతర్జాతీయ సినిమా ఉత్సవాలలో బహుమతి పొందిన తొలి భారతీయ చిత్రం

ఎమిలె జోల (Emile Zola) రచన "లోయర్ డెప్త్స్" ఆధారంగా నిర్మింపబడిన హిందీ సినిమా "నీచా నగర్" అంతర్జాతీయ ఫిల్మోత్సవాలలో బహుమతిని పొందిన తొలి భారతీయ భాషా చిత్రం. 1946లో కార్లోవి వేరీ (Karlovy Vary) వద్ద జరిగిన ఫిల్మోత్సవంలో ఈ చిత్రం అంతర్జాతీయ బహుమతిని పొందింది.

## మీ ఆలోచనలను గమనించండి

*మీ మాటలుగా మారే*
*మీ ఆలోచనలను గమనించండి.*
*మీ కార్యరూపాన్ని పొందే*
*మీ మాటలను పరీక్షించండి.*
*మీ అలవాట్లుగా రూపుదిద్దుకునే*
*మీ కార్యరూపాన్ని నిరీక్షించండి.*
*మీ స్వభావాన్ని మలచే*
*మీ అలవాట్లపై దృష్టిని సారించండి.*

"మనం ఇతరులకు ఇచ్చే సలహాలను పాటించడమే ఉత్తమ విజయ మార్గం."

# 88 సంవత్సరాల క్రితం సైబీరియాలో ప్రేలిన తోకచుక్క

1908వ సంవత్సరం జూన్ నెల 30వ తారీఖు పొద్దున రష్యాలోని తూర్పు సైబీరియాలో ఉన్న ప్రజలు ఒక ప్రకాశవంతమైన వస్తువు తన వెనుక ప్రకాశాన్ని వదులుతూ ఆకాశంలో ప్రయాణం చేయడాన్ని చూసారు. ఆ తరువాత వారు పెద్ద ప్రేలుడు ధ్వని విన్నారు. ఆ ప్రేలుడు కోనిఫెరస్ అడవిలో జరిగింది. ఆ ప్రేలుడు శబ్దం వెయ్యి మైళ్ళ దూరం వరకు వినబడింది.

అప్పుడు సైబీరియాకు చెందిన అనేక గ్రామాలలో కిటికీల అద్దాలు కిందపడ్డాయి. పింగాణీ సామాన్లు కిందపడి పగిలిపోయాయి. ఆ ప్రేలుడు బద్దలు చేసే అలలను సృష్టించింది. దానికి అక్కడి ప్రజలు



బలి అయ్యారు. పశువులు కూడా బలి అయ్యాయి. ప్రపంచంలోని వివిధ సాధనాలు కుదుపులను భూకంపం సమయంలో వచ్చే కుదుపులను పోలినట్లు నమోదు చేసాయి. చాలా రాత్రిళ్ళు ఆకాశం కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతితో నిండి ఉండడం వల్ల



Tunguska Forest area where meteorite fell

ప్రజలు చదవడం గానీ, రాయడం గానీ చేయలేకపోయారు. ('మిష') ●

## ప్రపంచపు అతి చిన్న టైప్‌రైటర్

డానిష్ సాంకేతిక మ్యూజియంలో అరచేతిలో ఇమిడేటంతటి చిన్న సైజు టైప్‌రైటర్ ఉంది. ప్రపంచంలో ఉన్న చిన్న సైజు టైప్ రైటర్లలో బహుశా ఇదే అతి చిన్న టైప్‌రైటర్ అయి ఉంటుంది. దీనికి రెండు చిన్న రోలర్లు అమర్చబడి ఉన్నాయి. ఈ రోలర్ల కారణంగా టైప్‌ల కింద తక్కువ వెడల్పున్న కాగితం అమర్చడానికి వీలవుతుంది. 1878వ సంవత్సరంలో టైపు చేయబడిన ఒక కరపత్రంను రుజువు పరిచేందుకు దీన్ని బయటపెట్టడం జరిగింది.

"తక్కువ ఆహారం కన్నా ఎక్కువ ఆహారం తీసుకోవడం వల్లనే చాలామంది మరణిస్తున్నారు."

# అభివృద్ధిని సాధించడం ఎలా?

ప్రకాష్ జె.షా

ప్రొద్దున్న లేవడంతోనే ఆ రోజును సక్రమమైన ఆలోచనలతో ప్రారంభించండి. మీకు ధనవంతులుగా ఉండే అర్హత అన్ని విధాలుగా ఉంది. సరైన ప్రయత్నాలు చేసినప్పుడే ఒక వ్యక్తి ధనవంతుడు కాగలడు.



'సమృద్ధి, ప్రేమతో పాటు మీకు కావలసినంత డబ్బును మీరు పొందగలరు. ఆలోచనలలో పేదతనం మిమ్మల్ని పేదల్ని చేస్తుంది. ఆలోచనలలో ఔన్నత్యం ఉన్నప్పుడు మీరు ధనవంతులు కాగలరు, ఔన్నత్యాన్ని పొందగలరు.

మీ వ్యక్తిత్వపు పొడిగింపే మీధనం. మిమ్మల్ని మీరు ప్రేమించడం ప్రారంభించండి. అంతకు అంత మీరు ధనాన్ని మీ వైపుకు ఆకర్షించుకోగలుగుతారు. అప్పుడే మీరు మీ ధనాన్ని మరింత ఎక్కువగా అనుభవించగలరు.

ఆత్మగౌరవం అన్న భావనే మీ సుఖశాంతులను, భోగభాగ్యాలను పెంచగల ఏకైక సాధనం. నేను తప్పక చేయగలను, సాధించగలను అన్న నమ్మకాన్ని మీరు పెంచుకోండి. దాన్ని పొందే అర్హత మీకు ఉందన్న గట్టినమ్మకాన్ని కలిగి ఉండండి. పొందాలన్న బలమైన కోరికలో విశ్వాసాన్ని కలిగి ఉండండి. మీరు దాన్ని తప్పక పొందగలరు.

మీకు ఏమి కావాలన్నా స్పష్టమైన అవగాహన, దాన్ని పొందాలన్న ఆంతరంగిక నిర్ణయం ఉన్నంతవరకు మీవద్దకు డబ్బు వస్తుంది.

గొప్ప ఆలోచనాపరుడు అయిన రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ ఒకసారి "మనిషి

## 1996లోని సాధారణ ఎన్నికలు ఓటర్ల సంఖ్య

*1996వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో ఓటర్ల సంఖ్య 620 మిలియన్లకు మించినట్లు లెక్కలు చెబుతున్నాయి. ఈ సంఖ్య ప్రపంచపు రెండవ అతి పెద్ద ప్రజా ప్రభుత్వంగల దేశంగా పరిగణింపబడుతున్న అమెరికా జన సంఖ్య కంటే కూడా ఎక్కువ.*

"దేశ ప్రజలు దేశాన్ని ఎంత మంచిగా, ఎంత గొప్పగా మార్చగలరో దేశం అలా అవుతుంది."

ధనవంతుడు కావడానికే పుట్టాడు లేదా ఎలాంటి అవరోధాలు లేకుండా తప్పని సరిగా సంపదను తన సామర్థ్యంతో వృద్ధి చేసుకోవడానికే అతడు పుట్టాడు" అని అన్నాడు.

మీ అంతరాత్మలో ఎనలేని లెక్కలేనన్ని అమూల్యమైన భావాలు ఉన్నాయన్న నమ్మకాన్ని కలిగి ఉండండి.

మీ వ్యక్తిగత సుఖసంతోషాల కోసం ఇతరులను దుఃఖం పాలు చేయకండి. ఇతరులను సంతోషపెట్టగలిగితే, ఇతరులను సుఖపెట్టగలిగితే వారు మీకు అనేక విధాలుగా సహాయపడడానికి సిద్ధంగా ఉండి ముందుకు వస్తారు.

వినయశీలురుగా ఉండండి. నేను గొప్పవాణ్ణి అని అహం భావనను కలిగి ఉండకండి. అపరిచితులతో కూడా మీరు మీ తోబుట్టువులను పలకరించినట్లు వారితో కలవండి. దీని పరిణామం చాలా అద్భుతంగా ఉంటుంది, అద్భుత ఫలితాల్ని ఇది ఇస్తుంది.

సరైన మానవ సంబంధాలు మిమ్మల్ని ముందుకు తీసుకుపోగలవు. అంతే కాదు సమృద్ధి శిఖరాలను కూడా మీరు అధిరోహించగలరు.

విజయపరమైన అనుభవాన్ని మీ సొంతం చేసుకోండి. మీరు కొత్త పంథాల కోసం, కొత్త భావాల కోసం, ఎదురు చూస్తున్నప్పుడు విషయం తెలిసిన వ్యక్తులను సంప్రదించండి. మీరు ఎలాంటి దాపరికం లేకుండా నిజాయితీతో సలహాలను అడిగి నప్పుడు నిస్సంకోచంగా సలహాలను ఇవ్వడానికి ప్రజలు సంసిద్ధులుగా ఉంటారు. విజయవంతులైన వారు మీకు సహాయపడడానికి సంతోషంగా ముందుకువస్తారు.

అభివృద్ధి సిద్ధాంతంలో పరిస్థితులు మరింత మంచిగా మారగలవన్న నమ్మకం కలిగి ఉండండి. అప్పుడు మీరు ఎల్లప్పుడూ ఎదుగుతూ పోగలరు. మీ దగ్గరున్న సంపదల విలువ పెరుగుతుంది.

ముందుకు సాగాలన్న భావన, అభివృద్ధి సూత్రం అన్నవి ప్రాథమిక భోగభాగ్యాల వృత్తంలో అంతర్భాగాలు. మనమంతా ఈ కాలచక్రపు అంతర్భాగాలమే.

మీరు దీన్ని గుర్తించగలిగితే ఇది మీ జీవితంలోనే ఒక భాగమని మీరు తెలుసుకోగలిగితే పరిస్థితులు మన మంచికోసం మరింత మంచికోసమే మారుతున్నాయన్న భావనను అనుభవించి చూడగలరు.

సిరిసంపదలు లేక భోగభాగ్యాల అవగాహన లేక తెలుసుకుని ఉండడం అన్నది సక్రమ విశ్వాస సిద్ధాంతం అనిపించుకుంటుంది. అదేవిధంగా దుఃఖాల, కష్టాల అవగాహన అన్నది వక్ర విశ్వాసం సిద్ధాంతం అవుతుంది. ప్రతిరోజు మీ మనసులో లెక్కలేనన్ని సార్లు "నాకు కావాలి... నాకు అర్హత ఉంది... నేను సాధించగలను" అన్న మాటలను అనేకసార్లు మననం చేసుకోవాలి.

"కర్తవ్యాల్ని నిర్వహించండి. ఆకురాలు కాలాన్ని వసంతం అనుసరించినట్లు హక్కులు వస్తాయి."

# ఆణిముత్యాలు

* "చదువు నాగరికతలపై ఎలాంటి తుది నిర్ణయాన్ని మనం తీసుకోలేము.




అవి జాతి, కుల, మత, వర్ణ విభేదాలకు అతీతం." — అబుల్ కలామ్ అజాద్


SUBRAMANIYA BHARATHI

* "జాతీయ సంపదకు అర్థం ఏమి? విద్యా సంపద గుణశీలాల సంపదలతో భౌతిక సంపదల కలయికనే జాతీయ సంపద అంటారు." — సుబ్రహ్మణ్య భారతి


Rabindranath Tagore

* "మానసిక స్వాతంత్రమే నిజమైన ఆధునికుల భావం అవుతుందే కాని బానిసత్వానికి అభిరుచి కాదు. అదే మానసిక క్రియాత్మక స్వాతంత్ర్యం అనిపించుకుంటుంది."

— రవీంద్రనాథ్ ఠాగూర్

## అశోకుడి కాలం నాటి జనాభా

*అశోకుడు పరిపాలించిన రోజులలో అంటే క్రీ.పూ. 242వ సంవత్సరంలో భారతదేశపు జనాభా దాదాపుగా 20 మిలియన్లుగా ఉండేది. ఈ జనాభా మొగలాయి చక్రవర్తి అక్బర్ కాలం (1556-1605) వరకు మారకుండా అలాగే ఉండిపోయింది.*

"ఎలా ఆలోచిస్తామో అలా తయారవుతాము."

* "మనం చదివిన దాన్ని గురించి ఆలోచించాలి. ఆ తరువాత దాన్ని జీర్ణం




చేసుకుని మన జీవితపు అంతర్భాగంగా దాన్ని మార్చుకోవాలి. — మహాత్మాగాంధీ



* "ఆహారాన్ని మాత్రమే భుజించి మనిషి బతకలేడు. ఆలోచనలకు ప్రేరణనిచ్చే ఆహారాన్ని కోరే మెదడు కూడా అతడి వద్ద ఉంది."

— డా॥ బి.ఆర్. అంబేద్కర్

* "అసలు మనిషి పుస్తకాలను ఎందుకు చదువుతాడు? బహుముఖాలతో కూడుకున్న




జీవితాన్ని అర్థం చేసుకునేందుకు, జీవితాన్ని ఎలా జీవించాలో తెలుసుకునేందుకు మనిషి పుస్తకాలను చదువుతుంటాడు."

— జవహర్‌లాల్ నెహ్రూ

— ('ఇన్‌స్పిరేషనల్ కోట్') ●

# నమ్మకం కార్యరూపమే ఉత్సాహం

ఉత్సాహం ఈ ప్రపంచపు అతి గొప్ప సంపద. ఉత్సాహం ధనాన్ని, బలాన్ని, పలుకుబడిని పూర్తిగా ఓడిస్తుంది. పూర్వభావనను, వ్యతిరేకతను, ఉత్సాహం తన పాదాల క్రింద వేసుకుని నలిపేస్తుంది. ఇది సోమరితనాన్నీ, పనిచేయకపోవడమనే గుణాన్నీ త్రోసివేస్తుంది. తన లక్ష్యసాధన కోసం కోటలను కూడా ముట్టడిస్తుంది. అన్ని ఆటంకాలను, అవరోధాలను అవలీలగా దాటేస్తుంది. విశ్వాసపు కార్యరూపమే ఉత్సాహం అని చెప్పడంలో ఎలాంటి అతిశయోక్తిలేదు. — హెన్రీ ఫోర్డ్

"పరిగెత్తడానికి ముందు నిలకడగా నిలవడం నేర్చుకోవాలి."

---

# చక్కెర వ్యాధికి సంబంధించిన వాస్తవాలు

డా.యు. వాసుదేవరావు

ఎబర్స్ పేపిరస్ (ఈజిప్టు 1500 BC)లో - చక్కెర వ్యాధి అనే మాట వాడబడింది. మనదేశపు సుప్రసిద్ధ వైద్యుడు శుశ్రుతుడు క్రీ.పూ. 400 సంవత్సరంలో ఈ వ్యాధిని తేనె మూత్రం (Honey urine)గా అభివర్ణించాడు. క్రీ.శ. ఆరంభమైన మొదటి శతాబ్దంలోనే ఈ వ్యాధి రోమన్, చైనా,




జపాను భాషా గ్రంథాలలో నమోదై ఉంది. డయబెటిస్ (Diabetes) అన్న పదాన్ని తొలుత గ్రీకులు వాడారు. ఈ పదం "నీళ్ళ ద్వారా విసర్జనం (A Passing through of Water) అన్న అర్థాన్ని ఇస్తుంది. మూత్రాన్ని వేడిచేసి పరీక్షించి, ఆవిరిచేసి డాక్టర్ విల్లిస్ 1674వ సంవత్సరంలో అందులో జిగటలాంటి పదార్థం ఉందని కనుగొన్నాడు. ఆ ఉన్న వస్తువు చక్కెరే. కానీ అప్పట్లో ఇంగ్లాండు వారికి చక్కెర విషయం తెలియదు. వారికి తెలిసిన తియ్యటి రుచిగల పదార్థం తేనె మాత్రమే. ఆ కారణంగానే తేనె అని అర్థాన్నిచ్చే 'మెల్' (MEL) అన్నమాట వాడుకలోకి రావడంతో ఈ వ్యాధి డయాబిటిస్ మెల్లిటస్ (Diabetes Mellitus)గా - మూత్రంలో తేనె విసర్జన అని - గుర్తించబడింది.

డయబెటిస్ (చక్కెర వ్యాధి) అంటే ఏమిటి?

ప్రాథమికంగా తినుబండారాలు మూడు రకాల (కార్బోహైడ్రేట్లు, మాంసకృత్తులు, కొవ్వు) పదార్థాలతో ముడిపడి ఉంటాయి. అన్ని రకాల పిండి పదార్థాలకు గ్లూకోజ్ ముఖ్య ఆధారం. ఇది మనకు గంజితో నిండిన (గోధుమ, ఉర్లగడ్డ, బియ్యం) అన్ని పదార్థాల ద్వారా లభిస్తుంది. గ్లూకోజ్‌ను వాడే విధానం,

## ప్రపంచపు మూడవ అతి పెద్ద మంచుగడ్డ

*మధ్య ఆశియా ఖండంలో కారాకుమ్ (Karakum) పర్వత ప్రాంతంలోని టర్క్‌మెనిస్తాన్ (Turkmenistan) వద్దనున్న మంచుగడ్డలు (Glacier) ప్రపంచంలో ఉన్న మంచు గడ్డలలో - అంటార్కిటిక్ ఉత్తర ధృవం తరువాత - మూడవస్థానంలో ఉందన్న సంగతిని వైజ్ఞానికులు ధృవీకరించారు.*

"ప్రశంసకు పాత్రమైనంత మాత్రాన ఏది సరికాదు. ఇతరులు తోసి పుచ్చినంత మాత్రాన ఏది సరికానిది కాదు."

నిలువ ఉంచే విధానం చాలా కష్టంగా ఉంటుంది. ఈ విధానంలో ముఖ్యమైన విషయం హార్మోన్ ఇన్సులిన్. మన శరీర రక్తంలో పెరిగే చక్కెర స్థాయికి లేదా మనం సాధారణంగా భుజించే ఆహారంకు



Thomas Willis – Discoverer of Diabetes mellitus

సరిపోయేలా పాన్క్రియా గ్రంధులలో ఇన్సులిన్ ఊరుతుంటుంది. ఈ ఇన్సులిన్ పరిమాణం తగ్గినప్పుడు ఎలా గ్లూకోజ్ రక్తంలో కలిసిపోయి చక్కెర స్థాయిని పెంచుతుందన్న విషయాన్ని మనం అర్థం చేసుకోగలం. రక్తంలోని గ్లూకోజ్ స్థాయి ఒక నిర్ణీత స్థాయి (సాధారణంగా 1 80 మిల్లీగ్రాముల శాతం కంటే ఎక్కువ) కంటే ఎక్కువైనప్పుడు మూత్ర పిండం ఈ స్థాయిని రక్తంలో ఉంచుకోలేకపోతోంది. దాంతో అది రక్తం నుండి మూత్రం లోకి ఒలుకు (Spills) తుంది. ఆ విధంగా మూత్రంలో చక్కెర కలిసిపోతుంది. మధుమేహం రోగిని పరీక్షించినప్పుడు మూత్రంలో చక్కెర ఉంటే అది రాబోయే వ్యాధికి ఒక హెచ్చరికగా భావించాలి. అదే రక్తంలో చక్కెర స్థాయి హెచ్చుగా ఉన్నప్పుడు వ్యాధి ఉన్నట్లు ధృవీకరించబడుతుంది.

చక్కెర వ్యాధి రకాలు:

చిన్న వయసులోనే వచ్చే రకం: ఈ రకం వ్యాధి 30 సంవత్సరాల కంటే తక్కువ వయసున్న వారికి వస్తుంది. కారణం వారి పాన్క్రియాస్ కావలసినంత ఇన్సులిన్ను ఉత్పత్తి చేయలేకపోవడమే. సాధారణంగా దీని తయారీ తక్కువ మోతాదులో ఉండడమో లేదా తయారీ బొత్తిగా లేకపోవడమో అయి ఉంటుంది. ఈ కోవకు చెందిన వారికి ఇన్సులిన్ చికిత్స ఇవ్వవలసి ఉంటుంది.

పక్వత చెందిన వయసులో వచ్చే రకం: ఈ రకం చక్కెర వ్యాధి సాధారణంగా4 0 సంవత్సరాల వయసుకు మించిన వారిలో కనబడుతుంది. కావలసినంత ఇన్సులిన్ లేకపోవడమో లేక ఎక్కువ లావుగా ఉండడం వల్లనో లేదా రెండింటి కలయిక దీనికి కారణం అవుతుంది. ఇటువంటి రకాలను సాధారణంగా ఇన్సులిన్ వాడకుండానే నరిచేయవచ్చును.

## కళ - కళాకారులు

** లలిత కళలలో చేయి, తల, హృదయం కలిసి ఒకటిగా పనిచేస్తాయి. — రస్కిన్*

** ప్రకృతి భగవంతుడి దివ్య వార్త. కళ మానవుడి దివ్య వార్త. — లాంగ్‌ఫెలో*

** భావాలు లేని కళాకారుడు రంగులు వాడని చిత్రకారుడు. — జె.ఎమ్. బ్యారి*

"మీరు అనుకుంటున్న దాన్ని వ్యక్తపరచడానికి ఎక్కువ మాటలు కావల్సివస్తే, ఇంకాస్త ఎక్కువగా ఆలోచించండి." — డెన్నిస్ రత్

చక్కెర వ్యాధి వంశపారంపర్యమా?

ఈ వ్యాధితో బాధపడేవారికి చాలావరకు వంశపారంపర్యమే ప్రధాన కారణంగా ఉంటుంది. వంశపారంపర్యంగా సంక్రమించడం అన్నది చిన్న వయసులో వచ్చే వారికంటే పెద్ద వయసులో వచ్చేవారికి




సంక్రమించే అవకాశాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. పెద్ద వయసులో ఈ చక్కెర వ్యాధి సోకిన వారి పిల్లలలో ఒకరు పెద్ద వయసులో ఈ వ్యాధికి గురి అయ్యే అవకాశం 40 శాతం దాకా ఉంది. కానీ చిన్న వయసులో ఈ వ్యాధికి వారి సంతానంలో ఒకరు గురి అయ్యే అవకాశం ఒక శాతం మాత్రమే ఉంటుంది.

మధుమేహం వ్యాధికి పత్యం అవసరమా?

చక్కెర వ్యాధి లేదా మధుమేహంతో బాధపడేవారి చికిత్సలోని ప్రధాన అంశం నిస్సందేహంగా పత్యమే.

ముఖ్యమైన సూత్రాలు

- చక్కెర లేదా తీపి పదార్థాలను లేదా చక్కెర అతి ఎక్కువగా వాడబడిన ఆహారాన్ని మానడం.

- తరచుగా తింటూ ఉండండి. మీరు రోజూ పగటిపూట తినే ఆహారాన్ని సమంగా విభజించి తినండి. ఈ మాటకు అర్థం అతిగా తినాలని కాదు. మనం తీసుకునే మందులు, మాత్రలు పనిచేయాలంటే ఒక నిర్ణీతమైన సక్రమ ఆహారం అవసరం ఎంతైనా ఉంది.

మనం ప్రతిసారి ఆహారం తీసుకుంటున్నప్పుడు కాలరీలు పిండిపదార్థాలకు, మాంసకృత్తులకు, కొవ్వు పదార్థాలకు సమ నిష్పత్తిలో ఉండాలి. ఈ విధంగా తీసుకున్నప్పుడే వ్యాధి చికిత్స సులభం అవుతుంది.

మధుమేహం చికిత్స: చిన్నవయసులో ఈ వ్యాధికి గురైన వారి విషయంలో ఇన్సులిన్ వాడకం సహజంగా జరుగుతుంది. దీన్నే శరీరంలో తయారుకాని ఇన్సులిన్‌ను బయట నుండి సరఫరా చేసే విధానం అంటారు. మరో మార్గం కూడా ఉంది.

## సమస్త విద్యలకు ఆలవాలమైన హృదయం

*నదులన్నీ సముద్రంలో కలుస్తున్నట్లు, సమస్త స్పర్శలకు చర్మం కేంద్రం అయినట్లు, అన్ని రుచులకు నాలుక ఆధారం అయినట్లు, అన్ని వాసనలను ముక్కు పసికట్టినట్లు, అన్ని రంగులను కనులు చూడగలిగినట్లు, అన్ని ఉపదేశాలు మనసులో నిలువ ఉన్నట్లు, అన్ని విద్యలకు హృదయమే ఆలవాలం.*

— హిందూమతం

"మనం పోరాడినప్పుడే భగవంతుడు మనకు జయాన్ని ప్రసాదిస్తాడు."

కానీ చక్కెర వ్యాధి విరుగుడు మాత్రలను, మందులను వాడి పాన్‌క్రియాసుకు ఎక్కువ ఇన్సులిన్ తయారు చేసుకునేందుకు తగిన శక్తిని ఇవ్వడం జరుగుతుంది. అప్పుడప్పుడు మందుల వాడకం వల్ల కణజాలం ఉన్న వాటితో సర్దుకు పోతూ ఉంటుంది.




గుర్తుంచుకోవలసిన విషయాలు:

వ్యాయామం: వ్యాయామం ఇన్సులిన్ పనిని ప్రభావితం చేసి రక్తంలోని చక్కెర స్థాయిని తగ్గిస్తుంది. వ్యాయామం అన్నది మధ్యే మార్గంగా ఉండాలి. చేయవలసిన వ్యాయామాన్ని గురించి డాక్టరు సలహాను పొందండి.

పత్యం ప్రాముఖ్యత: సరైన పత్యం అవసరం ఎంతో ఉంది. పత్యం ఉన్నప్పుడే మనం తీసుకునే చక్కెర వ్యాధి నివారణ మందులు బాగా పనిచేస్తాయి. తీసుకునే పత్యం కావలసినంత మాత్రమే కాకుండా స్థిరంగా, సంపూర్ణంగా ఉండాలి.

పాదాల జాగ్రత్త: ఈ వ్యాధి ఉన్నవారికి తమ కాళ్ళను, పాదాలను గురించి శ్రద్ధ తీసుకోవాలి. అలా జాగ్రత్త తీసుకోని పక్షంలో కాలి వేళ్ళకు అయిన గాయాలు మానకుండా ఉండే అవకాశం ఉంది. కావలసిన ఆరోగ్య పరమైన జాగ్రత్తలు తీసుకోకపోవడం వల్ల అంటురోగాలకు గురి అయ్యే అవకాశం కూడా ఉంది.

## డార్జిలింగ్ పేరు పుట్టు పూర్వోత్తరాలు




*ఉత్తర బెంగాలులోని డార్జిలింగ్ పర్వత ప్రాంత ఆరోగ్య పట్టణాల రాణి. "డోర్జి నివాసం' అని అర్థాన్ని ఇచ్చే డోర్జెలింగ్ (Dorjeling) అన్న మాట కాలక్రమేణా మార్పులను చెందుతూ నేటి డార్జిలింగ్‌గా మారింది. ఇండోటిబెటన్ బౌద్ధమతంలో ఈ మాటకు అర్థం "గొప్ప పిడుగు" (Majestic Thunderbolt) ఇది కొండపై వెలసిన బౌద్ధారామమైన వేధశాల (Observatory) పేరు. డోర్జి అని పేరున్న లామా బహుశా ఈ బౌద్ధారామాన్ని నిర్మించి ఉంటాడు.*

'మీరు తినేది ఆహారం అయితే మిమ్మల్ని పోషించేది పౌష్టికత అవుతుంది.''

— హెల్త్ హెరాల్డ్

వ్యక్తిగతంగా తాము ఈ వ్యాధికి గురి అయ్యామన్న ప్రకటన: ఈ వ్యాధికి గురై ఇన్సులిన్ చికిత్స తీసుకుంటున్న వారు మధుమేహంను సూచించే బిళ్ళను లేదా గుర్తింపు కార్డును లేదా ఏదైనా లోహంతో తయారుచేయబడిన కడియంను వేసుకోవాలి. ఈ ఒక్క జాగ్రత్త తీసుకోవడం వల్ల ప్రాణం రక్షింపబడే అవకాశాలు - ముఖ్యంగా శరీరంలో చక్కెర స్థాయి బాగా పడిపోయి నప్పుడో లేదా ప్రమాదానికి గురి అయి స్పృహ తప్పిపోయినప్పుడో చాలా ఉపయోగ కరంగా ఉంటుంది.

వివాహం - చక్కెర వ్యాధి: చక్కెర వ్యాధితో బాధపడేవారికి వివాహ వ్యవస్థ చాలా ఉత్తమ మైనది. వివాహం క్రమశిక్షణాయుతమైన గృహ జీవితాన్ని ప్రసాదిస్తుంది. అంతేకాదు, వారికి కావలసిన మనస్తత్వ ప్రధానమైన శారీరక బలం భార్యా/భర్త ద్వారా లభిస్తుంది.

దాంపత్య జీవితం - చక్కెర వ్యాధి: చక్కెర వ్యాధికి గురైన ప్రతి వ్యక్తి సర్వ సాధారణమైన దాంపత్య జీవితాన్ని అనుభ వించగలడు. చాలా అరుదుగా ఈ వ్యాధి వల్ల పురుష జననాంగాన్ని కలిపే నరం కారణంగా అతడు దాంపత్య జీవితాన్ని కోల్పోతాడు. చక్కెర వ్యాధితో బాధపడే వ్యక్తి చురుకైన జీవితాన్ని అనుభవించగలడు. కావల్సినదంతా జీవిత విధానంలో కొన్ని మార్పులను గ్రహించగలగడమే.

(— "బులిటిన్ ఆఫ్ ది లయన్స్ క్లబ్ ఆఫ్ జార్జ్ టౌన్" సౌజన్యంతో)

# టెస్ట్ క్రికెట్‌లో ఎక్కువ వికెట్లను తీసుకున్న ఘనత



*1956వ సంవత్సరం జూలై నెలలో ఓల్డ్ ట్రఫోర్డ్ వద్ద ఇంగ్లాండు జట్టుకు, ఆస్ట్రేలియా జట్టుకు మధ్య నాల్గవ టెస్ట్ మ్యాచ్ జరిగింది. ఆ టెస్ట్ మాచ్‌లో ఇంగ్లాండులోని సర్రే (Surrey)కు చెందిన బౌలర్ జేమ్స్ ఛార్లెస్ లాకర్ (James Charles Laker) రెండు ఇన్నింగ్స్‌లో (మొదటి ఇన్నింగ్స్‌లో 37 పరుగులకు 9 వికెట్లు, రెండవ ఇన్నింగ్స్‌లో 53 పరుగులకు 10 వికెట్లు) 90 పరుగులిచ్చి మొత్తం 19 వికెట్లను తీసుకున్నాడు. టెస్ట్ క్రికెట్ చరిత్రలో ఇన్ని వికెట్లను పడగొట్టిన వ్యక్తి ఇంకొకడు లేడు.*

# భారతదేశపు తొలి అణుశక్తి కేంద్రం

*మహారాష్ట్రలోని తారాపూర్ వద్దనున్న బాబా అణుశక్తి కేంద్రం (Bhabha Atomic Power Station) మన దేశపు తొలి అణుశక్తి కేంద్రం.*

"గెలవగలనన్న ఆశలేనివాడు ఆటకుముందే ఓడిపోతాడు."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

1. ఎంతమంది రాజ్యసభ సభ్యులను భారతదేశపు రాష్ట్రపతి నియమించగలరు?
2. అంతర్జాతీయ కార్మికుల దినంగా మనం వేడుకలను జరుపుకుంటున్న మే దినం అన్న మాట ఎక్కడి నుంచి వచ్చింది?
(ఎ) యుఎస్ఎ (బి) బ్రిటన్ (సి) యుఎస్ఎస్ఆర్ (అప్పటి) (డి) భారతదేశం.
3. క్రింద కనబరచిన వ్యక్తులలో ఎవరు గ్రాండ్ ఓల్డ్‌మాన్ ఆఫ్ ఇండియాగా ఖ్యాతిని గడించారు?
(ఎ) మహాత్మాగాంధీ (బి) ఫిరోజ్‌షా మెహతా (సి) లాలా లజపతిరాయ్ (డి) దాదాబాయ్ నౌరోజీ.
4. 'అర్జున్' బహుమతులు ఏ రంగానికి చెందిన వ్యక్తులు పొందుతారు?
(ఎ) సాహిత్యం (బి) క్రీడారంగం (సి) సంఘసేవ (డి) ఇవేవీకావు.
5. తమిళనాడులోని వెల్లింగ్‌టన్‌లో కింద కనబరచిన ఏ సంస్థ నెలకొల్పబడి ఉంది?
(ఎ) రక్షణ దళాల స్టాఫ్ కాలేజీ (బి) ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీ (సి) జాతీయ పోలీసు అకాడమీ (డి) జాతీయ రక్షణ (Defenece) అకాడమీ.
6. విటమిన్ 'ఏ' లోపం వల్ల వచ్చే వ్యాధి పేరు:
(ఎ) బెరిబెరి (బి) రేచీకటి (సి) స్కర్వీ (డి) రికెట్స్.
7. క్యూసెక్ (Cusec) అన్నది దేనికి ప్రమాణం (Unit)?
(ఎ) నీటిపారుదల (బి) ఉష్ణం (సి) పీడనం (డి) విద్యుచ్ఛక్తి.
8. ఐజ్‌వాల్ ఏ రాష్ట్రపు రాజధాని నగరం?
(ఎ) మేఘాలయ (బి) మణిపూర్ (సి) భూటాన్ (డి) మిజోరామ్.

## దక్షిణ దేశపు అతి విశాలమైన గుడి

*తమిళనాడులోని శ్రీరంగంలో వెలసిన శ్రీరంగనాథ ఆలయం 155 ఎకరాలలో విస్తరించి ఉంది. ఈ గుడికి ఏడు ప్రాకారాలు, 21 గోపురాలు మొత్తం నాలుగు వైపులా ఉన్నాయి. ఇక్కడి బ్రహ్మాండమైన రాజగోపురం నేలమట్టం నుండి 236 అడుగుల ఎత్తు ఉంది.*

"పుస్తకాలు లేని ఇల్లు కిటికీలు లేని ఇల్లు వంటిది."

## మాటల మహిమ

1. గుబ్బుమ్రాను: (ఎ) కుండలు చేయు సాధనం (బి) హిమాలయాలలోని చెట్టు (సి) అనుమానం (డి) జిల్లేడు.
2. చులుకము: (ఎ) తడికన్నులు (బి) చిన్న ఎలుక (సి) చిరుతపులి (డి) పేలపిండి.
3. తుటారము: (ఎ) చిన్నతూట (బి) దిట్ట తనము (సి) తిరస్కరించుట (డి) సమూహము.
4. దుమదుమ: (ఎ) ఎక్కువ కోపం (బి) కపటము (సి) పచ్చినీరుల్లి \(డి) మిక్కిలి తడిగలది.
5. నుడువర్తి: (ఎ) మధ్యవర్తి (బి) మాటల మారి (సి) చెప్పుట (డి) త్రిశూలి.
6. పుడమిరా: (ఎ) సముద్రం (బి) సీత (సి) విష్ణువు (డి) చీరలో సగం.
7. బుడవక్కె: (ఎ) ఒకరకమైన చేప (బి) ఒక ఔషధి (సి) పొట్టిది (డి) తడబడు.
8. ముచ్చిలిక: (ఎ) చిన్నగుంట (బి) దుఃఖించుట (సి) కునికిపాటు (డి) వ్యవసాయపరమైన ఒడంబడిక.

## తెలివికి పరీక్ష

1. ఒకానొక నక్షత్ర వీధి (Galaxy)లో సూర్యుడు అతి చిన్న నక్షత్రం మాత్రమే. ఆ నక్షత్ర వీధి పేరేమి?
2. మనిషికి ఎంత తాజా గాలి కావల్సి వస్తుంది?
3. నేతాజీ సుబాస్ చంద్రబోస్ మనదేశపు బ్రిటిష్ బందీఖానా నుండి ఏ సంవత్సరం తప్పించుకుని పోయారు?
4. చైనా మనదేశంపై ఏ సంవత్సరంలో దురాక్రమణ జరిపింది. నెల తారీఖులను తెలపండి.
5. మనకు మన రాజ్యాంగం (Constitution) ఎప్పుడు ఇవ్వబడింది?
6. మనదేశంలో న్యూస్‌ప్రింట్ ఎక్కువగా ఎక్కడ తయారవుతుంది?
7. పనామా కాలువ ఏఏ సముద్రాలను కలుపుతుంది?

(జవాబులకు వ పేజీ చూడండి)

## నెహ్రూ శతజయంతి తపాలాబిళ్ళలు



*స్వతంత్ర భారతదేశపు తొలి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ శత జయంతిని పురస్కరించుకుని భారతదేశంతో కూడా మొత్తం ప్రపంచంలోని 28 దేశాలు ప్రత్యేక తపాలా బిళ్ళలను జారీ చేసాయి.*

**"తననుతాను సరిదిద్దుకోవడానికి ప్రయత్నించే వ్యక్తి ప్రగతిపథంలో ఉంటాడు."**

# ప్రపంచ నగరాలు

## కొలోన్

జర్మనీలోని కొలోన్ (Cologne) నగరం ఆ దేశపు విశాలమైన నగరాలలో మూడవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఆ దేశపు జనాభాను గణనలోకి తీసుకున్నప్పుడు ఈ నగరంకు నాల్గవ స్థానం లభిస్తుంది. ఒక మిలియన్ ప్రజలు నివసిస్తున్న ఈ నగరం వైశాల్యం 40,000 హెక్టార్లు.


COLOGNE

రైన్ (Rhine) నది ఒడ్డున ఉన్న కారణంగా జర్మన్ దేశపు ఉబి (Ubii) తెగవారు క్రీ.పూ. 38వ సంవత్సరంలోనే కొలోన్‌లో స్థిరపడిపోయారు. ఈ అనుకూల పరిస్థితుల కారణంగానే ఈ నగరం గత 2000 సంవత్సరాలుగా అభివృద్ధి పొందుతూ వస్తోంది.

ఈ రోజు కొలోన్ ఒక రేవు పట్టణం మాత్రమే కాదు. ఆ దేశపు ప్రధాన వాణిజ్య కేంద్రంగా కూడా మారింది. వస్త్ర పరిశ్రమ, ఇనుము - ఉక్కు పరిశ్రమ, రసాయనాల ఉత్పత్తి, మోటార్ల తయారీ మొదలైనవి ఈ నగరపు ఇతర ప్రముఖ పరిశ్రమలు. కొలోన్ విశ్వవిద్యాలయం స్థాపన క్రీ.శ. 1388వ సంవత్సరంలోనే జరిగింది.

గోథిక్ శిల్పకళకు సరైన ఉదాహరణగా భావించబడుతున్న కెథెడ్రల్ ఆఫ్ కొలోన్ ఈ దేశపు ప్రధాన చర్చ్. అంతేకాదు ఇక్కడ బిషప్‌ల సింహాసనం కూడా ఉంది. ఈ కెథెడ్రల్ (Cathedral) నిర్మాణానికి సుమారు 632 సంవత్సరాలు - 1248 మొదలు 1560 వరకు పట్టింది. పేరు పొందిన తాపీ పనివారు కొన్ని తరాలు పనిచేసి ఈ కెథెడ్రల్ పనిని పూర్తి చేసారు. 263 సంవత్సరాల తరువాత కట్టడం పని మళ్ళీ ప్రారంభింపబడింది. 1880లో 157 మీటర్ల ఎత్తున్న నదరన్ టవర్ ఒక ఎత్తైన స్థితికి చేరడం జరిగింది. అప్పట్లో ఈ కెథెడ్రల్ ప్రపంచపు అతి ఎత్తైన నిర్మాణంగా ఉండేది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత పునర్నిర్మింపబడిన కట్టడాలలో ఈ కెథిడ్రల్ కూడా ఒకటి.

## చంద్రుడి కృష్ణపక్షం

*రెండువారాలు విడువకుండా చంద్రుడిపై వెలుగు పడుతుంటుంది. ఆ తరువాత రెండు వారాలు చీకటి అంటే కృష్ణపక్షం అవరిస్తుంది.*

"ప్రేమ అనే అంశం లేకుండా ఏదీ సజావుగా ఉండదు."

కొలోన్ వర్ణచిత్ర పాఠశాల (Cologne School of painting) కళాఖండంగా పరిగణింపబడుతున్న దైవపీఠం (Alter) వర్ణ చిత్రాన్ని క్రీ.శ. 1450లో స్టీఫెన్ లోచ్‌నర్ (Stephan Lochner) చిత్రించాడు.


Cathedral of Cologne

1976వ సంవత్సరంలో పారిశ్రామికవేత్త పీటర్ లుడ్‌విగ్ (Peter Ludwig) ఆధునిక కళల కొత్త మ్యూజియంను - లుడ్‌విగ్ మ్యూజియంను - ఏర్పాటు చేసాడు. కెథిడ్రల్‌కు సమీపంలో ఉన్న ఈ మ్యూజియంలో అతడు సంగ్రహించిన భవ్యమైన పాప్ ఆర్ట్‌కు సంబంధించిన చిత్రాలు ఉన్నాయి. ఈ లుడ్‌విగ్ మ్యూజియంలో సుప్రసిద్ధ జర్మన్ వర్ణచిత్రకారుడు మాక్స్ ఎర్నెస్ట్ (Max Ernst) 1923-24ల మధ్య చిత్రించిన "ఫ్రెండ్స్ రెండెజ్‌వాస్" (Frie nds Rendezvous) పెయింటింగ్ కూడా సంగ్రహించబడి ఉంది.

ఇదికాక స్టోల్‌వెర్క్ చాకొలెట్ మ్యూజియం (Stollwerck Chocolate Museum) కూడా ఈ నగరంలో ఉంది. ఈ మ్యూజియం ముఖ్య ఆకర్షణ చాకొలెట్ వెల్ (Chocolate Well).

('జర్మన్ న్యూస్' సౌజన్యంతో) ●

# అతి ఎక్కువ 'ఫ్లయింగ్ అవర్స్' ఉన్న మహిళా పైలెట్


Capt. Durba Banerjee – World's first woman pilot with most flying hours

*కాప్టెన్ దుర్బా బెనర్జీ తన విమానయానం (aviation) జీవితాన్ని 1959వ సంవత్సరంలో ప్రారంభించింది. 1966లో ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో ఉద్యోగం స్వీకరించడానికి ముందు ఒక ప్రైవేట్ విమానం కంపెనీలో పని చేసింది. 1988వ సంవత్సరం నవంబర్ నెలలో ఉద్యోగ విరమణ చేసే నాటికి ఈమె 18,500 ఫ్లయింగ్ అవర్స్ (విమానంను నడుపుతూ గడిపిన గంటలు) రికార్డును సృష్టించిన ఘనతను పొందింది. ఈ కారణంగా వాణిజ్యపరమైన విమానంను ఎక్కువ గంటల కాలం నడిపిన తొలి మహిళగా మొత్తం ప్రపంచంలోనే ఈమె ఖ్యాతిని ఆర్జించింది.*

"శ్రద్ధతో కూడిన కళే నిజమైన జ్ఞాపక శక్తి కళ." — శామ్యూల్ జాన్సన్

# మీ కల్పనా శక్తిని పెంచుకోవడం ఎలా?

రాబర్ట్ జె. లుమ్స్‌డెన్

మంచి ఆలోచనలు, కల్పనలు కేవలం పిల్లలకూ, రచయితలకూ, కళాకారులకే సొంతం అన్న ఆలోచనను మనసులోకి రానివ్వకండి. నిజం చెప్పాలంటే ఆలోచన, కల్పన అన్నది ప్రతి ఒక్కరి మేధాసంపత్తిపై ఆధారపడి ఉంటుంది. ఈ కల్పనాశక్తిని మనం మనకు అనుకూలమైన విధంగా, లాభాన్ని తెచ్చే విధంగా మలచుకోవచ్చును.




తన కల్పనా శక్తి ఆధారంగా పేరు ప్రఖ్యాతులను గడించిన సోమర్‌సెట్ మామ్ ఒకసారి "కల్పనా శక్తి కసరత్తువల్ల అధికమవుతుంది. అందరూ అనుకున్నట్లు కాకుండా యువకులలో కంటే అనుభవజ్ఞులైన వారిలోనే శక్తివంతమైన కల్పనలు, ఆలోచనలు ఎక్కువగా ఉంటాయి" అని అన్నాడు.

పూర్వకాలంలో నివసించిన వారంతా ఆలోచనాపరులే, కల్పనాశక్తి సంపన్నులే. వారి సృజనాత్మకతమైన ఆలోచనల ఫలితమే మనం ఈ రోజు వాడుతున్న కప్పి (Pulley), పంపు, ముద్రణాయంత్రం, విద్యుచ్ఛక్తి బల్బు, రేడియో, జెట్ యంత్రం, అంతరిక్ష వాహనాలు మొదలైనవి. ప్రస్తుతం మనకున్న కల్పనాశక్తిని వృద్ధిపరచుకుంటే పైన చెప్పిన సాధనాలను తప్పక వెలుగులోకి తీసుకొచ్చి మానవాళికి సహాయం చేయవచ్చును. అంత గొప్ప పనులు మీరు చేయలేకపోయారనుకోండి, నిరుత్సాహపడవలసిన అవసరం లేదు. మీరు మీ జీవితాన్ని మీపై ఆధారపడి ఉన్నవారి

## విద్యా విస్ఫోటం

* శ్రేష్ఠమైన కంప్యూటర్‌కు ఒక సెకండుకు 3 బిలియన్ విట్లను కరకరమని నమలగల సంఖ్యా స్తోమత ఉంది.

* బ్రిటన్‌కు చెందిన వైజ్ఞానికులు 29 ఖండాలలో ఉన్న మొత్తం ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను ఒక గుండు సూది తల భాగంపై రాయగల ఒక ఎలక్ట్రానిక్ బీమ్‌ను అభివృద్ధి పరిచారు.

* మీ ఇంటి కప్పుపైనున్న ఒక చిన్న ఆంటెనా ద్వారా కొన్ని కోట్ల పేజీల సమాచారం రోజు మీ అందుబాటులో ఉంటోంది. ఈ మొత్తం సమాచారం అతి శక్తివంతమైన ఉపగ్రహాల ద్వారా అందజేయబడుతుంది.

(—ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్)

"సంక్షిప్తతే సరసోక్తికి ఆత్మ." — షేక్స్పియర్

జీవితాల్ని మెరుగుపరచి వారికి సుఖశాంతులను ప్రసాదించవచ్చును. వారిని మరింత ఉత్తేజ పరచవచ్చును. మీ ఆలోచనా శక్తిని, కల్పనాశక్తిని వృద్ధి చేసుకునేందుకు కొన్ని ఉపయోగకరమైన సలహాలు.




1. పిల్లల కథల పుస్తకంలోని మొదటి పేజీని చదివి మీ మాటలలో ఆ కథను పూర్తి చేయండి.

2. ఆడుకుంటున్న పిల్లల మాటలన్నీ జాగ్రత్తగా వినండి.

3. మీ పరిశీలనా శక్తిని, కల్పనా శక్తిని ఉపయోగించుకుని మీ పిల్లలకు కథలు చెప్పండి.

4. ఒక సంఘటన గురించి విన్న తరువాత లేదా చదివిన తరువాత మీ మనోనేత్రంతో దాన్ని చూడడానికి ప్రయత్నించండి.

5. ఒక సర్వసాధారణమైన వస్తువును తీసుకుని దాన్ని ఇంకా ఎలా అభివృద్ధి చేయగలరో ఆలోచిస్తూ రండి.

6. ఇంటిలో లేదా దారిలో జరిగే దుస్సంఘటనలకు సంబంధించిన ప్రశ్నలకు పరిష్కారాలను గురించి ఆలోచించండి.

7. ఏదైనా ఒక వస్తువును తీసుకుని ఇది ఇంకొంచెం కురచగా చేస్తే ఏమవుతుంది? మరింత పొడవు పెంచితే లేదా మందాన్ని పెంచితే ఏమవుతుందని ప్రశ్నించుకోండి. అదేవిధంగా మరో విధంగా పాక్ చేస్తే మరొకదానికి జత చేస్తే ఏమవుతుందని ప్రశ్నించండి. ఇలాంటి ప్రశ్నలు మీ ఆలోచననా శక్తిని, కల్పనా శక్తిని తప్పక మరింత పెంచగలవు.

మీ కల్పనా శక్తి ఆలోచనా శక్తి ఈ క్రింది వాటికి మొదట్లో వర్తింపజేయండి.

మీ ఇల్లు: మీరు నివసిస్తున్న చోట్లోనే నివసించాలా? ఇంతకు మించిన ఆరోగ్య కరమైన, ఆహ్లాదాన్నిచ్చే ప్రాంతంలో నివసించాలా? ప్రపంచం చాలా సువిశాల మైనది. మీ కల్పనా శక్తిని వాడుకోండి.

## విముక్తి చెందిన వ్యక్తి

*ఎలాంటి గొప్పలకు పోకుండా మీవరకు మీరు నిజాయితీగా ఉండండి. మీ అనుభవాల ఆధారంగానే జీవించండి. మీ అనుభవానికి మించిన గురువు వేరొకరు లేరు. అంతరంగంలోని వెలుగు కారణంగా ముఖం అందమైన కాంతితో మెరిసిపోతున్న వ్యక్తే నిజంగా విముక్తిని పొందిన వ్యక్తి. అతడి నుండే దివ్యమైన వెలుగు నలుదిశలకు ప్రాకుతుంది.*

— స్వామి రామతీర్థ

"మీ ప్రతి ముఖవైఖరి చెరగని ముద్రవేస్తుంది. జాగ్రత్తగా ఉండండి."

వనిచేసే దిశలో ఇది మీరు వేయబోతున్న మొదటి అడుగు అవుతుంది.

మీరు ప్రస్తుతం నివసిస్తున్న ఇంటిలోపలి భాగాన్ని ఎలా అభివృద్ధి పరచగలరు? సృజనాత్మకంగా ఆలోచించండి. కొంత ప్రయత్నం, కొంత ఉత్సాహం, మరి కొంత డబ్బు కలిస్తే మొత్తం ప్రాంతాన్ని శోభాయమానంగా మార్చవచ్చును. మరి మీ పూదోట సంగతేమి? దాన్ని మీరు మార్చగలరా? తేవలసిన మార్పులను గురించి ఆలోచించండి. లేదా ప్రణాళికను తయారు చేసుకోండి. ఆ తరువాత వాటిని అమలువరచండి.

మీరు చేస్తున్న వని: మీరు వని చేస్తున్న చోటులో ఉన్న వరిస్థితులను మార్చగలరా? మరింత అభివృద్ధి వరచగలరా? మీ యజమానికి మీరు ఇంకా ఉపయోగకరంగా ఉండగలరా? చేస్తున్న వనిలో సమయాన్ని కార్మికులను, వస్తువులను ఎలా పొదుపు చేయగలరు? సృజనాత్మకంగా ఆలోచించండి. మీరు ఇతరులకు ఉద్యోగాలిచ్చేవారైతే మీ సిబ్బందిని మరింత సంతోష పెట్టడానికి, ఉత్పత్తిని పెంచడానికి మీరేమి చేయగలరో దాన్ని గురించి ఆలోచించండి. మీ ఉద్యోగస్తులున్న చోట మీరు ఉంటే అక్కడ మీరు వని చేయగలరా? చెప్పండి.

మీ సంబంధ బాంధవ్యాలు: మీ కల్పనా శక్తిని ముఖ్యమైన రంగంలో వాడండి. ఘర్షణను మీరు ఎలా తగ్గించగలరు? మా స్నేహ గుణాన్ని ప్రదర్శించండి. ఏ మార్గాలను అవలంభించి మీరు మరింత మంచి భర్తగా లేక భార్యగా లేదా తల్లి, లేదా తండ్రిగా మారగలరు? ఆలోచించి కార్యవంతులుకండి. ఆలోచనా శక్తి మొత్తం మీ ప్రపంచాన్ని మార్చగలదు.

## భారతదేశంలో మొదటిది




* *హిందూస్థాన్ మోటార్స్‌వారు 1944-45లో 'హిందూస్తాన్-10' అన్న పేరుతో ఒక కారును తయారుచేసారు. ఇదే భారతదేశవు తొలి కారు.*

* *బెంగళూరులోని శేషాద్రిపురంలో ఉన్న సిండికేట్ బాంకు శాఖ మొత్తం భారత దేశంలోనే మహిళల చేత నడువబడుతున్న మొదటి శాఖ.*

* *షేర్‌షా సూరి (Sher Shah Suri) ఢిల్లీని రాజధానిగా చేసుకుని భారతదేశాన్ని పాలించిన అతి గొప్పరాజు. ఇతడే క్రీ.శ 1542లో మొదటి రూపాయిను జారీ చేసాడు.*

* *చార్టర్డ్ బాంక్ భారతదేశంలో ప్రవేశించిన తొలి విదేశీ బాంకు. మద్రాసులో ఈ బాంకు తమ శాఖను 1853లో ప్రారంభించింది.*

"క్రమశిక్షణా చట్టం వట్ల గౌరవం లేకపోవడం, కట్టుబాటు లేకపోవడం ఆత్మహత్యతో వమానం." — గాంధీజీ

మీరు సాధించిన విజయాలు: ఇక్కడ మీ కల్పనా శక్తిని ఉపయోగించండి. మీరు ఏమి కావాలని ఉబలాటపడుతున్నారో అది అయినట్లు మీ మనసులో భావించి దాన్ని మీ కండ్ల ముందు ఉంచుకోండి. మీరు ఏమి చేయదలచుకున్నారో దాన్ని చేయండి. చేయాలన్న లేదా కావాలన్న నిర్ణయం తీసుకోవడం మాత్రం చాలదు. రోజు మీ కంటి ముందు విజయాన్ని పొందుతున్న చిత్రాలను ఉంచుకోండి. ఇదివరకు మీరు మీ మనసుపై వ్యతిరేక చిత్రాలనే చిత్రించుకుని ఉంటారు. ఇక భవిష్యత్తులో అనుకూలమైన చిత్రాలనే చిత్రించుకోండి. కల్పనాశక్తిని మీ స్నేహితుడిగా స్వీకరించండి.

మీ వ్యక్తిత్వం: అవాంఛితమైన అలవాట్లు, ధోరణులను అధిగమించడానికి మీ కల్పనా శక్తిని వాడండి. మీరు ఏకాంతప్రియులు, మితభాషులు లేదా ముక్కోపి అయితే, నత్తితో బాధపడేవారు సిగ్గుపడేవారైతే ఈ లోపాలను అధిగమించడానికి ప్రయత్నించండి. ఇంతకుముందు ఎదురైన పరాజయాలను గురించి మీ మనస్సు పాడుచేసుకోవడానికి స్వస్తి చెప్పండి. విజయం చిత్రాన్ని రోజూ చిత్రించుకోండి. రోజూ ఆత్మబింబాన్ని అభివృద్ధి చేసుకోండి. రహస్యంగా మీ మెదడులో మీరే పెంచుకుంటున్న ఆలోచనలు మీ నడవడికపై ఇప్పటికే తమ ప్రభావాన్ని చూపి ఉంటాయి. ఇదే మీ ప్రయత్నాలకు హద్దులను నిర్ణయించి ఉంటుంది. ఆ విధంగా మీ విజయాలకు కూడా అది హద్దును నిర్ణయిస్తుంది. మీ ఆత్మబింబాన్ని మార్చుకోండి. అప్పుడు మీ అలవాట్లలో వ్యవహారంలో మార్పు తానుగా వస్తుంది.

మీరు ఏ స్థానాన్ని చేరాలనుకుంటున్నారో ఆ స్థానంకు సంబంధించిన విశదమూ, పరిపూర్ణమూ అయిన చిత్రాలనూ చిత్రించుకుని మీ ముందు ఉంచుకోండి. ఈ చిత్రంపైనే మీ మనసును లగ్నం చేయండి. ఈ రోజుకాకపోతే రేపు మీరు మీ మనసులో పెంచుకుంటూ వస్తున్న ఆ స్థానాన్ని ఆక్రమించుకోగలరు.

(ఆధారం - "విజయసాధనకు 23 మార్గాలు-" 'పార్థ' సౌజన్యంతో)

## ఒక్కసారికి 27 గాలన్ల నీటిని తాగే ఒంటె



*ఒంటె ఒక్కసారికి 27 గాలన్ల నీటిని తాగుతుంది. ఒంటె నీరును తన శరీరపు కణజాలాలలో కలిసిపోయేలా తాగుతుంది.*

**"తాను అన్నిచోట్లా ఉండలేనందున భగవంతుడు తల్లులను సృష్టించాడు."**

# ప్రపంచపు మహాకవులు

## రాబర్ట్ ఫ్రాస్ట్

### ఎం. ముత్తు మోహన్

అమెరికా దేశపు కవి, విద్యావేత్త అయిన రాబర్ట్ ఫ్రాస్ట్ ఒక అద్వితీయ కవితోపాటు సువిఖ్యాత సంపాదకుడు కూడా. అతడిని సాహిత్యాభిమానులు




సుపరిచితుడైన నాటక కర్తగా, మంచి అధ్యాపకుడిగా అన్నింటికీ మించి దయాగుణ సంపన్నుడిగా గుర్తిస్తున్నారు. గుండెలలో చొచ్చుకుపోయే దూరదృష్టి పరమైన కవితలను సరళమైన భాషలో రచించడంలో ఇతడు దిట్ట.

శాన్‌ఫ్రాన్సిస్కోలోని కాలిఫోర్నియాలో ఫ్రాస్ట్ 1874వ సంవత్సరం మార్చి నెల 26వ తారీఖున జన్మించాడు. తండ్రి విల్లియం ప్రెస్కాట్ ఫ్రాస్ట్ (William Prescott Frost), స్కాట్‌లాండ్‌లో పుట్టిన తల్లి ఇసబెల్ మూడి (Isabel Moodie) ఇద్దరూ అధ్యాపకులే. రాబర్ట్ ఫ్రాస్ట్ తండ్రి 1885వ సంవత్సరంలో మరణించాడు. అప్పట్లో ఫ్రాస్ట్ వయసు 11 సంవత్సరాలు మాత్రమే. తన కుటుంబంతో సహా తల్లి ఇసబెల్ మూడీ బసను న్యూ ఇంగ్లాండ్‌కు మార్చింది. అక్కడే రాబర్ట్ ఫ్రాస్ట్ పెరిగి పెద్దవాడయ్యాడు. మెస్సాచుసెట్స్‌కు చెందిన లారెన్స్ పాఠశాలలో ఉన్నత పాఠశాల చదువును కొనసాగించాడు.

14 సంవత్సరాల వయసులోనే ఎడ్గార్ అలన్ పో (Edgar Allan Poe), లార్డ్ బైరన్ (Lord Byron), జాన్ మిల్టన్ (John Milton), విలియం షేక్స్పియర్ మొదలైన సాహిత్యకారుల రచనలు ఫ్రాస్ట్‌ను బాగా ఆకట్టుకున్నాయి. 15వ ఏట రాబర్ట్ ఫ్రాస్ట్ తొలి కవిత - "సాంగ్ ఆఫ్ ది వేవ్" పాఠశాల పత్రికలో అచ్చు అయింది. లారెన్స్

---

### వారు మాత్రమే జీవిస్తారు

*జీవితం క్షణ భంగురం. నీటి బుడగలాంటిది. గర్వం కూడా అస్థిరమైనదే. కానీ ఇతరుల కోసం జీవించే వారే జీవిస్తారు. మిగతా వారందరు జీవించి ఉన్నా మరణించిన వారితో సమానమే.*

—స్వామీ వివేకానంద

---

"హృదయ కవాటాలు - 'ధన్యవాదాలు,' 'మీరు దయచేస్తే' అన్న రెండు చిన్న తాళం చెవులతో తెరుచుకుంటాయన్న సంగతిని మరవకండి."

ఉన్నత పాఠశాలలో చదువుతున్నప్పుడు ఎలినార్ మిసియమ్ వైట్ (Elinor Misiam White)తో పరిచయమైంది. ఆ తరువాత ఆమె అతడి భార్య అయింది. కొంతకాలం ఫ్రాస్ట్ డార్ట్‌మౌత్ (Dartmouth) కాలేజీలో చేరి చదివాడు. అర్థాంతరంగా కాలేజీ మానేసి ఒక కాటన్ మిల్లులో పనికి కుదిరాడు. అతడు చెప్పులు కుట్టేవాడిగా పనిచేసాడు. ఆ తరువాత రెండు సంవత్సరాలు హార్వర్డ్ కాలేజీలో చేరి చదివాడు. అనారోగ్య కారణంగా చదువును కొనసాగించలేక పోయాడు. డెర్రి (Derry)లోని ఒక పాఠశాలలో అధ్యాపకుడిగా పని చేసాడు. ఆ రోజుల్లోనే కవిత్వం రాయడం ప్రారంభించాడు. కానీ కొన్ని కవితలు మాత్రమే ప్రచురించబడ్డాయి.

తాను రాసిన కవిత్వం - "ది ఇండిపెండెంట్"కు గాను పారితోషికంగా పంపబడిన ఒక చెక్కును 19 సంవత్సరాల యువకుడు ఫ్రాస్ట్ అందుకున్నాడు. 20 సంవత్సరాల తరువాత ఇతడు రచించిన కవితల తొలి సంగ్రహం - "ఏ బాయ్స్ విల్" 1913వ సంవత్సరంలో ప్రచురించబడింది. అతి త్వరలో ఆ పుస్తకం కాపీలు అమ్ముడు పోయాయి. గొప్ప కవిగా గుర్తింపు పొందడానికి అతడికి రాత్రి పగలు పని చేయవలసివచ్చింది. శ్రమ ఫలితంగా గొప్ప కవి పట్టాను పొందగలిగాడు. అతడి కృషి కారణంగానే అమెరికా దేశపు అనధికార ఆస్థాన కవిగా రాణించాడు.

ఫ్రాస్ట్ చదివిన ఎమర్సన్ (Emerson) సాహిత్యాన్నే మరీ మరీ చదవసాగాడు. ప్రకృతి ప్రేమికుడైన మిత్రుడితో చాలా దూరం వరకు షికారు వెళ్ళేవాడు. తోపలో అరుదైన పూలకోసం గాలించేవాడు. రాత్రిళ్ళు మాత్రం కవిత్వం రాసేవాడు. 1914వ సంవత్సరంలో ఇతడి రెండవ కవితా సంకలనం. - "నార్త్ ఆఫ్ బోస్టన్" ప్రచురింపబడింది. ఈ ప్రచురణతో ఫ్రాస్ట్ పేరు అందరి నోట వెలువడసాగింది. హాస్యం కారణంగానూ, వక్తగా ఇతడు ప్రకటించే భావాల తీరుకుగానూ, ఇతడు అందరి

## భారతదేశపు అతి పెద్దదైన తీరికలేని కాంటిలెవర్ బ్రిడ్జి




*హుగ్లీ నదిపై కలకత్తాలో కట్టబడిన హౌరా బ్రిడ్జి మన దేశంలో ఉన్న అతి పెద్దదైన, తీరిక లేకుండా వాడబడుతున్న కాంటిలెవర్ బ్రిడ్జ్. 457 మీటర్ల పొడవున్న ఈ బ్రిడ్జ్ నిర్మాణం రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న సమయంలో (1943) పూర్తి అయింది.*

"మతం లేని విజ్ఞాన శాస్త్రం గుడ్డిది. విజ్ఞాన శాస్త్రం లేని మతం కుంటిది."
— అల్బర్ట్ ఐన్‌స్టీన్

ప్రశంసలను పొందాడు. ఇతడి కీర్తి ప్రతిష్ఠలు నలదిశలలో ప్రాకసాగాయి.

1916 మొదలు అమ్‌హెర్స్ట్ (Amherst), హార్వర్డ్ (Harvard), మిచిగన్ (Michigan)లతో సహా అనేక విశ్వవిద్యాలయాలలో పనిచేసాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో 1941 మొదలు 1945 వరకు - ఇతడు అనేక కవితా సంకలనాలను ప్రచురించాడు. వాషింగ్టన్ డి.సి.లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌కు సలహాదారుడిగా 1958వ సంవత్సరంలో నియమించబడ్డాడు. కవిత్వం కోసం ఇవ్వబడే పులిట్జర్ (Pulitzer) బహుమతిని ఫ్రాస్ట్ నాలుగు సార్లు -1924, 1931, 1937, 1943 - గెలుచుకున్నాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం ఇతడిని 75వ, 85వ జన్మదిన సందర్భంగా సత్కరించింది. అమెరికా రాష్ట్రపతి జాన్ ఎఫ్. కెన్నెడీ అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేసిన సభలో - 1961లో - ఇతడు తన కవిత - 'ది గిఫ్ట్ అవుట్‌రైట్' - ను చదివి వినిపించాడు. 1962వ సంవత్సరంలో ఇతడి పుస్తకం - ఇన్ ది క్లియరింగ్ - ప్రచురింపబడింది. 1963వ సంవత్సరం జనవరి నెల 29వ తారీఖున ఫ్రాస్ట్ చనిపోయాడు.

అతడి కవితలలో బిర్చెస్ (Birches), ది డెత్ ఆఫ్ ది హైర్డ్ హాండ్ (The Death of the Hired Hand), మెండింగ్ వాల్ (Mending Wall), ది రోడ్ నాట్ టేకెన్ (The Road not Taken), స్టాపింగ్ బై వుడ్స్ ఆన్ ఎ స్నోఈ ఈవినింగ్ (Stopping by Woods on a Snowy Evening) మొదలైనవి చాలా ప్రసిద్ధిని పొందాయి. ప్రకృతితో పాటు ప్రకృతితో మనిషికి ఉన్న సంబంధం ఇవి రెండూ అతనికి చాలా ప్రియమైన విషయాలు.

"స్టాపింగ్ బై వుడ్స్ ఆన్ ఎ స్నోఈ ఈవినింగ్" అన్న ఇతడి బహుళ ప్రచారం పొందిన కవితలోని "చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోవాలి. నిదురించే ముందు మైళ్ళు తరబడి దూరం పోవాలి" అన్నవి చాలా ప్రచారాన్ని పొందాయి. భారతదేశపు తొలి ప్రధానమంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూకు ఈ వాక్యాలంటే పంచప్రాణాలు. ఫ్రాస్ట్ రాసిన ఆ వాక్యాలు అతడి బల్లపై ఎప్పుడూ ఉండేవి. ●

## తన జీవిత కాలంలో 30 ఆస్కార్ అవార్డులను అందుకున్న డిస్నీ




*సజీవమైన కార్టూన్లను గీయడంలో దిట్ట అనిపించుకున్న చిత్ర నిర్మాత వాల్ట్ డిస్నీ (1901-66) తన జీవిత కాలంలో మొత్తం 30 ఆస్కారులను గెలుచుకున్నాడు.*

'తన ప్రణాళికలో అదృష్టానికి చోటు ఇవ్వని వ్యక్తినే అదృష్టం వరిస్తుంది."

# చిదంబరం

## ప్రపంచ ఖ్యాతి పొందిన నటరాజ ఆలయం

చెన్నై మహానగరానికి దక్షిణాన సుమారు 243 కి.మీ.ల దూరంలో ఉన్న చిదంబరంలో ప్రళయ తాండవం చేసే నటరాజ ఆలయం వెలసి ఉంది. 13 హెక్టార్ల భూమిలో ఈ దేవాలయం విస్తరించి ఉంది. ఈ దేవాలయం రెండు నదుల



Nataraja Temple, Chidambaram

మధ్యనున్న సమతల ప్రదేశంపై నిర్మించబడి ఉంది. ఈ దేవాలయం నుండీ 80 కి.మీ.ల దూరంలో మీకు నల్లరాయి వెతికినా కనిపించదు. అయినా మొత్తం దేవాలయ నిర్మాణం అందమైన నునుపు చేయబడిన నల్లరాయితో నిర్మించబడింది.

ఈ దేవాలయపు లోపలి నాలుగు ప్రాకారాలు నాలుగు గోపురాలను కలిగి ఉన్నాయి. ఇందులోని రెండు గోపురాలు నగిషీ చెక్కిన నృత్య శాస్త్రానికి సంబంధించిన 108 నృత్యభంగిమలను సూచించే శిల్పాలను కలిగి ఉన్నాయి.

దేవాలయపు లోపలి భాగంలో అందంగా, విశాలంగా చెక్కబడిన ఐదు సభా ప్రాంగణాలు ఉన్నాయి. సుప్రసిద్ధమైన వేయి స్తంభాల

## ఆస్కార్ వైల్డ్ సుభాషితాలు




* నవ్వని రోజే మనం పూర్తిగా కోల్పోయిన రోజు అవుతుంది.

* నవ్వుతో ప్రారంభమయ్యే స్నేహం చెడ్డదేమీ కాదు. స్నేహం అంతానికి నవ్వు చాలా ఉత్తమమైనది.

* ప్రేమ పెండ్లి జరిగేలా చేస్తుంది. అలవాటు దాన్ని భరించేలా చేస్తుంది.

* ధాతృత్వం, ఔదార్యం అన్నది ఇచ్చే డబ్బులో లేదు. ఇచ్చే విధంలోనే ఉంది.

"పనిచేసే విధానం తెలియనప్పుడు ప్రతి పని కష్టమైన పనే."

రాజసభ మంటపంలో పాండ్య చోళ రాజులు తమ యుద్ధంలో పొందిన విజయోత్సవాలను ఘనంగా జరుపుకున్నారు. అక్కడ




దేవసభ, చిత్‌సభ, కనకసభ, నాట్యసభలు ఉన్నాయి. చిత్‌సభలో ఆకాశలింగం ఉంది. కనకసభలో నటరాజ విగ్రహం




ఉంది. నృత్యసభలో దేవతా వాహనాలను లాగుతున్న అందమైన గుర్రాల, రథ చక్రాల శిల్పాలు ఉన్నాయి.

అన్ని చోట్లా - గోపురాల మీద, స్తంభాల మీద, సభ లోపల - శివుడి శిల్పాలను లేదా వందల సంఖ్యలో నృత్యభంగిమలను చూడవచ్చును. ప్రళయ తాండవం చేసే శివుడు నటరాజ రూపంలో లోకాలనేలే దేవుడిగా గర్భగుడిలో అలరారుతున్నాడు. పంచ లోహాలతో తయారైన ఈ విగ్రహం అందంగా, ఎన్నో ముఖ్యమైన అర్థాలను సూచించే విధంగా చెక్కబడి ఉంది.

## అపజయం అంగీకరించని వారికి అపజయం ఉండదు

మన ఆదర్శాలనూ, ఉద్దేశాలనూ, సిద్ధాంతాలను పూర్తిగా విస్మరించినప్పుడే "నిజమైన పరాజయం" సంభవిస్తుందని జవహర్‌లాల్ నెహ్రూ అన్నారు. లక్ష్యసాధనం అనే మార్గం నుండీ అవి మనల్ని తప్పుదారి పట్టిస్తాయని అదే అపజయానికి కారణమని కూడా అన్నారు. ప్రతి వ్యక్తీ జీవితంలో ఎన్నో అపజయాలను అనుభవిస్తుంటాడు. మీ జీవితపు అపజయాన్ని ఎలా మీరు స్వీకరిస్తున్నారన్న విషయంపైనే మీ గెలుపు ఆధారపడి ఉంటుంది. అందుకే జీవితంలో అపజయాన్ని స్వీకరించని వారికి అపజయం అనేదే ఉండదు.

## హృదయపు మతం

హృదయపు మతం పైనే చిరకాలం విలువ గల మానవాళి ఐక్యమత్యం ఆధారపడి ఉంది. ప్రేమమతమే హృదయపు మతం.

— స్వామి శివానంద

"ప్రజలు మిమ్మల్ని గుర్తుంచుకోవాలంటే ఒకటి చదవదగ్గ రచన వ్రాయండి. లేదా వ్రాయదగ్గ పనులను చేయండి."

— బెంజమిన్ ఫ్రాంక్లిన్

# ప్రతి క్షణం అమూల్యం

ఒక రైతు ఉండేవాడు. భూమిని నాగలితో దున్నుతున్నప్పుడు రంగు రంగుల గోలీలను అతడు భూమిలో కనుగొన్నాడు. వాటిని తీసుకుని ఒక కుప్పగా అమర్చాడు. అందులో నుండీ ఒక్కొక్క గోలీను తీసుకుని పక్షులను బెదిరించడానికి వాడేవాడు. ఆ గోలీలు పక్కనే ఉన్న పారుతున్న నదిలో పడుతూ వచ్చాయి.



ఇలా చేస్తూ పోగా ఒకే ఒక గోలీ మాత్రం మిగిలింది. దాన్ని తనతో ఇంటికి తీసుకు వెళ్ళి కొడుకుకు ఆడుకోవడానికి ఇచ్చాడు. ఆ దారిలో వెడుతున్న ఒక వజ్రాల వ్యాపారి రంగు రాయితో ఆడుకుంటున్న ఆ కుర్రాడిని చూచాడు. దాన్ని చేతికి తీసుకుని పరీక్షించాడు. అది విలువైన కెంపు అని తెలుసుకున్నాడు. రైతుకు పెద్ద మొత్తం ఇచ్చి ఆ కెంపును కొనడానికి ఆ వ్యాపారి తయారయ్యాడు. వ్యాపారి మాటలను విన్న రైతు ఏకధాటిగా ఏడవడం మొదలుపెట్టాడు. "అయ్యా ఇలాంటి గోలీలు నా దగ్గర లెక్కకు మించినన్ని ఉండేవి. నేను వాటిని నదిలో విసిరేసాను. ఆ రాళ్ళ విలువ నాకు తెలిసి ఉంటే నేను ఇప్పటికి ఈ నగరంలోని అతి పెద్ద ధనవంతుడిని అయి ఉండేవాడిని" అన్నాడు.

మన జీవితంలోని ప్రతి క్షణం భగవంతుడు మనకు ప్రసాదించిన అతి విలువైన కానుక. కానీ ఈ విలువైన కాలాన్ని మనం వ్యర్థపు మాటలతో, పనులతో వృథా చేసుకుంటున్నాము. సమయం విలువను తెలుసుకోవడంలో మనం చాలా ఆలస్యం చేస్తున్నాము.

ప్రతి క్షణం అమూల్యమైనదే.

('ఈస్ట్ & వెస్ట్ సీరీస్')

## దేవుడు లేడని అనవద్దు

రాత్రిపూట మనం ఆకాశంలో మిలమిలలాడే ఎన్నో నక్షత్రాలను చూస్తాము. కానీ ఈ నక్షత్రాలు పగటిపూట కనిపించవు. అంతమాత్రాన పగటిపూట నక్షత్రాలు ఆకాశంలో ఉండవని చెప్పగలమా? మీ అజ్ఞాన స్థితిలో మీరు భగవంతుడిని కనుగొన లేకపోయినంత మాత్రాన అతడు ఎక్కడా లేడని చెప్పగలమా? ఓ మనిషి, దేవుడు లేడని చెప్పకు.

— శ్రీరామకృష్ణ పరమహంస

"మాట ఇచ్చేముందు నిదానంగా ఆలోచించు. మాట ఇచ్చిన తరువాత దాన్ని నిజాయితీగా నిలబెట్టుకో."

# సంకిపంగా

## దక్షిణ దేశపు సువిశాల శివలింగం

తమిళనాడుకు చెందిన తిరుచిరాపల్లి జిల్లాలోని ఒక గ్రామంలో గంగై కొండ



చోళపురం పేరుతో ఒక గొప్ప దేవాలయం వెలసి ఉంది. ఈ దేవాలయాన్ని చోళ




రాజైన మొదటి రాజేంద్రుడు క్రీ.శ. 1035వ సంవత్సరంలో నిర్మించాడు. ఈ దేవాలయ ప్రాంగణం శివుడికి అంకితమివ్వబడింది. ఈ ప్రాంగణం 567 అడుగుల పొడవు 318 అడుగుల వెడల్పు ఉంది. గర్భ గృహం పైనున్న శ్రీవిమానం 48 మీటర్ల ఎత్తుతో అందర్నీ ఆకర్షిస్తుంది. 3.9 మీటర్ల ఎత్తున్న ఈ గుడిలోని శివలింగాన్ని దక్షిణ భారతదేశపు అతి పెద్ద శివలింగంగా భావిస్తున్నారు. ఈ ఆలయ గర్భగృహం గోడపై చోళుల కాలపు శిల్పకళకు ఉత్తమ నమూనాగా నిలిచిపోయిన చదువుల తల్లి సరస్వతి శిల్పం అలరారుతోంది.

## 20,000 టన్నుల టిఎన్‌టికు సమమైన శక్తి విడుదల

*రెండవ ప్రపంచయుద్ధం చివరి రోజులలో ఎనోలా గే (Enola Gay) అనబడే B-29 సూపర్‌ఫోర్ట్రెస్ (Superfortress) బాంబర్ జపానులోని పారిశ్రామిక నగరాలైన హిరోషిమా, నాగసాకిలపై అణుబాంబులను వేసింది. బాంబులు వేయబడిన కారణంగా పేలిన బాంబులు 20,000 టన్నుల టిఎన్‌టికు సమమైన శక్తిని విడుదల చేసాయి. తాను వేసిన అటంబాంబు చేసిన విధ్వంసక చర్యను గురించి తెలుసుకున్న బాంబర్ విమానం పైలెట్ మేజర్ థామస్ డబ్ల్యు. ఫోర్‌బీ (Thomas W. Forebee) పిచ్చివాడిగా మారిపోయాడు. మనస్థిమితం లేని ఫోర్‌బీను పిచ్చి ఆసుపత్రిలో చేర్పించారు.*

**"మీ కలలు పండాలంటే మేల్కొనడమే ఉత్తమ మార్గం."**

# ఆశ్చర్యకరమైన మొక్కల ప్రపంచం

శ్రీకృష్ణా చంద్రకాంత్ పరాంజ్‌పే

మాంసాహారవు మొక్కలు: ఆశ్చర్యకర మైన విషయం ఏమిటంటే క్రిములను



Venus flytrap

తినే మొక్కలు ఉన్నాయి. ఆరోగ్యకరమైన ఎదుగుదలకు కావలసిన నత్రజని కోసం



Pitcher Plant

ఇవి అలా చేస్తుంటాయి.

వీనస్ ఫ్లై ట్రాప్ (Venus's flytrap), పిట్చర్ ప్లాంట్, బ్లాడర్ వర్ట్ మొదలైనవి కూడా మాంసాహారాన్ని సేవించే మొక్కలే.



Redwood Tree

అతి ప్రాచీనమైన చెట్టు: కాలిఫోర్నియా లోని వీలర్ (Wheeler) పార్క్ వద్ద ఒక బ్రిస్టల్ కోన్ (Bristlecone) దేవదారు

## దేవుడు కనిపించడు

ప్రాపంచిక కోర్కెలు ఏమాత్రం ఉన్నానరే దేవుడు మనకు కనిపించడు. తేమ తగిలిన అగ్గిపుల్లను అగ్గిపెట్టెపై వెయ్యిసార్లు గీచినా కూడా అది మండదు. మీరు అనవసరంగా అగ్గిపుల్లలను వ్యర్థం చేసిన వారౌతారు. ప్రాపంచిక కోరికలతో కూడిన మనసు, తడితో కూడిన అగ్గిపుల్ల లాంటిది.

— శ్రీరామకృష్ణ పరమహంస

"జీవితం రమణీయం అని నిద్రలో కలగన్నాను. లేచిన తరువాత జీవితం కర్తవ్యం అని తెలుసుకున్నాను."

(Pine) చెట్టు ఉంది. ఒక అంచనా ప్రకారం ఈ చెట్టు వయసు 5000 సంవత్సరాలకు మించి ఉంది.


Bamboo

అతి ఎత్తైన వృక్షం: అమెరికాకు చెందిన కోస్ట్ రెడ్ ఉడ్ బాగా ఎదిగినప్పుడు 110 మీటర్ల ఎత్తు పెరుగుతుంది.


Sunflower

మిరప: 1981వ సంవత్సరంలో అల్కోర (మహారాష్ట్ర)కు చెందిన శ్రీకృష్ణ జోషి అతి ఎత్తైన - 6.6 మీటర్లు - మిరప చెట్టును పెంచాడు.

ప్రాణవాయువు: పగటిపూట మొక్కలు ప్రాణవాయువును తయారు చేస్తాయి. రాత్రిపూట తయారయే బొగ్గు పులుసు వాయువు కంటే ప్రాణవాయువు ఉత్పాదకత 10 రెట్లు ఎక్కువగా ఉంటుంది.


Rafflesia

వెదురు: వెదురు అన్నది ఒక చెట్టు కాదు. అదొకరకమైన గడ్డి మాత్రమే. అందర్నీ ఆశ్చర్యంలో ముంచేటంత వేగంగా - రోజుకు మూడు అడుగులుగా - ఇది పెరుగుతుంది.

సూర్యకాంతం పూలు: సూర్యుడున్న వైపుకు చూడడం అన్నది ఈ పువ్వు ప్రత్యేకత.

## స్టీలు అద్దాలు

*గాజుతో తయారుచేయబడ్డ అద్దాలు వచ్చేంతవరకు జనం అద్దాలను కంచుతోను, వెండితోనూ తయారు చేసుకునేవారు. రష్యాదేశపు ప్రజలు స్టీలు అద్దాలను వాడేవారు.*

"ఒక కొవ్వొత్తి మరో కొవ్వొత్తిని వెలిగించినప్పుడు అది ఏమీ నష్టపోదు."

అతి చిన్న పువ్వు: ఫిరంగి (artillery) మొక్క పువ్వు వ్యాసం 0.35 మి.మీ.లు




ఉంటుంది. ఇంతవరకు మనకు తెలిసిన మొక్కలలో ఇదే అతి చిన్న పువ్వు.

అతి పెద్ద పువ్వు: రాఫలేశియా( Rafflesia) అనబడే పువ్వు వికసించినప్పుడు దాని వ్యాసం 90 సెం.మీ.లు ఉంటుంది. ఇదే మనకు తెలిసిన అతి పెద్ద పువ్వు.

ఆర్కిడ్ (ఒక జాతి పూల చెట్టు) విత్తులు: ఆర్కిడ్ పూల చెట్టు విత్తులు చాలా చిన్నవిగా ఉంటాయి. ఒక మిలియన్ విత్తులు కలిసి ఒక గ్రాము బరువు కంటే కూడా తక్కువ బరువు తూగుతాయి.

పిడుగు: ఇంగ్లాండులోని ఓక్స్, పోప్లర్స్ చెట్లు పిడుగులకు మిగతా చెట్లకంటే కూడా ఎక్కువగా గురి అవుతున్నాయి.

బాక్స్ ఉడ్: బాక్స్ ఉడ్ అన్నది ఎక్కువ బరువు ఉండడంవల్ల నీటిపై తేలకుండా నీటిలో మునిగిపోతుంది.

ఔషధ మొక్కలు: లెక్కలేనన్ని రకాల మొక్కలు ఆధునిక వైద్యశాస్త్రానికి పనికివచ్చే అనేక రకాల మాత్రల తయారీకి ఉపయోగ పడతాయి. ఫాక్స్‌గ్లోవ్ (Foxglove) అన్నది డ్రగ్ డిజిటల్స్‌కు ముఖ్య ఆధారం. ఇది హృద్రోగాల నివారణకు వాడబడుతుంది.

బంగాళాదుంపలు: ఒక బంగాళాదుంప ఆరు లేక ఆరుకు మించిన కొత్త దుంపలను పండించగలదు.

సముద్రపు కలుపుమొక్క: రాసాయన ఎరువుల తయారీకూ, మందుల, పెయింట్ల, టూత్‌పేస్ట్‌ల, ఐస్‌క్రీమ్ తయారీకు కూడా ఇది పనికి వస్తుంది.




జెముడు: చూడడానికి మూడు అడుగుల పొదవు మాత్రం ఉండే జెముడు వేర్లు ఎడారి భూములలో 10 అడుగుల లోతు వరకు దిగి విస్తరించి ఉంటాయి.

('ది టీనేజర్' సౌజన్యంతో)

"మిమ్మల్ని ఆశ అనే ఉయ్యాల జీవితాంతం ఊపుతుంది."

# వేమనవేదం

## తాత్పర్య రచన: ఎమ్.వి.ఎస్. సుబ్రహ్మణ్యం

చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచమైన నదియుం గొదువ కాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?
విశ్వదాభిరామ వినురవేమ!



(మఱ్ఱి విత్తనము చూడడానికి చాలా చిన్నదిగా ఉన్నా, మహా వృక్షానికి జన్మనిస్తుంది. అలాగే పరిశుద్ధమైన మనస్సుతో చేసిన పుణ్యకార్యం చిన్నదైనా గొప్ప ఫలాన్ని ఇస్తుంది).

ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు
కాచి యతుకనేర్చు గమ్మరీడు
మనసు విఱిగెనేని మరియంట నేర్చునా?
విశ్వదాభిరామ? వినురవేమ!

(మన మాటల వలన గాని, చేతల వలనగాని ఇతరుల మనస్సుకు నొప్పి కలిగించే రీతిగా ప్రవర్తించరాదు. కఠినమైన ఇనుప ముక్క విరిగితే ఒకటికి రెండుసార్లు దాన్ని నిప్పులో కాల్చి కమ్మరి అతుకుతాడు.



కానీ ఒకసారి మనసు విరిగిందా, దానిని అతకడం ఆబ్రహ్మకు కూడా సాధ్యం కాదు. కనుక అందరికీ ఆనందం కలిగించే విధంగా మెలగడం అలవరచుకోవాలి.)

## అదృష్టవంతుడు

ఇతరులను ద్వేషించకుండా ప్రశంసించడం నేర్చుకున్న వ్యక్తి, అనుకరించకుండా అనుసరించే వ్యక్తి, పొగడ్తలు కాకుండా ప్రశంసించే వ్యక్తి, నర్దుబాటుచేయడం కాకుండా నాయకత్వం వహించే వ్యక్తి అదృష్టవంతుడు.

"వివేకవంతుని ఒక దినం మూర్ఖుడి జీవిత కాలంతో సమానం."

# సమన్వయ భావన అందరిలో కలగాలి

ఈ దేశంలో అనేక కులాలకు, జాతులకు చెందిన వ్యక్తులు నివసిస్తున్నారు. ప్రతి ఒక్కరు తమది ప్రత్యేకమైన జాతి లేదా కులం అనీ, మేము ఇతరులలా కాదు, వేరు అన్న భావనను కలిగి ఉన్నారనుకోండి. అప్పుడు మనం సంపాదించిన స్వాతంత్ర్యానికి అర్థమే లేదు. అందుకే ప్రతి ఒక్కరు తాము అనుయాయులుగా భావించాలి.




ఒకే పూదోటలో పూచిన పూలమనీ, ప్రతి పువ్వు అందం ఆ పువ్వుదే అనీ, మొత్తం పూలన్నీ కలసి తోట అందాన్ని పెంచుతా యనీ భావించాలి. అనుభవమున్న తోటమాలి లాగా ప్రభుత్వం అన్ని పూవులను సమానంగా చూస్తూ అన్నింటిపై సమాన మైన దృష్టిని సారించాలి. అంతేకాని ఏవో కొన్ని మొక్కలు లేదా పూల తీగలపై మాత్రం మక్కువను చూపుతూ మిగతా మొక్కలను, పూతీగలను నిర్లక్ష్యం చేయకూడదు. ప్రతి కులానికి, ప్రతి జాతికి తన ప్రత్యేకతను నిలబెట్టు కునేందుకు పరిపూర్ణమైన స్వాతంత్ర్యాన్ని ఇవ్వాలి. కాని అందరూ దేశంను దృష్టిలో ఉంచుకుని ఒక సమన్వయ భావాన్ని పెంచుకోవాలి. పూదోటలోని అన్ని రకాల మొక్కలపై పూతీగలపై ఒక రకమైన భావన కలిగి ఉండే తోటమాలిలా మనం అందరం కలిసి ఒకటిగా ఆలోచించాలి.

— రాజాజీ ●

## వారివారి అభిప్రాయాలను వ్యక్తపరిచేందుకు ఇతరులకు అవకాశం ఇవ్వండి

*పెనుతుఫాను గాలులు వీస్తున్నప్పుడు దర్భ పోచలా వంగి తుఫానును ముందుకు సాగనిచ్చే విద్యను నేర్చుకునేందుకూ, నేర్చుకున్న దాన్ని ఆచరించేందుకూ చాలా కాలం పడుతుంది. అయినా ఇది నేర్చుకోదగ్గ విద్య. అరమరికలు లేకుండా చేసిన తప్పును ఒప్పుకోవడంలో తలవంచడానికి తయారవడమన్నది చాలా కష్టమైన పని. మెత్తదనం అన్నమాటకు అర్థం మీ అభిప్రాయాలకు గట్టిగా ముడిపడి ఉండడం కాదు. దానర్థం ఇతరులకు వారి మనోభావాలను వ్యక్తం చేసేందుకు అవకాశం ఇవ్వడం అవుతుంది. నిజజీవితంలో రోజూ ఎదురయ్యే ఆఘాతాల నుండీ మెత్తటి మనసు మనల్ని రక్షిస్తుంది. అది మిత్రుల సంఖ్యను పెంచి శత్రువులను శాంతింపజేస్తుంది.*

# సంతోషంగా ఉండడం ఎలా?

డా॥ ఎమ్.ఆర్. బెయిల్

ప్రతి జీవి సంతోషాన్ని కోరుతుంది. దుఃఖాన్ని అందరూ తూలనాడుతారు. ఈ సంతోషం మనలోనే ఉంటుంది. సంతోషం, దుఃఖం అన్నవి ఎక్కడో బయట ఉంటా యనుకోవడం పొరబాటు. సంతోషం,



Happiness lies within you.

దుఃఖం అన్నవి మానసిక వైఖరిని బట్టి ఉంటాయి. "స్వర్గాన్ని నరకంగా, నరకాన్ని స్వర్గంగా మార్చే గుణం మనసుకు ఉంది" అని మిల్టన్ మహాశయుడు ఎప్పుడో సెలవిచ్చాడు. ఆత్మపతనానికి, ఉన్నతికి మనసే బాధ్యత వహిస్తుందని గీతాచార్యుడు నొక్కి వక్కాణించాడు. తెలివితేటలను ఉపయోగించి అసలు ఆనందాన్ని పొందేందుకు కావలసిన శిక్షణను మనసుకు ఇవ్వాలి.

తన చుట్టూ ఉన్నవారిని చూసి వారు తనకంటే సంతోషంగా ఉన్నారని మనిషి ఊహించుకుంటాడు. వారి అందమైన భవంతులనూ నగిషీతో కూడిన ఖరీదైన మోటారుకార్లనూ, అధికమైన బాంకు నిలువలనూ అతడినే అనుసరించే మిత్రుల పెద్ద సంఖ్యనూ, నౌకర్లనూ అన్నీ చూసి బహుశా అతడు అలా ఊహించుకుంటాడు. కానీ పై కోవకు చెందిన వ్యక్తులకు చేరువ అయినప్పుడు వారు చక్కెర వ్యాధితోనూ లేదా రక్తపోటుతోనూ, హృద్రోగంతోనూ, నిద్రలేమితోనూ బాధపడుతున్నారన్న సంగతి మనకు తెలుస్తుంది. సుఖం అన్నది వారికొక మృగతృష్ణలా ఉంటుంది. అది దగ్గర పడుతున్న కొద్దీ దూరం జరుగుతున్న భ్రాంతి కలుగుతుంది. దూరం నుండీ కొండలు వెల్వెట్‌లా నునుపుగా కనబడతాయి. దగ్గరకు పోయినప్పుడే అక్కడున్న ముళ్ళు, బండలు, పాములు మనకు కనబడతాయి.

మంచి ఆరోగ్యానికి మానసిక శాంతి అవసరం ఎంతైనా ఉంది. ఇతరులతో పోటీ పడుతున్నప్పుడు కొంత ఆడంబరాన్ని

## మీరు దీవిటీకండి

శిష్యుడు: విద్యకు జ్ఞానానికి ఉన్న భేదాన్ని విశదీకరించండి.

గురువు: విద్య ఉన్నప్పుడు వారిని చూపడానికి దివిటీను వాడుతావు. కానీ జ్ఞానోదయం అయితే నీవే దివిటీగా మారుతావు. —టోని డి మెల్లో

"ప్రార్థన పగటిపూట తాళం చెవిగా, రాత్రిపూట తాళంగా ఉండాలి."

ప్రదర్శించాల్సి ఉంటుంది. ఆ కారణంగా లెక్కలేనన్ని చింతలకు గురికావలసి వస్తుంది. ధనాన్ని సంపాదించడానికి కష్టపడి పనిచేయాల్సి ఉంటుంది. అప్పుడు సంపద పెరుగుతుంది. ఆ సొత్తును దొంగల నుండీ, నిప్పు నుండీ, ప్రభుత్వం నుండీ,. స్నేహితుల నుండీ, బంధువుల నుండీ కూడా కాపాడవలసివస్తుంది.




లేనివక్షంలో మిత్రులు, బంధువులు కలసి మూడు వ్యసనాలకు (మగువ, మద్యం, పేకాట) - గురయ్యేలా ప్రోత్సహిస్తారు. అతడు చిర్రుబుర్రులాడుతూ ముక్కోపిగా ఉంటూ, అహంకారిగా తయారవుతాడు.

"సంపద ఆనందానికి ఆధారము కాదని అదే దుఃఖానికి కారణమని" ఆది శంకరుడు సెలవిచ్చాడు. "కిరీటం ధరించిన తలకు బాధలు తప్పవన్న" సూక్తిని ఆంగ్లేయ నాటక రచయిత, మేధావి, పండితుడైన షేక్స్పియర్ ఎప్పుడో సెలవిచ్చాడు. తన స్వానుభవంతో రాజు భర్తృహరి ఇలా రాసాడు. "నడుము చుట్టూ చుట్టుకున్న గుడ్డనే ఏకైక సంపదగా భావించే వ్యక్తి కడుపునిండా తిన్నా లేదా అర్థాకలితో లేచిపోయినా, మెత్తటి పరుపుపై పడుకున్నా లేదా కటిక నేలపై విశ్రమించినా అతడే నిజమైన సుఖపురుషుడు."

ప్రపంచం చుట్టూ ఉన్న వెలుగును మాత్రమే కాకుండా ప్రపంచపు చీకటిని కూడా

# పోలియో నివారణ మందు

*సాల్క్ వాక్సిన్ (Salk Vaccine) మందు 1955లో కనుగొనబడి అభివృద్ధి చేయబడింది. అంతవరకు ఈ పోలియో వ్యాధి ప్రతి సంవత్సరం ఎంతోమందిని వికలాంగులుగా తయారు చేయడమో, లేదా అనేకుల ప్రాణాలను హరించడమో చేస్తూ ఉండేది.*

*ఈ మందు ఆవిష్కరణవరమైన రజతోత్సవం 1980వ సంవత్సరంలో జరిగింది. జోనాస్ సాల్క్ (Jonas Salk)తో పనిచేసిన అతడి ఒకానొక సహచరుడు ఆ ఉత్సవంలో పాల్గొంటూ పోలియో నివారణ మందును కనుగొనేందుకు సాల్క్ పడిన కష్టాలనూ, సుదీర్ఘకాలాన్ని గురించి ప్రస్తావిస్తూ ఇలా సెలవిచ్చాడు.*

*"మందును కనుగొనేందుకు జరిగిన ప్రయత్నంలో ఒకేరకం ద్రవాన్ని ఏమాత్రం విసుగు విరామం లేకుండా ఒక రసి (Virus) తరువాత మరొక రసిపై ప్రయోగాలు అదే ద్రవంతో అదే ప్రయోగాన్ని వారానికి ఏడు రోజుల చొప్పున సంవత్సరంలో 52 వారాలు పాటు మూడు సంవత్సరాల కాలం అతడు కొనసాగించాడు."*

"సంగీతం విశ్వజనీనమైన మానవుల భాష." లాంగ్‌ఫెలో

ఉదాహరణకు ఎంతోమంది కూడు గుడ్డా లేకుండా బాధపడుతున్నారని తెలుసుకోండి. మనతో పోల్చి చూసినప్పుడు వారి పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నట్లు తేలిపోతుంది. మనకు ఇవ్వని వాటిని గురించి బాధపడక మనకు ప్రసాదించిన వాటిని గురించి భగవంతుడికి కృతజ్ఞతలు తెలువుకోవాలి. మన కంటే దయనీయమైన పరిస్థితులలో ఉన్నవారితో సరిపోల్చుకుని చూసుకోవాలి. అప్పుడే మీకు బాధలు కలుగవు. అంతేకాదు తృప్తి కూడా లభిస్తుంది.

ఈ రోజు మనల్ని పీడిస్తున్న అవినీతి, లంచగొండితనం, మొదలైన వాటికి ఏకైక నివారణోపాయం ఉంది. మన పిల్లల మననును నీతివరమైన కథలతో నింపాలి. లేదా ఈ పనిని పిన్న వయసులో ఉన్నప్పుడే విద్యాసంస్థలు చేపట్టాలి.

సంతోషాన్ని కోరేవారు చింతలన్నవి ఆరని మంటలన్న విషయాన్ని మరచిపోకూడదు. చితిప్రాణం లేని కట్టెను కాలుస్తుంది. కానీ దిగులు ప్రాణం ఉన్న మనిషినే నిలువునా కాల్చేస్తుంది!

చింతలను దూరం చేసుకోవడం ఎలా? ఇది సామాన్యంగా అందరూ, అందులోనూ ముఖ్యంగా ధనవంతులు అడిగే ప్రశ్న. కానీ నివారణోపాయాన్ని తెలుసుకోవడం అంత సులభం కాదు. నిద్రమాత్రలు తీసుకోవడం అన్నది నివారణోపాయం కానేకాదు. వ్యాపారపరమైన చింతలూ, ఆఫీసుపరమైన చింతలూ, ఇంటికి సంబంధించిన చింతలూ - ముఖ్యంగా ధనవంతుల కుటుంబాలలో - ఇలా ఎన్నో బాధలు, చింతలు ఉంటాయి. కానీ వీధిలో నివసిస్తున్న మనిషికి చింతలే ఉండవు. ఎందుకు? కారణం డబ్బులున్న మనిషి డబ్బు బలంతో అన్ని కష్టాలను ఎదుర్కోగలనని, లేదా పరిష్కరించుకోగలనని

## 70 శాతం భూమిని ఆక్రమించుకున్న మహా సముద్రాలు




*200 మిలియన్ల చదరపు మైళ్ళ వైశాల్యం ఉన్న భూమిలోని 140 మిలియన్ల వైశాల్యం భూమిని ప్రపంచపు మహాసముద్రాలు ఆక్రమించాయి. అంటే ప్రపంచపు భూమిలో 70 శాతం భూమి జలమయంగా ఉన్నది. ఈ సముద్రాలు 350 మిలియన్ల ఘనమైళ్ళ నీరును కలిగి ఉన్నాయి. ఈ సముద్రాల అడుగుభాగంలో రసాయనాలే కాక ఆహార పదార్థాల, విద్యుచ్ఛక్తి లాంటి తరగని నిధులు కూడా ఉన్నాయి.*

'దైన్యమును, దారిద్ర్యమును తొలగించి జాతిని ఉద్ధరించేదే నిజమైన మతము.''
- వివేకానంద

అనుకోవడమే. కానీ చింతలు లేని మనిషి ఏమీ చేయలేడు. అందుకని జరగాల్సింది జరిగి తీరుతుందని భావించి నుదుటి రాతకు వదిలేస్తాడు.

వైజ్ఞానికంగా చెప్పాలంటే మనిషి ఆకలికీ, నిద్రకు కారణమైన అసలు సంతోషం లేదా ఆనందం అన్నది మిద్దెలు, మేడలు, అందమైన కార్లలో ఉండదు. శారీరక, మానసిక సంతోషాలకు ఆహారం కంటే కూడా నిద్రే చాలా అవసరమైనది. సుఖంగా నిద్రపోయే వ్యక్తిని ఎలాంటి శారీరక, మానసిక రోగాలు బాధించవు. మంచి నిద్ర, మంచి ఆకలిని పుట్టిస్తుంది. తమ వ్యక్తిగత మైన చిన్న చిన్న పనులు చేయడానికి కూడా నౌకర్లను ఉంచుకునే ధనవంతులే చాలావరకు చక్కెరవ్యాధికీ, రక్తపోటుకూ, నిద్రలేమితనానికీ గురి అవుతుంటారు. బీదవాడు తన పనులను తానే చేసుకుంటాడు. ఆ విధంగా కావలసినంత వ్యాయామం చేసినట్లు అవుతుంది. ఫలితంగా మంచి ఆకలి కలుగుతుంది. కండరాలు పుష్టిగా తయారవుతాయి. బీదవాడి అవసరాలు చాలా తక్కువగా ఉంటాయి. వాడికి తృప్తి ఉంటుంది వాడికి ఎలాంటి బంధాలు ఉండవు. ఆ కారణంగా వాడికి చింకి చాప, చిరిగిన దుప్పటీ మంచి నిద్రను ఇస్తాయి.

ఆధునిక కాలానికి చెందిన వ్యాపారస్థుడు కూడా సుఖసంతోషాలతో జీవించాలంటే ఇల్లు వాకిలి భూమి కంపెనీ అన్నవాటితో సంబంధాలు పెంచుకోకుండా కనీసం పడుకోబోయే ముందైనా సరే ఆ భగవంతుడితో సంబంధం పెంచుకుంటే హానికరమైన నిద్రమాత్రలను తీసుకోవలసిన అవసరం ఉండదు. ●

## ఎలా జీవించాలి?

*చింతలుమాని ఎక్కువగా శ్రమించండి.*
*వాహనాలను మాని ఎక్కువగా నడవండి.*
*ముఖం మాడ్చుకోవడం మాని ఎక్కువగా నవ్వండి.*
*తక్కువగా మాట్లాడుతూ ఎక్కువగా ఆలోచించండి.*
*తక్కువగా తాగి ఎక్కువగా ఊపిరి పీల్చండి.*
*ఉపదేశాలు మాని ఎక్కువగా ఆచరించండి.*
*తక్కువ ఖర్చుచేసి ఎక్కువగా పొదుపు చేయండి.*

## గిండీ జాతీయ పార్కు



*చెన్నైలోని గిండీ జాతీయ పార్కు 270 హెక్టార్లకు మించిన భూమిలో విస్తరించి ఉంది. ఈ పార్కులో వివిధ రకాల మొక్కలు, జంతువులు ఉన్నాయి. ఇక్కడ 350 రకాల మొక్కలు ఉన్నాయి. ఇందులో 50 రకాల గడ్డి కూడా పెరుగుతోంది. ఈ మొక్కలలో 200 రకాల మూలికలు కూడా ఉన్నాయి.*

"నేను సంఘటనలను సక్రమంగా నిర్వహించలేకపోయినట్లయితే వాటంతట అవే జరిగేటట్లు నేను వాటిని వదిలివేస్తాను."

— హెన్రీ ఫోర్డ్

# చక్కటి మానసిక ఆరోగ్యం అంటే?

జాన్ విలియమ్స్

మానసిక ఆరోగ్యం గల వ్యక్తి తాత్కాలిక ఓటమిని గ్రహిస్తాడు. వాటిని విజయం మార్గంపై వచ్చే తప్పనిసరి అవరోధాలుగా భావిస్తాడు.





సాధారణమైన మానసిక ఆరోగ్యం గల వ్యక్తిలో యుక్తియుక్తమైన స్థాయి వరకు కొన్ని వైఖరులను తప్పకుండా చూడగలము.

జీవితంలో ఎదురయ్యే సమస్యలను ధైర్యంతో ఎదుర్కోవలసి వచ్చినప్పుడు ఎదుర్కొనే ధైర్యం వారికి ఉంటుంది. తన మార్గంలో ఎదురయ్యే ప్రతి అవరోధాన్ని సవాలుగా తీసుకుని, దాన్ని అధిగమించి గట్టి ప్రయత్నం చేస్తాడు. ఆ తరువాత తన విధిని సక్రమంగా నిర్వహించాను అన్న తృప్తిని అతడు పొందుతాడు.

మంచి మానసిక ఆరోగ్యం, ఆనందం అన్నవి ఒకే నాణెపు బొమ్మ బొరుసు లాంటివి. అంతమాత్రాన జీవితంతో బాగా సర్దుకు పోయే మనిషి పూర్తిగా సంతృప్తి పొందిన మనిషి అని అనుకోరాదు. దాని అర్థం అతని హృదయపు లోతులలో ఆరోగ్యకరమైన ఆత్మబింబం ఉందనే. మీరు మీ గురించి తక్కువ అంచనా వేసుకోకూడదు. తృప్తినిచ్చే సృజనాత్మకమైన పనిని చేపట్టండి. మిమ్మల్ని మీరే ద్వేషిస్తే మీ సామర్థ్యానికి హద్దులు

## చిన్న చిన్న విషయాలపై మీ సమయాన్ని పాడు చేసుకోకండి

*క్షణం తీరిక లేకుండా మొండి పట్టుదలతో పనిచేసే ఈ రోజుల్లో బాధ్యతతో కూడిన స్థానంలో మీరుంటే మిమ్మల్ని మీరు తేలికగా ఉంచుకోండి. ఎలా అంటారా? వివరాలను సేకరించే పనిని ఇతరులకు ఒప్పజెప్పండి.*

*మరోవిధంగా చెప్పాలంటే ఇతరులను పురమాయించండి. చిన్న చిన్న విషయాలను లెక్కలోకి తీసుకోకండి. నౌక ఉన్నతాధికారి (కాప్టెన్) తన వంట తాను వండుకుంటానని మొండిపట్టు పడితే నౌకకు ఏమౌతుందని ఆలోచిస్తే అసలు విషయం మీకు అర్థం అవుతుంది.*

"నీవు ఒక నిజాయితీ గల వ్యక్తిగా రూపొందు అప్పుడు ప్రపంచంలో ఒక దుష్టుడు తగ్గుతాడని నిశ్చయంగా తెలుసుకుంటావు."

— థామస్ కార్లైల్

నిర్మించినవారు అవుతారు. ఈ ద్వేషభావన శారీరక ఆరోగ్యంతో పాటు మానసిక ఆరోగ్యంపై కూడా దెబ్బతీస్తుంది.

మానసిక ఆరోగ్యం గల వ్యక్తి ఇతరులను ఇష్టపడతాడు. అదేలా ఇతరులు కూడా అతడిని ఇష్టపడుతున్నారని భావిస్తాడు. అతడు ఇతరులను శాసించడానికి ప్రయత్నించడు. అలాగే ఇతరులు తనపై శాసించడానికి కూడా అవకాశం ఇవ్వడు. ఇతరులను ప్రేమించే సామర్థ్యం అతడికి ఉంటుంది. ఇతరుల బాగోగులను, వారి అభిరుచులను గురించి ఆలోచించే గుణం కూడా అతడికి ఉంటుంది. అతడితో స్నేహం తృప్తికరంగా ఉంటూ చాలా మన్నికను కలిగి ఉంటుంది.

కోపానికి గల కారణాన్ని బట్టి అతడికి కోపం కలుగుతుంది. అంత ముఖ్యం కాని కారణాల కారణంగా అతడు కోప్పడడు. అతడు కూడా భయం, ద్వేషం, అసూయ లాంటి తప్పు చింతలను కలిగి ఉంటాడు. కానీ వాటికి బానిస మాత్రం కాడు.

పరివర్తన జీవితపు ఒక భాగం అని అతనికి తెలిసి ఉంటుంది. మార్పును అతడు ఆహ్వానిస్తాడు. భవిష్యత్తుకు కావలసిన ప్రణాళికను తయారు చేసుకుని తన భవిష్యత్తును తీర్చిదిద్దుకుంటాడు. నిర్ణయాలను అతడు తానే తీసుకుంటాడు. నిర్ణయాల వల్ల కలిగే ఫలితాలకు అతడే బాధ్యతను వహిస్తాడు. తప్పు చేసినప్పుడు అతడు చేసిన తప్పును ఒప్పుకుంటాడు. ఒకసారి చేసిన తప్పును ఇంకోసారి చేయనని అతడు నిర్ణయం తీసుకుంటాడు. చేసిన తప్పులనుండి మంచి పాఠాలను గ్రహించి లాభాలను పొందుతాడు.

సంక్షిప్తంగా చెప్పాలంటే చక్కటి మానసిక ఆరోగ్యం గల వ్యక్తి చేపట్టిన ప్రతి పనిని తన శక్తి సామర్థ్యాలను పూర్తిగా వాడి చేస్తాడు. తన శక్తి సామర్థ్యాల ద్వారా తాను చేరుకోవలసిన గమ్యాన్ని గురించి ఆలోచించి ఆగమ్యాన్ని చేరుతాడు. అతడు తన జీవితాన్ని అనుభవిస్తాడు.

—'ఐడియాస్ ఎక్స్ఛేంజ్' సౌజన్యంతో

## అత్యంత వేగంగా పయనించే మన దేశపు కొత్త రైలు



కొత్త ఢిల్లీ - హౌరా నగరాల మధ్య నడిచే రాజధాని ఎక్స్‌ప్రెస్ మన దేశంలో అత్యంత వేగంగా నడిచే రైలు. ఈ రైలును తొలిసారిగా 1969వ సంవత్సరంలో ప్రవేశపెట్టడం జరిగింది.

"అపజయాలు, పొరపాట్లు లేకుండా ఎవ్వరూ జీవితాన్ని సంపూర్ణంగా గెలవలేరు. మీపొరపాట్లను అంగీకరించండి, పశ్చాత్తాపం పొందండి. దానినుంచి నేర్చుకోండి."

# లాలా అమర్‌నాథ్

## మంచి ఆల్‌రౌండర్ అయిన గొప్ప క్రికెట్ ఆటగాడు

మంచి ఆల్‌రౌండర్ అయిన గొప్ప క్రికెట్ ఆటగాడు లాలా అమర్‌నాథ్ భారతదేశపు క్రికెట్ జట్టుకు మూడు టెస్ట్ సీరీస్‌లో నాయకత్వం వహించాడు. తొలిసారిగా టెస్ట్ క్రికెట్ ఆడుతున్నప్పుడు 1933వ సంవత్సరంలో ఇంగ్లాండు జట్టుకు విరుద్ధంగా లాలా అమర్‌నాథ్ నూరు పరుగులను చేసాడు.



Lala Amarnath – Noted Cricketer

180 నిమిషాలలో ఇతడు 118 పరుగులను చేసాడు. ఇంగ్లాండు టీమ్‌కు జార్డిన్ (Jardine) నాయకత్వం వహించాడు. ముంబాయిలోని జిమ్‌ఖానా గ్రౌండ్స్‌లో ఆడబడిన ఈ టెస్ట్‌మాచ్ టెస్ట్‌మాచ్ చరిత్రలోనే మరువరానిది.

1946లో ఇంగ్లాండ్‌లో ఆడబడిన టెస్ట్ మాచ్‌లలో తన ఇన్‌స్వింగర్స్‌తో అమర్‌నాథ్ ఇంగ్లాండు జట్టును అదరగొట్టాడు. లార్డ్స్‌లో జరిగిన మొదటి టెస్ట్ మాచ్‌లో స్కోరు బోర్డు 70 పరుగులను మాత్రం సూచిస్తున్నప్పుడు నాలుగు వికెట్లను - హట్టన్, వాష్‌బ్రూక్, కోంప్టన్, హమ్మోండ్ - పడగొట్టాడు.

1947 - 48లో ఆస్ట్రేలియాలో జరిగిన టెస్ట్‌మాచ్‌లో తన బౌలింగ్‌తో గొప్ప బాట్స్‌మన్‌గా పేరు పొందిన (బార్నెస్, మోరిస్, బ్రాడ్‌మన్, హస్సెట్, మిల్లర్‌తో సహా) వారిని తికమకలు పెట్టాడు. 1948 - 49లో వెస్ట్ ఇండీస్ జట్టుతో ముంబాయిలోని బ్రబౌర్న్ స్టేడియంలో ఆడుతున్నప్పుడు మూడు పాత్రలలో - బౌలర్‌గా, బాట్స్‌మన్‌గా, వికెట్ కీపర్‌గా - ప్రశంసనీయంగా రాణించి మన్ననలను పొందాడు. చాలా తొందర తొందరగా అయిదుమంది ఆటగాళ్ళను ఒకరి వెంట ఒకర్ని వెనక్కు తిప్పి పంపించ గలిగాడు. పుట్టుకతోనే నాయకత్వపు లక్షణాలను పుంజుకున్న లాలా అమర్‌నాథ్ ప్రపంచపు అతి చొరవ గల బాట్స్‌మన్‌లో ఒకడు.

## స్టాచ్యుట్ (Statuette)గా పిలువబడ్డ ఆస్కార్

*ప్రస్తుత ఆస్కార్ అవార్డుగా పిలువబడుతున్న అవార్డు 1931వ సంవత్సరానికి ముందు స్టాచ్యుట్ అవార్డుగా పిలువబడేది.*

"పాలల్లో వెన్నవలే, ఈ ప్రపంచంలో పరమేశ్వరుడు ఉన్నాడు."

— స్వామి చిన్మయానంద

# సొగసైన నిర్వచనాలు

రాజకీయవాది: తన దేశం కోసం మీ ప్రాణాలను త్యాగం చేసేందుకు సంసిద్ధుడుగా ఉండే వ్యక్తి.

పొరుగువాడు: మీకంటే కూడా మీ గురించి చాలా ఎక్కువ తెలిసినవాడు.

యజమాని: ఎవరెవరు ఆలస్యంగా వస్తున్నారో తెలుసుకోవడానికి తొందరగా వచ్చే వ్యక్తి.



నాయకుడు: లౌడ్ స్పీకర్ కంటే కూడా చాలా బిగ్గరగా కేకలు వేయగల వ్యక్తి. రాళ్ళు రువ్వుతున్నప్పుడు మాత్రం ప్రజల కంటే ముందుగా కాళ్ళకు బుద్ధి చెప్పే వ్యక్తి.

అర్థ శాస్త్రజ్ఞుడు: డబ్బున్న వారి కంటే కూడా డబ్బును గురించి చాలా ఎక్కువగా తెలిసిన వ్యక్తి.

న్యాయవాది: చట్టాన్ని పాటించే వ్యక్తిగా ఉంటూనే అబద్ధం ఎలా చెప్పాలో బాగా తెలిసి ఉన్న మనిషి.

కవి: అంతరిక్ష నౌక లేకుండానే చంద్రుడిని చేరగలడు కానీ కళ్ళు చారెడు చేసుకుని భూమిని తాకని వ్యక్తి.

బ్యాంకర్: వర్షం లేనప్పుడు గొడుగును అరువిచ్చి, వర్షం వస్తున్నప్పుడు వాపసు తీసుకునే వ్యక్తి.

('బాలవిహార్' సౌజన్యంతో)

## లేచి నించోవడం మంచిది

*తనవల్ల ప్రజలు ఇంకా విశ్వాసాన్ని కలిగి ఉన్నారని గూఢచరులు తనకు అందించిన విషయాన్ని ఒక నియంత ఎందుకో నమ్మలేక పోయాడు. ఒక రోజు మారువేషం వేసుకుని అతడు సినిమా హాలులో ప్రవేశించాడు. వెంటనే 'న్యూస్‌రీల్' ప్రదర్శింపబడింది. రాబోయే దృశ్యాన్ని గురించి చెప్పే వ్యక్తి "మన గొప్ప నియంత తాజా చిత్రాలను మీరు తెరపై చూస్తారు" అని ప్రకటించడం, ఆ తాజాచిత్రం కనబడడం ఏకకాలంలో జరిగాయి. చిత్రాలను చూసిన వెంటనే హాలులోని ప్రజలు అంతా లేచినుంచొని "నియంత వర్థిల్లాలి" అని ఘోష పెట్టారు. అది చూసిన ఆ నియంత మురిసిపోతూ లేచి నుంచోవడం మరచిపోయాడు. వెంటనే వెనుకనున్న వ్యక్తి నియంత భుజం తడుతూ "నీవు వాడిని గురించి ఎంత పెద్దగా ఆలోచిస్తున్నావో నాకు బాగా తెలుసు. లేచి నిలబడకపోతే పోలీసు వారు నిన్ను అరెస్ట్ చేస్తారు" అన్నాడు.*

"పురాతనమైనందువల్ల విడిచిపెట్టదగినది - యంత్రం మాత్రమే కాదు; మేథ పురాతనం కాకుండా ప్రతివారూ అప్రమత్తంగా ఉండాలి."

— లక్ష్మీపత్ సింఘానియా

# ప్రపంచపు అతివిశాలమైన రెండవ ఎమ్.ఎస్.టి.రాడార్

ఆంధ్ర ప్రదేశ్‌లోని తీర్థయాత్రా కేంద్రమైన తిరుపతిలో మొత్తం ప్రపంచంలోనే వైశాల్యంలో రెండవ స్థానంలో ఉన్న ఎమ్.ఎస్.టి. (Mesosphere, Stratosphere, Troposphere) నెలకొల్పబడి ఉంది. మన దేశంకు సంబంధించినంత



MST Radar, Gadanki, Tirupati, A.P.

వరకు ఇదే అతి పెద్దది. తిరుపతి పట్టణానికి 32 కి.మీ.ల దూరంలో ఉన్న గడంకి గ్రామంలో ఇది 1990వ సంవత్సరం అక్టోబరు నెల 29వ తారీఖు నుండే పని చేయడం ప్రారంభించింది. భౌగోళిక దృష్టితోనూ, శబ్దం స్థాయి తక్కువగా ఉన్న కారణంగా ఈ గడంకిని ఎన్నుకోవడం జరిగింది.

భూమి ఉపరితలంపై 5 కి.మీ.ల మొదలు 100 కి.మీ.ల ఎత్తుకు మధ్య ప్రాంతంలో ఉన్న వాతావరణాన్ని, ఛాయా చిత్రాలను ఈ రాడార్ ఎడతెరిపి లేకుండా తీయగలదు. వాతావరణంలో ఉన్న గాలులను, గ్రహాల, భూమధ్య రేఖ తరంగాలను, అల్లకల్లోల పరిస్థితులను నిశితంగా గమనించగలదు. ఈ విధంగా సేకరించబడిన వివరాల ఆధారంగా వార్తా సంచారం, వాతావరణ శాస్త్రం, విమానయానం, రాకెట్లను పంపేందుకు అనువైన సమయం లాంటి విషయాలకు సంబంధించిన ముఖ్య సమాచారాన్ని గాలుల ఆకృతి ఆధారంగా తెలుసుకోవచ్చును. ఈ ఎమ్.ఎస్.టి. రాడార్ ఆధారంగా వైజ్ఞానికులు వాతావరణ అధ్యయనం అర్థం చేసుకోవడం అన్నవి చాలా సులువుగా చేయగలరు. ఆ విధంగా ఇది వారికి దోహదకారి అవుతుంది.

— ("ఇన్‌వెన్షన్ ఇంటలిజెన్స్" సౌజన్యంతో)

## మనం ఉపయోగించే సాధనాలకు మనమే బాధ్యులం

సాధనాలూ సాధించినదీ రెండూ మంచివిగా ఉండాలి. సాధించటం అన్నది దేవుడి ఆధీనంలో ఉంటుంది కానీ మనం ఉపయోగించే న్యాయసమ్మతానికి సాధనాలకు బాధ్యులం మనమే. మనం సాధించినదానికి మనం బాధ్యులం కాము. కానీ మనం ఉపయోగించే సాధనాలకు మాత్రం మనమే పూర్తిగా బాధ్యులం.

— రాజాజీ

'ఉదయం ఆలోచించు, మధ్యాహ్నం ఆచరించు, సాయంకాలం భుజించు, రాత్రివేళ నిద్రించు.'' — విలియం బ్లాక్

# పుట్టకురుపు వ్యాధి

## జీవితాన్ని రక్షించే వాస్తవాల్ని తెలుసుకోండి

* పుట్టకురుపు వ్యాధి సోకిన వారి సంఖ్య పెరుగుతున్నట్లు గణాంక శాస్త్రం లెక్కలు చెబుతున్నాయి. ఈ వ్యాధి సోకడానికి గల సామాన్య కారణాలు పొగతాగడం (సాధారణంగా భావిస్తున్నట్లు కాక సిగరెట్లు తాగడం కంటే బీడీలు తాగడం రెండింతలు



హానికరం), జర్దాపాన్ తినడం, పొగాకును నమలడం, అతి ఎక్కువగా హార్మోన్లను గ్రహించడం, కొన్ని ఆహార పదార్థాలను నిలువ ఉంచేందుకు వాడే పదార్థాలు మొదలైనవి.

* ఈ పుట్టకురుపు వ్యాధితో వచ్చిన పెద్ద చిక్కు ఏమిటంటే వ్యాధి సోకిన లక్షణాలు లెక్కలోనికి తీసుకోనంత మామూలుగా కనబడటమే. అందుకే మనిషిలో పుట్టకురుపు వ్యాధి ఉండి ఉండవచ్చును. కానీ ఆ విషయంగా అతడికి తెలియకుండా ఉండవచ్చును. ప్రతి సంవత్సరం తప్పకుండా వైద్యచికిత్స చేయించుకోవడమే ఉత్తమమైన మార్గం.

* చాలావరకు రోగులలో ఈ జబ్బు నయం కాగలదు. ఈ 50 సంవత్సరాల కాలంలో మనం పుట్టకురుపు వ్యాధిని గురించి సామాన్యంగా మనకు వచ్చే జలుబుకంటే కూడా ఎక్కువ విషయాలను తెలుసుకున్నాము! ముందే గుర్తించి చికిత్స ప్రారంభిస్తే ఈ వ్యాధి చాలావరకు నయం కాగలదు.

* ఉపేక్షించినప్పుడే ఈ వ్యాధి భయంకరంగా తయారవుతుంది! ఈ రోజు ఈ వ్యాధి సోకిన వ్యక్తులు మృత్యువుతో జరిగే పోరాటంలో విజయాన్ని సాధించడం మాత్రమే కాకుండా, ఒడుదుడుకులు లేని సాధారణ జీవితాన్ని ఎంతో చురుగ్గా కొనసాగిస్తున్నారు.

(ఇండియన్ కాన్సర్ సొసైటీ, ముంబయి)

## కోపం

కోపం మనను దీపాన్ని ఆర్పుతుంది.
— ఇంగర్‌సోల్

''లేని గొప్పదనం ఉందని చెబితే ఉన్న గొప్పదనం కాస్తా వూడిపోతుంది.''
- గాంధీజీ

# భారతీయ వార్తాపత్రికలకు సంబంధించిన వాస్తవాలు

## ఉత్తర ప్రదేశ్‌లో అతి ఎక్కువ సంఖ్యలో ప్రచురింపబడుతున్న వార్తాపత్రికలు

1994లో సేకరించబడిన వివరాల ప్రకారం మనదేశపు అతిపెద్ద రాష్ట్రమైన ఉత్తర ప్రదేశ్ నుండీ అతి ఎక్కువ సంఖ్యలో (5,630) వార్తాపత్రికలు వెలువడ్డాయి. ఆ తరువాతి స్థానాలలో ఢిల్లీ (4,733), మహారాష్ట్ర (3,775), పశ్చిమ బెంగాల్ (2,992) ఉన్నాయి.




## 124.36 శాతం పెరిగిన దినపత్రికలు

1985 మొదలు 1994 వరకు అంటే పది సంవత్సరాల కాలంలో దినపత్రికల పెరుగుదల 124.36 శాతంగా నమోదైంది.

## వార్తాపత్రికల మొత్తం సంఖ్య

మొత్తం దేశంలో వార్తాపరమైన వార్తా పత్రికల సంఖ్య 1994లో 35,601గా నమోదైంది. ఈ పత్రికలన్నీ కలిపి 7,23,02,000 ప్రతులను అమ్మాయి.

(— రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్‌పేపర్స్' రిపోర్ట్ ఆధారంగా)

●

---

## అతి ఎక్కువగా వాడబడుతున్న ఇంగ్లీషు మాట

* ఇంగ్లీషు భాషలోని ప్రాథమిక ధ్వనుల సంఖ్య 45 ఈ ధ్వనులు మనకు ఆ భాషకు చెందిన 26 అక్షరాల వర్ణమాల నుండి లభిస్తున్నాయి.

* ఇంగ్లీషు భాషలో మనం వాడే సెట్ (Set) అన్నమాట ఇంగ్లీషులో ఎక్కువగా వాడబడుతున్న మాట. ఈ సెట్ అన్నమాట 50 రకాలైన నామవాచకాలు (noun)గా, 126 రకాల క్రియలుగా వాడబడుతోంది. ఈ మాటకు పదిరకాల క్రియావిశేషణ రూపాలు కూడా ఉన్నాయి

* అబ్‌స్టెమియస్ (Abstemious), ఫేషియస్ (Facetious), ఆర్సెనియస్ (Arsenious) అన్న పదాలలో ఇంగ్లీషు అచ్చులు (Vowels) అదేక్రమంలో వస్తాయి.

"ఏమీ చేయకుండా విజయం సాధించటం కంటే ఏదోఒకటి చేసి అపజయం పొందటమే మేలైనది."

# నాదృష్టిలో ఆనందం

## కె.పి.ఎస్. మేనన్

నా జీవితపు ప్రతి క్షణాన్ని నేను జీవించాను. ఒక పదవి నుండీ ఇంకో పదవిని స్వీకరించినప్పుడు నా జీవితాన్ని జీవించాను. ప్రతి పనిలోనూ, నేను ఆనందాన్ని, సంతోషాన్ని పొందాను. ప్రతి పనికి నా సామర్థ్యాన్ని జోడించాను. ప్రతి పని నుండీ సామర్థ్యాన్ని పొందాను.




అన్నింటిని నేను అనుభవించాను అన్నీ నాకు ఆనందాన్ని ఇచ్చాయి. నా దేశంలోనూ, విదేశాలలోనూ, పలు రకాలైన అధికారాలను బాధ్యతలను నిర్వహించే అవకాశాలు నాకు వచ్చాయి. భారతదేశంలో ఫక్తూనిస్తాన్ గుండెగా పరిగణింపబడే ఉత్తర ప్రాంతపు పెషావర్ నుండీ దక్షిణ భారతంలో తమిళ సాంస్కృతిక కేంద్రంగా పరిగణింప బడుతున్న తిరుచినాపల్లి వరకు అన్ని చోట్లా పని చేసాను. విదేశాలలో రష్యా, చైనా, సిలోన్, కొరియా, జాంజిబార్, శాన్ ఫ్రాన్సిస్కో లాంటి అనేక దేశాలలో పని చేసాను. పైన చెప్పబడిన కొన్ని దేశాలలో చాలా సంవత్సరాలు పని చేసాను. నేటి శ్రీలంకలో నాలుగు సంవత్సరాలు ఉన్నాను. చైనాలో అయిదు సంవత్సరాలు పని చేసాను. ఒక్క రష్యాలోనే 9 సంవత్సరాలు గడిపాను. నేను ఈ దేశాలలో పని చేస్తున్నప్పుడు కొన్ని సంవత్సరాలలో గాలులు, పెనుగాలులు వీచాయి. కానీ నేను ఈ గాలులతో కొట్టుకొని పోలేదు. నా పాదాలు స్థిరపడడం వల్ల నాపై ఎలాంటి ప్రభావాన్ని అవి చూపలేకపోయాయి.

పనిలోనే, పరిశ్రమలోనే ఆనందం దాగుంటుందని నా అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. అంతమాత్రాన అందులోనే

### భర్త తినదగ్గ తినుబండారం

*భర్తను నమ్మకం అనే జాడీలో ఉంచి దాంపత్య ప్రేమ అనే వెచ్చదనానికి దగ్గరగా ఉంచండి. వెచ్చదనం ఒకేలా ఉండాలి. అనురాగం మరియు దయతో భర్తను తృప్తిపరచండి. దీనితో కూడా వివేకం, సద్భావాల తేనెను వాడండి. ఈ విధంగా వండబడిన భర్త తినతగ్గ తినుబండారంగా మారుతాడు.*

"భూమిపైన సాహసానికి గొప్ప పరీక్ష ఏదంటే హృదయ స్థైర్యాన్ని కోల్పోకుండా పరాజయాన్ని భరించగలగటమే."

— రాబర్ట్ గ్రీన్ ఇన్‌గర్‌సాల్

ఆనందం ఉండదని కూడా తెలుసుకున్నాను. ఆటపాటలు లేకుండా పని మాత్రం చేసేవాడు నిరుత్సాహపరుడుగా ఉంటాడన్న ఆంగ్ల సామెత ఉండనే ఉంది. ఆ వ్యక్తి పెరిగే కొద్దీ అతడిని అది మరింత సోమరిపోతుగా


Spending leisure usefully

మార్చగలుగుతుంది. పని చేస్తున్న రోజులలో ఎలాంటి అభిరుచులు కానీ, ఆసక్తి పట్ల గానీ చొరవ చూపించని వ్యక్తి పదవీ విరమణ చేసిన తరువాత, విసుగెత్తి నిజంగానే మరణిస్తాడు. కారణం బోర్‌డమ్‌కు మరణమే జుల్మానా అవుతుంది.

ఢిల్లీకి చెందిన సుప్రసిద్ధ హృదయ పరమైన జబ్బుల నిపుణుడు డా॥ కరోలి (Dr. Caroli) గుండెజబ్బుకు గురి అవుతున్న ప్రభుత్వ ఉద్యోగులకు సంబంధించిన ఒక అధ్యయనాన్ని చేపట్టాడు. ఉద్యోగ విరమణ చేసిన మొదటి రెండు లేక మూడు సంవత్సరాల లోపే చాలావరకు వ్యక్తులు గుండె జబ్బుకు లేదా పోటుకు గురి అయ్యారని అతడు తెలుసుకున్నాడు. పదవీ విరమణ చేసిన తరువాత చాలా తీరిక సమయం దొరుకుతుంది. ఏ విధమైన అభిరుచి లేదా ఆసక్తి లేనప్పుడు ఇక మీదట జీవించి ఏమీ ప్రయోజనం లేదన్న భావన నిదానంగా అతనిలో జొరపడుతుంది. దాంతో రక్తపోటు పెరిగి గుండెపోటు వస్తుంది.

ఒకప్పుడు అరిస్టాటిల్ (Aristotle) పని, ఆట, విశ్రాంతి ఈ మూడింటి మధ్య విభజన రేఖలను గీసాడు. ఏదో ఒక దాని కోసం చేసేదాన్ని పనిగా అతడు నిర్వచించాడు. ఆటలు చేస్తున్న పనిలో మనం కోరే మార్పు అనిపించుకుంటుంది. విశ్రాంతిని అతడు పనీ ఆటల కంటే కూడా గొప్పదైనదిగా అభివర్ణించాడు. ఈ విశ్రాంతి అన్న

## నీరు అతి ఎక్కువగా ప్రవహించే పెద్దనది అమెజాన్

*అమెజాన్ నదికున్నంత ప్రవాహమార్గం ప్రపంచంలోని మరే నదికీ లేదు ఈ మార్గం 3,889,489 6 చ.కి.మీ.ల వరకు విస్తరించి ఉంది. అమెజాన్ 6515 కి.మీ.ల పొడవునూ, 91 మీటర్ల (అత్యధిక) లోతునూ, 10 కి.మీల (అత్యధిక) వెడల్పును కలిగి ఉన్న నది. ఇందులోకి 7,000లకు పైగా ఉపనదులు కలుస్తాయి. పొడవు దృష్ట్యా అమెజాన్ నదికి ప్రపంచంలో రెండవస్థానం లభిస్తుంది. ఇందు లోకి ప్రవహించే నీరు దృష్ట్యా (ఒక సెకండుకు 100,000 ఘటమీటర్లు) ఇది ప్రపంచంలోని అతి పెద్ద నది. (ఎకనామిక్ టైమ్స్)*

"వినటం ఎలాగో తెలుసుకో, అప్పుడు చెడుగా మాట్లాడిన వారి నుంచి కూడా నీవు లాభం పొందగలుగుతావు."

సహాయంతోనే జీవిత సంధ్యా కాలాన్ని ఆనందంగా గడపడానికి బాట వేసుకున్న వారం అవుతాము.

నేను గడిపిన జీవితాన్ని ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే నా జీవితపు మధుర క్షణాలన్నీ నేను విశ్రాంతిలో గడిపిన క్షణాలే అన్న భావన నాకు కలుగుతుంది. నా జీవితంలో సాహసయాత్ర అన్నది నేను ఏమైనా చేసి ఉంటే అది కాలినడకతో నేలపై ప్రయాణం. రెండవది గుర్రంపై కూర్చొని భారత దేశం నుండి చైనా వరకు ప్రపంచంలో అతి భయంకర మార్గంగా భావింపబడుతున్న ద్వారా ప్రయాణం. హిమాలయ పర్వతాల గుండా అదే విధమైన ప్రయాణం కారాకోరమ్స్ (Karakorams), పామిర్స్ (Pamirs) గుండా కూడా చేసాను. ఈ ప్రయాణాలు నాలోని సాహిత్యకారుడిని మేలుకొలిపాయి. ప్రయాణం చేస్తున్నప్పుడు నేను రోజూ రాసుకున్న డైరీ "ఢిల్లీ చుంకింగ్" పేరుతో నా మొదటి పుస్తకంగా వెలువడింది. ఆ తరువాత మరో పన్నెండు పుస్తకాలు వెలువడ్డాయి. పరిష్కరింపబడిన నా ఆత్మకథ "మెనీ వరల్డ్స్ రివిసిటెడ్" ప్రచురణతో చరమస్థాయికి చేరుకుంది. "జర్నీ రౌండ్ ది వరల్డ్" అన్న పేరుతో నా 65వ ఏట వయసు ముదురుతున్న భార్య, విరిగిన కాలు, చేతి కర్రతో నేను చేసిన యాత్రలను గురించి అందులో రాసాను.

యాత్రలు, రచనలు ఇవే నా అభిరుచులుగా ఉన్నాయి. నేను నా జీవితంలో అనుభవిస్తున్న ఆనందానికి ఇవి ఎంతో దోహదం చేస్తున్నాయి. మీరు మీ జీవిత సంధ్యాకాలంలో ఆనందంగా గడపాలని అనుకుంటే అరిస్టాటిల్ సలహాను పాటించండి. మీరు మీ యౌవన దశను, మధ్య వయసును పని ఆటలలో గడుపుతున్నా విశ్రాంతి కోసం సమయాన్ని కేటాయించి అనుభవించడాన్ని నేర్చుకోండి.

(సంకలనం: "లైఫ్ అండ్ ఔట్‌లుక్" సౌజన్యంతో)

## స్వాతంత్ర్యానంతరం జారీ చేయబడిన తొలి తపాలా బిళ్ళలు



అశోకుని స్తంభం, మువ్వన్నెల జాతీయ పతాకం, ఎర్‌క్రాఫ్ట్ Dc4ను ముద్రించిన తొలి తపాలా బిళ్ళలను మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారత ప్రభుత్వం విడుదల చేసింది.

"సంఘాన్ని ఏకీకృతంగా ఉంచే బంగారు గొలుసు - కనికరం."
— గోథె

# వీరిని గురించి తెలుసుకోండి

**అమృత్‌రాయ్:** సుప్రసిద్ధ హిందీ రచయిత. ఇతడి మొదటి నవల బీజ్ 1952లో ప్రచురింపబడింది. తండ్రి ప్రేమ్‌చంద్ జీవిత చరిత్రను "కలమ్ కా సిపాహి" అన్న పేరుతో ఇతడు రచించాడు. 1963వ సంవత్సరంలో ఈ పుస్తకానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది.




**గాబ్రియాలా సబాటినీ:** అర్జెంటీనా దేశానికి చెందిన టెన్నిస్ క్రీడాకారిణి. మహిళా టెన్నిస్‌కు సంబంధించినంతవరకు ఎక్కువ ధనాన్ని సంపాదించినవారిలో ఆరవ స్థానంలో ఉన్న మహిళ. ఇంతవరకు ఈమె 27 వ్యక్తిగత ప్రైజ్‌లను, 12 జంట ఆటలకు సంబంధించిన ప్రైజ్‌లను పొంది 87,85,849 డాలర్లను సంపాదించింది.

**హరి సాధన్ దాస్ గుప్త:** చలన చిత్రాల, డాక్యుమెంటరీల సుప్రసిద్ధ నిర్మాత. ఇతడు నిర్మించిన కథా చిత్రాలలో 'కమల్లత', 'అకి అంగే అతేరూప్' మంచి ప్రజా దరణను పొందాయి.

**ఎడ్డీ రికెన్‌బేకర్:** ఆటోమొబైల్ వాహనాల పందాలలో పాల్గొనే డ్రైవర్‌గా మంచి పేరును సంపాదించాడు. అమెరికా దేశపు ముగ్గురు ఉత్తమ డ్రైవర్లలో ఒకడుగా పరిగణింపబడుతున్నాడు.

**ధ్యాన్‌చంద్:** అందరికీ ఇతడు హాకీ 'విజర్డ్'గా సుపరిచితుడు. 1947 వరకు భారతదేశపు జట్టు ఆటగాడుగా భారతదేశానికి ప్రతినిధిత్వం వహించాడు. ముఖ్యమైన ఆటలలో 395 గోల్స్‌ను, ఇతర అన్ని ఆటలలో 1,000 గోల్స్‌ను ఇతడు చేసాడు.

**డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బర్గ్ ఫిలిప్ మౌంట్ బాటన్:** రెండవ ఎలిజబెత్ రాణీ భర్త. సుప్రసిద్ధమైన రాణి విక్టోరియా (1819-1901) మునిమనమడు. ఎర్ల్ మౌంట్ బాటన్ అల్లుడు. ఇతని మేనమామే బ్రిటిష్ ఇండియా ఆఖరి వైస్రాయ్. 1947-48 మధ్య ప్రాంతంలో స్వతంత్ర భారతదేశపు తొలి గవర్నర్ జనరల్‌గా ఇతడు దేశ విభజన తరువాత నియమించబడ్డాడు.

## న్యాయవర్తనం

*ఎక్కడ న్యాయవర్తనం ఉందో అక్కడ విజయం ఉంటుంది.*

"భావం, పలుకు, క్రియ - ఈ మూడింటి ఏకత్వమే మానవత్వం."

# మహిళలు - దేశనిర్మాతలు

ఆడవారికి మగవారికి ఉన్న బాధ్యతలను గురించిన చర్చలలో అనుకూలమైన ప్రతికూలమైన అభిప్రాయాలు వెలువడుతుంటాయి. ఆడమగవారిలో ఎవరు గొప్ప ఎవరు తక్కువ అన్న ప్రశ్న ఎంతోమంది జీవితాలలో సమస్యలను సృష్టిస్తుంది.



చక్కటి సామరస్యం కోసం పనులనూ, బాధ్యతలనూ ఇద్దరిలో సమంగా విభజించడం అన్నది చాలా అవసరం. ఒకరి కార్యరంగంలో మరొకరి ప్రవేశం అన్నది ఎప్పుడూ జరగని పని. అదేవిధంగా వృత్తిపరంగానూ, సాంఘిక పరంగానూ ఒకే పనిలో లీనమవడమన్నది కూడా అంత సాధ్యమయ్యే పని కాదు. కానీ వారు అందరికి ఉపయోగపడే సర్వసాధారణమైన పనులలో అభిరుచి, ప్రేమభావాన్ని, తెలిసిన సమాచారాన్ని పంచుకుని పెంచుకోవచ్చును.

స్త్రీ ఏ విషయంలోనూ మగవాడికి తీసిపోదు. ఇల్లు అన్నది సహకార సహయోగాలతో కూడుకున్న సంస్థ. ఇది పనులను, బాధ్యతలను పంచుకోవడం వల్లనే దినదినాభివృద్ధి చెందుతుంది. మగవాడు బయటకు పోయి పనిచేసి ధనాన్ని సంపాదిస్తే స్త్రీ ఇంట్లో ఉండి ఇంటిని చక్కబరుస్తుంది. అంతమాత్రాన స్త్రీ ఇతరులపై ఆధారపడి జీవించే స్వతంత్రం లేని ప్రాణి అని అర్థం కాదు. నిజం చెప్పాలంటే జాతి నిర్మాణానికి ఆమే కారకురాలు. పిల్లలను క్రమశిక్షణతో సక్రమంగా పెంచి వారి గుణగణాలను తీర్చిదిద్ది తద్వారా మొత్తం మానవాళిని తీర్చిదిద్దే శక్తిని కలిగి ఉండడం నిస్సంశయంగా గొప్ప అధికారం. ఇది నిజంగానే ఒక స్త్రీ ఓటరుగా, చట్టాల నిర్మాతగా, అధ్యక్షురాలిగా, మంత్రిగా, న్యాయాధిపతిగా చేసే పనుల కంటే కూడా చాలా గొప్పదైనది.

స్త్రీ పురుషులిద్దరూ వ్యక్తిగత వ్యక్తిత్వాన్ని అభివృద్ధి పరచుకోవడంలో ఒకరినొకరు అభినందించుకుంటూ ఉత్తమమైన పరిపూర్ణత్వాన్ని పొందాలి. ఒకరికొకరు సహాయం చేసుకోకుండా, సహకారాన్ని అందివ్వకుండా ప్రేమతో అర్థం చేసుకోకుండా జీవితంలో విజయాన్ని సాధించలేమని తెలుసుకోవాలి.

—వినీతా సేత్ (రోటరీ ప్రైమ్)

"తప్పులెన్నటం తేలికే, బాగా చేయగలగటమే కష్టమైన పని."

# కాగితం రకాలను గురించి మీకు తెలుసా?

వివిధ ప్రయోజనాల కోసం వాడబడే కాగితం రకాలు 5000 దాకా ఉన్నాయి. వాటిలోని కొన్ని రకాలు:

1. న్యూస్‌ప్రింట్: వార్తాపత్రికలు, ఇతర వాణిజ్యపరమైన ప్రకటనల అచ్చు కోసం న్యూస్‌ప్రింట్‌ను వాడుతారు.



2. బ్లీచ్డ్ బ్రిసిల్ (Bleached Bristle): తెల్లబరచబడి బిరుసుగా ఉండేలా తయారు చేయబడిన కాగితాన్ని బ్లీచ్డ్ బ్రిసిల్ అంటారు. బాంకు చెక్కులను తయారు చేసేందుకూ, చాలా విలువైన కార్యాలయ సామగ్రీను (Stationary)ను తయారు చేసేందుకూ, ఫొటోగ్రాఫిక్ పేపరు తయారీకూ, కంప్యూటర్ కార్డ్‌ల తయారీకు ఈ రకం పేపరును వాడుతారు.

3. ముతక కాగితం (Coarse Paper): ఇదొక రకమైన హెవీ డ్యూటీ బ్రౌన్ రంగు కాగితం. దీన్ని పాకింగ్ కోసం వాడుతారు.

4. పీల్చుకునే కాగితం (Absorbent Paper): ఇది ప్రధానంగా బ్లాటింగ్ పేపర్ తయారీకు, వడగట్టే సాధనం తయారీ కోసం వాడబడుతుంది.

5. టిష్యూ పేపరు: దీన్ని టాయిలెట్ పేపరుగా, నాప్‌కిన్‌గా, తువాళ్ళుగా వాడుతారు.

6. ఫ్లిమ్‌సీ పేపర్: వండ్లను పాక్ చేసేందుకు వాడుతారు.

7. పేపర్ బోర్డ్: పెట్టెలను, కంటైనర్లను తయారు చేయడానికి వాడుతారు.

8. కార్రుగేటెడ్ కంటైనర్ బోర్డ్: ఇదొక రకమైన ముడుచుకున్న కాగితం. మిట్టవల్లాలున్న పొడవైన రోలర్ల ద్వారా పోయేలా చేసి ఈ రకం పేపరు తయారు చేస్తారు. అలా చేయడం వల్ల బోర్డుకు ఒక విధమైన ఆకారం లభిస్తుంది.

## ఎలాంటి మనుషులు కావాలి?

*ఎలాంటి మనుమలు కావాలి? బలమైన, శక్తివంతమైన, నమ్మకమున్న యువకులు, నిజాయితీకు వెన్నెముక లాంటి వ్యక్తులు కావాలి. ఇవి ఉంటే అన్నీ సక్రమంగా సమకూరుతాయి. ఇలాంటి వారు నూరు మంది ఉంటే చాలు ఈ ప్రపంచంలో విప్లవాత్మకమైన మార్పు వస్తుంది.*

"నీతిని నిలిపి జాతిని నడిపిన మహనీయులను మరువవద్దు."

# హూవర్ ఆనకట్ట

## ప్రపంచపు అద్భుత నిర్మాణం

హూవర్ లేదా బౌల్డర్ ఆనకట్ట అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని కొలొరాడో (Colorado) నదీ ప్రవాహాన్ని బ్లాక్ లేదా బౌల్డర్ కాన్‌యాన్ (Boulder Canyon)లో అపుతుంది. ప్రపంచపు అతిపెద్ద ఆనకట్ట లలో ఈ హూవర్ డామ్ ఆనకట్ట ఒకటి. దీని



HOOVER DAM,
COLORADO, USA

ఎత్తు 726 అడుగులు (70 అంతస్తులంత ఎత్తు), పొడవు 1244 అడుగులు. దీని నిర్మాణంలో 4.4 మిలియన్ ఘన గజాల కాంక్రీటు వాడబడింది. ఈ నిర్మాణం కారణంగా 115 మైళ్ళ పొడవున్న సరస్సు - లేక్ మీడ్ (Lake Mead) - ఏర్పడింది. 1955 వరకు ఈ సరస్సే ప్రపంచపు అతిపెద్ద కృత్రిమమైన సరస్సుగా పరిగణించబడింది. ఆనకట్ట వద్ద నీటిలోతు 600 అడుగులకు మించి ఉంది!

ప్రపంచపు నిజమైన అద్భుత నిర్మాణాలలో ఈ హూవర్ ఆనకట్ట నిర్మాణం ఒకటి. విడువకుండా రెండు సంవత్సరాలపాటు కాంక్రీటును కార్మికులు పగలనక, రేయనక

---

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్:** 1. 12 మందిని రాష్ట్రపతి రాజ్య సభకు నియమించవచ్చును. 2. (ఎ) యుఎస్ఎ 3. (డి) దాదాభాయ్ నౌరోజీ 4. (బి) క్రీడారంగం 5. (ఎ) రక్షణ దళాల స్టాఫ్ కాలేజీ 6. (బి) రేచీకటి 7. (ఎ) నీటిపారుదల 8. (డి) మిజోరామ్.

**మాటల మహిమ:** 1. (ఎ) కుండలు చేయుసాధనం 2. (సి) చిరుతపులి 3. (బి) దిట్టతనము 4. (డి) మిక్కిలి తడి గలది 5. (బి) మాటలమారి 6. (సి) విష్ణువు 7. (ఎ) ఒక రకమైన చేప 8. (డి) వ్యవసాయపరమైన ఒడంబడిక.

**తెలివికి పరీక్ష:** 1. మిల్కీవే 2.1000 ఘన అడుగుల తాజాగాలి ప్రతి 20 నిమిషాలకొకసారి కావలసి వస్తుంది 3. 1941 4. 1962వ సంవత్సరం, అక్టోబరు నెల 20వ తారీఖున 5. 1949వ సంవత్సరం నవంబర్ 26వ తారీఖున 6. నేపానగర్‌లో 7. అట్లాంటిక్ - పసిఫిక్ సముద్రాలను.

'ఉపయోగించని బుద్ధి, సంతోషంలేని బుద్ధి."

వేస్తూ వచ్చారు. అన్ని ఘన అడుగుల నీటి బరువును భరించగలిగే శక్తిని ఇవ్వడం కోసం ఆనకట్ట అడుగు భాగాన్ని 600 అడుగుల మందంతో వేసారు. ఈ మందం రెండు ఫుట్‌బాల్ మైదానాల పొడవుతో సమానంగా ఉంటుంది. అడుగు నుండీ పైభాగం వరకు లేస్తున్నప్పుడు మందం క్రమక్రమంగా తగ్గుతూ పైభాగంలో 45 అడుగుల మందంగా తయారౌతుంది. కాన్‌యాన్ (Canyon) ఒక చివర నుండీ మరో చివర వరకు ఈ ఆనకట్ట 1,300 అడుగుల వరకు విస్తరించి ఉంది. ఈ ఆనకట్ట నిర్మాణానికి మొత్తం 7,000,000 టన్నుల కాంక్రీటు ఉపయోగింపబడింది. ఈజిప్ట్‌లోని గొప్ప పిరమిడ్ బరువు కంటే కూడా ఈ కాంక్రీటు బరువు ఎక్కువ.

ఆనకట్ట క్రింది భాగంలో 1.3 మిలియన్ కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల జల విద్యుచ్ఛక్తి కర్మాగారం నెలకొల్పబడింది. ఈ మీడ్ సరస్సు నుండీ ప్రవహించే నీటి పారుదలతో అమెరికా సంయుక్త రాష్ట్రాలతోపాటు మెక్సికోలోని ఒక మిలియన్ ఎకరాల భూమికి నీరు లభిస్తోంది. అంతేకాదు లక్షలాది జనులను వరదలకు గురి అయ్యే ప్రమాదాల నుండీ తప్పించి వరదము అదుపులో ఉంచగలుగుతోంది.

## దేవుడు - మనిషి

*దేవుడు ఇచ్చి మరచిపోతాడు. మనిషి తీసుకుని మరచిపోతాడు.*

*— స్వామి చిన్మయానంద*

## 4000 సంవత్సరాల వయసున్న భారీ వృక్షం

*సెక్వోయ (Sequoia) అని పేరున్న భారీ వృక్షం 100 మీటర్ల ఎత్తువరకు ఎదుగుతుంది. దీని వ్యాసం సుమారు 10 మీటర్లు ఉంటుంది. ఈ చెట్టుపై నిప్పు ప్రభావం ఏమాత్రం ఉండదు. ఈ చెట్టు 4000 సంవత్సరాలు జీవిస్తుంది. ఈ చెట్టు కలప అసలు కుళ్ళనే కుళ్ళదు. ఈ చెట్టు కాండంను కోస్తే 40 గదులున్న ఐదు ఇండ్లకు కావలసిన కలప లభిస్తుంది. ఆశియా ఖండంలో కాకసస్ (Caucasus) పర్వత ప్రాంతంలో ప్రస్తుతం ఈ చెట్టును పెంచుతున్నారు.*

## సింహపురమే నేటి సింగపూర్



*ప్రస్తుతం సింగపూర్‌గా పిలువబడే సింగపూర్ ఇంతకు ముందు సింగపుర అని పిలువబడేది. సింగపూర్ అన్న మాటకు అర్థం సింహ పట్టణం.*

"అన్ని గొప్ప సాధనలు కఠినమైనవే. యోగ్యమైనదేదీ సులభంగా రాదు. సాధించటం కష్టమనుకుని మీ ఆదర్శాన్ని దిగజార్చవద్దు."

# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

చందా వివరాలు:
సంవత్సర చందా రూ. 60/-
3 సంవత్సరాల చందా రూ. 175/-
ఎయిర్‌మెయిల్ (1 సం) రూ. 220/-
సీమెయిల్ (1 సం) రూ. 110/-

చందాపంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద
చెన్నై - 600 004,
ఫోను: 4990327

ఫిబ్రవరి 1999

Vol.18 No.2



★ తెలుగు విస్డమ్‌కు ఇది 18వ సంవత్సరం ★

# సంపాదకుని పేజీ

## మంచి – చెడు మనో భావనలు

మంచి మనో భావనలనూ, చెడు మనో భావనలనూ మన జీవితంలో మనం కలిగి ఉంటాము. చెడు మనో భావనలు మన



ఆనందాన్ని దోచుకుని మన దైనిక చర్యలలో, ఇతరులతో మనకున్న సంబంధాలలో విపరీతంగా జోక్యం చేసుకుంటాయి.

మంచి మనో భావనలు మనకున్నప్పుడు తోటి వారి పట్ల మన వైఖరి సంతోషకరంగా ఉంటుంది. మన మనో భావనలు బాగా లేనప్పుడు ఏ ఒక్కరినీ – మన స్నేహితులతో సహా – చూడటానికి ఇష్టపడం. బాగా విశ్రమించి, భోజనం చేసిన తరువాత ఇతరుల పట్ల మనం అనుసరించే వైఖరి బాగా అలసినప్పుడూ లేదా బాగా ఆకలి కొన్నప్పుటి కంటే భిన్నంగా ఉంటుంది. మన మనో భావాలను ఇతరులపై రుద్దే స్వభావాన్ని మానుకునే జాగ్రత్తలు మనం తీసుకోవాలి.

ఆఫీసులో బాగా అలసిపోతే మనలో చిరాకు, నిరుత్సాహం బాగా పెరుగుతుంది. ఈ చిరాకు నిరుత్సాహం కారణంగా ఇతరులపై కోపం చూపే స్వభావంకు అవకాశం కలుగుతుంది. రైల్వే స్టేషన్‌లోని టికెట్ కలెక్టరూ, బస్సులోని కండక్టరూ, మోటుగా ప్రవర్తించడానికి

# ఆనాటి వారలు

## అంతరిక్షంలోకి పంపబడిన ఉపగ్రహం

*రాక్షసాకారపు గాల్ఫ్ బంతిగా అమెరికన్ వైజ్ఞానికులచే రూపుదిద్దబడిన లేజర్ జియోడైనమిక్ సాటిలైట్ (Lageos) ఉపగ్రహం 1976వ సంవత్సరం మే నెల 4వ తారీఖున అమెరికా సంయుక్త రాష్ట్రాల వైజ్ఞానికులచే అంతరిక్షంలోకి పంపబడింది. భూమి దిగువ ఉన్న శిఖరం (7,800 కి.మీ) పొడవును– ఒక అంగుళం కంటే తక్కువగా కుదించడం, ధృవాల కదలికలను తిప్పికొట్టడం, భూమిపైన ఉన్న స్థలాల కదలికలను అతి సూక్ష్మంగా ఇది కొలవగలదు*

''ధారణా శక్తిగల జ్ఞాపకశక్తి మంచిది. కానీ తగిలిన గాయాన్ని మరచిపోగల సామర్థ్యం దీనికంటే కూడా గొప్పది''

కారణం ఈ నిరుత్సాహమే అయి ఉంటుంది.

తాము వ్యవహరిస్తున్న వ్యక్తుల మనో భావాలను విజయులైన వ్యక్తులు తరచుగా అధ్యయనం చేస్తుంటారు. సేల్స్‌మాన్‌గా పనిచేస్తున్న వ్యక్తి తన ఖాతాదారుడిని సరైన సమయంలోనే కలవాల్సి ఉంటుంది. ' లేదు ఈ రోజు నేను మిమ్మల్ని చూడలేను' అని చెప్పే ఖాతాదారుడితో ఎంతో నైపుణ్యం, తెలివి తేటలున్న సేల్స్‌మాన్ కూడా ఎలాంటి వ్యవహారం పెట్టుకోలేడు.

మన మనో భావాలు ఆహ్లాదకరంగానో లేదా అనాహ్లాదకరంగానో తేలికగానో లేదా తీవ్రంగానో కొంతకాలం తరువాత సరిపోయేవిగానో లేదా అసలు సరిపోనివిగానో ఉండవచ్చును. మన మనో భావం ఆహ్లాదకరంగా ఉన్నప్పుడు ఎలాంటి ఇబ్బంది ఉండదు. మనం అన్ని విషయాలను ప్రశ్నించకుండా లేదా వాదించకుండానే స్వీకరించగలము.

మనం చంచలమైన మనో భావాలను కలిగి ఉంటే ఆ మనోభావాలు మనల్ని ఏలుతాయి. అలాంటప్పుడు మన ముందు కాలం దయనీయమైన పరిస్థితులతో కూడి ఉండగలదు.

మన శరీరాన్ని, మనసును విశ్రమింపజేసుకుని ఈ సమస్యలను ఎదుర్కోగలిగితే మన చుట్టూ ఆనందాన్నీ, అర్థం చేసుకునే వ్యక్తులనూ చూడగలం.

# విజడమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, అక్టోబర్ '84, నవంబరు '84 (రూ. 5.50); మార్చి '85 నుంచీ జూన్ '85 (రూ. 5.50); ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, అక్టోబర్ '86 (రూ. 6.00); జనవరి '87, మార్చి '87, ఏప్రిల్ '87, డిసెంబర్ '87 (రూ. 7.00), జనవరి '88, ఏప్రిల్ '88 నుంచీ డిసెంబర్ '88 (రూ. 17.00); జనవరి '89 నుంచీ డిసెంబర్ '89 (రూ. 24.50); ఫిబ్రవరి '90 నుంచీ మే '90, ఆగస్టు '90, సెప్టెంబర్ '90, నవంబర్ '90, డిసెంబర్ '90 (రూ. 18.00); ఫిబ్రవరి '91 నుంచీ జూలై '91, సెప్టెంబర్ '91 నుంచీ డిసెంబర్ '91 (రూ. 24.00); జనవరి '92 నుంచీ డిసెంబర్ '92 (రూ. 33.00); జనవరి '93 నుంచీ అక్టోబర్ '93, డిసెంబర్ '93 (రూ. 30.00); జనవరి '94 నుంచీ డిసెంబర్ '94 (రూ. 35.00); జనవరి '95 నుంచీ డిసెంబర్ '95 (రూ. 36.00); జనవరి '96 నుంచీ డిసెంబర్ '96 (రూ. 36.00); జనవరి '97 నుంచీ డిసెంబర్ '97 (రూ.36.00); జనవరి '98 నుంచి జూన్ '98 (రూ. 19.00) కాపీలు మావద్ద ఉన్నాయి. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 12.00 చేర్చి M.O. ''రత్నా ఏజన్సీస్'', 9, దేశికారోడ్డు (ఆళ్వారు పేట వద్ద) చెన్నై – 600 004కు పంపాలి.*

*– సర్క్యులేషన్ మేనేజర్*

''ఆలోచించకుండా చదవడం జీర్ణం చేసుకోకుండా తినడం లాంటిది.''

# ప్రపంచ ప్రఖ్యాతిని పొందిన కవులు

## విలియం వర్డ్స్‌వర్త్

ఎం. ముత్తు

ఇంగ్లీషు భాషా సాహిత్యాలకు చెందిన అతి గొప్ప కవులలో ఒకడుగా లెక్కింపబడుతున్న విల్లియం వర్డ్స్‌వర్త్ ప్రకృతి కవిగా పరిగణింపబడుతున్నాడు. తన భావ కవిత్వం ద్వారా చాలా సరళమైన




భాషలో చేసిన కవితలు - లేక్‌జిల్లా కొలనులు, కొండల మధ్య గడిపిన తన జీవితపు అధిక కాలానికి సంబంధించిన. ప్రకృతి వర్ణనలతో కూడిన కవితలు చాలా ప్రసిద్ధిని పొందాయి. నిజమైన కవిత్వం చాలా సరళంగా, సహజంగా ఉండాలని అతడు నమ్మేవాడు.

'ది ప్రిల్యూడ్' (తొలి పలుకులు) అనే సుదీర్ఘ ఆత్మకథాత్మక కవిత్వంలో వర్డ్స్‌వర్త్ తన ప్రారంభిక జీవితాన్ని గురించి వర్ణించాడు. లేక్ జిల్లాకు అంతర్భాగమైన కంబర్‌లాండ్ (Cumberland) ప్రాంతంలోని కోకర్‌వౌత్ (Cockermouth)లో 1770వ సంవత్సరం ఏప్రిల్ నెల 7వ తారీఖున ఇతడు జన్మించాడు. శ్రీ జాన్, శ్రీమతి అన్న వర్డ్స్‌వర్త్ దంపతుల రెండవ సంతానంగా ఇతడు జన్మించాడు. ఇతడి తండ్రి లాయర్‌గా ఉంటూ లార్డ్ లోన్స్‌డేల్ (Lord Lonsdale) భూములకు ప్రతినిధిగా కూడా ఉండేవాడు. చిన్న వయసులోనే వర్డ్స్‌వర్త్ తన తల్లితండ్రులను కోల్పోయాడు. పిన్ని బాబాయిలు ఇతడిని

---

### పవిత్రమైన తులసి మొక్క

ముంగిట తులసి ఉన్న ఇల్లు తీర్థస్థానం అనీ, ఆ ఇంటి వారికి తీర్థస్థానాలకు పోవలసిన అవసరం ఉండదన్న నమ్మకం ప్రజలలో గాఢంగా పాతుకునిపోయింది. మన పూర్వీకులు, మహా ఋషులు అందుకే తులసిని పవిత్రమైన మొక్కగా గుర్తించారు

"సూర్యుడివైపు ముఖం చేయండి అప్పుడు నీడ మీకు కనిపించదు" – హెలెన్ కెల్లర్

పెంచి పెద్ద చేసారు. కేంబ్రిడ్జ్‌లోని హాక్స్ హెడ్ (Hawkshead) పాఠశాలలోనూ, సెయింట్ జాన్స్ కళాశాలలోనూ మంచి విద్యను పొందగలిగే సహాయం ఇతడి చిన్నాన్న వర్డ్స్‌వర్త్‌కు చేసాడు.

'ది ఈవెనింగ్ వాక్', 'డిస్క్రిప్టివ్ స్కెచెస్ ఆఫ్ ఎ పెడస్ట్రియన్ టూర్ ఇన్ ది ఆల్ప్స్' అన్న వర్డ్స్‌వర్త్ రచనలు 1793వ సంవత్సరంలో ప్రచురించబడ్డాయి. 1795వ సంవత్సరంలో వర్డ్స్‌వర్త్, శామ్యూల్ టేలర్ కోలరిడ్జి అన్న కవిని కలుసుకున్నాడు. వర్డ్స్‌వర్త్ దృష్టి కవిత్వంకు అంకితం అయిపోవడానికి ఈ కలయిక ఎంతో సహాయపడింది. వారిద్దరి మధ్య గాఢమైన స్నేహం విరబూసింది. వర్డ్స్‌వర్త్‌లోని సృజనాత్మకత ఆ తరువాత పది సంవత్సరాలలో శిఖరానికి చేరింది.



Wordsworth's cottage at Town End, Grasmere

'టింటెర్న్ అబ్బే' (Tintern Abbey) అన్న కవిత్వంతో సహా వర్డ్స్‌వర్త్ తన స్నేహితుడు శామ్యూల్ కొలరిడ్జ్‌తో కలిసి 'లిరికల్ బాలడ్స్' (వీరగాథలు) అనే సంకలనాన్ని (1798 - 1805) ప్రచురించాడు. ఆంగ్ల సాహిత్యంలోనే ఒక అద్భుతమైన సంఘటనగా భావింపబడుతున్న దీని తొలి ముద్రణ 1798వ సంవత్సరంలో జరిగింది. మిత్రుడు కొలరిడ్జ్ సోదరి డోరోతి వర్డ్స్‌వర్త్ (Dorothy Wordsworth) కలిసి విలియం వర్డ్స్‌వర్త్‌ను వ్రాసేందుకు ప్రోత్సహించారు.

తన సోదరి డోరోతితో కలిసి వర్డ్స్‌వర్త్ 1799వ సంవత్సరంలో లేక్ జిల్లాలోని కంబర్‌లాండ్‌కు పోయాడు. అక్కడి ప్రశాంత సుందర వాతావరణం అతడి ఉత్తమ కవితలుగా భావింపబడుతున్న కొన్ని కవితలకు కవితా వస్తువులుగా

## అభిప్రాయం

ఉత్కృష్టమైన భారతీయ సంస్కృతినీ సంప్రదాయాన్నీ విస్తరింపజేస్తున్న పత్రిక - విస్డమ్

ఉత్కృష్టమైన భారతీయ సంస్కృతినీ సంప్రదాయాన్నీ 'విస్డమ్' ద్వారా విస్తరింపజేస్తున్నందుకు నా అభినందనలు.

– డా. నందితాకృష్ణ, గౌరవ డైరక్టరు,
సి.పి. రామస్వామి అయ్యర్ ఫౌండేషన్,
చెన్నై - *600 018.*

స్ఫూర్తినిచ్చింది. మనుషుల భావాలను, ప్రకృతి ప్రతిబింబిస్తుందని భావించడం వల్ల పల్లెసీమలలోని సహజ ప్రకృతిని తన సరళ ధోరణిలో ఇతడు రాసాడు 'తొలి పలుకులు' (ప్రిల్యూడ్) అనే తన సుదీర్ఘ కవితలో తన సొంత మనసు, ఎలా అభివృద్ధిని సాధించిందన్న విషయాన్ని వివ


Natural Scenery Seen by William Wordsworth

రించాడు. 'ది రెక్లూస్' అనే తన ఆధ్యాత్మిక కవితకు సంబంధించిన మొదటి భాగంగా దాన్ని రచించాడు. కానీ దురదృష్టవశాత్తు అది పూర్తి కాలేదు. ఆ సమయంలో 'రుత్ అండ్ లూసీ గ్రే' (Ruth and Lucy Gray) అనే కవితతో సహా అనేక కవితలను అతడు వ్రాసాడు. 1800వ సంవత్సరంలో 'లిరికల్ బాలెడ్స్' రెండవ ముద్రణ వెలువడింది.

తన బాల్య స్నేహితురాలైన మేరీ హుట్చిన్సన్ (Mary Hutchinson)ను వర్డ్స్‌వర్త్ లేక్ జిల్లా గ్రాస్మియర్ (Grasmere), టౌన్ ఎండ్ (Town End) వద్ద డోవ్ కాటేజ్ (Dove Cottage)లో ఉంటున్నప్పుడు 1802వ సంవత్సరంలో పెండ్లి చేసుకున్నాడు. తన ప్రియ సహోదరిలాగానే ప్రియమైన భార్య మేరీ హుట్చిన్సన్ కూడా ఎంతో శ్రద్ధానురాగాలను ఇతడిపట్ల జీవితాంతం ప్రదర్శించింది. 1805వ సంవత్సరంలో ఇతడు 'ది ప్రిల్యూడ్' అనే కావ్యాన్ని పూర్తి చేసాడు. రెండు సంవత్సరాల తరువాత ఇతడి అతి గొప్ప కవితలుగా పరిగణింపబడే 'ఓడ్ టు డ్యూటీ', 'ఇంటిమేషన్స్ ఆఫ్ ఇమ్మార్టాలిటీ', 'ది ఇడియట్ బాయ్', 'మైఖేల్', 'ది డాఫడిల్స్', 'ది సాలిటరీ రీపర్',

---

### ప్రపంచం ఇంతకుముందుకంటే కూడా బాగుపడుతుంది

*మంచివారంతా బుద్ధిమంతులైతే*
*బుద్ధిమంతులంతా మంచివారైతే*
*ప్రపంచం ఇదివరకటి కంటే కూడా బాగుపడుతుంది.*

*ఇలా జరగడం సంభవం అనుకున్నాం.*
*ఇది ఎప్పుడో కానీ లేదా అసలు జరగబోదు.*

*ఇవి రెండూ తగాదా పడినట్లు విడిపోయాయి*

*మంచివారు బుద్ధిమంతులపట్ల క్రూరంగా ఉన్నారు*

*బుద్ధిమంతులు మంచివారిపట్ల మొరటుగా ఉన్నారు*

''వయసు మళ్ళినవారిపట్ల అనుసరించే విధానం ఆధారంగా ఒక దేశం సిరిసంపదలను అంచనా వేయండి'' – నహమన్ బ్రాట్స్‌లవ్

'యారో (YARROW) అన్ విజిటెడ్' మొదలైన కవితా సంకలనాలను ప్రచురించాడు 1813వ సంవత్సరంలో ఇతడి కుటుంబం రైడల్ మౌంట్ (Rydal Mount)కు తరలి వెళ్ళింది. ఇక్కడే వర్డ్స్‌వర్త్ తన శేష జీవితాన్ని గడిపాడు. తొమ్మిది ఖండాల ది ఎక్స్‌కర్షన్ (The



William and Mary Wordsworth

Excursion) అనే పుస్తకాన్ని 1814లో ప్రచురించాడు. బాగా ప్రచారం పొందిన సానెట్లలో (14 చరణాలు ఉన్న ఒక విధమైన పద్యం) 'ది వరల్డ్ ఈజ్ టూ మచ్ విత్ అస్' 'వెస్ట్‌మినిస్టర్ బ్రిడ్జ్' అన్నవి చాలా ముఖ్యమైనవి.

1838వ సంవత్సరంలో డర్హమ్ (Durham) నుండీ వర్డ్స్‌వర్త్ డిసిఎల్ డిగ్రీను పొందాడు. ఇదే డిగ్రీను ఆ తరువాత సంవత్సరం ఆక్స్‌ఫర్డ్ నుంచీ కూడా పొందాడు. 1843వ సంవత్సరంలో సౌతే (Southey) మరణానంతరం యావజ్జీవ ఆస్థాన కవిగా వర్డ్స్‌వర్త్ నియమించబడ్డాడు. దురదృష్టవశాత్తు 1829వ సంవత్సరం నుండీ ఇతడి సోదరి డోరొత్తి ఆరోగ్యం క్షీణించసాగింది. 1847వ సంవత్సరంలో వర్డ్స్‌వర్త్ కూతురు డోరా చనిపోయింది. అతనికి ఇదొక పెద్ద అఘాతంగా మారింది. దీని నుండీ అతడు తేరుకోలేకపోయాడు.

1850వ సంవత్సరం ఏప్రిల్ నెల 13వ తారీఖున విలియం వర్డ్స్‌వర్త్ కన్ను మూసాడు. గ్రాస్‌మియర్ చర్చ్ ఆవరణంలోనే ఇతడి శరీరం భూస్థాపితం చేయబడింది. అతడు చనిపోయిన తరువాత విలియం డోరోతి వర్డ్స్‌వర్త్ లేఖలు అన్న పేరుతో 5 సంపుటాల గ్రంథం ప్రచురింపబడింది.

## తెలుసుకోదగిన విషయాలు

*మన శరీరంలోని గ్రంధులలో ఎండోక్రైన్ గ్రంథియే అతి పెద్దదైన గ్రంథి. ఇది సుమారు 25 గ్రాముల బరువు తూగుతుంది. ఇక్కడ రక్త ప్రసారం అతి ఎక్కువగా ఉంటుంది. ఈ రక్తప్రసారం గుండె, మూత్రాశయం కంటే కూడా ఎక్కువగా ఉంటుంది.*

*– ''హెల్త్ అప్‌డేట్'' సౌజన్యంతో*

''పొగడ పొగిడేవాడిని పొగడబడే వాడిని ఇద్దర్నీ కలుషితం చేస్తుంది.''

# పుస్తకాలు - రచయితలు

★ అంబాసిడర్స్ రిపోర్ట్ - ఛెస్టర్ బౌల్స్.

★ ఎర్‌పోర్ట్ - ఆర్థర్ హైలె.



JEAN-PAUL SARTRE

★ ఏజ్ ఆఫ్ రీసన్ - జీన్ పాల్ సార్త్రే.

★ ఏరియా ఆఫ్ డార్క్‌నెస్ - వి.ఎస్. నైపాల్.

★ సీజర్ అండ్ క్లియోపాత్రా - జార్జ్ బెర్నార్డ్ షా.

★ కర్టన్ రైసర్స్ - కె. నట్వర్ సింగ్.

★ ఎండ్స్ అండ్ మీన్స్ - ఆల్డస్ హక్స్‌లీ.

★ ఫ్రెంచ్ రివెల్యూషన్ - థామస్ కార్లైల్.

★ ది డార్క్ రూమ్ - ఆర్.కె నారాయణ్.



R.K.Narayan

★ గాదరింగ్ స్టార్మ్ - విన్‌స్టన్ చర్చిల్.

## అతి ప్రాచీన వృత్తులలో ఒకటి

పన్నులను వసూలు చేసే పనిలో నిమగ్నులైనారు అతి ప్రాచీనమైన వృత్తులలో ఒకటైన వృత్తిలో ఉన్నారు. ప్రజలకు ఉపయోగపడే పనులకు సంబంధించిన పన్నులను సూచించే ఒక మట్టి పలకాన్ని (క్రీ.పూ. 1900 నాటిది) పురాతత్త్వ శాస్త్రజ్ఞులు తమ త్రవ్వకాలలో కనుగొన్నారు. అంతేకాదు వారు సేకరించిన వాటిలో క్రీ.పూ. 4000 సంవత్సరాల క్రితం నాటి పురాతన పత్రాల పట్టీ, అప్పట్లో పన్నులు కట్టేవారికున్న పిర్యాదులను నమోదు చేసే మట్టి ఫలకం కూడా ఉన్నాయి.

– ('ఆప్టిమిస్ట్ మాగజైన్' సౌజన్యంతో)

''గర [illegible] నిస్సందేహంగా తప్పువారి పట్టించే దుర్గుణం.''

– అలెగ్జాండర్ పోప్


Winston Churchill

★ ఇండియా డివైడెడ్ - రాజేంద్ర ప్రసాద్.

★ కాయాకల్ప్ - మున్షీ ప్రేమ్‌చంద్.


Sri Aurobindo

★ లైఫ్ డివైన్ - అరబిందో ఘోష్.

★ అవర్ ఫిల్మ్స్, దేర్ ఫిల్మ్స్ - సత్యజిత్ రే.

★ షల్ ఉయ్ టెల్ ద ప్రెసిడెంట్ - జఫ్రీ ఆర్చర్.

●

## అపూర్వ విషయాలు

### ఎగిరే చేప - విద్యుత్ ఈల్

ఈస్ట్ ఇండీస్‌లో దొరుకుతున్న బ్లిమింగ్ పెర్చ్ (Blimıng Perch) అనే రకం చేప చెట్టు బోదెను చాలా అడుగుల ఎత్తు వరకు ఎక్క గలదు. ఎగిరే చేపలు నీటి మట్టం నుండీ 6 అడుగుల ఎత్తు వరకూ ఎగిరి 50 మొదలు 100 అడుగుల దూరం వరకూ గాలిలో ప్రయాణం చేయగలవు. తమ గుండె వద్దనున్న (Pectoral) పొడుగాటి పొలుసును తెక్కలుగా అవి వాడుకుంటాయి. ఎలక్ట్రిక్ ఈల్ తోకలో ఉన్న ఇంద్రియం కరెంటు షాకును ఉత్పత్తి చేస్తుంది. ఈ షాకు ద్వారా అది చిన్న చిన్న చేపలనూ లేదా చిన్న జంతువులను చంపగలదు.

---

### అతి పెద్ద ధనవంతులలో ఒకరు

మీ ఆస్తులను లెక్కపెట్టండి. మీ అంత్మ రాత్మ కల్మషం లేకుండా ఉంటే, మీకు మంచి కాలేయం ఉంటే, ముగ్గురు మంచి మిత్రులు ఉంటే, ఆనందప్రదమైన గృహసీమ ఉంటే, హృదయం యవ్వనంతోనూ, ఆత్మ నిజాయితీతోనూ నిండి ఉంటే ఆనందంతో చిందులు వేయండి. మీ జీవిత కాలపు అతి పెద్ద ధనవంతులుగా మీరు ఇంకా కొనసాగు తున్నారని తెలుసుకోండి.

'అతి ఉత్తమమైన ఆదర్శాన్ని ఎంచుకొని దానికి తగినట్టుగా జీవించండి

# అందరి వాదన సరైనదే

## స్వామీ జ్యోతిర్మయానంద

ఒకసారి కొంతమంది గుడ్డివారి ముందుకు ఒక ఏనుగు రావడం జరిగింది. సాధుగుణం గల ఆ ఏనుగు వారి ముందు ఎంతో ఓపికతో నిలబడింది.



అక్కడున్న గుడ్డివారు ఆ ఏనుగును చుట్టుముట్టారు. తమ చేతులతో అందుబాటులో ఉన్న ఏనుగు అంగాలను తడుమసాగారు.

ఏనుగు తొండాన్ని తడుముతూ ఒకడు "ఏనుగు తప్పకుండా పాము లాంటిది" అని నిర్ధారించాడు.

చెవులను తడుముతున్న మరొక గుడ్డివాడు మొదటివాణ్ణి ఖండిస్తూ "కాదు కాదు ఏనుగు విసనకర్రలాంటిది" అని అన్నాడు.

తోకను చేత్తో పట్టుకున్న మూడవవాడు "చూడండి మీరిద్దరూ పొరబడుతున్నారు. ఏనుగు నిజంగా చీపురులాంటిది" అని ఖచ్చితంగా చెప్పాడు.

# అవార్డులు

## ప్రొఫెసర్ రామశేషన్‌కు గుజర్ మల్ మోడి అవార్డు

బెంగళూరు రామన్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లో పదవీ విరమణ చేసి ప్రొఫెసర్ ఎమిరిటస్ (Prof. Emeritus)గా పనిచేస్తున్న ఆచార్య శివరాజ్ రామశేషన్‌కు క్రిస్టలోగ్రఫీ (స్ఫటికాల ఆకృతి స్వభావ లక్షణాలకు సంబంధించిన శాస్త్రం) ఆప్టిక్స్ (కంటికి సంబంధించిన శాస్త్రం) మెటీరియల్ సైన్స్ (భౌతికశాస్త్రం) రంగాలలో చేసిన సేవలకు గుర్తింపుగా గుజర్ మల్ మోడి బహుమతి ఇవ్వబడింది.

## ప్రొఫెసర్ విజేంద్రకు బిహారీ అవార్డు

ఋతుకా పహ్లాపల్ (ఋతువు మొదటి పండు) అన్న కవితా సంపుటిని ప్రచురించిన ప్రొఫెసర్ విజేంద్రకు కె.కె. బిర్లా సంస్థ వారు స్థాపించిన 1996వ సంవత్సరపు ప్రతిష్ఠాత్మకమైన బిహారీ అవార్డు ఇవ్వబడింది.

'మనం మెలకువ, [illegible] మనం గడిపేతీరు– ఈ రెండింటి పరిణామమే మనం [illegible]

[illegible]

ఏనుగు మధ్యభాగమైన కడుపును తడుముతూ మరొకడు: ''చూడండి ఈ ఏనుగు గోడలాంటిది'' అని అన్నాడు.

ఏనుగు కాళ్ళను తడుముతున్న ఐదవ వాడు ''మీ అందరి అంచనా సరైనది కాదు. ఏనుగు స్తంభం లాంటిది'' అన్నాడు.

దంతాలను ముట్టుతూ ఆరవవాడు ''మీకు నిజంగా మతి లేదు. ఏనుగు బల్లెంలాంటిది'' అన్నాడు.

ఈ విధంగా ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా సుమారు మూడు రోజులు వాదించుకున్నారు. అందులోని ప్రతి ఒక్కరు తాను ఏనుగును గురించి చెప్పిన మాటే సరైనదన్న గట్టి నమ్మకాన్ని కలిగి ఉన్నారు.

అదేవిధంగా నిజం అన్నది ఒక్కటే కాని దాన్ని పరిపరివిధాలుగా నిర్వచిస్తారు. అందులోని ప్రతి ఒక్కరి వాదన సబబైనదే. కారణం వారు తాము తాకి అనుభవించిన విధంగానే ఏనుగును తమ అనుభవం ప్రకారంగానే వర్ణించారు. మీ అంతర్దృష్టితో నిజాన్ని చూడగలిగినప్పుడు అన్ని వాదోపవాదాలు ఆ నిజం ముందు సమసిపోతాయి.

## మానవాళి హీరో - అబ్రహాంలింకన్




''మానవాళి విముక్తికి పాటుపడిన వారిలో అబ్రహాంలింకన్ అతి గొప్పవాడు. ప్రజాస్వామ్యానికి కొత్త అర్థాల్ని ఇచ్చే తన మాటలతో మానవుల గౌరవాన్ని దిగంతాల వరకు వ్యాపింపజేసే తన కార్యశక్తితో ఇతడు ప్రజలను రంజింపజేసాడు బానిస వృత్తి, నిర్మూలతను, అమెరికా సంయుక్త రాష్ట్రాల సమైక్యత, సమగ్రతల పరిరక్షణ అనే రెండు మహోన్నత కార్యాలను సాధించినందుకు మానవాళి ఇతడికి చిరకాలం ఋణపడి ఉంటుంది. దేశ సమైక్యతకు భంగం ఏర్పడగల అపాయకరమైన పరిస్థితులలో నిర్ణయాలను తీసుకోవడంలో దృఢత్వాన్ని ప్రదర్శించిన ఈ నాయకుడి జీవితం నుండీ ప్రేరణను గ్రహించాల్సి ఉంటుంది. తీసుకున్న నిర్ణయాలను అమలు పరచడంలో ఇతడు అమోఘమైన ధైర్యాన్ని చూపేవాడు.''

– జెపి. వాస్వాని

# వార్తలు

## 120 మిలియన్లకు చేరిన ప్రపంచ నిరుద్యోగుల సంఖ్య



అంతర్జాతీయం కార్మిక సంస్థ (International Labour organisation) వారి లెక్కల ప్రకారం మొత్తం ప్రపంచంలో 120 మిలియన్ల నిరుద్యోగులు ఉన్నారు. 700 మిలియన్ల వ్యక్తులు తమ అర్హత సామర్థ్యంకు సరిపోయే ఉద్యోగాలు కాక తక్కువరకం ఉద్యోగం చేస్తున్నారని కూడా ఇది తెల్పి చెప్పింది.

('యునెస్కో' సౌజన్యంతో)

## టెలివిజన్ చూస్తున్న వారి సంఖ్య

ప్రస్తుతం మనదేశంలో 16 మిలియన్ల టెలివిజన్ సెట్లు ఉన్నాయి. టెలివిజన్ కార్యక్రమాలను ఏకకాలంలో సుమారు 300 మిలియన్ల ప్రజలు చూస్తున్నారు.

## 9 ఒలింపిక్ బంగారు పతకాలను గెలుచుకున్న వ్యక్తి

17 సంవత్సరాల సుదీర్ఘకాలం ఎడతెరపి లేకుండా అథ్లెటిక్స్‌లో పాల్గొన్న అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన సుప్రసిద్ధ క్రీడాకారుడు కార్ల్ లెవిస్ (Carl Lewis) 1997వ సంవత్సరం ఆగస్టు నెల 26వ తారీఖున క్రీడలకు స్వస్తి చెప్పాడు. తన క్రీడా జీవితంలో అతడు 9 ఒలంపిక్ బంగారు పతకాలను, 8 ప్రపంచ ఛాంపియన్‌షిప్‌లను పొందాడు.

---

## జీవితాన్ని విజయవంతం చేసే పరోపకారం

సాధించిన విజయానికి, పదవి మరియు పేరు సంపదలు, కొలబద్దలు కావు ఇతరుల మేలుకోసం పాటుపడడం వల్లనే జీవితం విజయవంతం అవుతుందని నేను నమ్ముతాను భౌతిక వస్తువులు కాలగర్భంలో కలిసిపోయినప్పుడు తన తెలివితేటల్ని, ప్రజ్ఞాపాటవాల్ని ఇతరులకోసం అర్పించి జీవించే వ్యక్తే విజయుడు ఆ విజయం కోసం తనలోని ఉత్తమ శక్తిని ధారపోస్తూ గౌరవంతో జీవితాన్ని గడపాల్సి ఉంటుంది - గెరాల్డ్ ఆర్. ఫోర్డ్

## ద్రాక్ష పంటలో ప్రపంచరికార్డు




ఒక హెక్టారుకు సరాసరిగా 22 టన్నుల ద్రాక్షను పండించి మనదేశం ద్రాక్ష పంటలో ప్రపంచ రికార్డును సృష్టించింది.

## 450 గిరిజనుల వర్గాల నుండీ ఏర్పరచబడిన దేశం!

జైరే (Zaire) దేశపు మాజీ అధ్యక్షుడైన మొబుటు సెసె సెకో (Mobutu Sese Seko) సాధించిన అతి గొప్ప పనులలో 450 ప్రత్యేక నిర్దిష్ట జాతులకు చెందిన వారిని చేర్చి వారి కోసం ఒక ప్రత్యేక దేశాన్ని సృష్టించడం అన్నది ఒకటి. పడమటి మధ్య ఆఫ్రికాలో సృష్టించబడిన ఈ దేశానికి ఒక సామాన్య భాష (Common language) అంటూ ఏదీ లేదు!

## నిజమైన బంగాళాదుంప విత్తనం

మనదేశపు ఈశాన్య ప్రాంతంలోని త్రిపురా రాష్ట్రం ఒక సంకరజాతి బంగాళాదుంప విత్తులను అభివృద్ధి పరచడంలో ప్రగతిని సాధించింది. ఈ ట్రూ పొటేటో సీడ్ (TPS) అనే కొత్త విత్తులను చాలా దేశాలకు ఎగుమతి చేసి ఈ రాష్ట్రం ఇప్పటివరకు 12,000 డాలర్ల విదేశీ మారకాన్ని పొందింది.

## ఆలోచింపజేసే సంఘటన

### పేరు రాసి ఉత్తరం రాయడం మరచిపోయిన వ్యక్తి

సుప్రసిద్ధ క్రైస్తవ మత గురువైన హెన్రీ వార్డ్ బీచర్ *(Henry Ward Beacher)* ఆ రోజు తాను అందుకున్న కవరు తెరిచాడు. ఆ కవరులో ఒకే ఒక కాగితం మాత్రం ఉంది. ఆ కాగితంపై "మూర్ఖుడు" అని రాసి ఉంది. ఆ ఉత్తరం అందుకున్న తరువాత ఆదివారం రోజు జరిగే ప్రార్థనా సమావేశంలో తాను అందుకున్న ఒక విచిత్రమైన జాబును గురించి చెప్పాడు. ఆ తరువాత అందులో రాసి ఉన్న మాటను చెబుతూ : "మొత్తం జాబు రాసి సంతకం చేయడం మరచిపోయిన వారిని గురించి నేను చాలా బాగా ఎరుగుదును కానీ నాకు వచ్చిన జాబులో ఆ రాసిన వ్యక్తి తన పేరును రాసి ఉత్తరం రాయడం మరచిపోయాడు" అని నవ్వుతూ ఆ విషయాన్ని గురించి చెప్పాడు.

"మీ మాటలను ఇతరులు ఎంత శ్రద్ధగా వినాలని మీరు అనుకుంటారో అంతే శ్రద్ధతో ఇతరుల మాటలను వినండి. ఇదే స్నేహపు బంగారు సూత్రం."

## మనదేశపు పొట్టివాడి మరణం




పాత ఢిల్లీలోని బల్లిమరన్ (Ballimaran)లో నివసిస్తున్న 43 సంవత్సరాల గుల్ మహమ్మద్ ఇటీవల చనిపోయాడు. ఇతడు 63.5 సెం.మీ.ల (25 అంగుళాలు) పొడవు ఉండేవాడు.

## అతి ఎక్కువ సైకిళ్ళు ఉన్న నగరం

ఢిల్లీ మహానగరంలో మనదేశంలోని ఏ నగరంలో లేనన్ని సైకిళ్ళు ఉన్నాయి. సుమారు 1.8 మిలియన్ సైకిళ్ళను మనం ఢిల్లీ రోడ్లపై చూడవచ్చును.

## ఏలక్కాయల పంట

మనదేశంలో పండుతున్న ఏలక్కాయల పంటలో 60 శాతం ఏలక్కాయలు కేరళ రాష్ట్రంలో పండుతున్నాయి.

## ప్రపంచ మొత్తంలో అతి ఎక్కువ మందికి ఉద్యోగాలు ఇస్తున్న సంస్థ

ప్రపంచ మొత్తంలో అతి ఎక్కువమందికి – సుమారు 1.6 మిలియన్ల మందికి– ఉద్యోగాలిస్తున్న సంస్థగా భారతీయ రైల్వే రికార్డును సృష్టించింది.

## అతి ఎక్కువ పసుపు పంట

మనదేశంలోని ఆంధ్రప్రదేశ్‌లో పసుపు పంట ఎక్కువగా పండుతోంది. మనదేశంలో పండుతున్న పసుపు పంటలో ఆంధ్రప్రదేశ్ 35 శాతం పసుపును పండిస్తోంది.

## 125,000,000 సంవత్సరాల క్రితం జీవించిన ఎగురగలిగిన అతి పెద్ద పక్షి

*ఎగురగలిగిన అతి పెద్ద పక్షి పేరు "టెరాటోర్నిస్ ఇన్‌క్రెడిబిలిస్" (Teratornis incredibilis). ఈ పక్షి ఇప్పటికి 125,000,000 సంవత్సరాల క్రితం ఉత్తర అమెరికాలో జీవించింది. ఈ రకం పక్షి అవశేషాలు అమెరికాకు చెందిన నెవడా (Nevada)లోని స్మిత్ క్రీక్ (Smith Creek) గుహలో 1952వ సంవత్సరంలో కనుగొనబడ్డాయి. ఈ పక్షి రెక్కల మొత్తం పొడవు 16 అడుగుల 4 అంగుళాలుగా తేలింది. దీని బరువు 50 పౌండ్లు ఉండవచ్చునని అంచనా వేయబడింది.*

## బంగాళాదుంప పంటలో అగ్రస్థానంలో ఉన్న ఉత్తర ప్రదేశ్




బంగాళాదుంపల పంటకు ఉత్తర ప్రదేశ్‌లోని వ్యవసాయ భూములలో 30 శాతం భూములు వాడబడుతున్నాయి. ఈ భూములలో దేశపు పంటలోని 40 శాతం పండుతోంది.

## ద్వితీయ స్థానంలో ఉన్న తెలుగు భాష

హిందీ తరువాత మనదేశంలో అతి ఎక్కువ మంది మాట్లాడే భాషలలో తెలుగు భాష ద్వితీయ స్థానంలో ఉంది.

## అతి ఎక్కువ మిరియాల పంట

మనదేశంలో పండుతున్న మిరియాల పంటలో 95 శాతం పంట మనకు కేరళ రాష్ట్రం నుండీ లభిస్తోంది. మిరియాల పంటలో మొదటి స్థానంలో ఇండోనేషియా, రెండవ స్థానంలో బ్రెజిల్, మూడవ స్థానంలో భారతదేశం ఉన్నాయి.

## 2001వ సంవత్సరంలో జరగనున్న జనగణన

1872వ సంవత్సరంలో మొదటి జనగణన మనదేశంలో పూర్తి అయింది. 1881వ సంవత్సరం నుండి ప్రతి పది సంవత్సరాల కొకసారి జనగణన భారతదేశంలో జరుగుతోంది. రాబోయే జనగణన మనదేశంలో 2001వ సంవత్సరంలో జరుగనున్నది.

## కేరళలో పండుతున్న అల్లం

మొత్తం ప్రపంచంలో పండుతున్న అల్లంలోని 65 శాతం అల్లం మనదేశంలో పండుతోంది. ఇందులోని 70 శాతం అల్లం పంటను మనదేశంలోని కేరళ రాష్ఠం పండిసోంది.

## తొలి రాడార్ పనిచేసే సాధనం

*1933వ సంవత్సరంలో జర్మన్ జలసేనకు చెందిన సిగ్నల్స్ రీసెర్చ్ డిపార్ట్‌మెంట్ అధినేత (Chief) అయిన డా. రుడాల్ఫ్ కుహనోల్డ్ (Dr. Rudolph Kuhnold) తొలి రాడార్ పని చేసే సాధనాన్ని అభివృద్ధి పరిచాడు.*

" ఉన్న వస్తువులను ఉన్నట్లుగా చూచే దృష్టినీ, పనులను అవి చేయవలసిన విధంగా చేసే నేర్పరితనమునూ లోక జ్ఞానం అంటారు "

# అటల్ బిహారీ వాజ్‌పాయి

## అగ్రగణ్యుడైన పార్లమెంట్ సభ్యుడు

మనదేశపు ప్రధానమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయి. మనదేశపు ముఖ్యమైన రాజకీయనాయకులలో ఇతడు ఒకడు. ఇతడు ప్రజలను మైమరపింపజేసే అద్భుతమైన గొప్ప వక్త.




1942వ సంవత్సరపు క్విట్ ఇండియా ఉద్యమంలో దేశభక్తి భావనతో పాల్గొన్న యువకులలో ఇతడు కూడా ఒకడు. భారతదేశపు ప్రతినిధిగా ఇతడు అనేక అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొన్నాడు. 1957వ సంవత్సరం మొదలు ఎలాంటి విరామం లేకుండా అటు లోక్‌సభ సభ్యుడిగానో, లేదా ఇటు రాజ్యసభ సభ్యుడిగానో ఇతడు కొనసాగుతూ వస్తున్నాడు. గత లోక్‌సభలో ఇతడు ప్రతిపక్ష నాయకుడిగా వ్యవహరించాడు. హాస్యాన్ని గుమ్మరిస్తూ చమత్కారంగా మాట్లాడి అందర్నీ ఒప్పించగల ప్రథమశ్రేణి పార్లమెంట్ సభ్యుడు. 1996వ సంవత్సరంలో 13 రోజుల పాటు ఇతడు ప్రధానమంత్రిగా ఉన్నాడు. 1998 ఏప్రిల్‌లో రెండవసారి ప్రధానమంత్రి పదవిని ఇతడు చేపట్టాడు.

అటల్ బిహారీ వాజ్‌పాయి కేవలం రాజకీయనాయకుడు మాత్రం కాదు. ఇతడొక మంచి కవి కూడా. అమర్ బలిదాన్, మృత్యు యా హత్యా, ఖైదీ కవిరాజ్ కీ కుండలియా లాంటి సుప్రసిద్ధ కవితల సంకలనం మేరీ ఇక్యావన్ కవితాయేన్ అన్న పేరుతో వెలువడింది. ఈ కవితా సంకలనాన్ని అప్పటి ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు ఆవిష్కరించాడు. ●

---

### ఎండకాలంలో తినవలసిన వస్తువులు

*ఎండకాలం అన్నది పండ్లనూ, సలాడ్‌లను అతి ఎక్కువగా తినవలసిన కాలం. వీటిని తినడం వల్ల మన ఆరోగ్యం చెడకుండా ఉండగలదు.*

''మంచితనం, గొప్పతనం అన్నవి సంపదలో కాదు, నిరాడంబరతలోనే ఉన్నాయి''
–మహాత్మ గాంధీ

# అతి సాహసవంతులు

ముక్కుపైన వేలు వేసుకునేలా ఆశ్చర్యచకితుల్ని చేసే సాహస కృత్యాలను చేసే వారిని ఉత్తర అమెరికాలోని నయాగరా జలపాతం తమ కోరికను అణచుకోలేని విధంగా ఆకర్షిస్తూ వస్తున్నది. మొత్తం ఐరోపా ఖండంలో



Blondin crossed over Niagara Falls on a tightrope while pushing a wheelbarrow

బ్లాండిన్ (Blondin)గా పిలువ బడుతున్న ఫ్రాన్స్ దేశస్థుడు జీన్ ఫ్రాంకోయిస్ ఎమిలె గ్రావ్‌లెట్ (Jean Francois Emile Gravelet) ఉరకలు తీసే జలపాతంపై 200 అడుగుల పొడవున్న ఒక బలమైన తాడుగట్టి దానిపై ఒక చివర నుండీ మరొక చివర వరకు నడిచేందుకు నయాగరా జలపాతాన్ని 1859వ సంవత్సరం జూన్ 30వ తారీఖున చేరాడు.

సుమారు 10 లక్షల మంది దర్శకులు స్టీమర్లపైన, రైళ్ళ ద్వారా ప్రయాణం చేసి ఫ్రాన్స్ దేశానికి చెందిన జీన్ ఫ్రాంకోయిస్ ఎమిలె గ్రావ్‌లెట్ చేపట్టిన ఈ దుస్సాహసంతో కూడుకున్న అద్భుత కృత్యాన్ని చూడడానికి వచ్చారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల వైపు నుండీ, కెనడా వైపు నుండీ ఈ సాహసోపేత కార్యాన్ని చూడడానికి వచ్చిన వారిలో అమెరికా సంయుక్త రాష్ట్రాల మాజీ ప్రెసిడెంట్ మిల్లర్డ్ ఫిల్‌మోర్, వేల్స్ యువరాజు, అనేక రాష్ట్రాల గవర్నర్లు, లక్షాధిపతులైన సోషలిస్టులూ, సాధారణ వ్యక్తులతోపాటు జూదగాళ్ళు కూడా ఉన్నారు. నయాగరా జలపాతంను తాడుపై నడుస్తూ – ఒక చివర నుండీ మరొక చివర వరకు – సాహసంను ప్రదర్శిస్తూ బ్లాండిన్ వెళ్ళగలడా లేదా అన్న విషయంపై చాలా మంది పందెం కాయడం కూడా జరిగింది.

# వంటయింటి చిట్కాలు

## పూల తాజాతనంకోసం

*పూలకుండీలో కోసిన పూలను ఉంచే ముందు పువ్వు ప్రతికాడ అడుగు భాగాన్ని మెత్తటి పత్తితో చుట్టండి. దాన్ని కుండీలో ఉంచి ఆ తరువాత నీటితో నింపండి. మామూలు కంటే కూడా ఎక్కువ సమయం వరకు పూలు తాజాగా ఉండగలవు.*

"పేరు ప్రతిష్ఠ అన్నవి గొప్ప పనులను వెదజల్లే సుగంధం లాంటివి.''

ఐదు నిమిషాలు మాత్రమే తీసుకుని బ్లాండిన్ అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తుతూ తాటిపై నడిచి వెళ్ళాడు. ఈ సాహసకృత్యంను పూర్తి చేసిన తరువాత మొత్తం అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఐరోపాఖండంలోని దేశాల బహిరంగ




సభలో పాల్గొనేందుకు ఆహ్వానిస్తూ ఎక్కువ మొత్తాన్ని అతడికి రుసుముగా ఇవ్వడానికి ప్రజలు ముందుకు వచ్చారు. ఆ తరువాత అనేకసార్లు ఆ చివర నుండీ ఈ చివర వరకు తాటిపై నడిచి తన పేరు ప్రతిష్టలను బ్లాండిన్ నిలుపుకున్నాడు. ఒకానొక ప్రదర్శన సందర్భంగా తనతో కూడా ఒక కుర్చీను తీసుకువెళ్ళి మధ్యలో దానిపై కూర్చోవడం కూడా అతడు చేసాడు. మరికొన్నిసార్లు తాటిపై తలకిందులుగా నిలబడటం లేదా డాన్స్ చేయడం కూడా అతడు చేసాడు. మరొకసారి తన తాటిపై నడక కార్యక్రమాన్ని రాత్రిపూట చేపట్టాడు. గమన శక్తిగల యంత్రం (Locomotive Engine) వెలుతురులో అతడు తన నడకను ప్రారంభించాడు. సగం దూరం నడిచి వెళ్ళిన తరువాత ఆ యంత్రం లైట్లను కూడా ఆర్పివేసారు. కటిక చీకటిలో అతడు మిగిలిన సగం దూరంను పూర్తి చేసాడు. మరోసారి చాలా అపాయంతో కూడిన నడకను కళ్ళకు గంతలు కట్టుకుని లేదా తన రెండు కాళ్ళను రెండు బుట్టలలో పెట్టుకుని లేదా కొయ్యకాళ్ళపై (Stilt) నించుని – పూర్తి చేసాడు!

ఈసారి తన వీపుకు ఒక మనిషిని కట్టుకుని నయాగరా జలపాతాన్ని తాటిపై నడుస్తూ దాటగలనని బ్లాండిన్ ప్రకటించాడు. హ్యారీ కోల్‌కోర్డ్ (Harry Colcord) అన్న వ్యక్తి బ్లాండిన్‌తో సహకరించడానికి ఒప్పుకున్నాడు. మళ్ళీ 10 లక్షల మంది ఈ సాహసకృత్యాన్ని చూడడానికి వచ్చారు.

## ప్రపంచపు తొలి క్రైస్తవ పాలకుడు

*ప్రస్తుతం ఇస్తాంబుల్ (Istanbul)గా పిలువబడుతున్న నగరం అసలు పేరు కాన్‌స్టాంటినోపల్ (Constantinople). దీన్ని 'ది గ్రేట్'గా పిలువబడుతున్న కాన్‌స్టంటైన్ అనే చక్రవర్తి నిర్మించాడు. ఇతడే ప్రపంచపు తొలి క్రైస్తవ మతపాలకుడిగా గుర్తింపబడుతున్నాడు.*

ఈ సాహస కార్యం కోసం బ్లాండిన్ బిగుతు పంట్లాము (Trouser)ను ధరించాడు. హ్యారీ కోల్‌కోర్డ్ మాత్రం సాధారణమైన దుస్తులనే ధరించాడు. హ్యారీ బ్లాండిన్ వీపునెక్కాడు. ఒక ప్రత్యేకమైన గుర్రపు ముస్తీబు (Harness)ను గట్టిగా పట్టుకొని రికాబు (Stirrups)పై కాళ్ళు పెట్టుకున్నాడు. 100 అడుగుల దూరం తాటిపై నడిచిన తరువాత బ్లాండిన్ కాస్తంత విశ్రాంతి తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఒక్క క్షణకాలం కిందికి దిగవలసిందిగా బ్లాండిన్ హ్యారీను కోరాడు. మొదట్లో హ్యారీ దిగడానికి నిరాకరించాడు. దిగకపోతే మరణం తప్పదని చెప్పిన తరువాత హ్యారీ కోల్‌కార్డ్ కిందకు దిగాడు!

నయాగరా జలపాతంకు 200 అడుగుల ఎత్తులో ఉన్న తాటిపై దిగి హ్యారీ గడగడా వణకసాగాడు. కిందపడి చనిపోకుండా ఉండేందుకు బ్లాండిన్ పిరుదులను హ్యారీ గట్టిగా పట్టుకున్నాడు. కోల్‌కార్డ్‌కు గుండె ఆగినంత పనైంది.!

కొన్ని నిమిషాల విశ్రాంతి తరువాత బ్లాండిన్ హ్యారీ కోల్‌కార్డ్‌ను తన వీపుపై మళ్ళీ ఎక్కవల్సిందిగా చెప్పాడు. జలపాతం మధ్యలో చేరిన తరువాత వీపుపైన మనిషి బరువు మోస్తున్న బ్లాండిన్ ప్రయాసతో ముందుకు పరిగెత్తడం మొదలుపెట్టాడు. చివరకు బ్లాండిన్ హ్యారీ కోల్‌కార్డ్‌తో సహా నయాగరా ఆ చివరను సురక్షితంగా చేరగలిగాడు. ఊపిరి బిగపట్టుకుని బ్లాండిన్ సాహసకృత్యాన్ని అపస్మారకపుస్థితిలో చూస్తున్న జనం బిగ్గరగా ఏడ్వడం మొదలుపెట్టారు. బ్లాండిన్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తూ అతడిని ప్రపంచపు అత్యంత సాహసవంతుడిగా గుర్తించి పొగడసాగారు. కానీ బ్లాండిన్ వీపు నెక్కి నయాగరా జలపాతాన్ని దాటిన హ్యారీ కోల్‌కార్డ్‌కు అది ప్రాణాంతకమైన అనుభవంగా తయారవడం వల్ల మతిస్థిమితం కోల్పోయిన వ్యక్తిగా మారి తన శేష జీవితాన్ని గడిపాడు. ●

## తీవ్రరక్తపోటుకు ద్రాక్షరసం



ద్రాక్షరసంలో విటమిన్ సి, భాస్వరం పుష్కలంగా ఉంటుంది. ఇందులో సోడియం అసలు ఉండదు. పథ్యంతో కూడిన భోజనంతో దీన్ని తీసుకున్నప్పుడు ఇది రక్తపోటును అదుపులో ఉంచగలదు. – హెల్త్

"అభిప్రాయాలను బహు జాగ్రత్తగా ఏర్పరచుకోవాలి. వాటిని మార్చుకుంటున్నప్పుడు మరింత జాగ్రత్త వహించాలి." – జోష్ బిల్లింగ్స్

# హాస్యతోరణం

## మా ఇద్దరి టీచర్ ఒకరే

మీ ఇద్దరూ ఒకేరకం అయిన స్పెల్లింగు తప్పు చేసారని క్లాస్ టీచర్ ఇద్దరు విద్యార్థులను అడిగాడు ''దీనికి మీ సమాధానం ఏమి?'' అనే ప్రశ్నకు 'మా ఇద్దరి టీచర్ ఒకరేసార్' అని వారు కలిసి సమాధానం ఇచ్చారు.



## 40 కోట్ల మంది!

చొక్కాలేని మహాత్మాగాంధీని చూసి ఆశ్చర్యపోయిన ఒక పది సంవత్సరాల బాలుడు ఆయన వద్దకు పోయి ''మీరు ఎందుకు చొక్కా తొడుక్కోలేదు? మీకు ఒక చొక్కా ఇవ్వమని మా అమ్మతో చెప్పేదా?'' అని అన్నాడు.

''నాకు ఒక చొక్కా ఇచ్చావంటే అంతా తారుమారు అవుతుంది. నా సోదరులు అందరూ నాతో పోట్లాటకు దిగుతారు'' అని గాంధీజీ నవ్వుతూనే జవాబు ఇచ్చాడు.

ఏమాత్రం బెదరకుండా ఆ కుర్రాడు ''నేను అందరికి చొక్కాలను ఇవ్వగలను. మీరు ఎంతమంది అన్నదమ్ములో చెప్పండి'' అన్నాడు.

''40 కోట్లమంది'' అన్న జవాబు విని ఆశ్చర్యపోయిన ఆ కుర్రాడి బుగ్గను గాంధీజీ ప్రేమతో గిల్లాడు.

## ఉపన్యాసం ఆరు కాపీలు

ఒక మంత్రిగారు ఒక సభ నుండీ తిరిగి వచ్చి తన కార్యదర్శిపై కళ్ళెర్రచేసి ''ఏమయ్యా నేను కేవలం 10 నిమిషాలు పట్టే ఉపన్యాసం తయారుచేయమంటే ఒక గంటసేపు పట్టే ఉపన్యాసాన్ని ఎందుకు తయారు చేసావు. నేను ఎలాగో కష్టపడి అర గంటసేపు చదివాను. ప్రజలు గోల పెట్ట డంతో పూర్తిగా చదవకుండా నా ఉపన్యా సాన్ని సగంలోనే ముగించాను. నీ కార ణంగా నాకు ఎంత అవమానం జరిగింది'' అని మండిపడ్డాడు. ''అయ్యా! మీరు కోరి నట్లుగానే నేను 10 నిమిషాలు ఉపన్యాసాన్ని మాత్రమే తయారుచేసాను. కానీ పొరపా టుగా మీకు ఇచ్చిన ఫైలులో ఆ ఉప న్యాసం ఆరు కాపీలను ఉంచాను'' అని

''గాలిలో మేడలు కడుతున్నప్పుడు మీపని వృధాగా పోవలసిన అవసరం లేదు. కారణం మీరు అక్కడ ఉండాలి కాబట్టి కట్టిన తరువాత ఆమేడలు కింద గట్టి పునాది వేయండి.''
– హెన్రీ డేవిడ్ థోరో

చాలా నెమ్మదిగా ఆ కార్యదర్శి మంత్రిగారికి జవాబు ఇచ్చాడు.



## అదిగో! ఆ కారణంగానే!

ఛుయింగ్‌గమ్‌ను తయారుచేసి పంపిణీ చేసే శ్రీ ఆర్.జె. రిగ్‌లే (R.J Wrigley) ఒకసారి విమాన ప్రయాణం చేస్తున్నాడు. అతడి పక్కనే కూర్చున్న వ్యక్తి ''అయ్యా! మీరు చుయింగ్‌గమ్‌ను ఎంతో విజయవంతంగా తయారుచేసి ప్రపంచం మొత్తంలో పంపిణీ చేస్తున్నారు కదా! అయినా ఇంకా ఎందుకు ప్రకటనలను ఇస్తున్నారు'' అని రిగ్‌లేను అడిగాడు.

''మనం ఇప్పుడు ఆకాశంలో ఎగురుతున్నాం కదా! అయినా ఈ విమానం పైలెట్ విమానం ఇంజిన్‌ను ఆఫ్ చేయకుండా ఇంకా ఎందుకు వాటిని నడుపుతున్నాడు? ఆ కారణంగానే నేను ఇంకా ప్రకటనలను చేస్తున్నాను'' అని రిగ్‌లే జవాబిచ్చాడు.

## బహిరంగ న్యాయస్థానంలో నిద్ర

ఇది కరెంటుతో నడిచే పంఖాలు లేని రోజులలో జరిగిన సంఘటన. అప్పట్లో కచేరీలలోనూ, న్యాయస్థానాలలోను పంఖాలను వాడేవారు. ఈ పంఖాకు పొడవైన తాడు ఒక చివర కట్టబడి ఉండేది. మరో చివరను చేత్తో పట్టుకుని ఒక బంట్రోతు దాన్ని లాగేవాడు. మంచి వేసవి కాలంలో ఒక రోజు మద్రాసు హైకోర్టుకు చెందిన ఒక జడ్జి నిద్రపోయాడు. న్యాయవాది నార్టన్ ఆ జడ్జి సమక్షంలో తన వాదనను వినిపిస్తున్నాడు. నిద్రపోతున్న జడ్జిగారిని చూచిన న్యాయవాది నార్టన్ ఇబ్బందిలో పడ్డాడు. అదే సమయంలో పంఖానులాగే బంట్రోతు కూడా కునుకు తీయసాగాడు. కోపంతో నార్టన్ తన లా పుస్తకాలతో బల్లను బలంగా గుద్దాడు. ఆ శబ్దాన్ని విన్న జడ్జి, జడ్జితోపాటు పంఖాలాగే బంట్రోతు మేల్కొవడమే కాకుండా నిద్రమత్తును కూడా వదిలించుకున్నారు. ''ఎందుకు? ఇంతకూ విషయం ఏమి?'' అని జడ్జి న్యాయవాదిని నిలదీసాడు. నార్టన్ ఎంతో వినయంగా ''ఏమీలేదు దొరగారు, తనను తాను జడ్జిగా భావించి, వారిలాగా బహిరంగ న్యాయ స్థానంలో నిద్రపోవచ్చునన్న ఆ బంట్రోతు నిర్లక్ష్య భావనను ఖండించాను'' అని అన్నాడు.

''ఆలోచనలను బట్టే మనిషి. ఎలా ఆలోచిస్తే మనిషి అలాగే తయారవుతాడు.''

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

1 నల్లమందు మనకు ఏ పువ్వు నుండీ లభిస్తుంది?

(ఎ) మల్లె (బి) తామర (సి) గులాబీ (డి) గసగసాల చెట్టు పువ్వు.

2. మురికివాడల పాలిటి దేవుడిగా 'సెయింట్ ఆఫ్ గట్టర్స్' (Saint of the gutters)గా ఎవర్ని పిలుస్తారు?

(ఎ) బిషప్ డెస్మెండ్ టుటు (బి) మదర్ థెరెసా (సి) జోన్ ఆఫ్ ఆర్క్ (Joan of Arc) (డి) బాబా ఆమ్టే.

3. అతి ఎక్కువ ఆయుర్ధాయం గల దేశం పేరేమి?

(ఎ) థాయ్‌లాండ్ (బి) నెదర్లాండ్ (సి) జపాన్ (డి) అమెరికా సంయుక్త రాష్ట్రాలు.

4. దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు తొలి గ్రహీత.

(ఎ) జయరాజ్ (బి) అశోక్‌కుమార్ (సి) నౌషాద్ (డి) దేవికారాణి రోరిచ్.

5. సుబ్రాటో కప్ ఏ ఆటతో ముడిపడి ఉంది?

(ఎ) క్రికెట్ (బి) హాకీ (సి) ఫుట్ బాల్ (డి) బాడ్మింటన్

6. "ది ఫస్ట్ వార్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్" పుస్తకాన్ని రచించిన రచయిత పేరు?

(ఎ) మహమ్మద్ ముజీబ్ (బి) ప్రదీప్ సింగ్ (సి) మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్ (డి) వీర సవార్కర్.

7. ఆంగ్లో ఇండియన్ తెగకు సంబంధించిన ఎంతమంది వ్యక్తులను భారతరా

## చదరంగపు మేటి ఆటగాళ్ళను ఎన్నుకునే పద్ధతి

*చదరంగపు మేటి ఆటగాళ్ళను ఎన్నుకునే పద్ధతిని ఎ. ఇలో (A Elo) అనే అమెరికన్ ప్రొఫెసర్ తీర్చిదిద్దాడు.*

"భగవంతుడు + కోరిక = మనిషి
మనిషి – కోరిక = భగవంతుడు." – స్వామి శివానంద

ష్ట్రపతి లోక్‌సభకు నామినేట్ చేయవ చ్చును:

(ఎ) ఇద్దర్నీ (బి) ముగ్గుర్నీ (సి) నలుగురిని (డి) ఆరుగురిని.

8. మనదేశపు అతి ఎత్తైన శిఖరం ఏది?

(ఎ) కారాకోరం - 2 (K-2) (బి) నందాదేవి (సి) కాంచన్ జంగా (డి) ఘషీర్‌బ్రమ్.

9. నల్లరేగడి నేల ఏ రకం పంటకు శ్రేష్టమైనది?

(ఎ) జొన్నలు (బి) వరి (సి) గోధుమ (డి) పత్తి.

10. 'అన్ ఇంటిమేట్ స్టోరీ' అనే జీవిత చరిత్రను ఎవరు రాసారు?

(ఎ) కుల్ దీప్ నయ్యార్ (బి) కె.కె. కట్యాల్ (సి) ఎల్.కె. చోప్రా (డి) గోవిందన్ కుట్టి.

## మాటలమహిమ

1. అణిపూస: (ఎ) వెన్న (బి) ముత్తెము (సి) తెల్లటి పూస (డి) శ్రేష్ఠము.

2. ఉరియాట: (ఎ) ఉడుమును పట్టుకునే ఆట (బి) ఊరి ప్రజల సామూహిక ఆట (సి) ఊగులాట (డి) దాగుడుమూతలు.

3. కనుదురు: (ఎ) కందురీగ (బి) రహస్యం (సి) కంటి ఎదుట (డి) కంటిపైని నుదురు.

4. గఱిచిప్ప: (ఎ) పక్షి అస్తిపంజరం (బి) భిక్షాపాత్ర (సి) ముత్యపు చిప్ప (డి) తాటాకు దొన్నె.

5. చదలము: (ఎ) చదురునేల (బి) నూరు చదరపు అడుగులు (సి) ఆకాశగంగ (డి) సైన్యము.

---

### గుండె జబ్బులు ప్రధాన కారణాలు



గుండె జబ్బుల కారణంగా ప్రపంచ మంతటా మిలియన్ల ప్రజలు చనిపోతున్నారు. బలవర్ధకమైన ఆహారం లేకపోవడం, పొగత్రాగడం, మానసిక ఒత్తిడి, వ్యాయామం చేయక పోవడం అనే కారణాల వల్ల ప్రజలు గుండె జబ్బులకు గురి అవుతున్నారు.

''తన కోసం పాటుపడడం సంతృప్తిని ఇస్తుంది కానీ ఇతరుల కోసం పాటుపడడం ఉత్తేజం కలిగిస్తుంది.''

6. జడులము: (ఎ) పుట్టుమచ్చ (బి) కదలలేనిది (సి) ఇంగువ (డి) ఎద్దుల మెడకు తగిలించే కాడి.

7. తఱుగరి: (ఎ) కొండపైని చెట్టు (బి) తగ్గుముఖం పట్టిన వ్యాధి (సి) దలాలీకాడు (డి) కొయ్యగూర

8. నల్యజక్కి: (ఎ) పూర్తిగా ఉడకని అన్నం (బి) హంస (సి) నలుగు సామాను (డి) పరిహాసము.

## తెలివికి పరీక్ష

1. **ఆమ్‌స్టర్ డామ్ అన్నది నెదర్ లాండ్స్‌లో ఉంది. మరైతే ఆమ్‌స్టర్ డామ్ దీవులు (Islands) ఎక్క డున్నాయి?**

2. **ఒక గ్రాము కొవ్వు ఎన్ని కాలరీల ఉష్ణాన్ని విడుదల చేస్తుంది?**

3. **వెదురు మొక్కల్ని తిని జీవించే ప్రాణి ఏది?**

4. **నోబెల్ బహుమతి తొలిసారిగా ఎప్పుడు ప్రకటించబడింది?**

5. **ఆశావాది విమానాన్ని కనుగొంటే నిరాశావాది దేన్ని కనుగొన్నాడు?**

**(జవాబులకు 62వ పేజీ చూడండి)**

## ఇంటి యజమానిని నేనే



*బాగా చురుగ్గా కనిపించే ఒక మధ్య వయస్కుడు దయాగుణం గల ధనవంతుడి వద్దకు పోయి ఒక నిరుపేద విధవరాలి కన్నీటి గాథను వినిపించాడు.*

***"ఈ నిరుపేదరాలిపై అయిదుగురు ఆకలితో అలమటించే పిల్లల పోషణ బాధ్యత ఉంది. ఇంటి యజమానికి 500 రూపాయల బాడుగ బాకీ పడింది. యజమాని ఇంటి నుండి ఈమెను వెళ్ళగొట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంటి బాడుగ వరకు విరాళాన్ని పోగుచేసి ఇస్తామన్న ప్రయత్నంలో నేను ఉన్నాను. మీరు ఆమెకు సహాయం చేయగలరా?"***

***"మీలాంటి మంచి మనిషి ఆ నిరుపేదకు సహాయం చేసేందుకు తలపెట్టినందుకు నేను తప్పకుండా సహాయం చేస్తాను. ఇంతకూ మిత్రమా మీరెవరు?"***

***"ఆ ఇంటి యజమానిని నేనే", అని ఆ వచ్చిన వ్యక్తి జవాబు ఇచ్చాడు.***

***("లాఫ్టర్ ది బెస్ట్ మెడిసిన్' సౌజన్యంతో)***

"శత్రుత్వపు భావనను రేకెత్తించకుండా పనులను పూర్తి చేయడం నేర్పరితనంతో కూడిన గుణం."

# ఎల్లప్పుడు సంతోషంగా ఉండు

కాంషీరాం చావ్లా

నవ్వు ముఖంతో సంతోషంగా ఉంటూ తృప్తితో జీవించే వ్యక్తి మొత్తం ఇంటిలోని మనుషుల ధోరణిని మార్చగలుగుతాడు.



సంతోషంతో విరబూసిన వ్యక్తి తన ఉనికితో నిరంతర ఆనందాన్ని వ్యాపింపజేస్తాడు. భయంకరమైన చలితో బాధపడుతున్న భూములపై, అడవులపై నీరెండ ఎంతగా ప్రభావం చూపుతుందో సంతోషాన్ని విరజిమ్మే వ్యక్తి తన వ్యక్తిత్వంతో ఇతరులను అంతే ప్రభావితం చేస్తాడు. సంతోషం మనిషిని మేల్కొలిపి అతనిలో ఉన్న ఉత్తమ సామర్థ్యాన్ని వెలుగులోకి తీసుకువస్తుంది. అది వారిని బలవంతులుగా, సాహసికులుగా, ఆనందంతో కూడిన వ్యక్తులుగా మారుస్తుంది. ఈ గుణంగల వ్యక్తి విశాల ప్రపంచాన్ని సంతోషంతో నింపి నివసించేందుకు వీలైన భావనలతో దీన్ని నింపగలుగుతాడు. అతడిని ఉదయం కలిసామంటే అతని సంతోషం ఆ రోజు సమస్యలకూ, ప్రశ్నలకూ తేలికగా పరిష్కరించే సమాధానాన్ని సూచించగలదు. ఆ రోజు పనులను అది సులభతరం చేయగలదు. అతడి హృదయపూర్వక కరచాలనం మననాడులలో కొత్త ఉత్సాహాన్ని ప్రసరింపజేస్తుంది. అతడితో కొన్ని క్షణాలు మాట్లాడితే అది మీలో ఉత్సాహం ఉబికేలా చేస్తుంది. మీ అభిలాషలను చిగురింపజేసి జీవించడంలో ఉన్న ఆనందాన్ని తెలియజేస్తుంది. ఇతరులను సంతోష పరచగల వ్యక్తులు నిజంగానే ధన్యులు.

చిరునవ్వుతో కూడిన స్వభావం, సంపదకంటే శక్తివంతమైనది. అది వజ్రవైడూ.

---

## అత్యధిక జాతీయ బహుమతులు

మలయాళంలో నిర్మించబడిన స్వయంవరం చిత్రానికి ఇంతవరకూ ఏ చిత్రానికీ రానన్ని జాతీయ అవార్డులు – ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకత్వం, ఫొటోగ్రఫీ, ఉత్తమనటి– లభించాయి.

"బరువుకు తగ్గ కండ బలాన్ని దేవుడు మనకు ప్రసాదిస్తాడు."

ర్యాల కంటే కూడా చాలా విలువైనది. స్వర్గపు సువాసనలతో అది మొత్తం వాతావరణాన్ని నింపివేస్తుంది. అందుకే ఎల్లప్పుడూ సంతోషంగా ఉండండి. సంతోషం కారణంగా అన్ని మార్గాలు సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా తయారవుతాయి. జీవితపు మహా బరువులు కూడా తేలికగా తయారవుతాయి. దృఢమైన సంతోషంతో జీవించే వ్యక్తి హృదయంలో ఎలాంటి చీకటికి, చోటు ఉండదు

కొంతమంది వ్యక్తులు తాము వెళ్ళిన ప్రతిచోటా తమతో పాటు ఆనందాన్ని, సంతోషాన్ని తీసుకు వెళతారు. ప్రతి ఒక్కరు ఆనందంతో నిండిన వ్యక్తిని ఇష్టపడతారు. అతడి నవ్వు ముఖం అతడికి అన్ని చోట్లా ప్రవేశం కల్పిస్తుంది. అతని కోసం అన్ని ద్వారాలూ తాముగా తెరుచుకుంటాయి. అందరిపట్లా సద్భావనను కలిగి ఉండడం వల్ల అతడు ప్రతికూల భావనలను, ద్వేషాన్ని తరిమివేయగలుగుతాడు. సూర్యుడి వెలుగులాగా ప్రతి మనిషి అతడిని తన ఇంటికి ఆహ్వానిస్తాడు. సంతోషంతో కూడిన గుణం కారణంగా అతడి ముందు కష్టాలు మంచులాగా కరిగిపోతాయి. అతడు గట్టిగా నిరుత్సాహాన్ని నిరుత్సాహ పరుస్తుంటాడు.

ఉల్లాసం కొరవైన వ్యక్తి స్ప్రింగులు లేని వాహనంతో సమానం. ప్రతి చిన్నరాయి కూడా ఆ వాహనాన్ని ఎత్తి ఎత్తి వేస్తుంది. కానీ ఉల్లాసంతో కూడిన వ్యక్తి స్ప్రింగులు గల వాహనంతో సమానం. మార్గంలో ఎన్ని ఎత్తుపల్లాలున్నా, అది ఎంత బాగా లేకపోయినా, ప్రయాణం చేస్తున్నట్లు కూడా అనిపించనంత సాఫీగా జీవితం కొనసాగిపోతుంటుంది. సంతోషానికున్న శక్తి, సహనశీల గుణం అద్భుతమైనవి. దుఃఖంతో బాధపడుతున్న మనిషి కంటే కూడా సంతోషంగా జీవిస్తున్న వ్యక్తి ఇచ్చిన వ్యవధిలో అప్పజెప్పబడిన పనిని చాలా త్వరగా, చాలా సమర్థతతో చేయగలడని కార్లైల్ (Carlyle) అంటున్నాడు.

నిజంగానే సంతోషమే మహాభాగ్యం. మనిషిలోని ఈ గుణం సూర్యరశ్మి లాంటిది. ఎండి బీటలు వారిన నేలపై వాన చూపే ప్రభావాన్ని సంతోషంతో జీవించే వ్యక్తి దుఃఖంతో కూడిన వ్యక్తులపై చూపగలడు.

సంతోషంతో నిండిన గుణాన్ని భగవంతుడి వర ప్రసాదంగా కాంప్‌బెల్ మోర్గన్ భావిస్తున్నాడు. ''నవ్వే స్వభావం, ఉల్లాసంతో గడపడం, అన్ని సమస్యలను మరచి సంతోషంగా ఉండడం అన్నది భగవంతుడి ద్వారా మనకు అబ్బిన దైవీక ప్రసాదం అవుతుంది.''

– రచయిత పుస్తకం సౌజన్యంతో

**''ఏదో ఒక వస్తువు కోసమో లేదా ఏదో ఒకదాన్ని ఎదిరిస్తూనో ఉత్తముడు తన లక్ష్యాన్ని నిర్ణయించుకోడు. ఉత్తమమైన మార్గాన్ని మాత్రమే అతడు అనుసరిస్తాడు.''**

**– కన్‌ఫ్యూసియస్**

# మనదేశాన్ని గురించి తెలుసుకోండి

★ మనదేశపు మొత్తం వైశాల్యం – 32.8 లక్షల చదరపు మైళ్ళు.




★ మనదేశం మొత్తం 26 రాష్ట్రాలుగా, 6 కేంద్రపాలిత ప్రాంతాలుగా విభజింపబడింది.

★ భారతదేశపు రానున్న జనగణన 2001వ సంవత్సరంలో జరుగుతుంది.

★ భారతదేశపు ప్రధాని కావడానికి కనిష్ఠ వయసు 25 సంవత్సరాలుగా రాజ్యాంగంలో రాయబడింది.

★ డా బి.ఆర్. అంబేద్కర్ మనదేశపు రాజ్యాంగాన్ని తీర్చిదిద్దిన రూపశిల్పి.

★ గణనీయమైన సేవలకు గుర్తింపుగా ఇవ్వబడే అతిపెద్ద పౌరసన్మానంగా 'భారతరత్న'ను పరిగణించడమైనది. ఈ సత్కారం దేశ రాష్ట్రపతి చేతుల మీదుగా జరుగుతుంది.




★ ప్రతి సంవత్సరం అక్టోబరు నెల 2వ తారీఖున మనం జాతీయ సమైక్యత దినంగా జరుపుకుంటాము.

★ భారతదేశపు 8వ షెడ్యూలులో అధికార భాషలుగా 15 భారతీయ భాషలను మన రాజ్యాంగం గుర్తించింది.

---

### "ఆకుపచ్చ శీతలీకరణం"

*పరిసరాలు – వాతావరణంకు అనుకూలమైన శీతలీకరణయంత్రాన్ని (Fridge) "గ్రీన్ ఫ్రిడ్జ్" అంటారు. ఓజోన్ (Ozone)ను నాశనం చేసే క్లోరో ఫ్లూరో – కార్బన్స్ (Chlorofluoro - Carbons) సహాయం లేకుండానే ఈ శీతలీకరణ యంత్రం పనిచేస్తుంది.*

"తాను విత్తులను నాటిన చెట్ల నీడలో తాను సేదతీర్చుకోలేనన్న విషయాన్ని పూర్తిగా తెలుసుకున్న తరువాత కూడా ఆపనిని అతడు చేస్తున్నాడంటే మానవతా విలువలకు సంబంధించిన గుణానికి అతడు శ్రీకారం చుట్టాడని భావించాలి."

★ దేశపు పంచవర్ష ప్రణాళికను జాతీయ అభివృద్ధి కౌన్సిల్ (National Development Council) అనబడే అతి పెద్ద సంస్థ ఆమోదిస్తుంది.







★ మన రెండు సభల మొత్తం రాజ్యాంగ సంఖ్య 795. ఇందులోని 545 పార్లమెంట్ సభ్యులు లోక్‌సభకు సాధారణ ఎన్నికల సందర్భంగా మనదేశపు వివిధ రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాల నుండీ ప్రజలచేత ఎన్నుకోబడతారు. 250 మంది రాజ్యసభకు, ఎన్నుకోబడిన శాసన సభ్యుల ద్వారా ఎన్నుకోబడతారు. (– ''భారతీయ జీవన బీమా సంస్థ'' సౌజన్యంతో) ●

## ఏడుకు సంబంధించిన వింతలు

### ఏడు రాష్ట్రాలు

భారతదేశపు ఈశాన్య ప్రాంతంలో ఏడు రాష్ట్రాలను ఏడుగురు సోదరీమణులంటారు. ఆ ఏడు అక్కచెల్లెళ్ళ పేర్లు: అస్సాం, అరుణాచల్‌ప్రదేశ్, మేఘాలయా, నాగాలాండ్, త్రిపుర, మిజోరం, మణిపూర్‌లు.

### వేరుపడ్డ ఏడు దీవుల కలయిక ముంబాయి

పడమటి కోస్తా ప్రాంతపు మేటినగరం అయిన ముంబాయిని భారతదేశపు ఆర్థిక రాజధాని నగరంగా భావించడం జరుగుతోంది. బైకుల్లా, కొలాబా, ఫోర్ట్, మాహిం, మాతుంగ, ఒర్లి, పరేల్ అనే వేరు వేరు ఏడు దీవుల కలయిక కారణంగా ఇది ఏర్పడింది. సముద్ర మట్టానికి కొంత దిగువు ఉన్న బురద భూమిని విశాలమైన సమతలంగా మార్చడంతో అది ఈనాడు ముంబాయిగా పిలువబడుతోంది. దీనినే భారతద్వారం అని కూడా అంటారు.

– నిర్మలేందు చక్రవర్తి

''అధ్యయనం ప్రారంభించిన తరువాత గానీ మన అజ్ఞానం తెలిసిరాదు.''

# మీకు తెలుసా?

## న్యూజిలాండ్‌ను కనుగొన్న వ్యక్తి




ఏబెల్ టాస్‌మాన్ (Abel Tasman) అన్న వ్యక్తి న్యూజిలాండ్ దేశాన్ని కనుగొన్నాడు.

## మొట్టమొదటి పరీక్షనాళిక శిశువు

ప్రపంచపు తొలి పరీక్షనాళిక (test-tube) శిశువు పేరు లూయిస్ జాయ్ బ్రౌన్ (Louise Joy Brown).

## భూమికి సూర్యుడికి మధ్యనున్న దూరం

భూమికి సూర్యుడికి మధ్యనున్న దూరంను 150 మిలియన్ల కిలోమీటర్లుగా అంచనావేయడం జరిగింది.

## బ్రిటన్ జాతీయపతాకం

యునైటెడ్ కింగ్‌డం (బ్రిటన్) జాతీయ పతాకంను యూనియన్ జాక్ (Union Jack) అన్న పేరుతో పిలుస్తారు.

## మేడమ్ క్యూరీ అసలు పేరు

రేడియంను కనుగొన్న మేడం క్యూరీ (Madam Curie) అసలు పేరు మేరీ స్కొలోడోవాస్కా (Marie Sklodowska).

## సాచ్చరో మీటర్

ఒక ద్రవ పదార్థంలో కరిగిపోయిన చక్కెరను కొలిచే పరికరాన్ని సాచ్చరో మీటర్ (Saccharometer) అంటారు.

## అంధులకు సహాయపడే కంప్యూటర్లు నడిపే సాధనం

*అంధులకు సహాయపడే, కంప్యూటర్లు నడిపే ఒక సాధనాన్ని ఎఇజి - టెలిఫన్‌కెన్ (AEG - Telefunken) జర్మన్ కంపెనీ అభివృద్ధి పరిచింది. ఈ సాధనం పుస్తకాలలో అచ్చుయిన ప్రతి వాక్యాన్నీ, వ్యక్తిగత కాగితాల్నీ ఒక అక్షరం పొల్లుపోకుండా చదివి, చదివిన దాన్ని గుడ్డివారు తమ బ్రెయిల్ (Braille)లో నమోదు చేసేవిధంగా 40 పంక్తులను వారి కోసం రాయగలరు.*

"మనకు జరిగేది కాదు మనలో జరిగే మార్పే వాస్తవమైనది." – జేమ్స్ డబ్ల్యు. కెన్నెడీ

## కరాటే మాట అర్థం




పిడి గుద్దులతో అవతలివాడు మనపై దాడి చేస్తున్నప్పుడు ఆత్మరక్షణకై వాడే క్రీడను కరాటే అంటారు. జపానీసు భాషలో కరాటే (Karate) అన్న మాట 'వట్టి చేతులతో' అనే అర్థాన్ని ఇస్తుంది.

## నావను నిలకడగా ఉంచే లంగరు

వాడి మొనలుగల (barb) బలమైన వస్తువును లంగరు అంటారు. నీటిలో దీన్ని దింపినప్పుడు అది నావను నిలకడగా ఉంచుతుంది.

## సమతౌల్యాన్ని కాపాడే చెవులు

వినడం అనే పనిని మాత్రం కాకుండా మన చెవులు మన సమతౌల్యాన్ని కూడా కాపాడుతాయి.

## విరగడం తెగడమవుతుంది

ఏకాండంగా ఉన్న శరీరపు ఎముక కొద్దిగా గానీ లేక పూర్తిగాగానీ తెగడాన్ని ఎముక విరగడం అంటారు.

## అగ్గిపుల్లలను కనుగొన్న వ్యక్తి

ఈ రోజు మనం వాడుతున్న సురక్షితమైన అగ్గిపుల్లలను స్వీడన్‌కు చెందిన శాస్త్రజ్ఞుడు లుండ్ స్టార్మ్ (Lund Storm) 1855వ సంవత్సరంలో కనుగొన్నాడు.

## హాజియాలజిస్టు

ఋషుల సన్యాసుల జీవితాలనూ పురాణాలనూ, సాహిత్యానికి సంబంధించిన విషయాలను అధ్యయనం చేసే వ్యక్తిని హాజియాలజిస్టు (Hagiologist) అంటారు.

## సొగసైన నిర్వచనాలు

*ఉపన్యాసకుడు (Lecturer): మీ చెవులలో తన నాలుకను ఉంచి మీ సహనంపై నమ్మకాన్ని పెంచుకునే వ్యక్తి.*

*క్షమాపణ కోరడం. భవిష్యత్తులో మీరు చేయబోయే దాడికి గట్టి పునాదులను వేయడం.*

*సలహా: అంబాజీ పేట ఆముదంలాంటిది. ఇవ్వడం సులభం కానీ తీసుకోవడం చాలా కష్టం.*

"మనసును తన ఆలోచనలను తానే చేసుకోగల వలలో చిక్కుకునేలా చేయడమే పుస్తకాల ప్రధాన ఉద్దేశం."

– క్రిస్టోఫర్ మోర్లే

## ఏడు రంగులు




వెలుతురులో ఏడురంగులు ఉన్నాయన్న సత్యాన్ని కనుగొన్న వ్యక్తి సర్ ఐజాక్ న్యూటన్. ఇతడు వైజ్ఞానికుడితోపాటు గణిత శాస్త్రజ్ఞుడు కూడా!

## రెండవ ప్రపంచ యుద్ధం ప్రకటింపబడిన తారీఖు

1939వ సంవత్సరం సెప్టెంబరు నెల 3వ తారీఖున రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన ప్రకటన జారీ చేయబడింది.

## లె మాన్స్ ప్రారంభం

మోటారుకారు పందెంతో లె మాన్స్ స్టార్ట్ (Le Mans Start) అన్న మాట ముడిపడి ఉంది. మోటారు కార్ల పందెం ప్రారంభం అయ్యే ముందు కారును నడిపే వ్యక్తులు కారు ముందు నిలబడుతారు. ప్రారంభపు సిగ్నలు ఇవ్వగానే తమ శక్తినంతా ఉపయోగించి అడ్డంగా తమ వాహనాల్ని చేరి ఇంజనును స్టార్ట్ చేసి ఎంత వేగంగా సాధ్యమైతే అంత వేగంగా ముందుకు వెళ్ళిపోతారు.

## కొత్త అక్షరం




ఇంగ్లీషు వర్ణమాలకు ఒక కొత్త అక్షరాన్ని కనిపెట్టిన వ్యక్తికి తన యావదాస్తీ చెందేలా ఐరిష్ నాటక రచయిత, పాత్రికేయుడూ అయిన జార్జ్ బెర్నార్డ్ షా వీలునామా రాసాడు.

## "పెయింటెడ్ లేడీ"

ఒకరకమైన సీతాకోకచిలుకను "పెయింటెడ్ లేడీ" అని పిలుస్తారు.

"సౌజన్యం జీవితానికి తియ్యదనాన్ని ఇస్తుంది. గొప్ప సౌజన్యం జీవితాన్ని గొప్పగా తీర్చిదిద్దుతుంది."



భారతీయుల
వస్త్ర అలంకరణ
TTAR PRADESH
HIMACHAL PRADESH
HIMACHAL PRADESH
TRIPURA
ASSAM
WEST BENGAL
NAGALAND
MAHARASHTRA
HRA PRADESH
ORISSA
ORISSA
RA PRADESH
PUNJAB

# నిరుత్సాహపు మాటలతో మనం ఇతరులను ఆటంకపరుస్తున్నామా?

ఒక పాఠశాల లెక్కల మాష్టారు బోర్డుపై ఒక లెక్కనిచ్చి దానికి జవాబు బోర్డుపై రాయవలసిందిగా ముగ్గురు విద్యార్థులను, ఒకరి తరువాత మరొకరిని పిలిచాడు.



మొదటి విద్యార్థి చాక్‌పీసును తీసుకుని ఒకటి రెండు నిమిషాలు ఆలోచించి లెక్క చేయడం మొదలు పెట్టాడు. ఆ విద్యార్థి ముందుకు సాగుతున్నప్పుడు ఆ విద్యార్థిని ఆపి ఆ టీచరు ''నీకు జవాబు తెలియదు. లెక్కను చేసే పద్ధతి అది కాదు'' అని అన్నాడు. నిరాశతో ఆ విద్యార్థి తన సీటుకు వెనుతిరిగిపోయాడు. రెండవ విద్యార్థి ఆ లెక్కకు సమాధానం రాయడం ప్రారంభించిన వెంటనే ఆ మాస్టారు ఆ విద్యార్థిని ఆపుచేసాడు. ఆ కుర్రాడు మాస్టారు మాటలను విని విభ్రాంతుడయ్యాడు. కానీ మాస్టారు మాటకు ఎదురు చెప్పకుండా వెనుతిరిగాడు. మూడవ విద్యార్థి విషయంగా ప్రారంభంలోనే ఆ విద్యార్థిని 'కాదు' అని మాస్టారు ఆపు చేసాడు. మాస్టారు నిరుత్సాహపరుస్తున్నా ఆయన మాటలను ఖాతరు చేయకుండా మూడవ విద్యార్థి ఆ లెక్కకు సమాధానం రాయడం మొదలుపెట్టాడు. పూర్తి సమాధానం రాసిన తరువాత ఆ కుర్రాడు వెనుతిరిగాడు.

మాస్టారు పిలిచిన ముగ్గురు విద్యార్థులకూ ఆ లెక్క చేయవలసిన విధానం, సమాధానం తెలుసు. కానీ మూడవ విద్యార్థే నిరుత్సాహపు మాటలను పట్టించుకోకుండా ధైర్యంతో సమాధానం రాయడం పూర్తి చేయగలిగాడు. ఇటువంటి పరిస్థితులలో విద్యార్థులు ఎలా స్పందిస్తారో తెలుసుకోవాలనే ఆ మాస్టారు అలా ప్రవర్తించాడు. మనకు తెలిసిన పనులను చేసే విధానం తెలిసి ఉండి కూడా ఇతరుల నిరుత్సాహపు మాటలను విని ముందుకు సాగలేకపోతున్నామా అనే ప్రశ్నను మనకు మనమే వేసుకోవాలి.

**''మంచి స్నేహితులను పొందిన తరువాత మంచి పుస్తకాల సాంగత్యాన్ని పొందడం అన్నది ఉత్తమమైనదిగా పరిగణింపబడుతుంది.''** **– కాల్టన్**

# అవీ- ఇవీ

## జీవరాసులు జీవించడానికి అనుకూలమైన వాతావరణం ఉన్న బృహస్పతి చంద్రుడు


Galileo space probe

నాసా (Nasa)కు చెందిన గెలీలియో (Galileo) అని పేరున్న పరిశోధక అంతరిక్ష నౌక 1996వ సంవత్సరం డిసెంబర్ నెల 19వ తారీఖున బృహస్పతి చంద్రుడు యురోపా (Europa)కు 692 కి.మీ.ల సమీపంగా వెళ్ళి ఫోటోలను తీసి భూమికి పంపింది. ఈ ఫోటోలు మంచు ధారనూ, మంచును కక్కే అగ్ని పర్వతాల మచ్చలనూ తెలియజేసాయి. నీళ్ళూ, వేడి, సజీవ రసాయన సమ్మేళనం (Organic Compound) ఇత్యాదులు కలిసి ఈ యురోపాపై ప్రాణులు జీవించడానికి అనువైన వాతావరణాన్ని సృష్టిస్తున్నాయని వైజ్ఞానికులు భావిస్తున్నారు.

## పొలంలో దొరికిన ప్రాచీన లింగం

తమిళనాడుకు చెందిన **తిరుచిరాపల్లి** జిల్లాలోని లాల్‌గుడికు సమీపంలో ఉన్న కాట్టూర్ అనబడే గ్రామం పొలంలో 5 అడుగుల ఎత్తూ, 2 టన్నుల బరువూ ఉన్న రెండవ శతాబ్దానికి చెందిన ఒక రాతి లింగం ఇటీవల బయటపడింది.

## మంచి ఆలోచనలకున్న ఔషధగుణం

*మన శారీరక స్థితిగతులపై ఆలోచనలకున్న ప్రభావాన్ని ఈ రోజు మనం అర్థం చేసుకోగ లుగుతున్నాము.*

*నిరసన లేదా కోపం కారణంగా మనిషి అనారోగ్యాన్ని కొని తెచ్చుకుంటాడు. తాను తప్పు చేసానన్న భావన కారణంగా రకరకాల శారీరక వ్యాధి లక్షణాలు అతనిలో మొలకెత్తుతాయి.*

*భయం, బెంగల కారణంగా కొన్ని స్పష్టమైన శారీరక వ్యాధి లక్షణాలు కొందరిలో కనబడతాయి.*

*ఆలోచనా సరళిలో మార్పు వచ్చినప్పుడు మనిషి ఆరోగ్యం కుదుట పడుతుంది.*

*- డా. నార్మన్ విన్సెంట్ పీలె*

రూపొందించబడిన మనిషి దేవుడు అయితే చిక్కుకున్న దేవుడు మనిషి అవుతాడు.''

- స్వామి శివానంద

## కాల గర్భంలో కలిసిపోయిన టైనో ఇండియన్ల నగరం




డొమినికన్ రిపబ్లిక్‌కు చెందిన ఒకానొక అరణ్య మారుమూల ప్రాంతంలో పురాతత్వ శాస్త్రజ్ఞులు టైనో (Taino) ఇండియన్లు ఒకప్పుడు నివసించిన ఒక నగరాన్ని కనుగొన్నారు. 1492వ సంవత్సరంలో సాన్ సల్వాడోర్ (San Salvador) అన్న దీవిపై కొలంబస్ కాలు పెట్టినప్పుడు టైనో తెగకు చెందిన ఇండియన్లే ఆయనకు ఆహ్వానం పలికారు.

## రవిశంకర్‌కు జపాను దేశపు ప్రతిష్ఠాత్మక అవార్డు

జపాను దేశపు ప్రతిష్ఠాత్మకమైన అవార్డనం- ప్రేమియం ఇంపీరియల్ (Praemium Imperiale) – భారతదేశపు సితార్ విద్వాంసుడు రవిశంకర్ అందుకున్నాడు. కళల రంగంలో ఇతడు ఇంత వరకు సాధించిన లేదా చేసిన సేవలను గుర్తించి ఈ బహుమతి అతడికి ఇవ్వబడింది. జపాను దేశపు రాజకుటుంబం నుండీ 15 మిలియన్ యెన్నుల (Yens) (150,000 డాలర్లు) నగదుతోపాటు మెడల్‌ను కూడా అతడు పొందాడు.

## తొలి ఆలోచించే మిషను

మనిషి మెదడును అనుసరిస్తూ పనిచేసే ఒక యంత్రాన్ని లండన్‌కు చెందిన ఇంపీరియల్ కాలేజ్ ఆఫ్ సైన్స్, టెక్నాలజీ అండ్ మెడిసిన్‌కు చెందిన శాస్త్రజ్ఞులు అభివృద్ధి పరిచారు. పది బిలియన్ల (10,000 మిలియన్లు) మజ్జా తంతువులు (మెదడులో ప్రధానంగా ఉండేవి ఇవే) మనిషి శారీరక, మానసిక

---

## నాలుగు నిమిషాల లోపు కాలంలో ఒక మైలు దూరాన్ని పరుగెత్తిన తొలి వ్యక్తి

*ఇంగ్లాండులోని ఆక్స్‌ఫర్డ్ పరుగు పందాలలో ఒక మైలు దూరాన్ని నాలుగు నిమిషాల లోపు రోగర్ బాన్నిస్టర్ (Roger Bannister) అన్న వ్యక్తి పరుగుపందెంలో పూర్తి చేసాడు. ఈ సంఘటన 1954వ సంవత్సరం మే నెల 6వ తారీఖున జరిగింది.*

''అందమైన ముఖం కంటే కూడా మర్యాదతో కూడిన నడవడిక మనిషిని గట్టిగా బంధిస్తుంది. అందం అంధుణ్ణి చేస్తే మర్యాదతో కూడిన నడవడిక ఆకర్షిస్తుంది ''

పనులను ఎలా ఆధీనం చేసుకోగలదన్న విషయాన్ని తెలుసుకోవడంలో పరిశోధకులకు ఈ తొలి ఆలోచించే యంత్రం మాగ్నెస్ (Magnus) సహాయపడగలదు. ఈ మాగ్నెస్ యంత్రాన్ని కనుగొన్న ప్రొఫెసర్ ఇగోర్ అలెక్సాండర్ (Prof. Igor Aleksander) మనిషి పనులను, భావాలను ఎలా తన ఆధీనంలో ఉంచుకోగలదో దానిపై కొత్త కాంతిని ఇది ప్రసరింపగలదని భావిస్తున్నాడు.

## ప్రపంచపు తొలి అణులేజర్

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన 'మెస్సాచుసెట్స్ సాంకేతిక సంస్థలో (Massachusetts Institute of Technology) పనిచేసే భౌతిక శాస్త్రజ్ఞులు ప్రపంచపు తొలి అణు లేజర్ (Atom laser)ను తయారుచేసారు. ఈ కొత్త లేజర్ అణువులను పేలుస్తుంది. (Shoots). సోడియం అల్ట్రాకోల్డ్ రేణువులను (Partides) వాడుతుంది. బయటి అంతరిక్ష వాతావరణం కంటే కూడా మిల్లియన్ రెట్లు వాతావరణం చల్లబడితే అణువులు తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. అవి ఒకటిగా వ్యవహరించడం మొదలుపెడతాయి. అంతేకాదు అవి అదుపులోకి కూడా వస్తాయి. ఈ కొత్త విషయం ఖచ్చితమైన నౌకాయానంకు సంబంధించిన వస్తువులను తయారు చేయడంలోనూ మెషిన్ టూల్స్ తయారు చేయడంలోనూ, మరింత చిన్నవిగా ఉంటూ మరింత ఉపయోగకరంగా ఉండే కంప్యూటర్ చిప్పుల తయారీలో పరిణతం కావచ్చును.

---

## సాండ్‌విచ్ అన్న పేరు




*ఆహార పదార్థం మధ్యలో పెట్టబడిన రెండు బ్రెడ్ ముక్కలను (Slice) సాండ్‌విచ్ (sandwich) అంటారు. 1700వ సంవత్సరంలో ఒక రోజు పేకాడుతూ ఎర్ల్ ఆఫ్ సాండ్‌విచ్ (Earl of Sandwich) అని బిరుదున్న బ్రిటిష్ ప్రభుత్వ తన సేవకుడిని పిలిచి వేయించిన మాంసంను రెండు బ్రెడ్ ముక్కల మధ్య పెట్టి తినడానికి తీసుకురమ్మన్నాడు. చూస్తుండగానే చాలామంది ఈ రకమైన తినుబండారాన్ని ఇష్టపడసాగారు. అప్పట్నించి ఆ రకం తినుబండారానికి సాండ్‌విచ్ అన్న పేరు వచ్చింది.*

''మనతో కూడా జీవించేవారు మనలాగానే మనతో కూడా జీవించాలనే విషయాన్ని మనం తరచుగా మరచిపోతుంటాము '' – ఎంజల్‌బెర్ట్ హంచ్

# చిన్న చిన్న విషయాల ప్రాముఖ్యత

పై పై మెరుగులు లేక ఆకర్షణ గొప్పదనం కాదనీ, ప్రశంస కీర్తికాదనీ, గొంతెత్తి అరవడం పరపతీ కాదనీ, ప్రాముఖ్యం ఖ్యాతి కాదనీ, ఒక్క క్షణం కాలం గౌరవింపబడే వ్యక్తి కలకాలం గుర్తింపబడడన్న విషయాన్ని మనం మరవకూడదు.



గులకరాళ్ళు ఎండకారణంగా తళ తళ మెరుస్తాయి. అంత మాత్రాన అవి మణులు, మాణిక్యాలు కాలేవు. మనిషి వద్ద ధనం ఉండవచ్చును. దాని ఆధారంగా అతడు గెలుపును సాధించలేడు. ఒక విద్యార్థి బుద్ధిమంతుడుగా ఉండవచ్చును. ఆకారణంగా అతడు వేదాంతి కాలేడు. ఏ మాత్రం ముఖ్యత్వం లేని వ్యక్తులు చేసే పనుల పైనే మానవ చరిత్ర ఆధారపడి ఉంటుంది. అదే చరిత్రకు కావలసిన మలుపును ఇవ్వగలుగుతుంది.

ఈ ప్రపంచంలో అతి గొప్ప శక్తులు ఎప్పుడూ అద్భుతాలను సాధించలేదు. ఎండకాలపు తుంపరలు పెనుతుఫానుల కంటే కూడా చాలా లాభాల్ని ఇవ్వగలవు. కానీ ఈ తుంపరలకు అంత ప్రచారం ఇవ్వబడదు.

గుర్తింపును పొందని వ్యక్తుల విశ్వాసం, నిజాయితీ, అంకితభావం లేని పక్షంలో ఈ ప్రపంచం ఎప్పుడో నశించిపోయి ఉండేది

మన భవిష్యత్తును గొప్పగా తీర్చిదిద్దగల వ్యక్తుల జీవితాలు – అవి ఎంతటి సాధారణమయినవి అయినా సరే అవే దేశాన్ని ముందుకు తీసుకుపోతాయి. గొప్పవారి గొప్పలను, చిన్నవారి గొప్పతనాన్ని తక్కువగా అంచనా వేయడం చాలా సులభమైన పని.

– సన్‌షైన్

### ఒక్క క్షణం ఆలోచించండి

నీటి బిందువులు కలిసి మహాసముద్రంగా మారుతాయి ఇసుక రేణువులు కలిసి మహాప్రదేశంగా మారుతాయి. అదేవిధంగా చిన్న చిన్న క్షణాలు అవి ఎంత చిన్నవైనాసరే అంతులేని అనంతకాలం రూపాన్ని దాలుస్తాయి

"పలురకాల వ్యక్తిగత విభేదాలతో చుట్టబడిన దృఢమైన సర్వసామాన్యమైన ఒప్పందాన్ని ప్రజాస్వామ్యం అంటారు." – జేమ్స్ కొనాంట్

# అమెరికా దేశపు గొప్ప విశ్వవిద్యాలయాలలో ఒకటైన ఏల్ విశ్వవిద్యాలయం

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని బోస్టన్ (Boston)లో ఎలిహు ఏల్ (Elihu Yale - 1649 - 1721) జన్మించాడు. అక్కడి నుండీ ఈస్ట్ ఇండియా కంపెనీ కోసం పనిచేసేందుకు చెన్నై




నగరాన్ని అతడు చేరుకున్నాడు. క్రమ క్రమంగా అభివృద్ధి చెందుతూ అతడు ఫోర్ట్ సెయింట్ జార్జ్ గవర్నరు పదవిని అలంకరించాడు. 18వ శతాబ్దపు తొలి సంవత్సరాలలో కన్నెక్టికట్ (Connecticut) అనే బ్రిటిష్ కాలనీకు చెందిన న్యూ హెవెన్‌లోని సేబ్రూక్ (Saybrook) పాఠశాల కోసం అమెరికా దేశపు పండితుడు క్రైస్తవ ధర్మ శాస్త్ర పారంగతుడు అయిన కాటన్ మాథెర్ (Cotton Mather)ను నిధుల కోసం అర్థించారు. ఈ మాథెర్ ఆర్థిక సమస్యలలో చిక్కుకున్న పాఠశాలకు నిధులను సమకూర్చి సహాయపడవల్సిందిగా ఎలిహుఏల్‌ను కోరాడు. తాను పుట్టిన ప్రాంతంకు చెందిన పాఠశాల కోసం ఎలిహు ఏల్ విరాళాన్ని పంపాడు. ఆ స్కూలు ధర్మకర్తలు తమ కృతజ్ఞతా భావాన్ని ప్రకటించుకుంటూ సేబ్రూక్ స్కూలు పేరును ఏల్ కళాశాలగా మార్చారు. ఆ ఏల్స్ కాలేజీ రోజులు గడుస్తున్న కొద్దీ అమెరికా దేశపు గొప్ప విశ్వవిద్యాలయంగా మారింది. సంస్కృత ఆచార్య పీఠాన్ని ప్రారంభించిన (1854వ సంవత్సరం) తొలి విశ్వవిద్యాలయం కూడా ఇదే.

(– ''స్పాన్'' సౌజన్యంతో)

---

## కాగితపు కరెన్సీను వాడిన తొలి దేశం

*క్రీస్తుశకం ఏడవ శతాబ్దంలో చైనా కాగితపు కరెన్సీను వాడింది. బహుశా ఈ దేశమే కాగితపు కరెన్సీను వాడిన తొలిదేశం అవుతుంది.*

**''రాబోయే దురదుష్టాన్ని గురించి ఆలోచించేందుకు మించిన మూర్ఖత్వంతో కూడిన పని మరొకటి లేదు. చెడుమ అది రాబోయే ముందే రావచ్చునని భావించడం పిచ్చితనం అవుతుంది.'' – సెనెకా**

# వేమన వేదం

తాత్పర్య రచన: ఎమ్.వి.ఎస్. సుబ్రహ్మణ్యం

ఐదు వ్రేళ్ళ బలిమి హస్తంబు పనిచేయు
నందొక్కటియు వీడ బొందిక చెడు
స్వీయుడొకడు విడిన జెడుగదా పని బల్మి
విశ్వదాభిరామ! వినురవేమ!



(చేతికి ఐదు వేళ్ళూ ఉన్నప్పుడే నువ్వు చేయదలచిన పనిని సమర్థవంతంగా పూర్తి చేయగలవు. ఆ ఐదింటిలో ఏ ఒక్క వ్రేలు లోపించినా ఆహస్తం ఎందుకూ కొరగాదు. అలాగే మనలను ప్రాణ సమానంగా భావించి ప్రేమించే అప్తుడు ఒక్కడు వీడినా కార్యహాని జరగ డమే కాకుండా జీవితంలో అభివృద్ధి సాధించడం కూడా చాలా కష్టం అవు తుంది.)

మృగమదమ్ము చూడ మీద నల్లగనుండు
బరిఢవిల్లు దాని పరిమళంబు
గురువులైన వారి గుణము లీలాగురా
విశ్వదాభిరామ! వినురవేమ!



(చూడటానికి కస్తూరి నల్లగా ఉన్నా, దాని పరిమళము నలుదెసల వ్యాప్తి చెంద డంతో అందరి ప్రశంసలు పొందగలుగు తుంది. అలాగే విద్యాదానం చేసే గురువు కురూపి అయినప్పటికీ తన విజ్ఞాన గంధము వలన లోకంలో కీర్తి ప్రతిష్ఠలు పొందుతాడు.) ●

---

### సూర్యుడి నర్తనశాల

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన న్యూ మెక్సికోను సూర్యుడి నర్తనశాలగా భావిస్తున్నారు.

''చేసిన తప్పుడు పనులను గురించి చెప్పి పశ్చాత్తాప పడడం అన్నది మంచి పనికి శ్రీకారం చుట్టే మొదటి పని అవుతుంది.''

# సరసోకులు

## సృజనాత్మక శక్తిగల వ్యక్తి సహచరుడు

మౌనమే సృజనాత్మక శక్తిగల వ్యక్తి యొక్క ఉత్తమ సహచరుడు.



## తొలి రూపం

తొలి రూపాలు మనల్ని భ్రమలో ముంచేవిగా ఉంటాయి. వెంట్రుకలతో అసహ్యంగా కనబడే కాటర్ పిల్లర్ అందమైన సీతాకోక చిలుకగా మారుతుంది. కానీ అందమైన చిరుకప్ప (tadpole) అసహ్యమైన కప్పగా మారుతుంది.

## మీ క్షేమం కోసం దిగులు

మీ సంక్షేమం కోసం దిగులుపడే సంస్థ బీమా కంపెనీ. మీ తల్లిదండ్రుల కంటే కూడా మీ సంక్షేమం కోసం అది దిగులు పడుతుంది.

## నేరం చేసానన్న భావనే దండన

తప్పు చేసిన వ్యక్తిలో నేరం చేసానన్న భావనను కలుగజేయడమే అతనికి మీరు విధించే పెద్ద శిక్ష అవుతుంది.

## ప్రజలు చూడ్డానికి రానప్పుడు

ప్రజలకు తనను చూడడానికి రావలసిన అవసరం రానప్పుడు దాన్ని గురించి మంచిగా ఆలోచించే మంచితనం ఏ డాక్టరుకూ ఉండదు.

---

## అటు కొళాయిలను సరిచేయడం కాదు ఇటు వేదాంతం కాదు!

*"నీటి కొళాయిలను, తొట్టిలను నైపుణ్యంతో సరిచేసే వ్యక్తి సమర్థుడు కాని వేదాంతి కంటే కూడా ఎక్కువగా ప్రశంసనీయుడు. నీటి కొళాయిలను సరిచేసే పనిని సంఘం గౌరవించదు. కారణం అది అంత గొప్ప పని కాకపోవడమే. అదే వేదాంతంలోని అపరిపక్వతను గౌరవిస్తుంది. కారణం అది గౌరవప్రదమైన పని కావడమే. ఈ విధమైన భావాలు కలిగిన సంఘంలో నీటి కొళాయిలను సరిచేసే పని రాణించదు, వేదాంత తత్వమూ ప్రశంసింపబడదు."* – జాన్ డబ్ల్యు. గార్డనర్

''తెలివి తేటలు ఉన్నంత మాత్రాన ఎవరూ రచయితలు కాలేరు. ప్రతి పుస్తకం వెనుక ఒక వ్యక్తి ఉన్నప్పుడే అతడు రచయిత అవుతాడు.'' – ఎమర్సన్

## భయం కారణంగా ఇచ్చే గౌరవం

గౌరవించబడడం కన్నా ప్రేమించబడడాన్ని నేను అభిలషిస్తాను. భయాన్ని కలిగించే వ్యక్తిగా కాకుండా గౌరవాన్ని పొందగల వ్యక్తిగా ఉండడం కోరుతుంటాను.



## నిజమైన ప్రేమ

అర్థం చేసుకోవడం అనే బలమైన పునాదిపై కట్టబడిన ఇల్లును నిజమైన ప్రేమ అంటారు.

## తొలి వ్యక్తి నడిచిన బాట

ఎవరూ నడవని మంచుబాటపై నడిచే వ్యక్తి కాలు దిగబడడం వల్ల బాధను అనుభవిస్తూ తన అడుగుజాడలను వదులుతాడు. ఆ తరువాత నడిచే వారికి ఆ బాట సుగమం అవుతుంది.

– టెంజిన్ వాంగ్యాల్

## మీలోని సంగీతం

మీలో సంగీతం ఉంది. దాన్ని వ్యక్తం చేసేందుకు కొన్ని వాద్యాల అవసరం ఉంది.

## అంతులేని ఆనందం

మితమైన కోరికలే అంతులేని ఆనందాన్ని ఇస్తాయి.

## విమర్శ

విమర్శకుల విమర్శను పట్టించుకోవద్దండి. ఏ విమర్శకుడి గౌరవార్థం ఇంతవరకు శిలా విగ్రహం ప్రతిష్ఠాపన జరగలేదు.  – జీన్ సెబిలియస్

## ఒక తోటకు చెందిన పూలు–పండ్లు

*. వందలకొలది కులాలకు చెందిన వ్యక్తులు ఈ దేశంలో నివసిస్తున్నారు. ప్రతి ఒక్కరు తమ కులం, తమ జాతి ఇతరుల కులం, జాతి కంటే భిన్నమైనది, అని ఆలోచించడం మొదలుపెడితే మనకు లభించిన స్వాతంత్ర్యానికి ఎలాంటి అర్థం ఉండదు. అందుకే ప్రతి ఒక్కరు తాము ఒకే తోటకు చెందిన పుష్పాలం, పండ్లం అని భావించాలి. మొత్తం తోట అందాన్ని పెంచుతూ తమ అందానికి కూడా మెరుగులు దిద్దుకుంటూ రావాలి. ఆ విధంగా వారు స్వాతంత్ర్యాన్ని అందరికీ ఉపయోగపడే విధంగా, లాభాలదాయకంగా ఉండేరీతిగా మార్చగలగాలి.*  – *రాజాజీ.*

''ఆలోచనలను నిగ్రహించడమే ఆత్మనిగ్రహం బాటపై మనం వేసే మొదటి అడుగు అవుతుంది.''

## దీన్ని తప్పనిసరిగా చేసిన పిల్లలకు

పియానిస్టూ హాస్యగాడూ అయిన విక్టర్ బోర్జ్ (Victor Borge) తన టెలివిజన్ కార్యక్రమం చివర్లో "ఈ కార్యక్రమాన్ని జరిగేలా చేసిన నా తల్లితండ్రులకూ, దీన్ని తప్పనిసరి కార్యక్రమంగా చేసిన నా ఐదుగురు పిల్లలకూ, నా ధన్యవాదాలు" అని అన్నాడు.

– జె. మౌరుస్ (పెద్దవారి మరపురాని సంఘటనల నుండీ)

## బంగారపు మౌనదారాలు

కొంత ఆత్మవైరాగ్యం, కొంత సానుభూతి పదాలు, మరీ అంతగా పేర్కొనదగని కొన్ని దయతో నిండిన పనులు, కొన్ని ఇష్టమైన ఆకర్షణలపై పొందిన, మౌన విజయాలూ – ఇవన్నీ కలిసి బంగారపు మౌన దారాలవుతాయి. ఈ దారంతో వాటినన్నిటిని కూర్చినప్పుడు అవి భగవంతుడు అంగీకరించిన జీవిత విధానంను కాంతులలో వెలిగేలా చేస్తాయి. – ఎఫ్. డబ్ల్యు. ఫరార్

## మీ కష్టాలను ప్రచారం చేస్తే...

మీ కష్టాలను ప్రకటించుకోకండి. కారణం వాటిని కొనేవాడు ఒక్కడు కూడా ఉండడు.

## దేశభక్తిగల కవయిత్రి – శ్రీమతి సరోజిని నాయుడు




*భారతమాత సేవలో ప్రాణాల్ని పణంగా పెట్టేందుకు కావలసిన స్ఫూర్తినిస్తూ వేలాది ప్రజల హృదయాలలో దేశభక్తి దీపాల్ని వెలిగించిన వ్యక్తి శ్రీమతి సరోజిని నాయుడు దేశభక్తిగల కవయిత్రి. కాంగ్రెస్ మహామహులైన నెహ్రూ లేదా వల్లభబాయి పటేల్ కూడా అప్పటి వరకు పొందని గౌరవాన్ని ఈమె 1925వ సంవత్సరంలో పొందింది. ఆ సంవత్సరం ఈమె కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఎన్నుకోబడింది. తన సమాధిపై "ఈమే దేశ యువతను ప్రేమించింది" అన్న మాటలు రాయాలని ఆమె తన వారిని కోరింది. దేశ యువత మాత్రమే కాదు దేశప్రజలందరూ ఈమెను గౌరవించారు, ప్రేమించారు. ఆమె వ్యక్తిత్వం, కవిత్వం, అన్నింటిని మించిన ఆమె ఉపన్యాస ధోరణి అందరినీ సమ్మోహితుల్ని చేసింది. అందరినీ ఈమె ప్రభావితం చేసింది.*

– జె.వి. వాసాని

# జంతువుల వాస్తవాలు

★ ప్రాచీన కాలపు సంకరజాతి కుక్కను అఫ్ఘాన్ వేటకుక్క (Hound) అంటారు. ఏసుక్రీస్తుకు కొన్నివేల సంవత్సరాల క్రితమే ఈజిప్ఠ్‌వాసులు ఈ రకం సంకరజాతి కుక్కను మొదట్లో గుర్తించారు.



BEAVER

★ ఎలుకజాతికి చెందిన బీవర్ (Beaver) అనే ఉభయచరం చాలా తెలివైనది. ఇది చెట్లను పడగొట్టి మొద్దు ఆకారాన్ని తీర్చిదిద్దగలదు. మొద్దులతో (logs) బంకమన్నుతో, నీటిని నిలిపేకళ, మొదలైన నిర్మాణాత్మకమైన పనులు వీటి సాంకేతిక పరిజ్ఞానానికి అద్దం పడతాయి.

★ కాలగర్భంలో కలిసి కనుమరుగు కాకుండా ఇంకా కొనసాగుతున్న అతి ప్రాచీనమైన ఇంగ్లీషు జాతికుక్కలను మస్టిఫ్ (Mastiff) అంటారు. ఈ ప్రపంచపు అతి ప్రాచీనమైన సంకరజాతి కుక్కలుగా ఈ మస్టిఫ్స్ కుక్కలు పరిగణించబ



Mastiffs

## కదిలిపోయే హిమఖండంపై ఏర్పాటు చేయబడిన తొలి విజ్ఞాన కేంద్రం

*ఐస్‌లాండ్ వంశీకులకు చెందిన విల్‌హజల్మర్ స్టెఫాన్సన్ (Vilhjalmur Stefansson -1879 -1962) అనే అమెరికన్ మానవ శాస్త్రజ్ఞుడు 1918వ సంవత్సరంలో కదలిపోయే హిమఖండంపై తొలి విజ్ఞాన కేంద్రాన్ని ఏర్పాటు చేసాడు. బ్యూఫోర్ట్ సముద్రం (Beaufort Sea)లో ఈ కేంద్రం 400 మైళ్ళకు మించిన దూరం వరకు తేలుతూనే పోయింది.*

"ఇచ్చే వస్తువు కంటేకూడా ఆ వస్తువును ఇచ్చే విధానమే దాత గుణానికి అద్దం పడుతుంది."
— లవటర్

డుతున్నాయి. మంచి తెలివితేటలు బలం కారణంగా ఇవి మంచి కాపలా కుక్కలుగా ప్రసిద్ధిని పొందాయి.




★ రాత్రిపూట మాత్రమే చురుగ్గా ఉండే గుడ్లగూబలకు అపారమైన వినికిడి శక్తి, బలమైన కంటి చూపు ఉంటుంది. ఇది రెండు మనిషి కంటే కూడా గుడ్లగూబకు 35 మొదలు 100 రెట్లు ఎక్కువ ఉంటుంది.

★ సగం మనిషి ఆకారంతోనూ, సగం తోకలేని కోతి (ape) ఆకారంతోనూ మనదేశపు హిమాలయా ప్రాంతాలలో సంచరించే పౌరాణిక మంచు మనిషిని (abominable) యతి (Yeti) అంటారు.

– సేకరణ: వి.వి. కుమార్ ('ది వెటిరినేరియన్' సౌజన్యంతో)

# ఆణిముత్యాలు

★ విజయాన్ని సాధించిన వారిని గురించి అసూయ చెందనంతవరకు ప్రపంచంలోని ఏ ఒక్క వ్యక్తి పూర్తిగా పరాజితుడు కాలేడు.

★ లక్ష్యం నుండీ మీ దృష్టిని మరలించినప్పుడే అవరోధాలు మీ మార్గాన్ని అడ్డుకుంటాయి.



★ ఆశావాది ఆశీస్సులను లెక్కపెడితే, నిరాశావాది ఆశీస్సులను తోసి పుచ్చుతుంటాడు.

★ తేలికైన బాధ్యతల కోసం ప్రార్థించక బలమైన బరువు మోసే వీపుకై ప్రార్థించండి.

★ మంచిని ఆశించండి. అయితే చెడును ఎదిరించేందుకు కూడా తయారుగా ఉండండి.

★ పిల్లలు ప్రశ్నలు అడగడం ప్రారంభించినప్పుడే పెద్దలకు తమకు ఏమాత్రం తెలియదో తెలిసి వస్తుంది.

★ మంచి ఉదాహరణ చాలా చెడు సలహాలను అధిగమించగలదు.

★ ఇతరులను మనం గౌరవించని పక్షంలో వారు మనతో ఏకీభవిస్తారని ఆశించరాదు.

"చిన్న చిన్న ఖర్చుల నుండీ జాగ్రత్తగా ఉండండి. చిన్న చిల్లు పెద్ద ఓడ మునిగిపోయేందుకు కారణం అవుతుంది" – ఫ్రాంక్లిన్

# సమసిపోని సంఘటనలు

## అందరూ వేనోళ్ళ పొగడిన న్యాయనిర్ణయం

సదానంద మొహంతి

అది 1767వ సంవత్సరం. మైసూరు సంస్థానం పాలకుడు తన సిబ్బందితో సహా ఒక పెద్ద పట్టణం గుండా వెళ్ళడం జరిగింది వారిలో న్యాయంకోసం




అందర్ని అర్థిస్తున్న ఒక ముసలి స్త్రీ ఆ రాజు కంటబడింది. ఆమె పిర్యాదును అతడు వెంటనే విన్నాడు. రాజు మాజీ ''ఖాస్ జమీందార్'' తన కూతురును ఎత్తుకుపోయాడని ఆమె పిర్యాదు చేసింది. ఆ మాజీ ఖాస్ జమీందార్ ఇప్పటికి ఒక నెల క్రితం ఆ స్థలం నుండీ వెళ్ళిపోయాడని ఆమెకు చెబుతూ ఇంతకుముందే ఈ విషయాన్ని తన దృష్టికి ఎందుకు తేలేదని కూడా ఆ ముసలామెను రాజు అడిగాడు.

ప్రస్తుతం ఖాస్ జమీందారుగా ఉంటున్న వ్యక్తికి తన పిర్యాదును అంద జేసానని ఆమె తన దుఃఖాన్ని తెలియజేసింది. అయినా తన పిర్యాదుపై ఎలాంటి చర్య తీసుకోబడలేదని కూడా ఆమె తెలియజేసింది. అక్కడే ఉన్న ఆ

---

## విషపూరితమైన గొంగళి పురుగులను తినే పక్షులు

*ఆహారం కోసం ఇతరులపై ఆధారపడే వారి నుండి తమను తాము రక్షించుకునేందుకు భూమిపై తిరిగే విషపూరిత గొంగళి పురుగులను అమెజోనియన్ (Amazonian) అరణ్యాలకు చెందిన పక్షులు తింటాయని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. చింపాంజీలు ఉదయం లేస్తూనే అస్పిల్లా (Aspilla) ఆకులను తింటాయని తెలుసుకున్నారు. ఈ ఆకులకు ఫంగల్, వైరల్, పారాసైటిక్ కాంపౌండులకు విరుద్ధంగా పనిచేసే విరుగుడు గుణం ఉన్నట్లు శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు.*

*(– 'డౌన్ టు ఎర్త్' సౌజన్యంతో)*

''తుఫానులో ప్రశాంతతనూ, ప్రయత్నంలో నెమ్మదినీ ప్రదర్శించి ఆత్మ సమర్పణలో ఆనందాన్ని పొందండి.''

ఖాస్ జమీందారు ఆ తల్లీకూతుళ్ళ నడత మంచిదికాదని రాజుతో చెప్పాడు.

ఆ ముసలామెను తనతో కూడా తీసుకుని రాజు తన భవనానికి తిరిగి వెళ్ళిపోయాడు. తన కంటిముందే ఆ ఖాస్ జమీందారు 200 కొరడా దెబ్బలు శిక్షను అమలు జరిపించాడు. ఆ తరువాత ఒక రౌతును మాజీ ఖాస్ జమీందారు ఇంటికి పంపాడు. ఆ రౌతు ద్వారా ఆ ముసలామె కూతురును ఆమెకు అప్పగించమని ఉత్తరువు వేసాడు. అంతేకాదు ఆ ముసలామె కూతురు ఆ మాజీఖాస్ జమీందార్ ఇంట్లో ఉన్నట్లైతే అతడి తలను నరికి తన వద్దకు తీసుకు రావలసిందిగా కూడా ఆజ్ఞను అతడు జారీ చేసాడు. ఆ ముసలామె కూతురు అక్కడ లేనిపక్షంలో అతడిని బంధీ చేసి తన ముందుకు తీసుకు రావల్సిందిగా ఆ రౌతుకు ఆదేశం ఇచ్చాడు. ఆ మాజీ ఖాస్ జమీందారు ఇంటికి పోయిన ఆ రౌతుని కొన్ని రోజుల తరువాత ఆ మాజీఖాస్ జమీందార్ తలను తెచ్చి రాజు ముందు ఉంచాడు.

న్యాయంపట్ల అతనికి ఉన్న ప్రేమ, గౌరవం కారణంగా అతడు మంచి పేరు ప్రఖ్యాతులను పొందాడు. నేరస్తుల మనసులో భయాన్ని రేకెత్తించేందుకు అతడు దోషులను శిక్షించాలన్న పట్టుదలను కనబరచాడు.

మైసూరు సంస్థానపు ఆ రాజు పేరు హైదర్ అలీ. అతడొక అద్భుతమైన వ్యక్తి న్యాయంపట్ల అతనికి ఉన్న ప్రేమ కారణంగా అతడు ప్రజల మన్ననలను, ప్రశంసలను విరివిగా పొందగలిగాడు

## విచిత్రంగా చూడబడుతున్న అతి దృఢమైన భవనం




అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని మెస్సాచుసెట్స్‌కు చెందిన బోస్టన్ నగరంలోని జాన్ హన్‌కాక్ టవర్ (John Hancock Tower) నగరంలోని ముఖ్యమైన కేంద్రాల నుండి. చూచినప్పుడు ఆకాశంకు పట్టిన రెండు ఘన పరిమాణాల అర్థంగా కనిపిస్తుంది. ఇది నిజంగానే విచిత్రంగా చూడబడుతున్న అతి దృఢమైన భవనం. సుప్రసిద్ధ గృహనిర్మాణ శిల్పి ఐ.ఎం. పై (I.M.Pei) దీన్ని నిర్మించాడు.

''భగవంతుడు ఎక్కడో స్వర్గంలో లేడు. అతడు నీలోనూ, నాలోనూ ఉన్నాడు.'' – రోస్ పాల్

# ఈ శతాబ్దంలో

## భారతదేశపు తొలి తాత్కాలిక ప్రభుత్వం




1946వ సంవత్సరం సెప్టెంబరు నెల 2వ తారీఖున ఏర్పాటైన భారతదేశపు తొలి తాత్కాలిక ప్రభుత్వానికి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వం వహించాడు.

## భారతదేశంలో తయారైన తొలి కారు

కలకత్తాకు చెందిన హిందుస్థాన్ మోటార్స్ లిమిటెడ్ వారు 1944-45 ఆర్థిక సంవత్సరంలో "హిందూస్థాన్ 10" అన్న పేరుతో ఒక కారును తయారు చేసారు. ఇదే మనదేశంలో తయారైన తొలి కారు.

## తొలి లీసింగ్ కంపెనీ

1973లో భారతదేశపు తొలి లీసింగ్ కంపెనీ 'ది లీసింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్' అన్న పేరుతో చెన్నై నగరంలో స్థాపించబడింది.

## తొలి ప్రాంతీయ గ్రామీణ బాంకులు

1975వ సంవత్సరం అక్టోబరు నెల 2వ తారీఖున గాంధీ జయంతి రోజున-మనదేశంలో తొలి ప్రాంతీయ గ్రామీణ బాంకులు ఉత్తర ప్రదేశ్‌కు చెందిన మొరాదాబాద్, గోరఖ్‌పూర్‌లలోనూ, పశ్చిమ బెంగాల్‌కు చెందిన మాల్డా (Malda)లోనూ, రాజస్థాన్‌కు చెందిన జైపూర్‌లోనూ, హర్యానాకు చెందిన భివానీలోనూ ఏర్పాటు అయ్యాయి.

---

స్పెయిన్ ప్రధాన రహదారి లాగా...

*స్పెయిన్ దేశపు కోస్టా బ్రవ (Costa Brava) ప్రధాన రహదారిని నమూనాగా తీసుకుని కలకత్తా, కన్యాకుమారిలను కలిపే తూర్పుకోస్తా ప్రధాన రహదారిని నిర్మించడం జరిగింది.*

## ఔట్ కాకుండా గారీ సోబర్స్ సాధించిన పరుగులు




**1958వ సంవత్సరం మార్చి నెల 2వ తారీఖున జమైకా (Jamaica) లోని కింగ్‌స్టన్ వద్ద పాకిస్తాన్ జట్టుతో ఆడుతున్నప్పుడు వెస్ట్ ఇండీస్‌కు చెందిన గారీ సోబర్స్ (Gary Sobers) ఔట్ కాకుండా 365 పరుగులను సాధించాడు.**

## స్వతంత్ర భారతదేశపు తొలి తాత్కాలిక ప్రభుత్వం

స్వతంత్ర భారతదేశపు తొలి ప్రభుత్వాన్ని సింగపూర్‌లో శ్రీ నేతాజీ సుభాష్ చంద్రబోస్ 1943వ సంవత్సరం అక్టోబరు నెల 21వ తారీఖున స్థాపించాడు.

## గోవా విమోచనం

450 సంవత్సరాలకు పైగా పోర్చుగీసు వారి పరిపాలనలో ఉన్న గోవా, డామన్, డియూ ప్రాంతాలను భారతీయసేనలు 1961వ సంవత్సరం డిసెంబరు నెల 19వ తారీఖున స్వాధీనం చేసుకున్నారు.

## ఫారో రాజవంశానికి చెందిన శిలా విగ్రహాలు

ఈజిప్టుకు చెందిన పురాతత్వ శాస్త్రజ్ఞులు ఫారో రాజవంశానికి చెందిన ఐదుమంది వ్యక్తుల నిలువెత్తు శిలా విగ్రహాలను 1989వ సంవత్సరం జనవరి నెల 30వ తారీఖున కనుగొన్నారు. ఈజిప్ట్ పైభాగంలోని లక్సర్ దేవాలయం వద్ద జరిపిన త్రవ్వకాలలో క్రీ పూ. 1470కు చెందిన ఈ శిలావిగ్రహాలు బయటపడ్డాయి.

## మహిళలకు తొలిసారిగా ఓటు హక్కు

ఐరోపాలోని లిచెస్టెన్‌స్టెన్ (Liechstenstein)లో మహిళలకు ఓటు హక్కు తొలిసారిగా 1986వ సంవత్సరం

---

### భగవంతుని ఆలోచనలు

*గొప్పగా పేరుకున్న భగవంతుని*
*ఆలోచనలే పర్వతాలు.*
*విశాలరూపం దాల్చిన అతడి*
*ఆలోచనలే మహాసాగరాలు.*
*విరబూసిన అతడి ఆలోచనలే పుష్పాలు.*
*స్వాతి నక్షత్రపు హిమ బిందువులే అతడి*
*ఆలోచనల ముత్యాలు. - సామ్ జేమ్స్*

''ప్రతి మంచి సలహా మొదట్లో ఆచరణ యోగ్యంగా ఉండదు. ప్రతి గొప్ప పని మొదట్లో అసంభవంగా ఉంటుంది.''

ఫిబ్రవరి నెల 2వ తారీఖున ఇవ్వబడింది.

## మాస్కో నగరపు భూగర్భ రైల్వే

1935వ సంవత్సరం ఏప్రిల్ నెల 23వ తారీఖున అప్పటి రష్యా అధినేత స్టాలిన్ మాస్కో నగరంలో భూగర్భ రైల్వేను ప్రారంభించాడు.

## అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా విమానాన్ని నడిపిన తొలి మహిళ

1928వ సంవత్సరపు జూన్ నెల 18వ తారీఖున అట్లాంటిక్ మహాసముద్రంపై విమానాన్ని నడిపిన తొలి మహిళ. అమీలియాఎర్‌హర్ట్ (Amelia Earhart) బ్రిటన్‌లోని వేల్స్‌లో తన ఇద్దరు సహచరులతో సహా ఈమె ఆ రోజు సురక్షితంగా దిగింది.

## నార్వే దేశపు తొలి మహిళా ప్రధానమంత్రి

1981వ సంవత్సరపు ఫిబ్రవరి నెల 1వ తారీఖున నార్వేకు చెందిన గ్రో హార్లెం బ్రుండ్‌లాండ్ (Gro Harlam Brundland) ఆ దేశపు తొలి మహిళా ప్రధానిగా ఎన్నిక అయింది.

## ఇజ్రాయిల్ దేశపు తొలి స్టాంపు

తన తొలి తపాలా బిళ్ళలను అరబిక్ హీబ్రూ భాషలలో ముద్రించి ఇజ్రాయిల్ వారు 1948వ సంవత్సరంలో విడుదల చేసారు. అప్పట్లో ఈ దేశం పాలస్తీనాగా పిలువబడేది.

## భారతదేశపు తొలి రబ్బరు ఎస్టేటూ, తొలి కంపెనీ

కేరళ రాష్ట్రపు తొడుపుళా (Thodupuzha)లో శ్రీ పి. జాన్ మలంకరా రబ్బర్ అండ్ ప్రాడక్ట్స్ కంపెనీ అన్న పేరుతో 1910వ సంవత్సరంలో ఒక సంస్థను స్థాపించాడు. ఇదే భారతదేశపు తొలి రబ్బరు ఎస్టేటూ, ఇదే తొలి కంపెనీ కూడా. ●

### జీవితం ఒక యాత్ర

*జీవితం ఒక రైలు ప్రయాణం లాంటిది.*
*రెండు కిటికీల వద్ద ఇద్దరు తోటి*
*ప్రయాణీకులు ఉంటారు.*
*నేను మీ పక్కనే యాత్ర చేస్తున్నంతసేపు*
*మీరు కూర్చోవచ్చును.*
*లేదా నేనెవరినో తెలియకుండానే మరో*
*చోటు కూడా కూర్చోవచ్చును.*
*కానీ మనం కలిసి ప్రయాణం చేయాలని*
*రాసి ఉంటే మాత్రం*
*సంతోషంగా ప్రయాణం చేద్దాం. ఇది*
*కొంతదూరం ప్రయాణం మాత్రమే.*

''అసంతోషాన్ని, మన తెలివితేటలకు మన నిరీక్షణలకు మధ్య ఉన్న భేదంగా నిర్వచించవచ్చును ''
– ఎడ్వర్డ్ డి బానో

# ఊహాశక్తి తేగల మేలు

పి. సుధాకర్

సుప్రసిద్ధ గణిత శాస్త్రజ్ఞుడూ, భౌతిక శాస్త్రజ్ఞుడూ అయిన ఆర్కిమెడీస్ స్నానాల టబ్బులో స్నానం చేస్తున్నాడు నీళ్ళ టబ్బులో అతడు మునిగినప్పుడు నీళ్ళు పొర్లి కిందపడ్డాయి. అంతే, టబ్బు



నుండీ అమాంతంగా బయటపడి ఉన్నపళంగా తాను గుడ్డలు వేసుకోలేదన్న విషయాన్ని మరిచి - రాజవీధులలో పరుగెత్తసాగాడు. నీళ్ళతో నిండిన టబ్బులో అతడు దిగినప్పుడు నీళ్ళు పొర్లి కిందపడగానే అతడి బుర్రలో ఒక ఊహాశక్తి మెరిసింది. పూర్తిగా నిండిన టబ్బులో తాను మునిగినప్పుడు పొర్లి బయటపడ్డ నీటి బరువు తన బరువుకు సమానంగా ఉండగలదన్న ఊహాశక్తి అతనికి తట్టింది.

అతడి కంటే కూడా ముందు ఎంతో మంది స్నానాల టబ్బులలో స్నానం చేసారు. అప్పుడు కూడా నీళ్ళు ఒలికి కిందపడ్డాయి. కానీ ఆర్కిమెడీసుకు తట్టిన ఆలోచన ఎవరికీ తట్టలేదు.

న్యూటన్ మహాశయుడు ఆపిల్ చెట్టుకింద కూర్చున్నాడు చెట్టుపై నుండీ ఒక ఆపిలు పండు కిందకు పడింది పైకి పోకుండా ఆపిల్ కిందకు ఎందుకు పడిందన్న ఊహ శక్తి అతనికి వచ్చింది. ఆ ఊహాశక్తి కారణంగానే అతడు భూమికి ఆకర్షణశక్తి ఉందన్న విషయం తెలుసుకోగలిగాడు.

పుట్టిన ప్రతి శిశువు ఒక మంచి నాటక రచయితనీ, గాయకుడనీ, కళాకారుడనీ, ఇంజినీరనీ - మన వైజ్ఞానికులు అంటున్నారు. కానీ అతని ఊహలు ఎలా పోషింపబడుతాయన్న దానిపైనే లేదా ఆ

---

### జీవితాన్ని అందంగా తీర్చిదిద్దేందుకు

ఇంద్రధనుస్సు నిర్మాణానికి వాన ఎండా రెండింటి అవసరం ఉంటుంది. అదేవిధంగా జీవితాన్ని అందమైన ఇంద్రధనుస్సులా తీర్చిదిద్దేందుకు సుఖదుఃఖాల కలయిక కూడా అవసరం. - జెపి. వాస్వాని

'ఆత్మకథలు రచయితల జ్ఞాపకశక్తిని తప్ప అతనిలో ఉన్న ఏ చెడును సాధారణంగా వెల్లడించవు''
- ఫ్రాంక్లిన్ పి. జోన్స్

వ్యక్తి తల్లితండ్రులు ఇచ్చే ప్రోత్సాహంపైనే అతడి భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. 'కాదు' 'చేయకు' అన్న రెండు మాటలనే మన పిల్లలు మన వద్ద నుండీ సాధారణంగా వింటుంటారు. మన పిల్లలకు తమతమ ఊహలను మెరుగుపరుచుకునే అవకాశం మనం ఇవ్వకపోయినా పరవా లేదు. కనీసం 'కాదు', 'చేయకు' అని మాత్రం చెప్పకుండా ఉండాలి.

ఈ రోజు మనం అనుభవిస్తున్నవన్నీ ఎవరో ఒకరి ఊహాశక్తి ఫలితాలే. ఉదాహరణకు మణికట్టుపై మనం కట్టుకునే ఎలక్ట్రానిక్ చేతి గడియారాలనూ, మన తలలపై గిర్రున తిరుగుతూ మనకు చల్లదనాన్ని ప్రసాదిస్తున్న ఫానునూ తీసుకోండి. ఈ వస్తువులు మనకు మన తోటి మానవుల ఊహాశక్తి ఫలితంగానే దక్కాయి.

మూడు పరిశీలనలను పేర్కొని నా వ్యాసాన్ని ముగిస్తాను.

★ మన చుట్టూ ఉన్నదాన్ని పరిశీలిస్తూ మనకున్న ఊహాశక్తిని పదును పెట్టుకుందాము.

★ మన దగ్గర పనిచేసేవారు తరచుగా కొన్ని సలహాలను ఇస్తుంటారు. సలహా అన్నది ఊహాశక్తి కారణంగానే వస్తుంది. మన కారణాల వల్ల మనం ఇతరుల సలహాలను పాటించము. కానీ సలహాలను వినడంలో ఎలాంటి తప్పు లేదు. అలా వినడం వల్ల వారు తమ ఊహాశక్తిని మరింత పెంచుకోగలరు.

నేటి బాలురే రేపటి పౌరులు. 'కాదు', 'కూడదు' అన్న మాటలను వారిపట్ల మనం ఎంత తక్కువగా వాడగలమో అంత తక్కువగా వాడుదాము. అప్పుడే వారు తమ ఊహాశక్తిని పెంపొందించుకోగలరు. ●

## మీ కర్తవ్యాన్ని నిజాయితీగా పాటించండి




ఒకసారి ఒక యువకుడు స్వామి వివేకానందను సందర్శించి "నేను నా దేశానికి సేవ చేయదలచుకున్నాను – నన్ను ఏమి చేయమంటారు?" అని ప్రశ్నించాడు. ఆ యువకుడు చేస్తున్న పనిని గురించి స్వామీజీ అడిగాడు. "చదువుకుంటున్నాను" అని ఆ యువకుడు సమాధానం ఇచ్చాడు. ఆ మాట విన్న స్వామిగారు "అయితే శ్రద్ధాసక్తులతో నీ చదువును కొనసాగించు అదే దేశం పట్ల నీవు నిర్వహించగల కర్తవ్యం అవుతుంది" అన్నాడు.

"మీ కోటు మొదటి బొత్తామును తప్పుగా వేసుకుంటే మొత్తం అంతా తప్పవుతుంది."

– బ్రూనో

# ఇతరులను శ్రద్ధగా వినడం

వినడం అన్నది మన మందరం మర చిపోయిన కళ. ''మీ నాలుకలను కాదు చెవులను నాకివ్వండి'' అని షేక్స్పియర్ సెలవిచ్చాడు. మనలో చాలామంది వింటున్నామే కానీ శ్రద్ధగా వినడం లేదు.



శ్రద్ధాసక్తులతో వినడాన్ని ఆక్స్‌ఫర్డ్ నిఘంటువు సంపాదకుడు లిజనింగ్‌గా అభివర్ణించాడు. మన మిత్రులతో, మన సహోద్యోగులతో మాట్లాడుతున్నప్పుడు మరో ప్రపంచంలో ఉంటూ, వారి నుండీ మైళ్ళ దూరం వెళ్ళిపోతున్నాము.

మంచి సంభాషణా చతురుడు సాధారణంగా శ్రద్ధగా వింటుంటాడు. అవతలి వాడు చెబుతున్న విషయాన్ని శ్రద్ధగా వినడం అన్నది చాలా ప్రధానమైన విషయం.

శ్రద్ధగా వింటున్నప్పుడు మీ మనసును ఆ విషయంపై కేంద్రీకరించండి. యజమాని మాటలను శ్రద్ధగా విన్న మేనేజరు మంచి నిర్ణయాలను తీసుకోగలడు.

బాగా వినడం వల్ల కొత్త విషయాలను తెలుసుకోవడంతోపాటు మంచి సంబంధాలను నెలకొల్పుకోవడం అనే లాభం కూడా కలుగుతుందని నిపుణులు అంటున్నారు.

(ఎం.ఎం.ఏ. బుల్లెటిన్) ●

## మూడు రకాల మనుషులు

ఈ ప్రపంచంలో మూడు రకాల మనుషులు ఉన్నారు మొదటిరకంవారు రాతిపై చెక్కిన అక్షరాలవంటివారు. వీరికి త్వరగా కోపం వస్తుంది. అంతేకాదు చాలా కాలం వరకు వీరుకోపంగానే ఉంటారు. రెండవరకం మనుషులు ఇసుకపైన రాసిన అక్షరాల వంటివారు. వీరు కూడా కోపానికి గురి అవుతుంటారు. కానీ వీరి కోపపూరిత ఆలోచనలూ చడీ చప్పుడు లేకుండా సమసిపోతుంటాయి. పారే నీటి పైన రాత లాంటి వారిని మనం మూడవ తరగతి మనుష్యులుగా గుర్తించాలి. కదిలే మెదిలే ఆలోచనలను గురించి వీరు పట్టించుకోరు వీరు తిట్లనూ, గుసగుసలనూ గురించి అసలు పట్టించుకోరు వీరి మనసు పవిత్రంగా, ప్రశాంతంగా ఉంటుంది.

– బుద్ధుడి ఉపదేశాల ఆధారంగా

---

''ఆలోచనల ఉన్నత శిఖరం నుండీ జీవితపు నిజాలను గురించి ఆలోచించడమే ప్రార్థన అవుతుంది ''

– రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

# నవ్వు

## అడ్డదారి

కాలినడక బాటసారి (రైతుతో): ''ఈ పొలం గుండా అడ్డదారిలో పోతే నేను మూడు గంటల రైలును అందుకోగలనా?''

రైతు: ''తప్పకుండా! ఎద్దు నిన్ను తరుముకుని వస్తే నీవు రెండు గంటల ఎక్స్‌ప్రెస్ ట్రైన్‌ను కూడా అందుకోవచ్చు.''



నేను అతడితో 100 సంవత్సరాలు మాత్రమే పనిచేసాను!

ఒక బూటక వైద్యుడు (Quack) ఆయుష్షును ఎక్కువ చేసే మందును అమ్మేందుకు ప్రయత్నం చేస్తూ ''నా వైపు చూడండి. నేను ఎంతో ఆరోగ్యంగా ఉన్నాను. నా వయసు 200 సంవత్సరాలు మాత్రమే'' అని బిగ్గరగా అరవసాగాడు.

''మీ యజమానికి ఆయన చెబుతున్నంత వయసు ఉందంటావా?'' అని బూటక వైద్యుడితో కూడా ఉంటున్న ఒక యువకుణ్ణి ఒకతను అడిగాడు.

''నేను చెప్పలేను. నేను అతడి వద్ద గత వంద సంవత్సరాలుగానే పని చేస్తున్నాను'' అని ఆ యువకుడు సమాధానం ఇచ్చాడు.

---

## కుటుంబ జీవితం

నన్ను పెండ్లి చేసుకునేందుకు నా భార్యను ఒప్పించడమే నేను నా జీవితంలో సాధించిన అద్భుత విజయం. – విన్‌స్టన్ చర్చిల్

పిల్లల తల్లిని ప్రేమించడమే ఒక తండ్రి తన పిల్లల పట్ల చేయగల అతి ముఖ్యమైన పని అవుతుంది. – రెవరెండ్ థియోడర్ హెస్‌బర్గ్

తల్లితండ్రులు తమ పిల్లల మాటలను పాటించడం అన్న విషయమే నన్ను అమెరికాలో చాలా బాగా ప్రభావితం చేసింది.

– డ్యూక్ ఆఫ్ విండ్సర్

ప్రతి సాధన వెనుక గర్వాన్ని అనుభవించే ఒక తల్లిని, ముక్కుపైన వేలు వేసుకునే అత్తగార్ని చూడగలం. – బ్రూక్స్ హేస్

## రెండుసార్లు దుస్తులు మార్చుకోవాల్సి వచ్చింది

పోలీసు ఆఫీసరు: ''మూడు రాత్రులు వరుసగా ఒక అంగడిలో ఎందుకు దొంగతనం చేసావు?''

దొంగ ''నా భార్య కోసం ఒక చీరను దొంగిలించాను. దాన్నే రెండు సార్లు మార్చాల్సి వచ్చింది.''

## శాంతిని ప్రేమిస్తాను కాబట్టే యుద్ధానికి దిగాను

మొదటి సైనికుడు: ''సైన్యంలో నీవు ఎందుకు చేరావు?''

రెండవ సైనికుడు: ''నాకు భార్యలేదు కాబట్టి నేను యుద్ధాన్ని ఇష్టపడ్డాను. మరైతే నీ సంగతేమి?''

మొదటి సైనికుడు: ''నాకు భార్య ఉండేది. నేను శాంతిని ప్రేమించాను అందుకే యుద్ధానికి దిగాను.''

## ఎక్కువ ఉద్యోగాలు ఇవ్వడానికి!

విలేఖరి: భవిష్యత్తులో మరికొన్ని ఉద్యోగాలను ఇస్తున్నారా?

రాజకీయవేత్త: మరిన్ని ఉద్యోగాలను ఇవ్వాలన్న తలంపుతోనే మేము ఈసారి గింజలను కొలవకుండా లెక్కబెట్టే పద్ధతిని ప్రవేశపెడుతున్నాము.

## ఒక గోతిలో ఇద్దరు

ఒక సమాధిపై ''ఇందులో ఒక లాయరూ, నిజాయితీగల మనిషీ విశ్రమిస్తున్నారు'' అని రాసి ఉండడాన్ని రాజు గమనించాడు.

[illegible]




*''హిమనోయిడ్'' (Himanoid) రోబో P-2ను మొత్తం ప్రపంచంలో నిర్ణయాలు తీసుకునే తొలి రోబోగా భావిస్తున్నారు. ఈ రోబో 6 అడుగుల ఎత్తు ఉంటుంది. దీని బరువు 210 కి.గ్రా.లు ఉంటుంది. జపానులోని టోక్యో నగరానికి చెందిన హోండా మోటార్స్ కంపెనీ లిమిటెడ్ వారు దీనిని ప్రదర్శించారు.*

''ఇతరుల పరిస్థితులు మనకు మంచివిగా కనబడితే మన పరిస్థితులు ఇతరులకు మంచివిగా కనబడతాయి''
– పబ్లియస్ సైరుస్

వెంటనే కాస్తంత వెటకారంగానే "రోజులు మారిపోయాయి. ఇప్పుడు ఒకే గోతిలో ఇద్దర్నీ పాతి పెడుతున్నారని" అన్నాడు.

## అదిగో దాన్ని నేను తాకలేదు

తల్లి (కోపంతో): "ఉషా! నీ బీరువాలో పెట్టిన కేకులు ఎక్కడ మాయమయ్యాయి?"

ఉష: "నేను ఒకదాన్ని తాకలేదమ్మా!"

తల్లి: "నేను బయటికి వెళుతున్నప్పుడు నాలుగు కేకులను ఉంచాను. ఇప్పుడు ఒకటే ఉంది."

ఉష: "అవునమ్మా అదే నేను తాకనిది."

## కాని నా గన్నును మాత్రం దాచుకోగలిగాను!

పోలీసు ఇన్స్పెక్టరు: "అయితే మీ ఇంట్లో దొంగలు పడి డబ్బునూ, గడియారాన్ని దోచుకున్నారంటావు. మీగన్ను అప్పుడు మీ దగ్గర లేదా!"

ప్రతాప్: "భలేవారుసార్! నేను ఎంతో సామర్థ్యంతో దాన్ని దాచగలిగాను."

## ఇప్పుడు మనం పెండ్లి చేసుకోక తప్పదు

ప్రొఫెసర్ భార్య: "జార్జ్! ఈ రోజు ఏ రోజో నీకు తెలుసా? 25 సంవత్సరాల క్రితం ఈ రోజే మన నిశ్చితార్థం జరిగింది."

మతిమరపు ప్రొఫెసర్ భార్య మాటలు విని బిత్తరపోయాడు.

ప్రొఫెసర్: "25 సంవత్సరాలుగానా! అయితే విషయం నీవు నాతో ముందుగా ఎందుకు చెప్పలేదు! సరి ఇప్పుడు మనం పెండ్లి చేసుకోక తప్పదు."

## భక్తులే నాకు ప్రియమైనవారు



"దేన్నీ అభిలషించని వ్యక్తీ లోపల బయట పవిత్రంగా ఉండే వ్యక్తీ బుద్ధిమంతుడూ, పక్షపాత రహితమైన గుణమున్న వ్యక్తీ ఆకర్షణకు లొంగని వ్యక్తీ, తను చేస్తున్న పనుల కర్తవ్య బాధ్యతను త్యజించిన వ్యక్తే నిజమైన భక్తుడు. ఇటువంటివాడే నాకు ప్రియమైనవాడు."

– శ్రీకృష్ణుడు (భగవద్గీత)

# సామాన్యునికి న్యాయశాస్త్రం

## భారతీయ భాగస్వామ్యపు చట్టం 1932

(1932కు చెందిన ఆక్ట్ నెం.9)

## భాగస్వాములు ఆర్జించిన సొంత లాభాలు

జస్టిస్ జి. రాధాకృష్ణరావు

రెడీమేడ్ దుస్తుల టోకు వ్యాపారం కలిసి చేసేందుకు చిదంబరం, విశ్వనాథం, వెంకటకృష్ణయ్యలు ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. ముంబాయికి చెందిన అగర్వాల్ రెడీమేడ్ గార్మెంట్స్



అన్న సంస్థతో వారు తయారుచేసే దుస్తుల ఏకైక ఏజెంటుగా వ్యవహరించే ఒప్పందంపై మిగతా ఇద్దరు భాగస్వాముల తరపున మూడవ భాగస్వామి అయిన చిదంబరం సంతకం చేసాడు.

అగర్వాల్ రెడీమేడ్ గార్మెంట్స్ కంపెనీ వారు పార్ట్‌నర్‌షిప్ ఫర్మ్ వారికి ఇచ్చే రాయితీ (Discount)తో పాటు మొత్తం అమ్మకాలపై రెండు శాతం రాయితీ అదనంగా చిదంబరంకు ఇచ్చేందుకు ఒప్పుకున్నారు.

తనకు రావలసిన ప్రత్యేక కమీషన్ ఇవ్వవల్సిందిగా చిదంబరం తన ఇతర భాగస్వాములను కోరాడు. కానీ మిగతా ఇద్దరు భాగస్వాములు ఆ అదనపు రెండు శాతం రాయితీ కూడా ఆ పార్టనర్‌షిప్ ఒప్పందానికే చెల్లుతుందని వాదించారు. ఈ వివాదాన్ని ఎలా తీర్చాలి?

### మనదేశపు ప్రధాన రేవులు

*మనదేశంలో 11 ప్రధాన రేవులు ఉన్నాయి. వాటి పేర్లు: కలకత్తా, పరదీప్, విశాఖపట్నం, చెన్నై, తూత్తుకుడి - ఈ ఐదు తూర్పు కోస్తాలో ఉన్నాయి. పడమటి కోస్తాలో కొచ్చిన్, కొత్త మంగళూరు, మర్మగోవా, ముంబాయి, కాండ్లా, కొత్త ముంబాయి సమీపంలో న్హావా షేవా (Nhava Sheva)లు ప్రధాన రేవులు.*

''సంవత్సరాలు చర్మానికి ముసలితనాన్ని ఇస్తాయి కానీ ఉత్సాహాన్ని కోల్పోయినప్పుడు అది ఆత్మకు ముసలితనాన్ని ఇస్తుంది ''

**1932**వ సంవత్సరపు భారతీయ భాగస్వాముల చట్టం (Indian Partnership Act, 1932)లోని **16**వ సెక్షన్ ప్రకారం రెండు పార్టీల ఒప్పందం మేరకు (a) కంపెనీ లావాదేవీల కారణంగా ఒక భాగస్వామి సొంత లాభాన్ని ఆర్జించడం లేదా కంపెనీ సంపదను వాడిన కారణంగా లేదా కంపెనీ పేరుపై వ్యాపార సంబంధాన్ని కలిగి ఉంటే ఆ లాభాల లెక్కలు తెలియజేస్తూ కంపెనీ ఖాతాలో జమ చేయాలి (b) ఈ విధమైన వ్యాపారాన్ని ఒక భాగస్వామి చేస్తూ, కంపెనీతో పోటీపడితే దానికి లెక్కలు చూపుతూ ఈ వ్యాపారం కారణంగా వచ్చిన అన్ని లాభాలనూ కంపెనీకు కట్టాలి.

ఆ విధంగా భారతీయ భాగస్వాముల చట్టం, **1932**లోని **16**వ సెక్షన్‌లో (a) షరతు ప్రకారం తనపై విశ్వాసాన్ని ఉంచుతూ వారి తరఫున వ్యాపారపు ఒప్పందాలపై సంతకం చేసేందుకు పురమాయించడం వల్ల సొంత లాభంను ఆర్జిస్తే దాని లెక్కలు కంపెనీకు చూపాలి.

పైన చెప్పిన ఉదాహరణలో **2** శాతం లాభాలు కంపెనీ తరఫున జరిగిన ఒప్పందం కారణంగానే చిదంబరంకు లభించింది. అందువల్ల ఆ లాభాల వివరాలూ, లెక్కలూ అతడు కంపెనీకు తప్పకుండా ఇవ్వాలి. అంతేకాని అది తన సొంతం అని వాదించకూడదు.

తూర్పు పడమరల వారధి




*అటు ప్రాచీనతనూ, ఇటు ఆధునికతనూ విశ్వకవి రవీంద్రుడు జోడించేవాడు. తూర్పు పడమరల సమ్మేళన కారుడిగా కూడా ఇతడు గుర్తించబడ్డాడు.*

*ఆ రోజుల్లో ఆవరించిన సాహిత్యాంధకారంలో రవీంద్రుడు ఎత్తైన దీపస్తంభంగా ఉంటూ వెలుగునిచ్చాడు. ఆనాటి ప్రజల మనసునూ, హృదయాన్నీ ఇతడు వెలుగుతో నింపాడు. తూర్పు పడమరలను కలిపే వారధిగా ఇతడు పనిచేసాడు. బ్రిటిష్ ప్రభుత్వం చేత 'సర్' బిరుదును పొందిన దేశభక్తుడు ఇతడు. 1919లో జరిగిన జలియన్‌వాలా బాగ్ హత్యాకాండ తరువాత తన దేశభక్తి కారణంగా దీన్ని ఇతడు ప్రభుత్వానికి తిప్పి ఇచ్చాడు*

*– జెవి. వాస్వానీ*

''పేదవాడిగా కనబడుతూ లోభి ధనవంతుడు అవుతాడు. అదే దుబారా ఖర్చు చేసే వ్యక్తి ధనవంతుడుగా కనబడుతూ పేదవాడు అవుతాడు.''

# ఎగిరే కప్పలు, గోదురుకప్పలు

టి.ఎస్.ఎన్. మూర్తి

మన దేశంలో నీటిలోనూ, భూమిపైనా ఉండగల సుమారు 130 రకాల ఉభయచరాలు ఉన్నాయి. ఈ రకాలలో గెంతే కప్పలు, గోదురు కప్పలు కూడా ఉన్నాయి.



FROG

పొలుసు (Fin)ను చూసి చేపనూ, రెక్కలను చూసి పక్షులనూ, వెంట్రుకలను చూసి స్తన్య జీవులనూ మనం పసికట్టవచ్చును. కానీ, ఒక కప్పుని లేక గోదురు కప్పను కనుగొనడానికి పనికి వచ్చే ఒకే ఒక గుర్తు అంటూ ఏదీలేదు. తడి ప్రాంతాలలో లేదా తడిలో కప్పలు ఉంటాయి. అందుకనే వాటి చర్మం మృదువుగా, పలచగా ఉంటుంది. కానీ గోదురు కప్పలపై చిన్న దళసరి చర్మం పెరిగి ఉంటుంది. ఈ రకం కప్పలు నీళ్ళలో పూర్తిగా ఉండవు. అంతేకాకుండా గోదురు కప్పలు లావుగా

## రచయితల పేర్లతో చమత్కారం

★ అత్యంత సంతుష్టుడైన రచయిత – శామ్యూల్ స్మైల్స్.

★ అత్యంత ప్రచండ రచయిత – రాబర్ట్ బర్న్స్.

★ అత్యంత శీఘ్ర రచయిత – జొనాథన్ స్విఫ్ట్.

★ అత్యంత రంగుల (Colourful) రచయిత – జాన్ బ్రౌన్.

★ అత్యంత వాగుడుపిట్ట రచయిత – చాట్టర్టన్.

★ అతి ఎత్తైన రచయిత – హెచ్.డబ్ల్యు. లాంగ్‌ఫెలో.

★ అతి చల్లటి రచయిత – రాబర్ట్ ఫ్రాస్ట్

★ అత్యంత దప్పికగొన్న రచయిత – జాన్ డ్రింక్‌వాటర్.

★ అత్యంత ఆకలిగొన్న రచయిత – ఫ్రాన్సిస్ బేకన్.

★ అతి ధనవంతుడైన రచయిత – గోల్డ్ స్మిత్

★ అతి బలవంతుడైన రచయిత – థామస్ హార్డీ.

– జబల్ డి క్రజ్

"శాశ్వతమైన గాఢమైన కోరికలు నాలో ఉన్నందువల్ల ఆత్మశాశ్వతమని నేను నమ్ముతున్నాను"

– హెలెన్ కెల్లర్

ఉంటాయి. వీటికి వేగం ఉండదు. దీని చర్మంపై ఉన్న జిడ్డు లాంటి పదార్థం దీన్ని రక్షిస్తూ ఉంటుంది.

నూరు రకాలకు మించిన కప్పలు, గోదురు కప్పలు బహు విశాలమైన స్థానాల్లో నివసిస్తుంటాయి. గెంతేందుకూ (Leaping), బొరియలను తయారు చేసు



TOADS

కునేందుకూ, ప్రాకడానికి, చెట్లపై నివసించడానికి అనువైన ప్రత్యేక పరిసర ప్రాంతాలలో ఇవి నివసిస్తుంటాయి. తమ జాతికి చెందిన ఇతర కప్పల రకాల కంటే కూడా తమ సంఖ్య కారణంగానూ, విస్తృతంగా చాలా ప్రాంతాలలో ఇవి నివసించడం కారణం వల్లనూ, నిజమైన కప్పలు, గోదురు కప్పలు అధికారాన్ని చెలాయిస్తుంటాయి. కురచ శరీరం, పొడవైన, బలమైన వెనుక కాళ్ళ కారణంగా అన్ని కప్పలూ ఒకేలా కనబడుతుంటాయి.

ధారతో పాటు నీళ్ళను చిమ్ముతూ, నీటిలో మునిగేందుకు ముందు అనేక సార్లు గెంతుతూ పోయే కప్పలు నీళ్ళలో నివసించే సర్వసాధారణ కప్పల రకం. వీటి రంగు సీమ చెట్టు రంగు లేక గోధుమ రంగును పోలి ఉంటుంది. వీటి వీపుపై నల్లటి మచ్చలు పూసినట్లు ఉంటాయి.

---

## మర్ఫీ నియమం

*అన్ని మార్గాలు మూసుకుపోయినప్పుడు యజమాని సలహాను పాటించు.*

*చాలా తక్కువ పనిచేసే వాడికే గొప్ప గుర్తింపు వస్తుంది.*

*మీరు ఫైలు చేస్తే అది ఎక్కడుందో మీకు తెలుస్తుంది. కానీ దాని అవసరం మీకుండదు. మీరు ఫైలు చేయకపోతే దాని అవసరం మీకు ఉంటుంది. అయితే అది ఎక్కడుందో మీకు గుర్తుకురాదు.*

*మీరు తీరిగ్గా కాఫీ త్రాగడానికి కూర్చున్నప్పుడు మీ యజమాని ఏదో పని మీకు అప్పజెప్తాడు. ఆ పని ఆ కాఫీ ఆరిపోయేంత వరకు మీరు చేయాల్సి ఉంటుంది.*

*మీ వంతు వచ్చినప్పుడు అంతకు ముందున్న నియమాలన్నీ మారిపోతాయి.*

*మనిషి అమితకోపంతో చిందులు వేస్తున్నప్పుడు నవ్వుజెప్పడానికి ప్రయత్నించకండి.*

*సరైన దుస్తులను ధరించండి. అవి తమ పాత్రను బహు చక్కగా నిర్వహించగలవు.*

*(మర్ఫీస్ లా బుక్ నెం. 1 నుండీ సంగ్రహించబడి వి.ఆర్. నాగరాజ్ ద్వారా సంక్షిప్తీకరించబడింది)*

"మీ సేవకుల పట్ల అతి చనువుగా ప్రవర్తించకండి. మొదట్లో వారి ప్రేమను మీరు పొందుతారు కానీ చివర్లో అదే చులకన భావాన్ని కలుగజేస్తుంది." – ఫుల్లర్

సుమారు ఏడు అంగుళాలు పొడవు ఉండే ఇండియన్ బుల్‌ఫ్రాగ్ ఏకాంతాన్ని ప్రేమించే సిగ్గుపడే ప్రాణి. దాని ఆకారం, బలం, గొంతు కారణంగా



Indian bullfrog

దాన్ని ''బుల్‌ఫ్రాగ్'' (Bullfrog) అంటారు. చిన్న బల్లులనూ, కప్పలనూ, పాములనూ కూడా ఇది తింటుంది. బుల్‌ఫ్రాగ్, గ్రీన్‌ఫ్రాగ్ కప్పలు బాగా ప్రసిద్ధి కెక్కాయి. వాన కాలంలో గోల పెట్టే ఈ కప్పలు ఇక్కడి వారికి బాగా డబ్బును ఆర్జించి పెడుతున్నాయి.

ట్రీ ఫ్రాగ్ రకం కప్పలకు ఒక ప్రత్యేకత ఉంది. ఇవి నురుగుతో కూడిన గూళ్ళను పచ్చటి బయళ్ళలోనూ, అప్పుడే పుట్టిన చిన్న కప్పలు నేరుగా నీళ్ళలో పడేందుకు వీలుగా నీటిపైన వేలాడే విధంగా గూళ్ళను కట్టుకుంటాయి. నీళ్ళలో పడిన తరువాత ఆ చిన్న కప్పలు (Tadpoles) మరింత ఎదుగుతాయి. వాటి ఎదుగుదలకు ఈ నీటిపైన గూళ్ళు సహాయపడుతాయి.

మలబార్ ట్రీ ఫాగ్ (కప్పలు) ఎగిరే కప్పలనే కృత్రిమమైన పేరును సంపాదించాయి. మంచి అల్లిక గల వీటి పాదాలు పారాచూట్‌లా పనిచేయడం వల్ల చెట్లనుండీ ఈ రకం కప్పలు 15 గజాల దూరాన్ని ఏటవాలుగా జారుతాయి. చీమలను తినే ఇరుకునోరు గల

---

### ఉత్తములు – అధములు

ఉత్తములు ఏది సరైందో దాన్ని అర్థం చేసుకుంటారు.

అధములు ఏది లాభదాయకమో దాన్ని అర్థం చేసుకుంటారు.

ఉత్తములు సుగుణాలను అభిలషిస్తారు.

అధములు ఆస్తిపాస్తులను కోరుతారు.

ఉత్తములు ఆంక్షలను గురించి ఆలోచిస్తారు.

అధములు వ్యక్తిగత ఉపకారాన్ని గురించి ఆలోచిస్తారు.

ఉత్తములు తమనుంచే ఎక్కువ రాబట్టుకోవాలనుకుంటారు.

అధములు ఇతరులనుండీ రాబట్టుకోవాలనుకుంటారు.

మంచిని సాధించడానికి ఉత్తములు పాటుపడతారు. చెడును చేయడానికి తలపెట్టరు.

కానీ అధములు దీనికి విరుద్ధంగా ఆలోచిస్తారు.

– కన్ఫ్యూసియన్

''భగవంతుడు మనకు చెవులను, రెండు కళ్ళను, ఒక నోరును మాత్రం ఇచ్చాడు. మనం ఎక్కువగా చూస్తూ వింటూ తక్కువగా మాట్లాడాలన్నదే ఆయన ఉద్దేశం.''

– సోక్రటీస్

కప్పలు ప్రపంచపు ఉభయచరాలలో (Amphibians) చాలా అందమైనవి.

వెనుక కాళ్ళను పారలాగా (Shovel) వాడే బొరియలు చేసే కప్పలు మెత్తటి భూమిలో ఒక అడుగులోతు బొరియలను చేసుకుంటాయి. ముక్కు చివర వాడిగా పొడవుగా వ్యాపించిన కొమ్ములాంటి చర్మం కారణంగా హిమాలయ ప్రాంతంలో నివసించే కప్పలను కొమ్ముగల కప్పలంటారు. తాము త్రవ్వుకున్న బొరియల లోనే తమ కాలాన్ని చాలావరకు ఇవి



Fungoid frog

గడుపుతాయి. బయట ఇవి చాలా అరుదుగా కనబడతాయి.

చర్మంపై దళసరి పెరుగుదల ఉన్న సాధారణ గోదురు కప్పను గురించి చెప్పవలసిన అవసరం లేదు. రోజంతా దాగి ఉండి రాత్రిళ్ళు పురుగులను కీటకాలను తినడానికి ఈ గోదురు కప్పలు బయటకు వస్తుంటాయి. పట్టుకున్నప్పుడు ఇవి లోగొంతుకతో అరుస్తాయి. ఆశ్చర్యాన్ని కలిగించేంతగా ఇవి తింటాయి. మన దేశపు వాయవ్య ప్రాంతంలో నివశించే ఆండర్సన్ (Anderson) గోదురు కప్పలు మూత్రపిండాల్లాంటి పెద్ద చర్మగ్రంథుల కారణంగా, పొడుచుకుని వచ్చే ముండ్లతో నిండిన వీపులేని కారణంగా తమ ప్రత్యేకతను చాటుకుంటాయి.

---

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్:–** 1. (డి) గసగసాల చెట్టు పువ్వు 2. (బి) మదర్‌థెరెసా 3. (సి) జపాను 4. (డి) దేవికారాణి రోరిచ్ 5. (సి) ఫుట్‌బాల్ 6. (డి) వీరసావర్కర్ 7. (ఎ) ఇద్దర్ని 8. (సి) కాంచన్ జంగా 9. (డి) పత్తి 10. (డి) గోవిందన్‌కుట్టి.

**మాటలమహిమ:** 1. (బి) ముత్తెము 2. (సి) ఊగులాట 3. (ఎ) కందురీగ 4. (సి) వుుత్యపుచిప్ప 5. (డి) సైన్యము 6. (ఎ) పుట్టుమచ్చ 7. (సి) దలాలీకాడు 8. (బి) హంస.

**తెలివికి పరీక్ష:** 1. హిందూమహాసముద్రంలో 2. 9 కాలరీలు. 3. పాండా (The Panda) 4. 1901లో 5. గాలి గొడుగు (Parachute). ●

"ఉత్సాహపు శక్తి, చురుకుదనంకు మించిన ప్రతిభ జీవితంలో మరొకటి లేదు."

ఇంత చిన్న చిన్న ప్రాణులు కూడా వాతావరణం పరిసరాల సమతౌల్యాన్ని సంరక్షించడంలో ప్రముఖ పాత్రను వహిస్తా యన్న విషయం చాలా మందికి తెలి యదు. ఈ ఉభయ చరాల పోషణ, తమ పిల్లలను పెంచే పద్ధతులు, మనకు చాలా లాభాల్ని ఆర్జించి పెడుతు న్నాయి. ఇవి అన్ని రకాల అంగాలతో



Malabar gliding frog

కూడిన (Organic) ప్రాణులను– విషపూ రితమైన పురుగులను, ఇతర వస్తువులను తినడంవల్ల మన ఏర్లు, నదులు, చెరు వులు, కలుషితం కాకుండా ఉన్నాయి. కొన్ని రకాల పిల్ల కప్పలు తుళ్ళిపడే దోమలపై విపరీతంగా తింటాయి. అవి ధంగా దోమలను అదుపు పొందడానికి వీటి వాడకంను సిఫారసు చేస్తున్నారు.

చాలా రకాల అడవి జంతువులను నిల్వఉన్న ఆహారంగా ఈ ఉభయ చరాలు పనికి వస్తున్నాయి. అంతే కాదు ఈ ఉభ యచరాలు హానికరమైన పురుగులను, ఇతర జంతువులను తమ ఆహారంగా స్వీకరి స్తాయి. కప్పల సంఖ్యను తగ్గించడం వల్ల పంటను నాశనం చేసే పురుగుల కీటకాల సంఖ్య పెరుగుతుందన్న జీవావరణ శాస్త్ర జ్ఞుల (Ecologist) వాదన సబబైనదే. ●

## గడియారాలను గురించి తెలుసుకోవలసిన విషయాలు

★ *ప్రపంచపు తొలి గడియారం నీడ గడి యారం (Sun dial).*

★ *స్విట్జర్లాండ్‌లోని జెనీవాకు చెందిన జాక్వెట్ డ్రోజ్ (Jacquet Droz) తొలి చేతి గడియారాన్ని తయారు చేసాడు.*

★ *725వ సంవత్సరంలో యంత్ర సహా యంతో నడిచే తొలి గడియారాన్ని చైనావారు తయారుచేసారు.*

★ *రెండు ఆటోమేటిక్ హైడ్రోజన్ మాసర్ (Maser)తో నడిచే గడియారం అమెరికాలోని నౌకా పరిశోధనా ప్రయోగశాల (Naval Research Laboratry)లో ఉంది. దీన్నే ప్రపంచంలో సరిగ్గా సమయాన్ని చూపే గడి యారంగా పరిగణిస్తున్నారు. ఈ గడియారం 1,700,000 సంవత్సరాలలో ఒక సెకండు ఆలస్యంగా కాలాన్ని చూపుతుంది.*

★ *ప్రపంచపు అతి చిన్న గడియారం స్విట్జ ర్లాండ్‌లో తయారైంది. ఈ గడియారం పొడవు 1.2 సెం.మీ.లు, వెడల్పు 0.476 సెం.మీ.లు దీని బరువు 7 గ్రాములు.*

''పుస్తక పఠనం వల్ల కలిగే అమిత ఆనందం, లాభాలు మనకు జీవిత చరిత్రలను చదవడం వల్లే సాధారణంగా మనకు లభిస్తుంది.'' – కార్లైల్

# మంత్రివర్గ సమావేశాలు సైతం నా కోసం వదులుకోవచ్చును

అవి సర్ ఆస్టిన్ ఛాంబర్‌లిన్ ఇంగ్లండ్‌కు ప్రధాన మంత్రిగా ఉన్నరోజులు. ఒకసారి రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి గారు ఒక సభలో మాట్లాడటానికి ఆక్స్‌ఫర్డ్‌లో వచ్చారు. ఆ సభలో పాల్గొనడానికి సర్ ఆస్టిన్ ఛాంబర్‌లిన్ నిరాకరించాడు. కానీ సిల్వర్ టంగ్డ్ (Silver Tongued) వక్తగా పేరును గడించిన శాస్త్రిగారి



V.S. Srinivasa Sastri

సభలో పాల్గొనడానికి ఛాంబర్‌లిన్ మంత్రివర్గ సభ్యులు ఎట్లా అయితేనేం అతడిని ఒప్పించారు. అతడి అద్భుతమైన ఉపన్యాసానికి హాజరు కావడానికి అతడు ఒప్పుకున్నాడు. శాస్త్రిగారి ఉపన్యాసం ముగిసిన ఒక గంట తరువాత మంత్రివర్గ సమావేశాన్ని ఏర్పాటు చేసారు. శాస్త్రిగారి సభకు ఛాంబర్‌లిన్ హాజరయ్యాడు. శాస్త్రిగారి ఉపన్యాసాన్ని పూర్తిగా లీనమై విన్నాడు. చివర్లో గడియారం చూసుకుంటే అప్పటికి అరగంట ఆలస్యం అయిన సంగతి గ్రహించాడు. అతడికి ఆశ్చర్యాన్ని కలిగించేలా అతని మంత్రివర్గ సభ్యులందరూ అతడి వెనుకనే కూర్చున్న సంగతిని గుర్తించాడు. శాస్త్రిగారి ఉపన్యాసం ముగిసిన వెంటనే అతడి వద్దకు పోయి "అయ్యా మంచి ఉచ్చారణతో ఉన్న మీ ఉపన్యాసాన్ని వినడం కోసం లెక్కలేనన్ని మంత్రివర్గ సమావేశాలను వదులుకోవచ్చును" అని అన్నాడు. ●

## పోలీసు దుస్తులను ధరించిన తొలి మహిళ

*మాజీ సంఘసేవకురాలైన శ్రీమతి అలిస్ స్టెబ్బిన్స్ వెల్స్ (Alice Stebbins Wells) పోలీసు దుస్తులను ధరించిన తొలి మహిళగా గుర్తింపును పొందింది. ప్రజలను అరెస్ట్ చేసే అధికారాన్నిస్తూ లాస్ ఏంజిల్స్ పోలీసుశాఖ వారు ఈమెను 1910వ సంవత్సరం సెప్టెంబరు నెల 12వ తారీఖున నియమించారు.*

"నేను నీకిచ్చే రూపాయి అంత ముఖ్యం కాదు. కానీ నా చేతి వేడిమిని తనతో తీసుకు వెళుతూ నీకు అది ఇచ్చే ప్రోత్సాహమే ముఖ్యమైనది"

# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

చందా వివరాలు:
సంవత్సర చందా రూ. 60/-
3 సంవత్సరాల చందా రూ. 175/-
ఎయిర్‌మెయిల్ (1 సం) రూ. 220/-
సీమెయిల్ (1 సం) రూ. 110/-

చందాపంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద
చెన్నై - 600 004.
ఫోను: 4990327

మార్చి 1999 3

Vol.18 No.3



ముఖచిత్రం:
కె.ఆర్.వి. భక్త

★ తెలుగు విస్‌డమ్‌కు ఇది 18వ సంవత్సరం ★

# సంపాదకుని పేజీ

## సంతోషంగా ఉండండి

క్రూరులైన పరిపాలకులు సోక్రటీసును జైలుకు పంపారు. ఆ తరువాత నిర్మోహ మాటంగా మాట్లాడుతున్నాడని అతనికి వారు మరణశిక్షను విధించారు. తనకు మరణశిక్ష విధించబడిందన్న వార్తను అతడు చిరునవ్వుతో స్వీకరించాడు. 'మీరు మరణానికి సిద్ధంకండి' అని అధికారులు సోక్రటీసుతో అన్నారు. అది




విని నవ్వు ముఖంతో అతడు తల ఊపాడు. ''నేను పుట్టినప్పటి నుండీ చావుకు సిద్ధమవుతూనే ఉన్నాను'' అని వారితో సోక్రటీసు అన్నాడు. 'ఏ విధంగా' అని అధికారులు అడగ్గా.. 'నేను రహస్యంగా కానీ, బహిరంగంగా కానీ ఎవరికీ ఎలాంటి హాని చేయలేదు' అని అతడు సమాధానం ఇచ్చాడు.

కల్మషంలేని హృదయం ఉన్నవారు నిర్భయంగా జీవిస్తారు. వారు సంతోషంగా మరణిస్తారు కూడా. సంతోషం గుండెలో ఒక దీపాన్ని వెలిగిస్తుంది. ఆ వెలుగు ముఖం ద్వారా బయట వ్యాపిస్తుంది. అందానికి, ఆనందానికి మించిన సౌందర్య సాధనం మరొక్కటి లేదు.

ఆనందంతో కూడిన స్వభావం జీర్ణశక్తిని పెంచుతుంది. జీర్ణశక్తిని పెంచేది మంచి ఆరోగ్యానికి కారణం అవుతుంది. అది ముఖానికి మంచి వెలుగును ప్రసాదిస్తుంది.

''సంతోషంతో నిండిన హృదయం మందులాగా బాగా పనిచేస్తుందన్న'' మన గ్రంథాలలో చెప్పిన విషయాన్ని ఎల్లప్పుడు గుర్తు ఉంచుకోండి. ●

## పిల్లలకు నిద్రపోయే సమయం

*శిశువులకు 16 మొదలు 20 గంటల నిద్ర అవసరం ఉంది. పాఠశాలకు పోయే వయసు వచ్చినప్పుడు కూడా చిన్నపిల్లలకు కనీసం 10 గంటల నిద్ర అవసరం ఉంటుంది.*

''పర నింద కంటే పాపము లేదు. పరసేవ కంటే పుణ్యమూ లేదు.''

# భారత రత్నాలు

## దాదాభాయి నౌరోజీ

ఎన్.డి. బాత్రా

మాతృదేశం పట్ల ఉన్న ప్రేమ కారణంగా ఉద్దీప్తులైన మహానుభావులు ఎందరో ఉన్నారు. అటువంటి స్వార్థరహితులైన వారిలో మణిదీపంలా వెలుగుతున్న వ్యక్తులలో దాదాభాయి నౌరోజి ఒకరు.




భారతదేశపు ప్రముఖ వ్యక్తి (Grand old Man of India)గా పరిగణింపబడేందుకు జన్మనెత్తిన దాదాభాయి నౌరోజి బ్రిటిష్ పార్లమెంటుకు ఎన్నికైన తొలి పార్లమెంట్ మెంబరు. ఇతడు భారత జాతీయవాదంకు బీజం నాటిన భీష్మాచార్యుడిగా పరిగణింపబడుతున్నాడు. భారతీయ నేషనల్ కాంగ్రెస్‌కు ఎన్నికైన తొలి భారతీయుడు ఇతడే. తండ్రి నౌరోజి పలన్‌జి డోర్బీ (Naoroji Palanji Dorbi)కు దాదాభాయి నౌరోజి ఏకైక సంతానం. ధనవంతుడుకాని నౌరోజీ పలన్‌జీ డోర్బీ పార్శీ మత గురువుగా పనిచేస్తూ భార్య – మనేక్‌బాయి (Maneckbai) సహచర్యంలో సంతృప్తికరమైన జీవితాన్ని ముంబాయిలో గడిపేవాడు.

దాదాభాయి నౌరోజీకు నాలుగు సంవత్సరాలు కూడా నిండకముందే కుటుంబంపై పిడుగుపడింది. తండ్రి చనిపోవడంతో కొడుకును పెంచే భారం తల్లిపై పడింది. కొడుకును తల్లి బడిలో వేసింది. అసాధారణ ప్రతిభగల దాదాభాయి తన తరగతిలో ఉత్తమ విద్యార్థిగా ఉండేవాడు. అద్భుతమైన ధారణాశక్తి, తెలివితేటలు అతడికి ఉండేవి.

## సొగసైన నిర్వచనాలు

*బ్రహ్మచారి: చూస్తాడే కానీ దూకడు (Leaps).*

*హనీమూన్: కొత్త యజమాని వద్ద పనిచేయడానికి ముందు మగవాడు తీసుకునే సెలవు.*

*దాంపత్యం: ఒకటి ప్లస్ ఒకటిని మూడుగా మార్చగల కొత్త సిద్ధాంతం.*

"తోటి జీవిని బాధించి దేవుని పూజించడం నిరర్థకం, అనర్థదాయకం" – బాబా

మెట్రిక్ పరీక్ష వ్రాసిన దాదాబాయి నౌరోజీ ముంబాయిలోని ఎల్ఫిన్‌స్టన్ కళాశాలలో చేరాడు. ఈ కళాశాలలో కూడా యువకుడు నౌరోజి భారతదేశ స్వాతంత్ర్యం పోరాటానికి మార్గదర్శకుడిగా మారే వ్యక్తిగా గుర్తింపబడ్డాడు. ఒక కళాశాలలో ఆచార్య పీఠాన్ని అధిరోహించిన



British Parliament

తొలి భారతీయుడు నౌరోజీ. 'ఆచార్య దాదాభాయి నౌరోజీ'' అని సంబోధింపబడినప్పుడు అతడు ఎనలేని ఆనందాన్ని పొందేవాడు.

తన 24వ ఏట దాదాభాయి నౌరోజీ గణితశాస్త్రాన్ని వదలి, వణ్యవస్తువుల (Merchandise) అధ్యయనం చేపట్టాడు. ఆకారణంగానే లివర్‌పూల్‌లోని కామాస్ (Camas)లో పనిచేసేందుకు గ్రేట్‌బ్రిటన్ చేరుకున్నాడు. కొన్ని సంవత్సరాలు లోపునే అభిప్రాయ భేదాల కారణంగా దానికి రాజీనామా చేసాడు. ఆ తరువాత స్వంత వ్యాపారం ప్రారంభించాడు.

## విస్డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, అక్టోబర్ '84, నవంబరు '84 (రూ. 5 50); మార్చి '85 నుంచీ జూన్ '85 (రూ. 5.50); ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, అక్టోబర్ '86 (రూ. 6.00); జనవరి '87, మార్చి '87, ఏప్రిల్ '87, డిసెంబర్ '87 (రూ 7.00), జనవరి '88, ఏప్రిల్ '88 నుంచీ డిసెంబర్ '88 (రూ 17.00); జనవరి '89 నుంచీ డిసెంబర్ '89 (రూ. 24.50); ఫిబ్రవరి '90 నుంచీ మే '90, ఆగస్ట్ '90, సెప్టెంబర్ '90, నవంబర్ '90, డిసెంబర్ '90 (రూ. 18.00); ఫిబ్రవరి '91 నుంచీ జూలై '91, సెప్టెంబర్ '91 నుంచీ డిసెంబర్ '91 (రూ 24 00), జనవరి '92 నుంచి డిసెంబర్ '92 (రూ. 33.00); జనవరి '93 నుంచీ అక్టోబర్ '93, డిసెంబర్ '93 (రూ. 30.00), జనవరి '94 నుంచీ డిసెంబర్ '94 (రూ. 35 00), జనవరి '95 నుంచీ డిసెంబర్ '95 (రూ. 36 00); జనవరి '96 నుంచీ డిసెంబర్ '96 (రూ. 36.00), జనవరి '97 నుంచీ డిసెంబర్ '97 (రూ.36.00); జనవరి '98 నుంచి జూన్ '98 (రూ. 19.00) కాపీలు మావద్ద ఉన్నాయి. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 12.00 చేర్చి MO ''రత్నా ఏజన్సీస్'', 9, దేశికారోడ్డు (ఆళ్వారు పేట వద్ద) చెన్నై - 600 004కు పంపాలి.*

– సర్క్యులేషన్ మేనేజర్

''స్నానంతో దేహం శుభ్రపడుతుంది. జ్ఞానంతో బుద్ధి శుద్ధిపడుతుంది. దానంతో ధనం పవిత్రమవుతుంది. ప్రేమతో హృదయం నిర్మలమవుతుంది.''

దానిని కూడా స్వచ్ఛంధంగా మూసి వేసాడు.

ఇంగ్లాండులో ఉంటున్నప్పుడు తన స్వంత వ్యాపారంతో పాటు భారతీయుల సాధక బాధకాలను ప్రభుత్వానికి తెలియ బరిచి సహాయం చేసేవాడు. 'ఇండియన్ సివిల్ సర్వీస్'లో చేరడానికి పోటీపడేం దుకు వచ్చిన భారతీయ విద్యార్థులకు సలహాల నిస్తూ మార్గదర్శకత్వం వహిస్తూ వచ్చాడు. బారిస్టరు చేయడానికి లండన్ చేరిన మహాత్మాగాంధీ నౌరోజీ పేరిట ఒక పరిచయ పత్రంతో వచ్చాడు.

భారతీయులకు సంబంధించిన ప్రశ్నలను గురించి చర్చించేందుకు ఆంగ్లేయులను భారతీయులను ఒక చోట చేర్చడానికి లండన్ ఇండియన్ సొసైటీ అనే సంస్థను ఇతడు స్థాపించాడు. ఈ సంస్థకు అతడు అధ్యక్షుడిగా ఉండే వాడు. అయిదు దశాబ్దాలపాటు ఈ సంస్థ గణనీయమైన సేవచేసింది.

ఈ సంస్థ సభలు సమావేశాల ద్వారా భారతీయుల సమస్యలను అక్కడి సాధా రణ జన సముదాయానికి తెలియజేసే ప్రయత్నం ఇతడు చేసాడు. పరిపాలనా రంగంలో ఎక్కువమంది భారతీయులను చేర్చుకోవాలన్న కోరికను అతడు ప్రభుత్వం ముందు ఉంచాడు. భారతీ యుల వ్యవహారంలో బ్రిటిష్‌వారిని మేల్కొలిపే గట్టి ప్రయత్నాలను అతడు చేప ట్టాడు. ఈ విధంగా చేయడం ద్వారా భారతీయులకు మేలు చేసినవాడయ్యాడు.

అవకాశం దొరికినప్పుడంతా రాయల్ కమిషన్ సభ్యుడిగా, లేదా వెల్‌బై (Welby) కమిషన్ ముందు సాక్ష్యం ఇచ్చే వ్యక్తిగా లేదా మరో విధమైన హోదాగల వ్యక్తిగా - భారతదేశపు దారిద్ర్యానికి బ్రిటిష్ ప్రభుత్వపు దోపిడీ విధానమే కార ణమన్న విషయాన్ని ఎత్తి చూపేవాడు. ''భారతదేశంలో పేదరికం - బ్రిటిష్ వారి అక్రమ పరిపాలన'' - (Poverty and Un-British Rule in India) అన్న

### ప్రతి పది కార్లలో ఆరుకార్లు




తయారు చేయబడుతున్న ప్రతి పది కార్లలో ఆరు కార్లకు అమెరికా సంయుక్త రాష్ట్రాలు, జపాన్, జర్మనీ, ఇటలీ, బ్రిటన్‌కు చెందిన వారే సొంత దారులుగా ఉంటున్నారు.

'''కృతజ్ఞత' అనేది చేసిన మేలుకు చూపించే సుగుణం. 'క్షమాపణ' అనేది చేసిన కీడుకు చూపించే ఔదార్యం.''

తన సుప్రసిద్ధ గ్రంథాన్ని అతడు ఈ ఉద్దేశం, ఉత్సాహంతోనే రాసాడు.

భారతదేశం తిరిగి వచ్చిన తరువాత దేశంలోని వివిధ ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించాడు. తన లండన్ ఇండియన్ సొసైటీ ఉద్దేశాలను ప్రచారం చేసేందుకు ఉపన్యాసాలను కూడా అతడు చేసాడు. ప్రజలలో దేశభక్తి భావనను తన భావ గర్భిత ఉపన్యాసాల ద్వారా మేల్కొలి పాడు. ముంబాయి నగరం వచ్చినప్పుడు భారతీయులకు అందచేస్తున్న సేవలను పురస్కరించుకుని అతడికి బ్రహ్మాండమైన స్వాగతం లభించింది. 1885వ సంవ త్సరంలో (జాతీయ కాంగ్రెసు స్థాపించబ డిన సంవత్సరం) దానికి సంబంధించిన అతి ముఖ్యమైన ప్రజానాయకులలో ఇతడు ముఖ్యమైనవాడు. ఆయన హాజరు కావడంతో ఆ సంస్థ గౌరవం బాగా పెరిగింది.

అసంఖ్యాక భారతీయుల సుఖదుఃఖా లకూ, బాధలకూ సంబంధించిన కోరిక లను బ్రిటిష్ ప్రభుత్వం దృష్టికి తీసుకు రావాలన్న బలమైన కోరిక కారణంగా బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు కావాలని అతడు మనసారా కోరుకున్నాడు. మొదట్లో అతడు విజయాన్ని సాధించలేకపోయాడు. కానీ అయిదు సంవత్సరాల తరువాత ఇతడు పార్లమెంటుకు ఎన్నికయ్యాడు. మూడు ఓట్ల మెజారిటీతో బ్రిటిష్ పార్ల మెంటుకు ఎన్నికైన తొలి భారతీయుడు శ్రీ నౌరోజీ. ఈ ఎన్నికలో అతడు సెంట్రల్ ఫిన్స్‌బరీ (Central Finsbury) నియోజకవర్గం నుండీ పోటీ చేసాడు. జాతీయ స్థాయిలో భారతీయులకు అతడి ఎన్నిక అమితమైన సంతోషాన్నీ, ఆనందాన్నీ, కలిగించింది.

కొన్ని నెలల తరువాత అతడు బ్రిటిష్ పార్లమెంట్‌లో తన స్థానాన్ని గ్రహించాడు. లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశా నికి అధ్యక్షత వహించడానికి అతడు ఇండియాకు రెండవసారి తిరిగి వచ్చాడు.




*రష్యాదేశపు రాజధాని నగరంలోని క్రెమ్లిన్ (Kremlin) బాగా సురక్షితమైన ఒక కోట (Citadel). రష్యా దేశపు సచివాలయం (Secretariat) ఇక్కడ నెలకొల్పబడి ఉంది.*

అప్పట్లో జరిగిన కలకత్తా సమావేశంలో హాజరై స్వపరిపాలన (Self - Government) అన్న కోరికను తొలిసారిగా సభ ముందు ఉంచాడు. స్వపరిపాలన ద్వారానే ప్రజల బాధలు తీరగలవనీ ఇదే ఏకైక పరిష్కారమార్గమని కూడా సూచించాడు. భారతీయ స్వతంత్ర సంగ్రామ చరిత్రలో ''స్వరాజ్'' అన్న మాటను ఈ పార్శీ మహాత్ముడు ప్రవేశ పెట్టాడు.

అప్పటికే ముసలితనం పైనపడడం వల్ల దేశ ప్రజలు అతడిని భారతదేశపు భీష్మ పితామహుడు (Grand old man of India) అని పిలువసాగారు. ఆ వయసులో కూడా అతడు తన ఆరోగ్యాన్ని చక్కగా కాపాడుకోగలిగాడు. తన ఆరోగ్యానికి కఠిన పరిశ్రమతోపాటు ఆరోగ్యకరమైన అలవాట్లే కారణం అని అతడు తెలియజేసాడు. కొన్నిరోజులపాటు అస్వస్థులుగా ఉండి దాదాభాయి నౌరోజీ తన 92వ ఏట స్వర్గస్థుడయ్యాడు.

ముంబాయి మహానగరపు ప్రజలు ఆయనకు గొప్ప నివాళులు అర్పించారు. ఆయన జ్ఞాపకార్థం ఆయనపట్ల వారికున్న శ్రద్ధాభక్తులను ప్రకటించేందుకు ముంబాయి నగరంలోని అతి ముఖ్యమైన వీధికి అతడి పేరును పెట్టారు. –('యువభారతి' సౌజన్యంతో)

## నిజమైన స్నేహితుడు



*పరిస్థితుల ప్రభావానికి తల ఒగ్గి మురికి గుడ్డలు ధరించిన వేళ కూడా నన్ను గుర్తుపట్ట గల వ్యక్తే నిజమైన స్నేహితుడు.*

*దురదృష్టం వెంటాడుతున్నప్పుడు ఆ ప్రవాహంలో నన్ను తోయకుండా ఆదుకుని నాకు చేయూతనిచ్చే వ్యక్తినే,*

*నాకు ఒక రూపాయి అవసరం అయినప్పుడు రెండు రూపాయల జామీను అడక్కుండా ఇచ్చే వ్యక్తినే,*

*నేను జబ్బు పడినప్పుడు నన్ను చూడడానికి వచ్చే వ్యక్తినే,*

*పరిస్థితులు అనుకూలంగా లేకుండా ఎదురు తిరిగినప్పుడు నాకోసం పోట్లాడేందుకు చొక్కా చేతులను పైకి మడుచుకునే వ్యక్తినే,*

*నా వెనుక కూడా నా ముందు మాట్లాడినట్లే మాట్లాడే వ్యక్తినే నేను నిజమైన స్నేహితుడిగా భావిస్తాను.*

''సహనం – సహకారం రెండూ ఉన్నప్పుడే మానవత్వం రాణిస్తుంది ''

# భాషకు సువాసన ఇచ్చే జాతీయాలు

గురుదత్ ఆర్. కామత్

మాన్ ఆఫ్ లెటర్స్ అని ఎవరినంటారో మీకు తెలుసా? ఈ ఆంగ్లభాష జాతీయంతో అంత పరిచయం లేని వ్యక్తులు శబ్దార్థాన్ని మాత్రం తెలుసుకుని జవాబుగా తపాలా బంట్రోతు లేదా



పోస్ట్ మాస్టర్ అని చెప్పే అవకాశం ఉంది. కానీ ఇంగ్లీషులోని ఆ మాట ''సాహిత్యాన్ని బాగా మదించిన వ్యక్తి'' అన్న అర్థాన్ని ఇస్తుంది. సాహిత్యాన్ని బాగా అర్థం చేసుకున్న వ్యక్తి అని కూడా అర్థం చేసుకోవచ్చును.

''మాన్ ఆఫ్ లెటర్స్'' (Man of letters) అన్నది ఒక జాతీయం. మనం మాట్లాడుతున్నప్పుడు జాతీయాలను వాడితే మసాలా దినుసుల లాగా జాతీయాలు మన రచనను లేదా మన సంభాషణలను మరింత రుచికరంగా మార్చగలవు.

జాతీయాల వాడకాన్ని నేర్చుకోవడానికి సరైన వ్యక్తులు దేశీయులే. మీరు ఇంగ్లీష్ వారితో – ఆడ లేక మగ – మాట్లాడితే జాతీయాలతో కూడిన మీ భాషా సంపదను బాగా అభివృద్ధి పరుచుకోగలరు. ఇంగ్లీషు నాటకాలనూ, సినిమాలను చూడడం ద్వారానూ, మంచి మంచి రచయితల పుస్తకాలను చదవడం ద్వారానూ

---

కనుగొనబడని గొప్ప సత్యసాగరం

''ఈ ప్రపంచం కళ్ళకు నేను ఎలా కనిపిస్తున్నానో నాకు తెలియదు. కానీ నా వరకు నన్ను నేను సముద్ర తీరంలో ఆటలాడుకునే పసిబాలుడిగా నన్ను పరిగణిస్తున్నాను. నా ముందు ఇంతవరకు కనుగొనబడిన సత్యసాగరం ఉన్నా అప్పుడప్పుడు మెత్తటి గులకరాయినిగానీ, అందమైన గవ్వనుగానీ, వెతుక్కొనేందుకు దృష్టిని మరలించే బాలుడిగా భావిస్తాను.'' – సర్ ఐసాక్ న్యూటన్, భౌతికశాస్త్ర పితామహుడు

''కొందరు నీతులు చెప్పి గోతులు తీసారు కొందరు గోతులు తీసి నీతిని పాతేసారు.''

మనం ఇంగ్లీషు జాతీయాలను బాగా నేర్చుకోవచ్చును.

మన రోజు వారీ సంభాషణలలో ముఖ్యంగా జాతీయాలు చాలా బాగా ఉపయోగ పడతాయి. మంచి సారవంత మైన (Pithy) జాతీయాన్ని వాడి మనం చెప్పదలచుకున్న భావాన్ని హత్తుకునేలా చెప్పగలిగే అవకాశం ఉంది. రెండు



మూడు జాతీయాలను వాడి మనం మన వాదనలో సులభంగా నెగ్గగలుగుతాము. వాగ్యుద్ధం జరుగుతున్నప్పుడు గురి చూసి వదిలిన రాయిలో అది లక్ష్యాన్ని ఛేదించ గలదు.

అన్ని రంగాలలో – క్రీడలు, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ, మేనేజ్‌మెంట్, కంప్యూటర్లు, అన్నింటిలో – మంచి ప్రావీణ్యం గల మిత్రుడు ఒకడున్నాడనుకోండి. అతడిని మీరు ఏ పేరుతో పిలుస్తారు? జాక్ (జాన్ అన్న పేరుకు బదులుగా అతి ప్రచారంలో ఉన్నమాట) ఆఫ్ ఆల్ ట్రేడ్స్ అంటారు. తెలుగులో మనం ఈ మాటను సకలకళాకోవిదుడుగా అర్థం చేసుకోవచ్చును. ఈ జాతియంకు మూలం – ''జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్ అండ్ మాస్టర్ ఆఫ్ నన్'' – అన్న సామెత మంచి దోష రహితమైన వజ్రాన్ని ఇంగ్లీషులో ''ఎ డైమండ్ ఆఫ్ ది ఫస్ట్ వాటర్'' అంటారు. ఈ జాతీయాన్ని దోషరహితమైన వస్తువు లేదా మనిషి పరంగా మనం వాడవచ్చును. మీ కార్య క్రమానికి అనువైన విధంగా రాయబడిన,

---

## అనంతమైన అవకాశం

*తానురాసిన ఒకానొక పుస్తకంలో రచయిత పీటర్ డ్రకర్ (Peter Drucker) జోళ్ళ ఫ్యాక్టరీకు చెందిన ఒక సేల్స్‌మన్‌ను గురించి ఇలా రాసాడు. ఆఫ్రికా ఖండపు ఒక దేశాన్ని చేరిన సేల్స్‌మన్ ఫ్యాక్టరీ యజమానికి ''ఇక్కడ ప్రజలు చెప్పులు లేకుండానే నడుస్తున్నారు. చెప్పులు అమ్మే అవకాశం బొత్తిగా లేదు'' అని టెలిగ్రాం ఇచ్చాడు.*

*అతనితో వచ్చిన మరో జోళ్ళ కంపెనీ సేల్స్‌మన్ తన యజమానికి ''ప్రజలు చెప్పులు లేకుండానే నడుస్తున్నారు. చెప్పులు అమ్మడానికి ఇక్కడ గొప్ప అవకాశం ఉంది'' అని టెలిగ్రాం ఇచ్చాడు.*

*(– 'పార్థ' సౌజన్యంతో)*

''అతి మంచితనం అనర్థదాయకం.''

సులభంగా అర్థమవడంతో పాటు ఎక్కువ మార్కులను సంపాదించడానికి అనువైన పాఠ్యగ్రంథాన్ని మనం ఖచ్చితంగా ''ఎ డైమండ్ ఆఫ్ ది ఫస్ట్ వాటర్''గా పరిగణించ వచ్చును.

మరైతే ఎవరిని రఫ్ డైమండ్ (ముతక వజ్రం) అంటారు? మనలో చాలా మంది సహృదయులై ఉంటారు. కానీ బయటికి మాత్రం చాలా ఖరాఖండి మనుషులుగా మొరటువారిలాగా కనబడుతుంటారు. ఇతరులకు సహాయపడే స్వభావాన్ని వారు కలిగి ఉంటారు. అలాంటి వ్యక్తిని ఇంగ్లీష్‌లో రఫ్ డైమండ్ అంటారు. ఇంగ్లీష్ సాహిత్యంతో, ముఖ్యంగా ఆలివర్ గోల్డ్‌స్మిత్ సాహిత్యంతో పరిచయం ఉన్న వారు రఫ్ డైమండ్‌ను మాన్ ఇన్ బ్లాక్ (Man in black)తో సరిపోలుస్తారు. జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్, ఎ డైమండ్ ఆఫ్ ఫస్ట్ వాటర్, రఫ్ డైమండ్ లాంటి ప్రయోగాలను జాతీయాలు అంటారు.

ఇప్పుడు జాతీయం అంటే ఏమో మీకు బాగా అర్థం అయి ఉంటుంది. మీకు బాగా నచ్చే మీకు ఇష్టమైన కొన్ని జాతీయాలను గుర్తు చేసుకోండి. కొన్ని జాతీయాలను కింద పొందు పరుస్తున్నాను. మీకు వాటి అర్థం తెలిసి ఉంటే సరే. లేని పక్షంలో మీ అధ్యాపకుడి లేదా నిఘంటువు సహాయంతో అర్థంచేసుకోండి. గిఫ్ట్ ఆఫ్ ది గాబ్ (మాటకారితనం, వాక్చాతుర్యం), లాండ్ ఆఫ్ నాడ్ (Nod), ది అప్స్ అండ్ డౌన్స్ ఆఫ్ లైఫ్, ది న్యూస్ ఆఫ్ వార్, ది స్కిన్ ఆఫ్ ఒన్స్ టీత్, స్లిప్ ఆఫ్ ది టంగ్, ఎ స్నేక్ ఇన్ ది గ్రాస్, ఎ కాక్ అండ్ బుల్ స్టోరీ, ఎ బర్డ్స్ ఐ వ్యూ, బర్డ్స్

## ఆణిముత్యాలు



Sri Ramakrishna

★ *కంసాలి దాగలిని చూడండి. సుత్తితో ఎంతగా బాదినా, కొట్టినా తన చోటు నుండీ అది కదలదు. మనిషి దీని నుండీ ఓపికను, సహనశక్తిని నేర్చుకోవాలి.*

★ *పండ్ల బరువుతో నిండున్న చెట్టు ఎల్లప్పుడూ వంగే ఉంటుంది. గొప్పవారు కావాలంటే అణకువనూ, వినయాన్ని అలవరుచుకోండి* – *శ్రీరామకృష్ణ పరమహంస*

ఆఫ్ ఎ ఫెదర్, ఔగియన్ (Augean) స్టేబుల్స్, ఎ వైట్ ఎలిఫెంట్, ఎ స్వాన్ సాంగ్, స్టోన్‌డెఫ్, ఎ స్లోకోచ్, రెడీమనీ, రియల్ ఎస్టేట్, పాయింట్ బ్లాంక్, ఎ పాస్‌వర్డ్, ఎ లెఫ్ట్ హాండెడ్ కాంప్లిమెంట్, హెన్ పెక్డ్ హస్బెండ్, ఎ హెర్క్యులియన్ టాస్క్, హాల్‌మార్క్, ఎ గోల్డెన్ మీన్, ది గోల్డెన్ రూల్, ఫ్రెంచ్ లీవ్ మొదలైనవి.

పైన పేర్కొన్న జాతీయాలన్నీ జంతువులకు సంబంధించిన కథల నుండీ, ప్రపంచ సాహిత్యం నుండీ, మత గ్రంథాల నుండీ, పురాణాల నుండీ మనకు లభించాయన్న విషయం మీకు తెలిసి ఉంటుంది. 5 లక్షలకు మించిన పదజాలం ఉన్న ఆంగ్ల భాష ప్రపంచ భాషలలో ఎక్కువ పద సంపద ఉన్న భాష. అన్ని ఖండాలనుండీ, అన్ని భాషా ప్రాంతాలనుండీ పదాలను ఈ భాష ఆహ్వానించింది. ఈ రోజుకూ ఆహ్వానిస్తూనే ఉంది.

పైన ''ది గోల్డెన్ రూల్'' అన్న జాతీయాన్ని మీరు గమనించి ఉంటారు. ఇది బైబిల్‌కు సంబంధించిన మాట. ఏసుక్రీస్తు ప్రభువు ఇచ్చిన సలహా– ''ఇతరులు మీ పట్ల ఎలా వ్యవహరించాలని మీరు కోరుకుంటారో అలాగే ఇతరుల పట్ల మీరు వ్యవహరించండి'' (మాథ్యూ VII, 12) ఆధారంగా ఈ జాతీయం వాడుకలోకి వచ్చింది. అదే విధంగా ''ఎ గుడ్ సమరిటాన్'' (మంచి దయాళువు) అన్న మాటకూడా ఏసు ప్రభువు నీతి బోధనలనుండీ వచ్చింది.

జాతీయాలను వాడటం నేర్చుకున్నారంటే మీ భాష విశదమైనదిగా, శక్తివంత

న్యాయం కోసం పోరాడండి




*నేను సాధించడాన్ని కోరుతాను. రేయనక, పగలనక కష్టపడి పనిచేసే వ్యక్తులు నాకు కావాలి. తమకు న్యాయమైనదనీ, సరైనదని తోచిన వాటి కోసం పోరాడే వ్యక్తులూ, తప్పు ముందు తలవంచని గుణంగల వ్యక్తులను నేను అభిలషిస్తాను. మీరు చిన్న చిన్న పనులు కాదు పెద్ద పెద్ద పనులను చేయండి. మీరు ఈ దేశాన్ని నిర్మించండి. అతి విశాలమైన మన ఈ దేశం నిర్మాణంకు మించిన అతి పెద్ద విషయాన్ని గురించి మీరు ఆలోచించగలరా?* – జవహర్‌లాల్ నెహ్రూ

''దెబ్బతిన్నవారిని పైకి లేపే పనిని నిర్లక్ష్యం చేసే వ్యక్తి భయపడాలి. కారణం అతడు దెబ్బతిన్నప్పుడు అతడిని ఆదుకోవడానికి ఏ ఒక్కడూ ప్రయత్నించడు'' – సాడి

మైనదిగా మారుతుంది. చక్రవర్తి రాజగో పాలాచారి గద్యంలో రాసిన మహా భారతం, రామాయణాలు, చిన్న చిన్న మనసుకు హత్తుకునే వాక్యాలతో నిండి ఉంది.

ఈ క్రింది ఉదాహరణాలు నామాటను బలపరుస్తాయి:

''తుఫాను కారణంగా ముక్కలు చెక్క లైన నావలో చిక్కుకుని, ఈదుకుంటూ సురక్షితంగా తీరం చేరేందుకు ప్రయ త్నించే మనిషిలాంటి వాడిని. నేను దుఃఖ సాగరంలో తప్పక మునిగిపోగలను.''

''తుఫాను తరిమివేయబడ్డ మేఘాల లాగా కౌరవ సైన్యాలు చెల్లాచెదరై చెట్టు కొకరు, గుట్టకొకరుగా పరుగెత్తిపోయారు.''

యోధుల సమక్షంలో అతడిని ముందుకు రానివ్వండి. రాతిబండకేసి కొట్టిన కుండ బద్దలైనట్లు మాపై దాడి చేసి మమ్మల్ని హడలగొట్టనివ్వండి.''

ఇలాంటి బంగారు ముద్దలు రాజగోపా లాచారి చేసిన స్వేచ్ఛానువాద గ్రంథా లలో– రామాయణం, మహాభారతంలో – ఉన్నాయి. ఈ పుస్తకాలను చదివి మీరు మీ ఆంగ్లభాషా జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడంతో పాటు మీ జీవితాన్ని కూడా సరిదిద్దుకోగలరు.

(– 'పార్థ' సౌజన్యంతో)

తనతో కూడా 6,000,000 సూక్ష్మజీవులను తీసుకుపోగల ఈగ




ఈగలకు సంబంధించిన పట్టీలో ఇంత వరకు 17,000 రకాల ఈగలు చేర్చబ డ్డాయి. కలరా, టైఫాయిడ్, పోలియో లాంటి సుమారు 30 రోగాలను ఇవి ఒక చోట నుండి మరొక చోటికి మార్పిడి చేయగలవు ఆడ ఈగలు 29 రోజులు జీవించగా మగ ఈగలు 17 రోజులు మాత్రం జీవిస్తాయి. ప్రపంచపు అతిపెద్ద ఈగను మిడాస్ హీరోస్ (Midas Heros) అంటారు. ఈగలు అద్భుతమైన విన్యాసా లను చేయగలవు. ఇవి ఇంటి పైకప్పులపై ఉండగలవు. అంతేకాదు భూమికి 30 కి.మీ ల ఎత్తులో కూడా ఇవి ప్రాణాలతో ఉండగలవు. ఇది తన శరీరంతోపాటు సుమారు 6,000,000 సూక్ష్మజీవులను మోసుకుని పోగలదు.

''ఇతరుల దురదృష్టం ఇచ్చే హెచ్చరిక ద్వారా పాఠం నేర్చుకోవడం చాలా మంచిది.''
– పబ్లియస్ సెరుస్



## ఒకే ఒక అవకాశం

ఒక భర్త (స్నేహితుడితో): నా భార్య దగ్గరున్నప్పుడు ఆవులింత వచ్చినప్పుడు మాత్రమే నాకు నోరు తెరిచే అవకాశం లభిస్తుంది.



## నమ్మకం కోసం ముట్టి చూస్తాడు

అనంత విశ్వంలో 300 బిలియన్ల నక్షత్రాలున్నాయని మీరంటే మనిషి దాన్ని తప్పక నమ్ముతాడు. కానీ ఈ కుర్చీకు కొత్తగా రంగు వేసారని అంటే మాత్రం అవునో కాదో అని నమ్మడం కోసం తప్పక ముట్టి చూస్తాడు.

## తాళం వేస్తుంటాను

విందు ఇస్తున్న వ్యక్తి: "నారాయణ్ గారూ, మీరు ఏ వాద్యాన్నైనా సరే వాయిస్తారా?"

నారాయణ్: "నేను ఇంటికి బయట ఎక్కడా వాయించను."

విందు ఇస్తున్న వ్యక్తి: "అయితే ఇంట్లో ఏమి వాయిస్తుంటారు?"

నారాయణ్: "భార్యమాటలకు తాళం వేస్తూ ఉంటానండి!"

## మిమ్మల్ని పెద్దమనిషి అన్నందుకు క్షమించండి

జడ్జి (న్యాయవాదితో): మీరు నన్ను పెద్ద మనిషి అని ఎందుకు సంభోధిస్తున్నారు? గౌరవనీయులైన అని కదా మీరు నన్ను సంభోదించాలి.

న్యాయవాది: గౌరవనీయులైన జడ్జి గారూ! మిమ్మల్ని 'పెద్దమనిషి' అని నేను తప్పు చేసాను.

---

## జీవకారుణ్య సంస్థ స్థాపకుడు

*ఐర్‌లాండ్‌కు చెందిన రిచర్డ్ మార్టిన్ (Richard Martin) 1824వ సంవత్సరంలో జీవ కారుణ్యసంస్థ (The Society for the Prevention of Cruelty to animals)ను స్థాపించాడు.*

## ఒక నిమిషం!

వివానం ద్వారా జెనీవా నుండీ బోస్టన్ పట్టణం చేరడానికి ఎంత సమయం పడుతుందని ఏర్‌లైన్ ఆఫీసుకు ఒక మహిళ ఫోను చేసింది. ఫోను అందుకున్న మహిళ కాస్సేపు ఆగండి అని అర్థాన్ని ఇచ్చే ''జస్ట్ ఎ మినిట్'' అంటే అవతలి మహిళ ఆ మాట విని ''ధన్యవాదాలు'' అని ఫోను పెట్టేసింది.

## ఒకప్పుడు పెండ్లి ఉంగరం జీవితాంతం ఉండేది

కూతురు (తల్లితో): ''ఒకప్పుడు పెండ్లి ఉంగరాలు చాలా వెడల్పుగా, దళసరిగా ఉండేవి. ఇప్పుడు అవి ఎందుకు అంత వెడల్పు తక్కువగా, పలచగా ఉంటున్నాయి.''

తల్లి: ''ఒకప్పుడు పెండ్లి ఉంగరాలు జీవితాంతం ఉండేవి.''

## వెయ్యి రూపాయల చెక్కు కూడా!

కక్షిదారుడు (న్యాయవాదితో): ''అయ్యా! ఈ కేసుకు సంబంధించిన మొత్తం దస్తావేజులను మీ ముందు ఉంచాను. ఇవి కాకుండా మీకింకేమైనా కావాలంటే అడగండి.''

లాయర్ (నింపాదిగా): ''అవునండీ. ఈ దస్తావేజులతోపాటు వెయ్యిరూపాయల చెక్కు కూడా ఉంచండి.''

## ఎరను తినింది

తల్లి: ''ఈ రోజు చేపలు పట్టేందు పోతున్నప్పుడు జాన్! నీవు నీ చిచెల్లెల్ని వెంట తీసుకుపోవద్దు.''

జాన్: ''లేదమ్మా! పోయినసారి నే తీసుకువెళ్లినప్పుడు ఒక చేపను కూడా నేను పట్టుకోలేదు.''

తల్లి: ''ఈ రోజు తీసుకువెళ్ళు అల్లరి చేయకుండా బుద్ధిగా ఉంటుంది.''

---

## ప్రతి వంద ఆసుపత్రులకు 79 ఆసుపత్రులు




మన దేశంలో నెలకొల్పబడిన ప్రతి వంద ఆసుపత్రులలో 79 ఆసుపత్రులు పెద్ద నగరాల లోనే ఉన్నాయి.

''ఓపిక చేదుగా ఉంటుంది కానీ వాటి ఫలాలు మాత్రం తియ్యగా ఉంటాయి.''

జాన్: ''అల్లరిని గురించి కాదమ్మా! క్రితంసారి నా దగ్గరున్న మొత్తం ఎరల్ని తినేసింది.''

## గెంతుతూనే ఉండాలి

మీ విజయరహస్యం ఏమని ఒక ఉత్సాహవంతుడైన యువకుడు తాను కూడా ముందు రావాలన్న ఆశతో వ్యాపారంలో బాగా విజయాన్ని సాధించిన ఒక వ్యాపారస్తుడిని అడిగాడు.

వ్యాపారి: ''మరి అంత సులభం లేదా తేలికైన రహస్యం అంటూ ఏమీ లేదు. చిన్న చిన్న విషయాల వరకు కూడా చాలా చురుగ్గా ఉండాలి. వచ్చిన అవకాశాల్ని గెంతి వశం చేసుకోవాలి.''

యువకుడు: ''మరి అవకాశాలు ఎప్పుడు వస్తాయో నాకు ఎలా తెలుస్తుంది?''

వ్యాపారి: ''నీవు తెలుసుకోలేవు. అందుకే అవకాశం వచ్చేంతవరకూ గెంతుతూనే ఉండాలి.''

## ఈగలు – ఏనుగులు

టీచర్ (సుధతో): ''ఈగలకూ, ఏనుగులకు మధ్యనున్న వ్యత్యాసాన్ని చెప్పు.''

సుధ: ''అలాగే! ఏనుగుపైన ఈగలు ముసురుకోవచ్చు. కానీ ఈగలపైన ఏనుగులు ముసురుకోలేవు.''

## హృదయ పరివర్తన చెందిన వ్యక్తి

కొడుకు (తండ్రితో): ''ఎవరిని రాజకీయ దేశద్రోహి అంటారు.''

తండ్రి: ''మీ పార్టీని వదలి అవతలి

---

ఒక కోటి రూపాయలకు మించిన
కొత్త జీవిత పాలసీలను అమ్మిన




*గుజరాత్‌లోని జీవిత బీమా సంస్థ రాజ్‌కోట్ డివిజన్‌కు చెందిన జవహర్ ధోలకియా (Jawhar Dholakia) అతి ఎక్కువ నిలకడ గల బీమా ఏజంట్‌గా భావింపబడుతున్నాడు. 1969–70 సంవత్సర కాలంలో ఒక కోటి రూపాయలకు మించిన కొత్త జీవిత బీమా పాలసీలను అమ్మిన తొలి వ్యక్తి కూడా ఇతడే.*

''చిన్న చిన్న పేరులేని, గుర్తుపెట్టుకోని దయ, ప్రేమలతో కూడిన పనులే మంచి మనిషి జీవితంలో మరపురాని మంచిరోజులు.''

పార్టీలో చేరినవాడు.''

కొడుకు: ''అవతలి పార్టీను వదలి మీ పార్టీ చేరిన వాడిని ఏమంటారు?''

తండ్రి: ''హృదయ పరివర్తన చెందిన వ్యక్తి''

## సంతోషంతో ప్రియతమా!

భర్త (భార్యతో): కాస్త కాఫీ తెచ్చిపెడుదూ!

భార్య: అలాగే ఆనందంతో తెస్తాను ప్రియా!

భర్త: ఆనందంతో వద్దు కానీ పాలు చక్కెర మాత్రం కలిపి తీసుకురా!

## నేరుగా మీ వద్దకు వచ్చాను!

న్యాయవాది (కక్షిదారుడితో): ''నీకు రావలసినదాన్ని గురించి నీ ప్రతివాదితో చెప్పావా?''

కక్షిదారుడు: ''అయ్యా! చెప్పానండి.''

లాయర్: ''దానికి అతడేమన్నాడు?''

కక్షిదారుడు: ''దిక్కున్న చోటికి పోయి చెప్పుకో అన్నాడు.''

లాయర్: ''మరైతే నీవేమి చేసావు?''

కక్షిదారుడు: ''చేసేదేముంది? నేరుగా మీ వద్దకు వచ్చాను.''

## కృత్రిమ వర్షం




విమాన ప్రయాణాల్ని విస్తృతంగా పరిశీలించిన తరువాత వర్షాకాలపు మేఘాల ద్వారా వర్షం ఏర్పడే విధానపరమైన అవగాహన ఏర్పడడం వల్ల కొత్త విషయాల్ని తెలుసుకోవడంలో విజయాన్ని సాధించడం జరిగింది. పూనేలోని ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ట్రాపికల్ మీటియోరాలజీ (Indian Institute of Tropical Meteorology) వారు మేఘాలపై ఉప్పును చిలకరించి వర్షపాతంను ఎక్కువ చేయవచ్చునని తెలుసుకున్నారు. ఈ విధానం ప్రకారం మేఘాలపైన హెచ్చు మోతాదులో ఉప్పు చిలకరించాల్సి ఉంటుంది. ఈ విధంగా చల్లడం వల్ల వర్షాన్ని ఇచ్చే మేఘాలు త్వరగా ఏర్పడి భారీ వర్షాన్ని కురిపిస్తాయి. ఈ పద్ధతి ప్రకారం వర్షపాతాన్ని ఎక్కువ చేసే ప్రణాళిక మంచి పరిణామాల్ని ఇస్తోందని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

(– పి.ఐ.బి. సౌజన్యంతో)

''జీవితంలో మీకు సంభవించే విషయాలను గురించి కాకుండా మీరు చేయగలిగిన విషయాలను గురించే ఎక్కువగా ఆలోచించండి.''

# ప్రపంచపు రీతి

ఇది చాలా రోజుల క్రిందటి మాట. అప్పట్లో బుద్ధ భగవానుడు జీవించి ఉన్నాడు. కిస గౌతమి (Kisa Gautami) అన్న స్త్రీ తన ఏకైక సంతానాన్ని కోల్పోయింది. ఈ శిశువు జననం ఆకుటుంబంలో ఒక సావంరస్యానికి కారణం



అయింది. ఇప్పుడు ఆ శిశువు మరణంతో ఆమె భవిష్యత్తు చీకటితో నిండింది. అమాయకత్వం కారణంగా చావుకు విరుగుడు ఒకటి తప్పక ఉండే ఉంటుందని అనుకోసాగింది.

చనిపోయిన తన శిశువును భుజాన వేసుకుని "అయ్యా నాశిశువును ఎవరైనా బ్రతికించగలరా?" అని ఇంటింటికి పోయి అడిగింది.

ఆమె బాధను చూసి ఒకతను జ్ఞానోదయమైన బుద్ధుడిని పోయి ప్రార్థించమని చెబుతూ 'అతడే నీ కొడుకుకు ప్రాణాన్ని ఇవ్వగలడు' అని చెప్పాడు!

మాతృప్రేమ ఆమెను బుద్ధుడి వద్దకు తీసుకువెళ్ళింది. నా కొడుకుకు ప్రాణాన్ని ప్రసాదించమని ఆమె బుద్ధుడిని వేడుకుంది.

"ఇంటింటికి పోయి కొన్ని ఆవ గింజలను తీసుకురా మరణం కారణంగా ఇంతవరకు ఏ ఇంటి సభ్యులకు బాధ దుఃఖం కలగలేదో ఆ ఇంటినుంచి మాత్రమే ఈ ఆవగింజలను తీసుకురావాలి," అన్న షరతును విధిస్తూ బుద్ధుడు ఆమె కొడుకుకు సహాయం చేయడానికి సంసిద్ధుడు అయ్యాడు.

## అభిప్రాయం

పాఠకులకు విలువలను
బోధిస్తున్న పత్రిక

*ఇంత తక్కువ ధరకు మీరు ఎంతో ఉపయోగకరమైన విషయాలను అందజేస్తున్నారు. పాఠకులకు చక్కటి విలువలను బోధిస్తున్న విస్డమ్ ప్రతి దాచుకోదగ్గది.*

*– బి. కృష్ణమూర్తి, అండర్ సెక్రెటరీ,*
*భారత ప్రభుత్వం (రిటైర్డ్), కొత్త ఢిల్లీ.*

"ప్రతి కర్తవ్యం పవిత్రమైనదే. కర్తవ్యాన్ని నిష్ఠతో పాటించడమే భగవదారాధనకు చెందిన ఉత్తమోత్తమమైన ఆరాధన."

బుద్ధుడి మాటలు విన్న 'కిస గౌతమి' తన కొడుకును బతికించుకోవడా నికి ఉత్సాహంతో బయలుదేరింది. ఆవ గింజలకోసం ప్రతి గడప తొక్కింది. ఆవ గింజలను ఇచ్చే వారైతే చాలా మంది ఆమెకు దొరికారు. కానీ దగ్గరివారు చని పోవడం వల్ల కలిగే విషాదానికి, దుఃఖా నికి గురికాని కుటుంబం మాత్రం ఆమెకు కనిపించలేదు. జీవించి ఉన్న వారికంటే కూడా చనిపోయినవారే ఎక్కు వగా ఉన్నట్లు ఆమె తెలుసుకుంది. ఆమెకు బుద్ధుడు పరోక్షంగా ఇచ్చిన ఉప దేశం అర్థం అయింది. తన కొడుకు అంత్యక్రియలను పూర్తి చేసి ఆమె బుద్ధుడి వద్దకు మళ్ళీ వెళ్ళింది. ఆయన ముందు నిలుచుని వినయంగా తలవంచి "ఓ మహాత్మా! చనిపోయిన నా కొడు కుకు ప్రాణం పోయవలసిన అవసరం లేదు. నాకు ఈ ప్రపంచపు స్వభావం పూర్తిగా అర్థం అయింది" అని చెప్పింది.

నీతి : నిత్యమూ సత్యమూ అయిన భగవంతుని పట్ల ప్రేమను పెంచుకోవాలి. భగవంతుడు తప్ప ప్రతి జీవి మరణానికి గురి అవుతుంది. ప్రపంచంలోని సమసి పోయి నశించే వ్యక్తులతో అనుబంధాన్ని పెంచుకోవద్దు.

– స్వామీ జ్యోతిర్మయానంద

## కొబ్బరి బోండాల నుండీ పాలపొడి



Coconut

*కేంద్ర ఆహార సాంకేతిక పరిశోధనా సంస్థ (Central Food Technological Research Institute) వారు కొబ్బరి బోండాల నుండీ పాలపొడిని తయారుచేసే విధానాన్ని అభివృద్ధి పరిచారు. ఈ పాల పొడిని ఉపయోగించి అనేక రకాల తీపి పదా ర్థాలనూ, తీపి లేని పదార్థాలనూ, బిస్కెట్లనూ –తయారు చేయవచ్చును. ఈ పాల పొడి ఆరు నెలలపాటు నిలువ ఉంటుంది. వెయ్యి కొబ్బరి బోండాల నుండీ 312 కి.గ్రా.ల కొబ్బరి పాలను పొందవచ్చును. ఇది 100 కి.గ్రా.ల కొబ్బరి బోండాల పాలపొడితో సమానం.*

---

## మిత్రుడు

*మొత్తం ప్రపంచం మనల్ని వదలి దూరంగా పోయినప్పుడు మన దరిచేరేవాడే మిత్రుడు.*

"అంకుశంలేని చెడు పెరుగుతూ పోతుంది. ఓర్చుకున్న చెడు మొత్తం శరీరాన్ని విషపూరితం చేస్తుంది."

# ఆదర్శవంతమైన భార్య

★ మీ భర్తను చూసి మీరు గర్వప డుతున్నారనీ, ఆయన్ని మీరు పూర్తిగా నమ్ముతున్నారన్న భావనను ఆయనలో కలి గించండి.



★ ఇతరుల సమక్షంలో ఉన్నప్పుడు పూర్తిగా కాకున్న చాలా విషయాలలో అతడితో ఏకీభవించండి.

★ అన్ని వేళలలో ఆయనను ఆకర్షిం చేందుకు అందంగా దుస్తులు వేసుకోండి.

★ ఆయన వద్ద రహస్యాలను దాచకండి.

★ అతను చేస్తున్న పనిలో ఆసక్తిని కలిగి ఉండండి.

★ అతనితో కూడా కలసి వివాహితు లైన మిత్రులకు విందులు ఏర్పాటు చేస్తూ ఉండండి.

★ ప్రతి మంచి సలహాకు ఆయనను అభినందించండి.

★ గడ్డు రోజులలోఆయనను ఉత్సాహ పరిచే మాటలతో చిరునవ్వును ప్రదర్శిస్తూ రండి.

★ మీరు పిల్లల మధ్య ఉన్నాసరే ఆయన కోసం ప్రత్యేకంగా కొంత సమ యాన్ని అభిరుచులను కేటాయించండి.

★ ప్రతి రోజూ మీరు ఆయన బాగు కోసం ప్రార్థన చేస్తున్నారన్న విషయం ఆయనకు తెలిసేలా చూడండి. ఆదర్శవం తమైన భర్త ఉన్న ఎలాంటి స్త్రీ అయినా సరే ఆదర్శవంతమైన భార్యగా ఉంటుంది. – బూత్ టార్కింగ్‌టన్

●

## చర్మాన్ని మెత్తబరిచే గులాబీజలం

*గులాబీలలో 'E' విటమిన్ పుష్కలంగా లభి స్తుంది. అందుకే ముఖానికి రాసుకునే పౌడరు డబ్బాలలోనూ, చర్మానికి సంబంధించిన టాని క్కులలోనూ దీన్ని వాడుతారు. గులాబీ జలం చర్మాన్ని మెత్తబరిచే ద్రవంగా బాగా ప్రచా రంలో ఉంది.*

''ఓర్పు అన్నింటికి అవసరం. గుడ్డు పొదిగినప్పుడే పిల్ల వస్తుంది, బ్రద్దలు చేయడం వల్లకాదు.'' – ఆర్నాల్డ్ గ్లాస్‌గో

# సామాన్యునికి న్యాయశాస్త్రం

## చెక్కులను తిప్పికొట్టడం

పి. పాండురంగారావు

తగిన మొత్తం ఖాతాలో లేనప్పుడు ఆ మొత్తాన్ని జమ చేయకుండా, బాంకు స్వీకారం కోసం, ఇతరుల పేర చెక్కును రాసి ఇవ్వడం, అన్నది ఒక అపరాధం. ఆ విధంగా చెక్కును జారీ చేసిన వ్యక్తి కారాగార శిక్షకూ లేదా జరిమానాకు లేదా రెండింటికి అర్హుడు.



నెగోషబుల్ ఇన్స్ట్రుమెంట్ చట్టంలోని 138వ విభాగం ప్రకారం, చెక్కు రాసి ఇస్తున్న వ్యక్తి, తాను రాస్తున్న మొత్తంకు సరిపడే ధనం తన ఖాతాలో ఉన్న విషయాన్ని నిర్ధారించుకున్న తరువాతనే ఇస్తూ, బాంకులు దాన్ని స్వీకరించేందుకు అనువుగా ఉండేట్లు చూసుకోవాలి.

బాంకులో చెక్కు స్వీకరింపబడనప్పుడు చెక్కును బాంకులో జమ చేసిన వ్యక్తి చిరునామాకు తిప్పి పంపబడుతుంది. అంతేకాదు చెక్కును ఏ కారణంగా వారు తిప్పిపంపుతున్నారో ఆ కారణాలను కూడా వారు రాసి స్వీకరింపబడని చెక్కుతో సహా పంపుతారు. 'తగిన మొత్తం ఖాతాలో లేదు' 'కావలసిన మొత్తంకు సరిపోయే డబ్బు ఏర్పాట్లు చేయబడలేదు' 'జమలో ఉన్న మొత్తం కంటే ఎక్కువ మొత్తానికి రాసి ఇవ్వబడింది' 'చెక్కు ఇచ్చిన వ్యక్తి డబ్బులను ఇవ్వకండి అని బాంకుకు తెలియజేసాడు.' 'చెక్కు రాసి ఇచ్చిన వ్యక్తికి పంపండి' మొదలైన కారణాలలో ఏదో ఒక కారణం రాసి పంపినప్పుడు పై చట్టంలోని 138వ విభాగం ప్రకారం ఆ చెక్కును జారీ చేసిన వ్యక్తి చట్టపరమైన చర్యకు అర్హుడు.

---

## ఎక్కువగా అమ్ముడు పోతున్న మహిళల పత్రిక

*కొట్టాయం (కేరళ) నుండి వెలువడుతున్న 'వనిత' పత్రిక మహిళల పత్రికలలో అతి ఎక్కువ కాపీలు అమ్ముడుపోతున్న పత్రిక.*

''నిన్ను కన్న అమ్మను వదలి, రాతి బొమ్మలోని అమ్మను కొలవడం వృథా.'' – మీరా వలీ

తీసుకున్న మొత్తానికిగానీ, లేదా అందులోని ఒక భాగానికి గానీ, లేదా చట్టపరంగా తీర్చవలసిన ఇతర అప్పులను తీర్చేందుకు ఇవ్వబడిన చెక్కును ఇచ్చిన తారీఖు నుండీ ఆరు నెలల లోపుగానీ ఇవ్వబడిన గడువు లోపలగానీ బాంకులో జమ చేయవచ్చును. పైన కనబరిచిన ఏ కారణాన్నైనా పేర్కొంటూ చెక్కును స్వీకరించకుండా డబ్బులు ఇవ్వకుండా తిప్పి గొడితే చెక్కు ఎవరిపేరుపై ఇవ్వబడిందో లేదా అది ఎవరి ఆధీనంలో ఉందో ఆ వ్యక్తి చెక్కు తిప్పిపంపబడిన 15 రోజుల లోపుగా తప్పనిసరిగా రాత మూలకంగా చెక్కు ఇచ్చిన వ్యక్తికి పిర్యాదు చేయాలి తనకు చెక్కు ద్వారా రావలసిన మొత్తం ఇవ్వవలసిందిగా చెక్కునిచ్చిన వ్యక్తిని కోరాలి ఇలా చెక్కు ఇచ్చిన వ్యక్తి నోటీసు ఇవ్వబడిన 15 రోజుల లోపల ఇవ్వవలసిన డబ్బులకు సంబంధించిన మొత్తాన్ని ఇవ్వనప్పుడు తిప్పి కొట్టబడిన చర్య పూర్తి అవుతుంది. ఆ తరువాత ఆ చెక్కును రాసి ఇచ్చిన వ్యక్తిపై చట్ట సమ్మతమైన చర్య పై చట్టంలోని 138వ విభాగం ప్రకారం తీసుకోబడుతుంది.

వ్యక్తులూ, కంపెనీ భాగస్వాములూ, కంపెనీ తరఫున చెక్కులు ఇచ్చే అధికారం గల మేనేజ్‌మెంట్‌కు సంబంధించిన వ్యక్తులూ లేదా కంపెనీ పైన చెప్పబడిన వాటిలో ఏది సమంజసమో వారిపైనా దానితో కూడా చివర చెప్పబడిన దేనిపైనా పై చట్టంలోని 138వ విభాగం ప్రకారం కోర్టులలో దావా వేయవచ్చును.

ఈ అపరాధానికి ఒక సంవత్సర కారాగారశిక్షతోపాటు జరిమానా లేదా జరిమానా వేయబడుతుంది. చెక్కులో రాసి ఇవ్వబడిన మొత్తానికి రెండింతలు మొత్తంను జరిమానాగా లేదా రెండుగా పొడిగించవచ్చును.

విధించబడిన జరిమానాలోని కొంత భాగాన్ని నిందితుడు (చెక్కు ఇచ్చిన వ్యక్తి) ద్వారా బాధితుడికి (రాసి ఇచ్చి చెక్కును అందుకున్న వ్యక్తికి) జడ్జి నష్టపరిహారంగా ఇప్పించవచ్చును. మిగతా మొత్తాన్ని ప్రభుత్వానికి జరిమానాగా చెల్లించాలన్న ఆదేశాలను కూడా జడ్జి ఇవ్వవచ్చును. ●

## ''వెయ్యి సరస్సుల దేశం''




ఫిన్‌లాండ్ *(Finland)* ''వెయ్యి సరస్సుల దేశం''గా ప్రసిద్ధికెక్కింది.

''సంకోచం లేకుండా ఇవ్వడం, విచారించకుండ ఓడిపోవడం, అల్పత్వం లేకుండా సంపాదించడం నేర్చుకో.''
– జి. సాండ్

# కొత్త సంవత్సరపు ఆలోచనలు

ఇతరుల పట్ల మనం ఉపయోగించే మంచి మాటల పైనా, వారిని గురించి మనం ఆలోచించే తీరుపైనా మన సుఖ సంతోషాలు చాలా వరకు ఆధారపడి ఉంటాయి.



హృదయంలో నవ్వును భద్రపరుచుకున్న వ్యక్తే ఆశావాది అవుతాడు. అతడి వద్ద ప్రతి అపజయంలోనూ జయాన్ని చూడ గల చూపు ఉంటుంది.

మన మనసులో మనం ఎంతగా ఎదు గుతామో అంతగా ఇతరులలో మరిన్ని మంచి గుణాలను చూడగలుగుతాము.

ఇతరుల పట్ల మంచిగా వ్యవహరించడం మీ పట్ల మంచిగా వ్యవహరించే ఉత్తమ మార్గం అవుతుంది.

మీ కోసం గొప్ప ఆదర్శాలను సృష్టించుకుని వాటికి కట్టుబడీ ఉండే ధైర్యాన్ని మీలో పెంచుకోండి.

అదృష్టానికి నోచుకోని అభాగ్యులకు సహాయం అందించడానికి ఎంతగా ప్రయత్నిస్తారో అంతగా మీ గుణశీలాలు ఎదుగుతాయి.

మీరు జీవించే అర్హతతో కూడిన జీవితం మీతో సమసిపోదు.

## ఒక మైలు పొడవున్న పుస్తకం

*మయన్మార్ (బర్మా)లోని మాండలే* *(Mandalay) రోడ్డులో ఉన్న ఒక గోడపై 728 టన్నుల బరువున్న చలువరాతి బండలపై ఒక మైలు పొడవున్న పుస్తకం రాయబడింది ఈ పుస్తకం పేజీలను చలువరాతి పలకాలుగా ఒక గోడ ఆకారంలో అమర్చడం జరిగింది. ఇవి ఒకటి తరువాత ఒకటిగా తూర్పు నుండీ పడమరకు, ఉత్తరం నుండీ దక్షిణంకు అతికించబడి ఉన్నాయి. ఆశ్చర్యాన్ని కలిగించే ఈ పుస్తకంను మొత్తం చదివేందుకు అయిదు సంవత్సరాలు పడుతుంది. ఈ పుస్తకాన్ని ప్రజలు నిలబడే చదవాలి. పాలీభాషలో రాయబడిన ఈ గ్రంథం ''కుషొదావో'' (Kusho Dao)–ను బర్మాకు చెందిన మహాత్ముడు యు ఖాంటి (Yu Khanti) రచించాడు.*

''మంచి సలహాను మించిన విలువైన కానుక మరొకటి లేదు.'

చిన్న చిన్న విషయాలను చక్కగా చేయడమన్నది ఎవరు ఇది వరకు ప్రయత్నం చేయని గొప్ప పనులను గురించి కలలు కనడం కంటే ఎంతో మెరుగైనది.

మీ జీవితపు విజయం ఫలానా కార్యంపై ఆధారపడి ఉందన్న సంగతి తెలుసుకుని మీరు దాన్ని సాధించడానికి ఎంత దృఢచిత్తులుగా ఉంటారో అంతే దృఢచిత్తంతో అది ఎంతటి పెద్దపని అయినాసరే దాన్ని పూర్తి చేయండి.

కార్యభారాన్ని మోయగల భుజాలపైనే కర్తవ్యం అనే భారం మోయబడుతుంది. కర్తవ్యాల భారాన్ని ఎలా మోయాలో తెలుసుకున్న వ్యక్తినే జయలక్ష్మి వరిస్తుంది.

చనిపోయేందుకే పుట్టినవారు కాదు కాని ఇతరుల మనస్సులో జీవించడానికి చనిపోయిన వారే అతి గొప్ప వ్యక్తులు, నాయకులు అవుతారు.

సముచితమైన లక్ష్యాన్ని ఎన్నుకోండి. ఆ దిశలో ప్రయాణం చేసి మీ లక్ష్యాన్ని, గమ్యాన్ని చేరి దాన్ని సాధించండి. ఆ తరువాత అంతకుమించిన గమ్యాన్ని మీ ముందు ఉంచుకుని – దాన్ని సాధించేందుకు మీ సాయశక్తులా ప్రయత్నించండి. అలా చేసినప్పుడు మీ గుణాలు మూస వేయబడతాయి. దేశాల ఔన్నత్యం, పతనం అన్నవి వ్యక్తుల గుణగణాల పైనే ఆధారపడి ఉంటాయి.

## మన మదిలో మెదలవలసిన నాలుగు స్థిరమైన ఆలోచనలు



★ *వివేకంతో కూడిన మన మదిలో కింద కనబరచిన నాలుగు నిర్ణయాలు మెదలుతూ ఉండాలి. అప్పుడే జీవితానికి అవి సరైన మార్గాన్ని చూపించగలవు.*

★ *ఎలాంటి అపజయాల్ని చివర్లో ఎదుర్కొన్నాసరే ఓటమిని అంగీకరించడానికి తయారుగా ఉండే దృఢ నిర్ణయాన్ని కలిగి ఉండాలి.*

★ *అన్నింటిలో ఉన్న మీ ఉత్తమ సామర్థ్యం కంటే అన్ని విధాలా తక్కువ స్థాయిలో ఉన్న ఆకర్షణకు లొంగను అన్న దృఢ సంకల్పాన్ని కలిగి ఉండాలి.*

★ *మిమ్మల్ని ఎవరు ఎంతగా రెచ్చగొట్టినా కోపం తెచ్చుకునేందుకు తిరస్క[illegible]ాలి.*

– జాన్ హెచ్.క్రో

"నిన్ను పొగడి నీ ముందు ఇంకొకరిని నిందిస్తే సహించకు, ఇంకొకరి దగ్గర వారిని పొగడి నిన్ను నిందించడని ఎలా అనుకోగలవు?" – మీరా వలీ

# అందరూ అతిగా మెచ్చుకునే పదిమంది

★ పిల్లలతో ఆదర్శాన్ని గురించి మాట్లాడకుండా ఆదర్శంగా ఉండగలిగిన వ్యక్తి.

★ సహాయాన్ని పొందాలని తహతహ లాడకుండా సహాయం పడాలన్న కోరిక గల వ్యక్తి.



★ "అవును నాదే తప్పు. నన్ను క్షమించండి" అని చెప్పేందుకు సిద్ధపడే వ్యక్తి.

★ ఆకర్షణను బహిరంగంగా చూసి "కాదు" అని చెప్పగల ధైర్యం ఉన్న వ్యక్తి.

★ మిగతా అన్ని పనులకంటే కూడా దైవ కార్యానికి ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చే వ్యక్తి.

★ చేపట్టిన పనిని సక్రమంగా పూర్తి చేసి ఆపని చేయడంవల్ల వచ్చే శ్రేయస్సును ఇతరులకు ఇచ్చే వ్యక్తి.

★ గుడికి పిల్లలను పంపకుండా వారిని తీసుకువెళ్ళే వ్యక్తి.

★ ఇతరుల తప్పులను వేలు పెట్టి చూపే ముందు తన తప్పులను తానుగా చూసుకోగల వ్యక్తి.

★ ప్రతి ఫలాపేక్ష లేకుండానే తన సర్వస్వాన్నీ – ధనం, సమయం, ప్రతిభ – ఇతరులకు సమర్పించే వ్యక్తి.

– గైడ్ పోస్ట్స్ ●

---

## సాదా జీవితాన్నీ ఉత్తమ ఆలోచనలనూ ప్రబోధించే ఆత్మకథలు

*"గొప్పవారి ఆత్మకథలు ముఖ్యంగా మంచి వారి ఆత్మకథలు చాలా ఉపదేశం ఇచ్చేవిగానూ, ఉపయోగకరంగానూ ఉంటూ మార్గదర్శకులుగా ఉంటాయి. అవి ఇతరులకు స్ఫూర్తినిచ్చేవిగా కూడా ఉంటాయి. ఉత్తమమైన కొన్ని ఆత్మకథలు గీతా వాక్యాలులాగా ఉంటాయి. ఇవి ఉత్తమ ఆలోచనలను రేకెత్తించేవిగా ఉంటాయి. తమ మంచి కోసం, ప్రపంచం మంచి కోసం ఉత్సాహంతో పనులను చేపట్టేందుకు కావలసిన ప్రేరణను కూడా అవి ప్రసాదిస్తాయి."*

'గుణానికి మనకంటే ఎక్కువ వాళ్ళతోనూ, ధనానికి మనకంటే తక్కువ వాళ్ళతోను పోల్చుకోవాలి'

– అమ్మ

---

# మీకు తెలుసా?

సులక్షణా శ్రీనివాసన్

★ మనకున్న గ్రహాలలో శుక్ర (Venus) బుధ (Mercury) గ్రహాలకు మాత్రమే ఉపగ్రహాలు (Satellites) లేవు.




★ ప్రపంచపు తొలి పరీక్ష నాళిక (Test tube) కవలలు 1981వ సంవత్సరం జూన్ నెలలో జన్మించారు.

★ బంధింపబడిన డేగలు ఆ స్థితిలో 46 సంవత్సరాలు జీవించగలవు.

★ ఆఫ్రికాలో 45 రకాల కొమ్ములు ఎక్కువగా ఉన్న విభిన్న జింకలు ఉన్నాయి.

★ ఒక సంవత్సర కాలంలో మనిషి గుండె 40,000,000 సార్లు కొట్టుకుంటుంది.

★ 77 సంవత్సరాల వయసుగల భారతీయం ఏనుగు – జెస్సీ (Jessie) ఆస్ట్రేలియా దేశపు సిడ్నీ నగరంలోని టరోంగా (Taronga) జంతు ప్రదర్శనశాలలో 1939వ సంవత్సరంలో చనిపోయింది.




★ జెర్రులకు (Centipedes) 28 మొదలు 354 వరకు కాళ్ళు ఉంటాయి.

## 1987వ సంవత్సరపు రిలయన్స్ కప్

*ఇంతవరకు రానంతమంది ప్రజలు 1987వ సంవత్సరం నవంబరు నెల 8వ తారీఖున మనదేశపు కలకత్తా మహానగరంలో ఇంగ్లాండు – ఆస్ట్రేలియా జట్లకు మధ్య జరిగిన రిలయన్స్ కప్ (ప్రపంచ క్రికెట్ కప్) ఆటను చూడడానికి వచ్చారు.*

''తప్పు చేస్తామేమోనను నిరంతర భయోత్పాతానికి మించిన తప్పిదం లేదు.'' – హబ్బార్డ్

★ వాల్ట్ డిస్నీ సృష్టించిన డొనాల్డ్ డక్ మొదట్లో డొనాల్డ్ డ్రేక్‌గా పిలువ బడేది.




★ చాలామంది మనుషులు ఒక నిమిషానికి సుమారుగా 25 సార్లు తమ కళ్ళను మిణకరిస్తారు.

★ ఊలు ఉన్న ఒక గొర్రె శరీరంపై 26 మిలియన్ల ఊలు ఉంటుంది.

– 'డిగ్నిటీ డైలాగ్' సౌజన్యంతో

●

---

## వికెట్‌కీపర్ ఔట్ చేసిన ఆటగాళ్ల గరిష్ఠ సంఖ్య

*1982వ సంవత్సరంలో ఆస్ట్రేలియా ఇంగ్లాండు జట్ల మధ్య జరిగిన ఆటలలో వికెట్ కీపర్ రోడ్నీ మార్ష్ (Rodney Marsh) అతి ఎక్కువమంది ఆటగాళ్ళను ఔట్ వేసి రికార్డు సృష్టించాడు.*

## Statement about ownership and other particulars about newspaper ""Wisdom" Madras - 600 004.

## Form IV (See Rule 8)

| | |
|---|---|
| 1 Place of Publication | Madras |
| 2 Periodicity of its Publication | Monthly |
| 3 Printer's Name | K.V.S VIJAYA KUMAR |
| Nationality | Indian |
| Address | 9, Desika Road, Mylapore, MADRAS-600004 |
| 4 Publisher's Name | K V.S VIJAYA KUMAR |
| Nationality | Indian |
| Address | 9, Desika Road, Mylapore, MADRAS-600004 |
| 5 Editor's Name | K.V GOVINDA RAO |
| Nationality | Indian |
| Address | 9, Desika Road, Mylapore, MADRAS-600004 |
| 6 Name & Address of individuals who own the Newspaper and Partners | WISDOM PUBLI-CATIONS 9, Desika Road, Mylapore, MADRAS-600004 |

I, K V S VIJAYAKUMAR hereby declare the particulars given above are true to the best of my knowledge and belief

Date. 1-3-99

MADRAS - 600 004

(Sd ) K V S VIJAYA KUMAR
PUBLISHER

---

''తాగుబోతులకు రుచి తెలియదు. వాగుడు కాయలకు ఆలోచన ఉండదు '' – పూచ్యు

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

1. ప్రాణంతో సజీవంగా ఉన్న పక్షులలో అతి పెద్ద పక్షి పేరేమి?

2. రాతిని మలచికట్టిన సుప్రసిద్ధ కైలాస దేవాలయం ఎక్కడుంది?

   (ఎ) అజంతా (బి) బదామి (సి) ఎల్లోరా (డి) ఎలిఫెంటా.

3. 'ఘనా' దేశంకు ఇదివరకు ఉన్న పేరేమి?

   (ఎ) అబిసినియా (బి) గోల్డ్‌కోస్ట్ (సి) సురినామ్ (డి) రొడేషియా.

4. ఈ క్రింద కనబరిచిన ఏ ధాతువు (ore) నుండీ మనకు అల్యూమినియం లభిస్తుంది?

   (ఎ) సిడరైట్ (బి) క్యుప్రైట్ (సి) బాక్సైట్ (డి) రక్తలోహం (Haematite).

5. ఇటీవల పూర్తిచేయబడిన పడమటికోస్తా రైల్వే లైను – కొంకణ్ రైల్వే – పొడవు ఎన్ని కిలోమీటర్లు?

   (ఎ) 760 కి.మీ.లు (బి) 590 కి. మీ. లు (సి) 620 కి. మీ. లు (డి) 825 కి. మీ. లు (ఇ) 985 కి. మీ. లు

6. విజయనగర సామ్రాజ్యపు శిథిలాలు ఎక్కడ కనుగొనబడ్డాయి?

   (ఎ) హళేబీడు (బి) చితగ్గారు (సి) ఘంటశాల (డి) హంపి.

# అపూర్వ విషయాలు

8 సంవత్సరాల తరువాత చేరిన ఉత్తరం

*వారణాసికు చెందిన ఒక ట్రేడింగ్ కంపెనీ – రాజ దర్వాజా (ఉత్తరప్రదేశ్) పేర జాబు రాసి ఒక వ్యక్తి ఉత్తరప్రదేశ్‌లోని లక్నో నగరం నుండీ 1981వ సంవత్సరం మే నెల 18వ తారీఖున పోస్ట్ చేసాడు. దాదాపు 8 సంవత్సరాల తరువాత ఆ ఉత్తరం 1988వ సంవత్సరం డిసెంబరు నెల ఒకటవ తారీఖున గమ్యం చేరింది.*

'ఒక పని పద్ధతిలో చేసి, అది అలా ఎందుకు చేసామో వివరించేందుకు పట్టే టైము కంటే క్రమపద్ధతిలో చేయడం తెలిసే దాదు – టైము కలిసొస్తుంది ''

– లాంగ్‌ఫెలో

7. మనదేశపు ఈశాన్య దిశలో ఉన్న మేఘాలయ రాష్ట్రంలో ఏఏ తెగకు చెందిన కొండజాతి వారున్నారు?

(ఎ) ఖాసీ, సంథాల్ మరియు హోస్‌లు (బి) ఖాసీ, గడబా మరియు గారోలు (సి) ఖాసీ, జయంతియ మరియు గారోలు (డి) ఖాసీ, బిల్స్ మరియు ఖోండులు.

8. క్రింద కనబరిచిన ఏ పన్ను ద్వారా భారత ప్రభుత్వానికి ఎక్కువ రాబడి లభిస్తోంది?

(ఎ) ఆదాయం పన్ను (బి) సెంట్రల్ ఎక్సైజ్ (సి) కార్పొరేటు పన్ను (డి) కస్టమ్స్.

9. కేంద్ర బియ్యం పరిశోధనా కేంద్రం (The central Rice Research Institute) మనదేశపు ఏనగరంలో స్థాపించబడింది.?

(ఎ) హైద్రాబాద్ (బి) తంజావూరు (సి) అలహాబాద్ (డి) కటక్ (ఇ) రాయ్‌పూర్.

10. వచ్చే 2000వ సంవత్సరంలో ఒలింపిక్ క్రీడలు ఏనగరంలో జరగనున్నాయి?

(ఎ) మనిలా (బి) బీజింగ్ (సి) సిడ్నీ (డి) కేప్‌టౌన్ (ఇ) క్యోటో.

## మాటలమహిమ

1. దివస్పతి: (ఎ) సూర్యుడు (బి) ఇంద్రుడు (సి) గుడ్లగూబ (డి) బృహస్పతి.
2. నుడువడి: (ఎ) త్వరత్వరగా (బి) త్రిశూల ధారుడు (సి) మాటలకారి (డి) మధ్యస్థుడు.

---

## ఆశియా ఖండపు అతి పెద్ద పూయబడిన ట్యూబుల గుమ్మటం



Largest dome with coated tubes in Asia

*కర్ణాటకలోని టుంకూర్ జిల్లాకు చెందిన అమ్మసంద్ర వద్ద మైసూర్ సిమెంట్ ఫాక్టరీ వారు నిర్మించిన జియోడెసిక్ (Geodesic) గుమ్మటాన్ని ఆశియా ఖండపు అతి పెద్ద పూయబడిన (Coated) ట్యూబుల గుమ్మటంగా భావిస్తున్నారు. 6,079.04 చ.మీటర్ల విస్తీర్ణం గల ఈ కట్టడము బొగ్గు నిలవకోసం వాడుతున్నారు.*

''ఏదీ కూడా ముందు అనుకున్నంత మధురంగా, చేతి కందిన మీదట ఉండదు.''

– ఎలియట్

3. బొక్కలాడు: (ఎ) సర్పము (బి) తిరిగివచ్చువాడు (సి) చినిగిన వస్త్రములను ధరించిన వ్యక్తి (డి) కొడుకున్నవాడు.

4. మెత్తబాఋ: (ఎ) ఒక రకం చేప (బి) ఎముకలగూడు (సి) అంగీకారం (డి) ఆలస్యం.

5. రసితము: (ఎ) చెరకు పాలు (బి) వెండితో చేసిన (సి) ఉఋము (డి) శృంగారం.

6. లుతితవము:(ఎ) అందమైన (బి) చలించినది (సి) దున్నపోతు (డి) హీనమైన.

7. వర్ణాటుడు: (ఎ) గాయకుడు (బి) అక్రమసంతానం (సి) వర్ణన చేయువాడు (డి) ఎదుగుతున్నవాడు.

8. శునీరము: (ఎ) మంచినీరు (బి) ఒక పక్షి విశేషం (సి) చంద్రకిరణం (డి) ఆడకుక్కల సమూహము.

## తెలివికి పరీక్ష

1. 99వ సంవత్సరం జనవరి ఒకటవ తారీఖునుండీ ఐరోపాలోని 11 దేశాలలో ప్రవేశపెట్టబడిన కొత్త కరెన్సీ పేరు?

2. ఇస్లాం లోని రెండు ప్రధాన శాఖల పేరేమి?

3. సోక్రటీస్ తాగిన విషం పేరేమి?

4. ఇటీవల జరిగిన ఆశియాడ్‌లో పరుగుపందెంలో రెండు బంగారు పతకాలను పొందిన పరుగుల రాణి పేరేమి?

5. మనిషి రక్తంలో ఏ మాత్రం ఉప్పు ఉంటుంది?

6. 10, డౌనింగ్ వీధిలో ఎవరుంటారు?

(జవాబులకు 62వ పేజీ చూడండి)

## ప్రపంచపు అతి వయోవృద్ధుడు




డానిష్ తెగకు చెందిన అమెరికన్ క్రిస్టియన్ మోర్టెన్‌సెన్ *(Christian Mortensen)* ప్రపంచపు అతి వయోవృద్ధుడు. ఇతడి వయసు 115 సంవత్సరాలు. అమెరికా దేశపు శాన్‌ఫ్రాన్సిస్కోకు సమీపంలో సాన్ రాఫావిల్ *(San Rafael)* వద్ద ఉన్న రిటైర్‌మెంట్ హోమ్‌లో ఇతడు నివసిస్తున్నాడు.

''శారీరక బలం యజమానిగా ఉన్న చోట న్యాయం బానిసగా ఉంటుంది.''

# అవీ - ఇవీ

## అరుంధతి రాయ్‌కు బూకర్ ప్రైజ్

దక్షిణ భారతదేశానికి చెందిన నవలా రచయిత్రి అరుంధతి రాయ్‌కు 1997వ సంవత్సరపు బూకర్ ప్రైజ్ ఆమె రచించిన "ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్" అనే నవలకుగాను ఇవ్వబడింది. ఇంగ్లీషు మాట్లాడే దేశాల వరకు ఇది చాలా ప్రతిష్ఠాత్మకమైన ప్రైజ్‌గా పరిగణింపబడుతోంది. ఈమెకు 21,000 పౌండ్లు బహుమతిగా ఇవ్వబడ్డాయి.

## అంతరిక్షపు మెడల్ గౌరవాన్ని పొందిన తొలి మహిళ

1996వ సంవత్సరంలో 188 రోజులు అంతరిక్షంలో గడిపిన 53 సంవత్సరాల మహిళ శ్రీమతి షన్నోన్ లూసిడ్ (Ms. Shannon Lucid)కు కాంగ్రెషనల్ స్పేస్ మెడల్ ఇవ్వబడింది. ఇటువంటి ప్రైజ్‌ను పొందిన తొలి మహిళ ఈమే. రష్యా వారి అంతరిక్ష కేంద్రం "మిర్" (Mir) వరకు ఆమె చేసిన ప్రయాణం అతి పొడవైన ప్రయాణం. ఇంతదూరం ఇది వరకు ఏ మహిళకాదు ఏ అమెరికన్ కూడా చేయలేదు.

## అతి తేలికైన వస్తువు - స్తంభింపబడిన గాలి

అమెరికాలోని లారెన్స్ లివర్‌మోర్ నేషనల్ లాబొరేటరీ (Lawrence Livermore National Laboratory)కు చెందిన వైజ్ఞానికులు ఏరోజెల్ (Aerogel) అనబడే ఒక అసాధారణ కార్బన్ వస్తువును కనుగొన్నారు. ఈ వస్తువును "స్తంభింపబడిన గాలి" అని కూడా పిలుస్తారు. ఇదే ఇప్పటివరకు మనకు దొరుకుతున్న అతి

## జపాన్‌లోని అతి ఎత్తైన పర్వతం




*ఫుజి (Fuji) పర్వతమే జపానులోని అతి ఎత్తైన పర్వతం. 3,776 మీటర్ల ఎత్తున ఈ పర్వతం ఒక అగ్నిపర్వతం.*

"తెలుసుకున్న తప్పు సగం సరిదిద్దుకున్నదవుతుంది."

తేలికైన వస్తువు. ఈ ఏరోజెల్ (Aerogel) బహురకాలుగా ఉపయోగపడుతుంది. దీన్ని రక్షణ దళాలవారు కూడా ఉపయోగించుకోవచ్చును. నాలుగు ఘన సెంటీమీటర్ల ఏరోజెల్ ఒక కాలుబంతి ఆట మైదానమంత వైశాల్యాన్ని కలిగి ఉంటుంది.

## హిందీ పిసి – డాస్

మనదేశంలోని భాషాపరమైన అవరోధాలను అధిగమించేందుకు రెండు భాషలలో పనిచేసే హిందీ PC - DOS 1997వ సంవత్సరం, సెప్టెంబరు నెల 15వ తారీఖున టాటా – ఐబిఎం ప్రారంభించబడింది. మనదేశ జనాభాలోని 5 శాతం ప్రజలు మాత్రమే ఇంగ్లీషు మాట్లాడుతున్నారు. 360 మిలియన్ల హిందీ భాష మాట్లాడేవారు తమ భాష ద్వారా కంప్యూటర్‌కు చేరువ అయేందుకు ఈ కొత్త సాధనం ఉపయోగపడుతుంది.

## వియత్నాంలోని కొత్త జంతువు

చిన్న కొమ్ములు గలిగిన అంట్లర్ (Antler)ను పోలిన కొమ్ములు ఉండే జింకలా ఉంటూ కుక్కలా మొరిగే జంతువును 1997వ సంవత్సరంలో కనుగొన్నారు. వియత్నాంలోని హోచి మిన్హ్ (Hochi Minh) చిక్కటి అడవులలో దొరికిన పుర్రెల (Skulls) ద్వారా వాటి జాడను కనుగొన్నారు. (వరల్డ్ లైఫ్ ఫండ్ సౌజన్యంతో)

## తమ తండ్రుల నుండీ పిల్లలు ఏమికోరుతారు?



*1 ప్రేమను కురిపించే గుణాన్ని*

*2. తమతో సమయం గడపగల స్వభావాన్ని*

*3. తమ కళ్ళతో ప్రపంచాన్ని చూడగలగడాన్ని*

*4. తమకు హద్దుల్ని ఏర్పాటు చేసే నైపుణ్యాన్ని*

*5. తాము అనుకరించడానికి యోగ్యమైన గుణాల్ని గల వ్యక్తిని పిల్లలు తమ తండ్రులలో చూడడానికి ఇష్టపడతారు.*

*ఈ గుణాలన్నీ తల్లిలో ఉంటాయి. అయినా తండ్రి వద్దే పిల్లలు భద్రతను, రక్షణను పొందుతారు. ప్రపంచంలోని ఏ విషయం తండ్రి ప్రాముఖ్యతకు సరితూగదు.*

''ప్రేమతో నిండిన హృదయం ఉన్నవారి వద్ద ఇచ్చేందుకు ఏదో ఒకటి ఎప్పుడూ ఉంటుంది.''

## ఎర్రని అంగారక గ్రహంను చుట్టుతున్న సర్వేయర్




ఎర్రని అంగారక గ్రహం చుట్టూ ది మార్స్ గ్లోబల్ సర్వేయర్ ఉపగ్రహం ఒక సంవత్సరం కాలంగా తిరుగుతుంది భవిష్యత్ అంతరిక్షయాత్రలకు ఉపయోగ పడేలా అంగారక గ్రహం ఉపరితలంకు చెందిన అన్ని వివరాలతో కూడిన మాపు లను అది చిత్రించగలుగుతుంది.

## చినిగిన పాత నోట్ల నుండీ చిన్న చిన్న దిమ్మెలు

పాతబడిన, వాడకానికి పనికిరాని నోట్లను రిజర్వ్ బాంకు కాల్చి బూడిద చేస్తుంది. కానీ వాటిని మళ్ళీ ఇంకో విధంగా వాడగలిగే ఒక కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని రిజర్వ్ బాంక్ ఆఫ్ ఇండియావారు అవలంభిస్తున్నారు. 9 కోట్ల పెట్టుబడితో విదేశం నుండి దిగుమతి చేసుకోబడిన ఒక యంత్రం గంటకు 300 కి.గ్రా.ల కరెన్సీ నోట్లను చిన్న చిన్న ముక్కలుగా తయారు చేయగలదు. చినిగిన ముక్కలను గట్టిగా అణచి వాణిజ్యపరంగా పరిశ్రమపరంగా వాడబడే చిన్న దిమ్మెలను (Briquettes) బొగ్గు లాంటి ఇంధనంగా ఈ యంత్రం తయారుచేయగలదు. (ఎకనామిక్ టైమ్స్)

## స్వదేశీ సాంకేతిక పరిజ్ఞానంతో తయారుచేయబడిన పిఎస్ఎల్వి

ఆంధ్రప్రదేశ్ తూర్పుకోస్తా ప్రాంతంలో

## ఒక ప్రణాళికను తయారుచేసుకోండి

*సంతృప్తికరమైన అభిప్రాయానికి రావాలన్న ఆశతో ముందుకు పోయేవారు, దారిని చూపే ఒక ప్రణాళికను తప్పక తయారుచేసుకోవాలి. మీ సమస్యను లేదా మీ ఉద్దేశ్యాన్ని నిర్వచించుకోండి. మీకు అవసరమైన వాస్తవాలు మీకు ఎక్కడ దొరుకుతాయో నిశ్చయించుకోండి. మీ పరిశోధనను చేస్తూ ఫలితాల్ని ఒక నిర్ణీత మార్గానికి తీసుకురండి. అప్పుడప్పుడు మీ ప్రగతిని సరి చూసుకోండి. ఒక నిర్ణయాన్ని తీసుకునేందుకు కావలసిన విజ్ఞానంకు సంబంధించిన సూచన మీకు ఎప్పుడు లభిస్తుందో తెలుసుకోండి.*

*– ది రాయల్ బాంక్ ఆఫ్ కెనడా వారి నెలవారీ లేఖ*

"పెద్దల పట్ల అణకువను కలిగి ఉండడం కర్తవ్యం అవుతుంది. అదే మన తోటివారి పట్ల ప్రదర్శించడం మర్యాదను సూచిస్తుంది. చిన్నవారిపట్ల అణకువను చూపడం మనిషి గొప్పతనాన్ని సూచిస్తుంది."

ఉన్న శ్రీహరికోట నుండీ 1200 కి.గ్రా.ల బరువున్న దూరగ్రహణ ఉపగ్రహం (Remote Sensing Satellite)ను 1997వ సంవత్సరం సెప్టెంబరు నెల 29వ తారీఖు స్వదేశీ సాంకేతిక పరిజ్ఞానం ఆధారంపై నిర్మింపబడిన పోలార్ సాటిలైట్ లాంచ్ వెహికల్ (Polar Satellite Launch Vehicle - PSLV-CI)ను అంతరిక్షంలోకి విజయవంతంగా పంపగలిగారు.

## చైనాలోని కొత్త పర్వతం

హిమానీ నదాల (Glaciers) అధ్యయనం చేసిన చైనాదేశపు శాస్త్రజ్ఞులు తమ దేశంలో ఒక కొత్త పర్వతాన్ని కనుగొన్నారు. ప్రపంచంలోని ఎత్తైన పర్వతాలలో ఇది 15వ స్థానంలో ఉంది. ఈ పర్వతం క్సింజిఅంగ్ ఉయ్‌గుర్ (Xinjiang Uygur) స్వతంత్ర ప్రాంతంలో ఉంది. భూమట్టం నుండీ 8011 మీటర్ల ఎత్తులో ఉంది. దీనికి 'జోన్‌గైఅంగ్' (Zhongyang) అన్న పేరు ఇవ్వబడింది.

## ఫ్లాపీను ఆధారం చేసుకున్న డిజిటల్ కెమెరా

3.5 అంగుళాల ఫ్లాపీను (Floppy) ఆధారం చేసుకున్న తొలి నిశ్చల (Still) కెమెరాను సోని ఇండియా ప్రైవేట్ లిమిటెడ్ వారు 1997వ సంవత్సరం సెప్టెంబరు 2వ తారీఖున ప్రవేశపెట్టారు. ప్రతి ఫ్లాపీ డిస్క్ ఫిల్మ్ లాగా పనిచేస్తూ 40 ఫ్రేముల వరకు అది జాగ్రత్తపరచగలరు.

## జలగర్భంలో చిరుత



SAIL FISH

*గంటకు 90 కి.మీ.ల వేగంతో పరిగెత్తే చిరుతపులి భూమిపైన అతి వేగంగా పరిగెత్తే జంతువు. కానీ జలగర్భంలో దీనికంటే కూడా అతి వేగంగా – గంటకు 100 కి.మీ.ల వేగంతో ప్రయాణం చేయగల మరొక జీవి ఉంది. దీనినే ఇంగ్లీషులో సైల్‌ఫిష్ (sailfish) అంటారు. తన వీపుపై ఇది తెరచాపలాంటి తన రెక్కలను (Fins) బల్లపరుపుగా చేసుకుంటుంది. శరీరపు ఈ అమరిక కారణంగా దీనికి నమ్మలేనంత వేగం వస్తుంది. చాలా వేగంగా ఈదగలిగిన వ్యక్తి గంటకు 8 కి.మీ.లకు మించిన వేగంతో ఈదలేడు.*
*('రీడర్స్ డైజెస్ట్, డిడ్ యు నో' సౌజన్యంతో)*

"పూర్తి అనుబంధం సహకారం పరస్పరంగా బిందువులలో ఉన్న కారణంగానే బిందువులన్నీ కలిసి సింధువుగా మారుతాయి." – ఫ్రెడరిక్ అనేయిల్

# మీరు ఏ సమస్యనైనా పరిష్కరించగలరు

వి.కె. వేణుగోపాల్

ఎన్నికల సందర్భంగా ఒకసారి మన దేశపు ప్రధానమంత్రి పండిట్ జవహర్ లాల్ నెహ్రూ మద్రాసుకు రావడం జరిగింది. మెరీనాబీచ్‌లో ఏర్పాటైన బహిరంగ



సభలో అతడు ఉపన్యసించాడు. గుమికూడిన ప్రజలను ఉద్దేశించి మాట్లాడుతూ "మనదేశంలో 360 మిలియన్ల ప్రజలు ఉన్నారు. అందుకే మన సమస్యలు కూడా 360 మిలియన్లుగా ఉన్నాయి" అన్నాడు. అతడి మాటలలో అసత్యం ఏ మాత్రం లేదు. మనలోని ప్రతి ఒక్కరూ ఏదో ఒక సమస్యకు గురి అవుతున్నారు.

పరిష్కరించుకోవడానికి సమస్య అంటూ లేకపోతే జీవితం నిరుత్సాహంగా తయారవుతుంది. జీవించడంలో ఎలాంటి ఉత్సాహం లేకపోవడంతో ఎలాంటి ప్రగతినిగానీ, అభివృద్ధిని గానీ మనం సాధించలేము. నిజం చెప్పాలంటే సమస్యలే మన జీవితపు సవాళ్ళు. అవే మనలో జీవించాలన్న కోరికను రేకెత్తిస్తాయి.

సమస్య అంటే ఏమి? పరిష్కారాన్ని కోరే, విభేదాలతో కూడిన భావాన్నీ, ఆలోచననూ లేదా పరిస్థితిని సమస్యగా భావించాలి. అది ధనానికి సంబంధించినదా లేదా మనశ్శాంతిని భంగం చేస్తూ మనకు బాధను కలిగించే ఏ పరిస్థితికి సంబంధించినదైనా కావచ్చును. సమస్యలు వ్యక్తినుండీ వ్యక్తికి మారుతుంటాయి. అదే విధంగా ఒక చోటునుండీ మరో చోటుకు మారుతుంటాయి.

స్థూలంగా సమస్యలను మూడుతరగతు

### పుస్తకాల బరువును మోసే జంతువు

నేర్చుకున్నదాన్ని ఉపయోగించుకోలేని వ్యక్తి పుస్తకాల బరువును మోసే గాడిదలాంటివాడు. తాను మోస్తున్నది పుస్తకాల బరువా లేదా వంట చెరుకా అన్న జ్ఞానం గాడిదకు ఉండదు.

– సాడి

" భగవంతుడు తరగని అనంతమైన శక్తియొక్క ఖజానాలాంటి వాడు. ఆయనను గురించి నిరంతరం ధ్యానిస్తూ ఉండడం వల్ల మనకు శక్తి లభిస్తుంది." – రమాదేవి

లుగా – వ్యక్తిగతమైనవిగా, కుటుంబానికి సంబంధించినవిగా, సాంఘికం లేదా రాజకీయానికి సంబంధించినవిగా – విభజింపవచ్చును. సమస్య వ్యక్తిగతమైనదైతే దాన్ని ఎదుర్కొనే తీరాలి. పరీక్ష



రాయడం, ఒక ఇంటర్వ్యూకు హాజరు కావడం, లేదా వ్యాపారపరమైన కీలక నిర్ణయం తీసుకోవడంలాంటి వ్యక్తిగత సమస్యలను ఆ వ్యక్తే పరిష్కరించుకోవాలి. అతడు ఇతరుల నుండి సలహాలు పొందవచ్చును. కానీ తన సొంత తెలివితేటలపైన సామర్థ్యంపైనే పరిష్కారం ఆధారపడి ఉంటుంది.

సమస్య కుటుంబానికి సంబంధించినది అయినప్పుడు పరిస్థితులకు అనుగుణంగా సర్దుకోవడం లేదా వైఖరి మార్చుకోవడం చేయాల్సి ఉంటుంది. నేను పట్టుకున్న కుందేలుకు మూడే కాళ్ళు అని వాదించే స్వభావం సమస్యను పరిష్కరించేందుకూ ఎవరికీ సహాయపడదు.

కార్యాలయం నిర్వహణ, రవాణా, పన్నులూ ఆకాశాన్ని అంటుతున్న నిత్యావసరాల వస్తువుల ధరలు లాంటి సాంఘిక లేదా రాజకీయ సమస్యలు మన హద్దులలో ఉండవు. మన హద్దులకు బయట ఉన్న సంస్థలు లేదా ఏజన్సీల పైనే దీని పరిష్కారం పూర్తిగా ఆధారపడి ఉంటుంది. ఇటువంటి పరిస్థితులలో సక్రమమైన వైఖరిని అవలంబిస్తూ సరైన నిర్ణయాలు తీసుకోవాల్సి ఉంటుంది. ఇక్కడ ఇతరులను నిందించి ప్రయోజనం ఉండదు. దాని ద్వారా ఏ సమస్య పరిష్కరింపబడదు.

తరతరాలుగా సమస్యలు ఉంటూనే వస్తున్నాయి. మన తాత ముత్తాతలకు వారి ముందు తరం వారికి కూడా సమస్యలు

## తెలుసుకోదగిన విషయాలు

★ *బాగా ఎదిగిన తిమింగిలంకు సుమారు 3 టన్నుల ఆహారం కావలసి ఉంటుంది.*

★ *ప్రపంచంలోని అందరికంటే ఎక్కువగా స్విట్జర్లాండ్‌కు చెందినవారు తలసరిగా ఎక్కువ జున్నును వాడుతారు.*

★ *ప్రతి 20 మందిలోనూ ఒకే ఒక శిశువు డాక్టర్లు చెప్పిన రోజున పుడుతోంది.*

"అందరూ ఒకే వస్తువును చూస్తారు కానీ ఆ వస్తువును అందరూ ఒకేలా అర్థం చేసుకోరు. వివేకం అన్నది సూక్ష్మ పరిశీలన తరువాత రుచి చూసే నాలుక లాంటిది."

ఉండేవి. ఆ సమస్యలు వారి జీవిత కాలంలో పరిష్కరింపబడకున్నా ఆ తరువాతి తరాల కాలంలో పరిష్కరింపబడ్డాయి. మన తాత ముత్తాతల కాలంలో కొన్ని సమస్యలు ఉండేవి. ఆ సమస్యలు మన తండ్రి కాలంలో పరిష్కరింపబడ్డాయి. మన తండ్రి కాలంలో ఉన్న సమస్యలు మన కాలంలో పరిష్కరింపబడుతున్నాయి. ఇప్పుడు మనకు కొన్ని సమస్యలు ఉన్నాయి. రాబోయే కాలంలో అవి పరిష్కరింపబడవచ్చును. సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ జనాభా పెరుగుతూ ఉంటుంది. అదేవిధంగా సమస్యలు పెరుగుతూ ఉంటాయి.

మనకు సమస్యలంటూ ఏమీ లేక పోయినట్లైతే మనం ఎక్కడ ఉండి ఉండే వారమో ఊహించండి. గడచిపోయిన కాలంలో ప్రజలు జీవితాన్ని చీకట్లో గడిపే సమస్యలు ఉండేది. అందుకే లైట్లను కనుగొనడం జరిగింది. ఒక చోటునుండీ మరొక చోటుకు త్వరగా పోయి చేరడమనే సమస్య వారికి ఉండేది. ఆ కారణంగానే బస్సులను, రైళ్ళను ఇతర ప్రయాణ సాధనాలనూ వారు ప్రవేశపెట్టగలిగారు. వంట చెరుకు సహాయంతో అన్నం వండుకునే సమస్య అప్పట్లో ప్రజలకు ఉండేది. దీన్ని పరిష్కరించేందుకు విద్యుచ్ఛక్తిని కనుగొన్నారు. అంతేకాదు గాస్ స్టవ్‌లను కనుగొన్నారు. ఇంతకు ముందు ప్రజలకు తీరిక సమయం ఎక్కువగా ఉండేది. దానివల్ల పొద్దుగడపడం అనే సమస్యను వారు ఎదుర్కొన్నారు. దాని ఫలితంగా డ్రామాలూ, సినిమాలూ, రేడియోలూ, టెలివిజన్లు కనుగొనబడ్డాయి. గుడ్డలు ఉతుక్కోవడం అనే సమస్య ఇంతకు ముందు ఉండేది. ప్రస్తుతం మన వద్ద వాషింగ్ మిషన్‌లు ఉన్నాయి. ఇలా ఒకటి తరువాత మరొకటి

---

అడవి సీమకోడి




*అడవి సీమకోడిని అమెరికా ఖండంలోనే మనం చూడగలం. మగ సీమకోడి 122 సెం.మీ.ల పొడవు ఉంటూ 9కి.గ్రా.ల బరువు తూగుతుంది. ఆడసీమకోడి తన గూడును తానే కట్టుకుని అందులో 10 గుడ్లను పెడుతుంది. మగపక్షి సహాయం లేకుండానే ఆడ సీమకోడి తన పిల్లల్ని పెంచి పెద్ద చేస్తుంది. మెక్సికోలో ఇవి తొలుత మచ్చిక అయ్యాయి.*

''చిన్న వారి పట్ల తాము ప్రదర్శించే తీరు ఆధారంగా గొప్పవారు తమ గొప్పతనాన్ని కనబరుస్తుంటారు.''

మనం ఎన్నో రాస్తూ పోవచ్చును.

మన సమస్యలను పరిష్కరించుకుని సుఖంగా జీవితం గడపాలన్న ఉద్దేశంతో ఎన్నో వస్తువులు కనుగొనబడి వాడుకలోకి వచ్చాయి. అందుకే సమస్యలను అవరోధాలుగా భావించకుండా సవాళ్ళుగా భావించాలి. మనలో నిద్రాణంగా ఉన్న శక్తి సామర్థ్యాలనూ, తెలివితేటల్నీ, మేల్కొలిపేందుకు ఈ సమస్యలు అవకాశాన్ని కల్పిస్తాయి. సమస్యలు సమాజ ప్రగతి బాగోగులుతో పాటు సొంత బాగోగులు ప్రగతికి పాటుపడేందుకు సమస్యలు అవకాశాల్ని కల్పిస్తాయి.

సమస్యలు ఎందరో వ్యక్తుల జీవితాల్ని మార్చాయి. వేడినీళ్ళకు చల్లనీళ్ళగా ఉంటూ కుటుంబ ఖర్చులకు ఉపయోగపడతాయన్న ఉద్దేశంతో రాత్రిళ్ళు చాలా పొద్దుపోయేవరకు కూర్చొని పనిచేస్తున్న భార్యను చూసి ఎలియాస్ (Elias) మహాశయుడు కుట్టుయంత్రాన్ని కనుగొన్నాడు. తన భార్య సమస్యను పరిష్కరించి ఎలియాస్ గొప్ప ధనవంతుడు అయ్యాడు. అదే విధంగా ప్రజల సమస్యలను పరిష్కరించేందుకు కొంతమంది ప్రజలు వైజ్ఞానికులుగా, ఆవిష్కర్తలుగా, పారిశ్రామికవేత్తలుగా మారారు. సమస్యలు వీరి మనో వైఖరిని మార్చి వారి జీవితంలో గొప్ప మలుపులను తీసుకువచ్చాయి.

సమస్యల నుండీ దూరంగా పోవడం లేదా పారిపోవడం వల్ల తాత్కాలిక ఉపశమనం మనకు కలుగుతుంది. కానీ పారి

---

## విచిత్రమైన నిర్వచనాలు



బంధువులు: మీరు సంతోషంగా ఉన్నప్పుడు మిమ్మల్ని ఒంటరిగా వదలని వ్యక్తులు.

పొరుగువారు: మీ గురించి మీ కంటే కూడా బాగా తెలిసిన వ్యక్తులు.

పత్రికా విలేఖరి: ఒక పెద్దమనిషి ఎప్పుడు జీవించాడన్న విషయం తెలియకపోయినా ఫలానా పెద్ద మనిషి చనిపోయాడని ప్రకటించే వ్యక్తి.

చదువరి: తన టెలివిజన్ సెట్టును రిపేరీకు పంపిన వ్యక్తి.

మానసికరోగ చికిత్సకుడు: ఇతరులు బెంగ పడుతున్నంతవరకు తనను గురించి బెంగ పడని వ్యక్తి.

స్త్రీ: ముష్టియుద్ధం చేయడానికి పురుషులు ఇష్టపడే సమస్య.

''దానంగా మీరిచ్చిందంతా మీ సొంతం అవుతుంది. ఇవ్వనిది మీ సొంతం కానేకాదు.''
– గురునానక్

పోవడం, లేదా పట్టించుకోకుండా ఉండటం అన్నది సమస్యకు పరిష్కారం కాదు. విశ్వాసంతో,ధైర్యంతో సమస్యలను ఎదుర్కొన్నవారు ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూ తమ ప్రయత్నాలలో విజయాన్ని సాధించారు.

సమస్యను ఎదుర్కొన్నప్పుడు నిరుత్సాహపడవలసిన అవసరం లేదు. శాంతంగా ఉండండి. మీరు ఏమి సాధించదలచుకున్నారో లేదా ఏది పొందాలనుకుంటున్నారో మొదట్లో నిర్ణయించుకోండి. సమస్యను చూసి భయపడకండి భయపడటం అన్నది సక్రమమైన ఆలోచన కాదు. ఈ రకం వక్ర ఆలోచనలు సమస్యలను మరింత జటిలంగా తయారు చేస్తాయే కానీ వాటిని పరిష్కరించలేవు పరిష్కరించేందుకు ఒక మిత్రుడి లేదా శ్రేయోభిలాషి సలహా కోరడంలో ఎలాంటి తప్పులేదు. అంతే కానీ సమస్య పరిష్కారానికి అడ్డదారి అంటూ ఉండదు.

కొన్ని సమస్యలు పరిష్కరించడానికి వీలుకాని గడ్డు సమస్యలుగా ఉంటాయి అయినా కూడా నిరాశ చెందవలసిన పని లేదు. ఆత్మవిశ్వాసాన్ని కోల్పోకుండా భగవంతుడిపై నమ్మకం పెంచుకోండి. దానివల్ల కావలసినంత ధైర్యం, ఆత్మ విశ్వాసం లభిస్తుంది. అంతేకాదు పరిష్కార మార్గంవైపు అది మిమ్మల్ని తీసుకు వెళ్ళగలదు. అన్ని సమస్యలనూ పరిష్కరించగలనని మీరు నమ్మగలిగితే మీరు వాటిని తప్పక పరిష్కరించుకోగలరు.

( - 'హిప్నాటిక్' సౌజన్యంతో)

●

## ప్రాముఖ్యం లేని బిందువు కూడా ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడే




ఒక వైజ్ఞానిక సదస్సులో మాట్లాడుతూ బాగా పేరుమోసిన ఒక ఖగోళశాస్త్రజ్ఞుడు "ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడి దృష్టిలో మనిషి విలువ, ఈ అనంత విశ్వంలోని బిందువుకంటే ఎక్కువ కాదు" అని ప్రకటించారు.

ఆ సభలో సుప్రసిద్ధ సైంటిస్టు, నోబెల్ ప్రైజ్ గ్రహీత అయిన ఐన్‌స్టైన్ కూడా ఉండడం జరిగింది. అతను లేచి నిలబడి అప్పుడప్పుడు నాకు అనిపించేది ఇప్పుడు మాత్రం అంత ప్రాముఖ్యం లేని బిందువు లాంటి మనిషికూడా ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడే అన్న విషయం పూర్తిగా తెలుసుకున్నానని తన అభిప్రాయాన్ని బహిరంగంగా వెలిబుచ్చాడు

"సాధు స్వభావానికి మించిన బలం లేదు. నిజమైన బలానికి మించిన సాధువైనదీ, సునిశితమైనదీ మరేది లేదు"

# ఆలోచింపజేసే సంఘటన

## నిన్ను దండించాలి!

ప్రతిరోజు ఒక సంగీత వాద్యాల అంగడి ముందు ఒక కుర్రవాడు నిలబడి అంగడి లోపలి వాద్యాలను చూడసాగాడు. నా అంగడి ముందు ఎందుకు నిలబడుతున్నావని ఆ అంగడి యజమాని ఉస్తాద్ గురుబత్ అలీ ఆ




కుర్రాడిని అడిగాడు ''అయ్యా నేను హార్మోనియం నేర్చుకోవాలనుకుంటున్నాను'' ''మా ఇంటికిరా! నేను నేర్పుతాను'' అని ఉస్తాద్ ఆ కుర్రాడితో అన్నాడు. అంగడి తాళం చెవి తనకిస్తే అటు అంగడిని ఇటు వాద్యాలను శుభ్రం చేస్తానని ఆ కుర్రాడు యజమానిని ప్రార్థించాడు. ఆ కుర్రాడికి ఉద్యోగం దొరికింది.

రోజు కంటే కూడా ఒక రోజు ఆ అంగడి యజమాని ముందుగా అంగడి

## పుట్టకురుపు వ్యాధిని తెచ్చిపెట్టే మత్తుపానీయాలు

*ఫ్రాన్స్ దేశపు లియాన్ (Lyon) నగరంలోని పుట్టకురుపు వ్యాధిపరమైన పరిశోధనలను చేస్తున్న ఒక అంతర్జాతీయ సంస్థ (International Agency for Research on Cancer) ''మత్తుపానీయాల సేవనం'' అన్న విషయాన్ని పరిశోధించి 400 పేజీల రిపోర్టును ప్రచురించింది. ఆ రిపోర్టు చివర్లో వారు పుట్టకురుపు వ్యాధిని మత్తుపానీయాలు తెచ్చిపెడుతున్నాయన్న నిర్ణయానికి వచ్చినట్లు నమోదు చేసారు 19 మంది అంతర్జాతీయ నిపుణులు నోరు, స్వరపథ (Pharynx), స్వరపేటిక (Larynx), అన్నవాహిక (Esophagus), కాలేయం (Liver)కు సంబంధించిన పుట్టకురుపు వ్యాధులకూ, మత్తుపానీయాల సేవనకూ కారణంగా ఉన్నట్లు తేల్చి చెప్పారు.*

*మత్తు పానీయాల సేవనం పెరిగే కొద్దీ ప్రమాదం కూడా పెరుగుతుందనీ, ముఖ్యంగా తాగుడుతోపాటు పొగతాగేవారికి పొగాకు కారణంగా ఈ వ్యాధి సోకే ప్రమాదం మరీ ఎక్కువగా ఉంటుందని కూడా ఈ రిపోర్టు చెబుతోంది. ('వరల్డ్ హెల్త్' సౌజన్యంతో)*

''తప్పులు ఉన్నాయని తెలుసుకున్న తరువాత వాటిని సరిదిద్దుకోలేకపోవడం అన్నదే నిజమైన తప్పు.'' – కన్ఫ్యూసియస్

చేరుకున్నాడు. తియ్యటి బాణీలతో వాతావరణం నిండి ఉండడం యజమాని గ్రహించాడు. ఆ కుర్రవాడు హార్మోనియం వాయిస్తూ ఉండడం యజమాని చూసాడు. ''ఓహ్! అయితే ఇందుకా నీవు రోజూ అంగడికి తొందరగా వస్తున్నావు. ఈ బాణీలు నీకు ఎవరు నేర్పారు?'' ''ఎవరూ నేర్పలేదండి. ఆ బాణీలన్నీ నా సొంతమే''అని ఆ కుర్రవాడు భయపడుతూనే జవాబిచ్చాడు. ''అయితే నిన్ను తప్పక శిక్షించాలి'' అని యజమాని భీకరంగా అన్నాడు. ఆ కుర్రవాడు గజగజా వణికిపోయాడు. అది చూసి యజమాని ''చూడుబాబు! నీకు కావలసిన హార్మోనియంను నీవు ఎన్నుకో. దానిని నీకు నా కానుకగా ఇస్తాను''అని యజమాని ఉస్తాద్ - గురుబత్ అలీ ఆనందంతో అన్నాడు.

ఆ కుర్రవాడు మరెవరో కాదు. నేటి సుప్రసిద్ధ సంగీత దర్శకుడు నౌషాద్ అలీ. సుమారు 74 సినిమాలకు ఇతడు సంగీత దర్శకత్వం వహించాడు. మూడు టెలివిజన్ సీరియల్స్‌కు - సంగీతం కూర్చాడు. సుమారు 700 పాటలకు బాణీలను కట్టాడు.

- ఆర్. సీతా ('ఎంగ్‌వరల్డ్ సౌజన్యంతో)

## 1200 సినిమాలలో నటించిన నటి మనోరమ




*తమిళ తెలుగు సినిమాలలో మంచి నటిగా, పేరు ప్రఖ్యాతులను ఆర్జించిన మనోరమ వెయ్యిపైచిలుకు చిత్రాలలో 1985 నాటికే నటించింది. ''మాలయిట్టమంగై' అనే తమిళ సినిమాలో మొట్టమొదటిసారిగా ఈమె నటించింది. 1993 నాటికి ఈమె 1200 సినిమాలను పూర్తిచేసింది.*

## 83 శాతం చదువును మనిషి చూచి నేర్చుకుంటాడు

*తన అభిరుచి ఆధారంగా మనిషి ఒక శాతం చదువును నేర్చుకుంటాడు. అదే విధంగా 1.5 శాతంను స్పర్శద్వారానూ, 3.5శాతం వాసన ద్వారానూ, 11 శాతంను వినికిడి ద్వారానూ, 83 శాతంను చూడడం ద్వారానూ నేర్చుకుంటాడని గణాంక శాస్త్రాలు చెబుతున్నాయి.*

''ఏ తోటలో పూసినదైనాసరే గులాబీ అందంగా ఉన్నట్లే ఏ దివ్వెనుండి వెలువడినా సరే కాంతి మంచిదిగా ఉంటుంది.'' - డా. సర్వేపల్లి రాధాకృష్ణన్

# సత్సంబంధాలకు తొమ్మిది సూత్రాలు

యజమాని - ఉద్యోగుల సత్సంబంధాలకు 9 ప్రాథమిక సూత్రాలను ఇంజినీరు జార్జ్ ఎడ్వర్డ్ సూచిస్తున్నాడు. యువకుడు జార్జ్ ఎడ్వర్డ్ ఇంజినీరుగా తన జీవితాన్ని ప్రారంభించినప్పుడు ఆయన యజమాని ఈ సూత్రాలను రూపొందించాడు. ఆ సూత్రాలు:



★ అబద్ధం చెప్పకండి. అది మీ సమయాన్ని, నా సమయాన్ని వ్యర్థపరుస్తుంది. చివర్లో నీవు చేసిన తప్పును పట్టుకోగలనన్న విశ్వాసం నాకుంది.

★ గడియారాన్ని చూడకుండా జాగ్రత్తగా మీ పని చేయండి. రోజంతా చేసిన పని, రోజు పొడవును తగ్గిస్తుంది.

★ నేను ఆశించిన దానికంటే ఎక్కువగా పని చేయండి. మీరు ఆశించిన దానికంటే ఎక్కువగా నేను మీకు జీతం ఇవ్వగలను. నా లాభాలను మీరు పెంచ

---

## ఇక దిగులు పడవలసిన అవసరం లేదు

ముల్లానసీరుద్దీన్ హోడ్జా వద్దకు వచ్చి ఒక వ్యక్తి "అయ్యా నేను రాత్రిళ్ళు నిద్రపోలేకపోతున్నాను" అని విన్నవించుకున్నాడు.

"ఏ విషయం నిన్ను బాధపెడుతోంది?" అని ముల్లా ఆ వ్యక్తిని అడిగాడు.

"మా ఇంటి వెనుక ఉన్న తాటి చెట్టును మీరు చూస్తున్నారా! ఆ చెట్టు ఎప్పుడు నా గుడిసెపై పడిపోతుందో అన్న భయం కారణంగా రాత్రంతా మేలుకునే ఉంటున్నాం."

"ఆ తాటి చెట్టు వేళ్ళు బలంగా ఉంటాయి. వేర్లు భూమిలో లోతుగాపోయి ఉంటాయి. అందుకని ఎక్కడ పైన పడుతుందో అన్న భయాన్ని వదలివేయి" అని అన్నాడు హోడ్జా.

"ఈ రోజు రాత్రి తుఫాను వస్తే?" అని ఆ వ్యక్తి హోడ్జాను ప్రశ్నించాడు. చివర్లో హోడ్జా ఆ చెట్టును పడగొట్టమని ఆ వ్యక్తికి సలహా ఇచ్చాడు. కొట్టిన చెట్టు ఆ వ్యక్తి గుడిసెపై పడి ఆ గుడిసె నేలమట్టం అయింది.

"ఇప్పుడు నీవు నిశ్చింతగా ఉండవచ్చును" అని హోడ్జా అతడికి ధైర్యం చెప్పాడు.

"మనల్ని మనం వంచించుకోవడం అన్నది అన్ని వంచనల కంటే హీనమైనది."
– జి. బెయిలే

గలిగితే నేను మీ జీతాలను పెంచే స్థితిలో ఉండగలను.

★ మీరు మీకే చాలా ఋణపడి ఉంటారు . అందుకే మీరు ఇతరులకు ఋణపడి ఉండకండి. అప్పును మీ దరి దాపులకు రానివ్వకండి.

★ నిజాయితీ లేకపోవడం అన్నది ఆకస్మికంగా జరుగదు. మంచి స్త్రీల లాగానే మంచి పురుషులు కూడా ఆకర్ష ణను ఎదుర్కొన్నప్పుడు దాన్ని గుర్తించ గలరు.

★ మీ పనులను మీరు చేసుకుంటూ పొండి. సకాలంలోనే మీ మెదడులో మీ సొంత వ్యాపారం మెదలగలదు.

★ కార్యాలయంలో ఉన్నప్పుడు మీ ఆత్మగౌరవం దెబ్బతీయగల పనులను చేయకండి. నాకోసం దొంగతనం చేయగల పనివాడు నానుంచీ కూడా దొంగతనం చేయగలడు.

★ నేను వినడానికి ఇష్టపడే విష యంను గురించి నాతో చెప్పకండి. నా ఆడంబరంకోసం నాకు అంగరక్షకుడి అవసరం లేదు. నా డబ్బుకే అంగరక్ష కుడు కావాలి.

★ మిమ్మల్ని మీరు సరిదిద్దుకో గలి గితే నా వద్ద ఉద్యోగం చేయగల సామ ర్థ్యాన్ని కలిగి ఉంటారు. ●

## భారతీయ యాజమాన్యంలోని తొలి టెక్స్టైల్ మిల్లు




*విదేశీ పెట్టుబడితో మనదేశంలో తొలి టెక్స్టైల్ మిల్లు 1817వ సంవత్సరంలో ప్రారంభింపబడింది. 1854వ సంవత్సరంలో భారతీయ పెట్టుబడి యాజమాన్యం గల తొలి టెక్స్టైల్ మిల్లు ''ది బాంబే స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెనీ'' అన్న పేరుతో కూస్‌జీ ఎన్. దావర్ (Cawasji N. Davar) అన్న వ్యక్తిచే ప్రారంభింపబడింది.*

---

## సమీకృత విద్యే వివేకం

*మనలోని సమీకృత విద్యను వివేకం అంటారు. ఈ వివేకం మనకు తెలివితేటలతో కూడిన అంచనా ఆధారంగానూ, ఈ ప్రపంచం లోని ప్రత్యక్ష పరోక్ష అనుభవాల అధ్యయనం ద్వారానూ లభిస్తుంది.*

*– స్వామీ చిన్మయానంద*

''దూరాలోచనలగల వ్యక్తి తన వ్యక్తిగత అనుభవాల ద్వారా లాభాన్ని పొందితే వివేకవంతుడు ఇతరుల అనుభవం ద్వారా లాభాల్ని పొందుతాడు.'' – డా. జోసెఫ్ కోలిన్స్

# ఈ శతాబ్దంలో

## పాలనాధికారం మార్పు




1867వ సంవత్సరపు కెనడా రాజ్యాంగ చట్టాన్ని బ్రిటన్ నుండీ కెనడాకు మార్చే దస్తావేజుపై రెండవ ఎలిజబెత్ మహారాణి 1982వ సంవత్సరం, ఏప్రిల్ 17వ తారీఖున సంతకం చేసింది.

## బిరోకు ఇవ్వబడిన బాల్‌పాయింట్ పేటెంట్

ఒక వస్తువు తయారీపరమైన ప్రత్యేక హక్కును పేటెంట్ అంటారు. వశీకరణ విద్యాపారంగతుడూ, శిల్పి, పత్రికారంగానికి చెందిన ప్రముఖ వ్యక్తిగా పరిగణింపబడుతున్న హంగేరీకు చెందిన లాజ్లో బిరో (Lazlo Biro)కు 1943వ సంవత్సరంలో బాల్‌పాయింట్ పెన్ పేటెంట్ జూన్ నెల 10వ తారీఖున ఇవ్వబడింది. అతడు దీన్ని తొలిసారిగా 1938వ సంవత్సరంలో కనుగొన్నాడు.

## రెండవ ఎలిజబెత్ మహారాణి




తన తండ్రి ఆరవ జార్జ్ చక్రవర్తి మరణించిన తరువాత 1952వ సంవత్సరం ఫిబ్రవరి 6వ తారీఖున రెండవ ఎలిజబెత్ మహారాణి బ్రిటిష్ సింహాసనాన్ని అధిరోహించింది. ●

## అతి ఎక్కువ సంఖ్యలో తపాలా ఆఫీసులు

ప్రపంచంలో మరే దేశంలో లేనంత ఎక్కువ సంఖ్యలో తపాలా ఆఫీసులు మన దేశంలో ఉన్నాయి.

''ఇద్దరు ఒక విషయాన్ని గురించి ఏకాభిప్రాయం కలిగి ఉంటే అందులో ఒకరి అవసరం బొత్తిగా ఉండదు.'' – విలియం రింగ్‌లే జూనియర్

# హాస్యతోరణం

## కానీ అది మీ వెంట వచ్చింది

ఒక కళా ప్రదర్శనశాలలో ఒక వ్యక్తి అడుగుపెట్టాడు. ఆయన వెంటనే ఒక బంట్రోతు వచ్చాడు. అతని భుజం



తడుతూ వెంట వస్తున్న కుక్కను చూపుతూ ''చూడండి. కుక్కలను మేము లోనికి రానివ్వం'' అని దృఢంగా చెప్పాడు.

''అది నా కుక్క కాదు'' అని ఆ వచ్చిన మనిషి అన్నాడు.

''కానీ అది మీ వెంట వచ్చింది.''

''అది నిజమైతే మరి నీవు కూడా నా వెంట పడ్డావు కదా'' అని కాస్తంత చిలిపిగానే ఆ వ్యక్తి జవాబిచ్చాడు.

## మీరు ఈ రెండింటి సంపర్కంలోకి రారు

అవి విన్‌స్టన్ చర్చిల్ రాజకీయాలలో ప్రవేశిస్తున్న రోజులు. ఆయన రాజకీయ ప్రవేశానికి ఒక భద్ర మహిళ ఆక్షేపిస్తూ: ''చూడండి చర్చిల్ గారు మీ రాజకీయం కూడా మీ మీసాల లాగా చాలా మోటుగా (Clumsy) ఉందండి'' అని చెప్పింది. చర్చిల్ ఏమాత్రం తడబడకుండా ''మీరేం భయపడకండి! మీరు మాత్రం ఆ రెండింటి సంపర్కంలో రాబోవడం లేదు'' అన్నాడు.

## వివేకవంతుడైన రాజు – వాక్‌స్వాతంత్ర్యం

*ప్రజలను గడ్డిపోచలలాగ, మాలిన్యం లాగా భావించే రాజును ఒక బందిపోటు దొంగగానూ, ప్రజల శత్రువుగానూ భావించాలి. మనుషుల నోరును కట్టివేయడం అన్నది పారుతున్న నదీ ప్రవాహాన్ని ఆనకట్టద్వారా అడ్డుకోవడం కంటే కూడా చాలా ప్రమాదభరితమైన పని. తెలివిగల ఇంజనీరు నది పరీవాహక (basin) ప్రాంతాన్ని లోతు చేసి నీటి పారుదలను సులభతరం చేస్తాడు. అదే విధంగా తెలివిగల రాజులు తన ప్రజలను స్వేచ్ఛగా మాట్లాడేందుకు ప్రోత్సహిస్తాడు.*

– మెనిసియస్ (చైనా)

''న్యాయసమ్మతంగా వ్యవహరించే ముందు ఉదారంగా ఉండండి.''

## ఆలోచించేందుకు సమయం లేదు

ఒక బహిరంగ సభకు ఒక రాజకీయ నాయకుడు ఆలస్యంగా వచ్చాడు. ఆలస్యం అయినందువల్ల ఆదరాబాదరగా వేదికవైపు ఉపన్యాసం ఇచ్చేందుకు వడివడిగా బయలుదేరాడు. తొందరలో ఉన్న రాజకీయ నాయకుడిని ఆపుతూ "ఈనాటి రాజకీయ పరిస్థితులను గురించి మీరేమనుకుంటున్నారు" అని ఒక పత్రికా విలేఖరి ప్రశ్నించాడు

"అయ్యా! ఇది ఉపన్యాసం ఇవ్వవలసిన సమయం. నా వద్ద ఆలోచించడానికీ అనుకోవడానికీ ఏమాత్రం తీరిక లేదు" అని చెబుతూ ముందుకు సాగిపోయాడు.

## సంతోషం కోసమో లేదా లాభం కోసమో మాత్రమే చదువుతాను

ఒక పార్టీలో విన్‌స్టన్ చర్చిల్ తన దాయాది లార్డ్ లండన్‌డెర్రి (Lord Londonderry)ను కలవడం తటస్థించింది. తన వాదనలు చర్చిల్‌కు తృప్తినివ్వకపోవడంతో లార్డ్ లండన్‌డెర్రి చాలా చికాకు పడ్డాడు. "మరైతే మీరు నా కొత్త పుస్తకం చదవలేదా" అని చర్చిల్‌ను విసుగ్గానే ప్రశ్నించాడు. "లేదు! నేను సంతోషం కోసమో లేదా లాభం కోసమో మాత్రమే చదువుతాను" అని జవాబిచ్చాడు.

("హ్యూమరస్ కొటేషన్స్" సౌజన్యంతో)

## ప్రపంచపు ఏకైక తేలాడే పార్క్



Floating Island, Manipur (National Park)

*మన దేశపు ఈశాన్య ప్రాంతపు రాష్ట్రాలలో ఒకటైన మణిపూర్ రాష్ట్రంలో ప్రపంచపు ఏకైక తేలాడే పార్క్‌ను చూడవచ్చును. కీయబుల్ లామ్‌జావో (Keibul Lamjao) జాతీయ పార్కుగా దీనికి నామకరణం జరిగింది. మణిపూర్ రాష్ట్రపు రాజధాని నగరమైన ఇంపాల్‌కు దక్షిణంవైపు 53 కి.మీ.ల దూరంలో ఉన్న లోక్‌టక్ సరోవరం (Loktak lake) అంచులలో 40 కి.మీ.ల విస్తీర్ణతను ఇది కలిగి ఉంది. మణిపూర్‌కు చెందిన నృత్యం చేసే "సాంగాయ్" (Sangai) జింకలకు కూడా ఈ పార్కు చాలా ఖ్యాతిని పొందింది.*

– నిర్మలేందు చక్రవర్తి

## కళ్ళు

*మనిషి కళ్ళు–*
*83 శాతం విద్యకూ,*
*80 శాతం చర్యలకూ,*
*50 శాతం బలానికీ,*
*ప్రధాన కేంద్రాలు.*

"ఓటమిని ఒప్పుకోవడంలో ఏమాత్రం తప్పులేదు. ఒప్పుకోవడం అన్నదే గెలుపుకు సమానం." – గాంధీజీ

# ఎవరు గొప్ప భక్తుడు?

''నాకంటే గొప్ప భక్తుడు మీకు ఎవరైనా ఉన్నారా?'' అని ఒకసారి నారదుడు శ్రీ మహావిష్ణువుని అడిగాడు.



''నీవే నా గొప్ప భక్తుడవని నీవు ఎలా అనుకుంటున్నావు?'' అని విష్ణుమూర్తి నారదుడితో అన్నాడు.

''నేను నిరంతరం మీ నామజపం చేస్తుంటాను.''

భూమిపై ఉన్న ఒక రైతును చూపుతూ ''నీ కంటే కూడా ఆ రైతు గొప్ప భక్తుడు'' అని విష్ణువు నారదుడితో అన్నాడు.

విష్ణుమూర్తి మాటలను నారదుడు పూర్తిగా నమ్మకపోవడంతో విష్ణుమూర్తి, నారదుడు వీరిద్దరూ తమ తమ వేషాలను మార్చుకుని రైతులుగా భూలోకం వచ్చారు. అసలుసిసలైన భూలోకపు రైతు ఆ ఇద్దరి రైతుల కాళ్ళు కడిగి ''నారాయణ, నారాయణ, మీకు స్వాగతం'' అన్నాడు. భోజనం వడ్డించిన తరువాత 'నారాయణ' అంటూనే మొదటి ముద్దను నోట్లో పెట్టుకున్నాడు ఆ తరువాత పడుకోబోయే ముందు కూడా 'నారాయణ' అంటూనే నిద్రపోయాడు. ఈ భూలోకపు రైతు 'నారాయణ' అన్న మాటలను ఎన్నిసార్లు వాడుతున్నాడో మనసులోనే నారదుడు లెక్కపెట్టుకున్నాడు.

ఆ రైతు వద్ద సెలవు తీసుకుని రైతు వేషాలలో ఉన్న శ్రీమహావిష్ణువు నారదుడు అక్కడి నుండీ బయటపడ్డారు. నడుస్తూ ''అయ్యో! ఇది చాలా అన్యాయం, ఆ రైతు మీ పేరును కొన్నిసార్లు మాత్రం ఉచ్చరించాడు. అయినా మీరు మాత్రం అతడిని మీ గొప్ప భక్తుడిగా పరిగణిస్తున్నారు. ఇది ఏమంత సమంజసంగా లేదు'' అని నారదుడు అన్నాడు.

విష్ణుమూర్తి నారదుడికి వెంటనే జవాబు చెప్పకుండా ''నారదా నా కోసం దయ చేసి ఒక చిన్న పని చేసి పెట్టమన్నాడు.''

''తప్పకుండా దేవా?''

''నూనెతో నిండిన ఈ పాత్రను చేత్తో

''మనలోని మంచిని కాదుకాని చెడును తెలుసుకోవడానికి ప్రపంచం ఎల్లప్పుడూ ఎదురుచూస్తుంటుంది.''

పట్టుకుని అదుగో ఎదురుగా కనబడు తున్న ఆ గుట్టను చుట్టి రమ్మంటూ, నారదా! జాగ్రత్త! ఒక చుక్క నూనె కూడా ఒలికిపోకూడదు సుమా'' అన్నాడు.

''అదేమంత పెద్దపని'' అని ఆ నూనె పాత్రను తన తలపై పెట్టుకుని జాగ్రత్తగా ఆ గుట్టను చుట్టివచ్చాడు. ఒక్క నూనె చుక్క కూడా కింద ఒలికిపోకుండా నారదుడు తగిన జాగ్రత్తలను తీసుకున్నాడు.

ఎంతో గర్వంతో నారదుడు ఆ నూనె పాత్రను మహావిష్ణువు ముందు ఉంచాడు.

ఈ గుట్టను చుట్టుతున్నప్పుడు నారదా నీవు ఎన్నిసార్లు నామజపం చేసావు అని విష్ణువు అడిగాడు.

ఎదురు చూడని ప్రశ్న నారదుణ్ణి ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఒక్కసారి కూడా అతడు హరినామస్మరణ చేయలేదు. ''నేను మీ పేరును ఎలా స్మరించగలను. నా దృష్టి అంతా నూనె పాత్రపైనే లగ్నం అయి ఉంది కదా!'' అని జవాబు చెప్పాడు.

''ఆ రైతు నెత్తి మీద కూడా ఒక నూనె పాత్ర ఉంది. గృహస్తుడి బాధ్యతలను – పంటను పండించడం, పండిన దానిలో కొంత భాగం రాజుకివ్వడం, తన కాపురం బాగోగులను చూడడం, తాను నివసిస్తున్న ప్రాంతంలోని తన తోటి వారిని గురించి ఆలోచించడం లాంటివి నిర్వహిస్తున్నాడు. ఇన్ని బాధ్యతల నడుమ కూడా ఆ రైతు కొన్నిసార్లే అయినా సరే నా పేరును స్మరించాడు. నెత్తిపై ఒకే ఒక నూనె పాత్రను పెట్టుకున్న నీవు ఒక్కసారి కూడా నన్ను స్మరించలేదు'' అని విష్ణుమూర్తి నవ్వుతూ నారదుడితో అన్నాడు. నారదుడు విష్ణుమూర్తి చెప్పదలచుకున్న గుణపాఠాన్ని అర్థం చేసుకున్నాడు. తన గర్వం పట్ల నారదుడు సిగ్గుపడ్డాడు.

– ('పార్థ' సౌజన్యంతో) ●

## అమెరికా దేశపు ధనవంతుల పట్టీ




*కంప్యూటర్ల సాంకేతిక విజ్ఞానపు నిపుణుడుగా పరిగణింపబడుతున్న బిల్ గేట్స్ (Bill Gates) ఫోర్బ్స్ (Forbes) వారు తయారుచేసిన నాలుగు వందల మంది అమెరికా ధనవంతుల పట్టీలో మొదటిస్థానంలో ఉన్నాడు. ఇతడి ఆస్తి విలువను 39.8 బిలియన్ డాలర్లుగా అంచనా వేయడం జరిగింది.*

''మనం ఎక్కడున్నాం అన్నది కాదు. మనం ఏ దిశలో ముందుకు పోతున్నామన్నదే ఈ ప్రపంచంలోని గొప్ప విషయం.'' – ఆలివర్ వెండెల్ హోమ్స్

# వీరిని గురించి తెలుసుకోండి

జీన్ బాప్టిస్టే వాన్ హెల్మాంట్ (Jean Baptiste Van Helmont): బెల్జియంకు చెందిన విజ్ఞాన శాస్త్రజ్ఞుడు మరియు మందుల వ్యాపారి (Chemist) గ్రీకు భాషా పదమైన కేయాస్ (Chaos) నుండే ఇతడు 'గాస్' (Gas) అన్న కొత్తమాటను కూర్చాడు. బొగ్గుపులుసు వాయువునూ, ఇతర వాయువులనూ ఇతడు గుర్తించాడు.




టోనీ బ్లేయర్ (Tony Blair): 1997వ సంవత్సరం మే నెల 2వ తారీఖున బ్రిటిష్ ప్రధానమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసి పదవీ బాధ్యతను నిర్వహించిన వ్యక్తి. 44 సంవత్సరాల శ్రీ టోనీ బ్లేయర్ 1812వ సంవత్సరం నుండీ ఇంతవరకూ ప్రధాన మంత్రి పదవిని స్వీకరించిన వారిలో అతి పిన్న వయస్కుడు.

జనరల్ గమాల్ నాజర్ (General Gramal Nasser): ఈజిప్టు దేశపు తొలి అధ్యక్షుడు. ఆ దేశపు రాజు ఫరూక్ (Farouk)ను గద్దె దింపి ఈజిప్టును రిపబ్లిక్‌గా ప్రకటించాడు.

లానా టర్నర్ (Lana Turner): అమెరికా దేశపు నటి. అందచందాలను విర

---

### ఇది అసాధారణం

*పేర్లు కొన్ని చాలా విచిత్రంగా ఉంటాయి. ఒకసారి ఒక యూరోపియన్ దంపతులు తమ మగ సంతానానికి ఆడ్ (Odd) అని నామకరణం చేసారు. అసాధారణ అని అర్థాన్ని ఇచ్చే 'ఆడ్' అన్న మాట ఆధారంగా అతణ్ణి పిల్లలు గేలి చేసి ఏడిపించేవారు. 'ఆడ్' మాత్రం ఇవేమీ పట్టించుకునేవాడు కాదు. పెరిగి పెద్దవాడై ఆడ్ పేరుపొందిన అడ్వొకేట్ అయ్యాడు. అయినా ప్రజలు అతడిని పేరు కారణంగా అల్లరి పెట్టేవారు. బాగా వయసు మళ్ళిన తరువాత అతడు తన ఆఖరి కోరికను తన వీలునామాలో ఇలా రాసుకున్నాడు. "జీవితాంతం నేను ప్రజల జోకులకు కేంద్రబిందువుగా ఉంటూ వచ్చాను. నేను పోయిన తరువాత నన్ను అల్లరిపెట్టే మనుషులు ఉండరు" తన సమాధిపై ఏమీ రాయకూడదని ఇతడు తన వారిని కోరాడు.*

*ఆయన చనిపోయిన తరువాత ఏమీ రాయబడని సమాధిని చూసి ప్రజలు ఆశ్చర్యపోతూ 'That is Add' (ఇది చాలా అసాధారణం) అనడం ప్రారంభించారు.*

"భగవంతుడంటే భయపడతాను. ఆ తరువాత భగవంతుడంటే భయపడని వ్యక్తిని చూసి నేను ముఖ్యంగా భయపడతాను." – సాది

---

జిమ్మిన పాత్రలను ఈమె పోషించింది. ''ది పోస్ట్‌మేన్ ఆల్వేస్ రింగ్స్ ట్వైస్'' (The Postman Always Rings Twice - 1946),''పేటన్ ప్లేస్'' (Peyton Place - 1957) మొదలైన చిత్రాలలో మరపురాని గ్లామర్ పాత్రలను ఈమె పోషించింది.

రొనాల్డ్ కాల్‌మన్ (Ronald Colman): ఇంగ్లీషు నటుడు. 1937 నాటి ''లాస్ట్ హొరైజన్స్'' (Last Horizons), ''ప్రిజనర్ ఆఫ్ జెండా'' (Prisoner of Zenda)లోనూ ఇతడు మంచి రొమాంటిక్ పాత్రలను పోషించాడు.

గోపీకృష్ణ: సుప్రసిద్ధ కథక్ నర్తకుడు. సుమారు 800 హిందీ చిత్రాలకు నృత్య దర్శకత్వం వహించాడు. హిందీ సినిమా లలో అతి గొప్ప విజయాన్ని సాధించిన స్వర్గీయ వి. శాంతారాం ద్వారా నిర్మిం చబడిన ''ఝునక్ ఝునక్ పాయల్ బాజే'' చిత్రంలో నాట్యం చేసిన హీరోగా నటించి గొప్ప పేరును పొందాడు. ఒక సందర్భంలో గోపీకృష్ణ ఆగకుండా 9 గంటలు 20 నిమిషాల పాటు కథక్ నృత్యాన్ని ప్రదర్శించాడు.

వాసిరెడ్డి సీతాదేవి: పేరు ప్రఖ్యాతులను పొందిన తెలుగు నవలాకారిణి. వ్యాసరచ యిత్రిగా, అనువాదకురాలిగా కూడా ఈమె పేరు గడించింది. ఈమె ఇంతవ రకు 63 పుస్తకాలను ప్రకటించింది.

ఉమాశంకర్ జోషి (1911-88): సుప్రసిద్ధ గుజరాతీ కవి, నవలాకారుడితో పాటు మంచి కథా రచయిత, నాటక రచ యిత, విమర్శకుడు, అనువాదకుడు కూడా. 1972వ సంవత్సరంలో ప్రచురిం పబడిన ''కవినిశ్రద్ధా'' అనే రచనకుగాను అటు జ్ఞానపీఠ్ అవార్డునూ, ఇటు సాహిత్య అకాడమీ అవార్డును పొందాడు. ●

## ప్రపంచ జనాభాలోని వయోవృద్ధుల సంఖ్య




*ప్రపంచ జనాభాలోని వయోవృద్ధుల (65 సంవత్సరాలకు పైబడ్డవారు) సంఖ్యాపరమైన నిష్పత్తి 2025వ నాటికి మన దేశంలో 9.7 శాతానికి పెరగనున్నది. ప్రస్తుతం మనదేశంలో 60 సంవత్సరాలకు పైబడ్డవారు 4.75 కోట్లకు మించి ఉన్నారు. 2001వ సంవత్సరం నాటికి ఈ సంఖ్య పెరిగి 7.56 కోట్లకు పెరగగలదని భావింపబడుతుంది.*

''అనుభవపు ఊటనీరును తాగడాన్ని ఖాతరు చేయని వ్యక్తి అజ్ఞానపు ఎడారిలో దప్పికతో చనిపోతాడు.''
– లింగ్ పి.

# ప్రకృతి అమూల్య కానుక - ఉసిరిక

ఆమ్లా (Amla)గా పిలువబడే ఉసిరి కకు భారతీయం గూస్‌బెర్రీ (Gooseberry) అన్న పేరుకూడా ఉంది. ఇది ప్రకృతి మనకు ప్రసాదించిన ఒక అమూల్య కానుక. 'సి' విటమిన్ పుష్క లంగా ఉసిరికలో మనకు లభిస్తుంది. మానవ శరీరంలో ఇది త్వరగా కలిసిపోగ లదు. రసి (Virus) సూక్ష్మ విషక్రిములు




(Bacteria) బూజు (Fungus)కు విరుగు డుగా పనిచేసే గుణం ఉసిరికకు ఉన్నట్లు భావించబడుతోంది.

లేత పసుపు రంగుగల ఈ పండు వ్యాసం 1.25 సెం.మీ.ల మొదలు 2.5 సెం.మీ.ల వరకు ఉంటుంది. ఇందులో నుండీ రసంను తీసినప్పుడు దీని 'సి' విటమిన్ విలువ మరింత పెరుగుతోంది.

బాగా ఎండిన ఉసిరికలో ప్రతి నూరు గ్రాములకు 2428 మిల్లీ గ్రాములు మొదలు 3470 మిల్లీ గ్రాముల 'సి' విటమిన్ లభిస్తోంది. సర్వ సాధారణంగా దీంతో ఊరగాయ వేస్తుంటారు. పొడిచేసిన ఎండిన ఉసిరికను పాడవకుండా చాలా కాలం ఉంచుకోవచ్చును. ఇది కాలేయాన్ని బాగా ఉత్తేజ పరచగలదు. శరీరాన్ని చల్ల బరచి విరేచన క్రియను సులభం చేసే సుగుణం దీనికి ఉంది.

ఉసిరికను ఉదయం పూట తీసుకో వాలి. క్రమం తప్పకుండా తీసుకున్న ప్పుడు శరీరపు బలాన్ని కొద్ది రోజులలోనే ఇది పెంచగలదు. తాజాపండ్లు దొరకన ప్పుడు ఎండిన ఉసిరికను పొడిగొట్టి తేనెలో కలిపి తీసుకోవాలి. ఉసిరిక మాత్రమే కానీ, దాన్ని ఇతర మూలికలతో కలిపిగానీ తీసుకున్నప్పుడు రక్తలేమికీ, మధుమేహానికీ, దీర్ఘకాలపు ఊపిరితిత్తుల

అర్థం చేసుకోవడం—

*మన చుట్టూ అర్థం చేసుకోదగ్గ, ప్రేమించ దగ్గ వ్యక్తులు ఉన్నారు. మీరు అర్థం చేసుకో వడం, ప్రేమించడం- అందిస్తే వాటినే తిరిగి పొందగలుగుతారు. అర్థం చేసుకోవడం, ప్రేమించడం అన్నవే మానవసంబంధాలను మెరుగుపరచగల అతి ప్రబలమైన శక్తులు,*

*- నార్మన్ విన్సెంట్ పీలే*

''తెలివితేటలన్నవి అనుభవానికి బదులు అని యువకులు భావిస్తే అనుభవం అన్నది తెలివి తేటలకు బదులు అని వయసు మళ్ళినవారు భావిస్తారు ''

వ్యాధికీ, జలుబుకూ, ఇన్ఫ్లుయెంజాకూ రక్తపోటుకూ ఇది విరుగుడుగా పనిచేస్తుంది. పుట్టకురుపు వ్యాధి రాకుండా కాపాడగల గుణం కూడా దీనికి ఉంది. కోల్పోయిన శక్తిని పొందడానికి ఉసిరిక ఎంతో బాగా ఉపయోగపడుతుంది.

తగుపాళ్ళలో కలిపిన ఉసిరిక పొడి, జమాన్ (Jaman) పొడి, కాకరకాయ పొడి కలిసిన మిశ్రమాన్ని తీసుకున్నప్పుడు చక్కెర వ్యాధికి ఇది తగిన విరుగుడు అవుతుంది. ఈ మూడు కలిసిన ఒక చెంచాడు పొడిని రోజుకు ఒకటి లేక రెండు సార్లు తీసుకుంటే అది చక్కెర వ్యాధిని అదుపులో ఉంచగలదు. కంటి చూపును కాపాడడానికి ఉసిరిక రసానికి తేనె కలిపి తీసుకోవాలి. అలా తీసుకుంటే అది చాలా లాభదాయకంగా ఉంటుంది. ఇది కంటిలోపలి ఉద్రిక్తతను (Intraocular Tension) చెప్పుకోదగ్గ స్థాయికి తగ్గించి కంటి చూపును జాగ్రత్తగా కాపాడగలుగుతుంది. పరంపరాగతంగా తయారవుతున్న మందులలో దీనిని కేశవర్ధినిగా వాడడం జరుగుతోంది. కేశ సంపదను పెంచి వాటి వర్ణ విధానాన్ని (Pigmentation) పెంచగలదు. ఉసిరిక నూనె కేశ సంపద అభివృద్ధికి చాలా బాగా తోడ్పడుతుంది.

– ది బ్లాసమ్ నుండి గ్రహించబడినది. ఫగ్వారా వారి కేంద్రీయ రోటరీ క్లబ్ వారి అధికార పత్రిక నుండి

## చదువుకూ, మంచి స్వభావ అభివృద్ధికీ మనం ఖర్చుపెడుతున్న రోజుల సంఖ్య

*ఒక విజ్ఞానశాస్త్ర నిపుణుడు మనిషి జీవితానికి సంబంధించిన క్రింద కనబరచిన గణితాన్ని తయారు చేసాడు. 70 సంవత్సరాలు సరాసరిగా మనం జీవిస్తే అందులో 25,550 రోజులుంటాయి. జీవించడం ఇంకా ప్రారంభించకముందే అమూల్యమైన 20 సంవత్సరాల కాలాన్ని మనం గడిపేస్తున్నామన్న సంగతి గుర్తు ఉంచుకోండి. మరో విధంగా చెప్పాలంటే 25,550 రోజుల నుండి 7300 రోజులను తీసివేయాల్సి ఉంటుంది. ఇకపోతే మిగిలేది 18,250 రోజులన్నమాట.*

*ఈ మొత్తం నుండి నిదురపోయే రోజుల సంఖ్య – 6080 తగ్గిస్తే 12, 170 రోజులు మాత్రం మిగులుతాయి. మనసును ఆహ్లాద పరచుకునే పనులలోనూ, వృత్తిలోనూ మనం 4060 రోజులను గడుపుతాము. అప్పుడు 8110 రోజులు మాత్రం మిగులుతాయి.*

*ఆ తరువాత ఆహారం, గుడ్డలు వేసుకోవడం, స్నానం చేయడం మొదలైన వాటికి 4110 రోజులను తీసివేస్తే మిగిలిన 4000 రోజులలోనే మనం చదువు నేర్చుకుని మంచి అలవాట్లను అలవరుచుకోవడం జరుగుతుంది.*

## అతి పెద్దదైన మహాకావ్యం

మొత్తం ప్రపంచంలోనే మనదేశపు మహాభారతం అతి పెద్దదైన మహాకావ్యం.

''భగవంతుడనే వృత్తానికి కేంద్రం అన్నిచోట్లా ఉంటుంది. పరిధి మాత్రం ఎక్కడా ఉండదు.''

# సుప్రసిద్ధ ప్రపంచ నవలాకారులు

## డబ్ల్యు. సోమర్‌సెట్ మామ్

ఎం. ముత్తు

ఇంగ్లీషు రచయిత సోమర్‌సెట్ మామ్ ప్రపంచానికి ఒక సుప్రసిద్ధ నవలాకారుడిగా, కథానిక రచయితగా, నాటకకర్తగా,




వ్యాస రచయితగా పరిచితుడు. సహజ స్వభావ సిద్ధమైన కథలను రచించే ఫ్రెంచ్ భాష రచయిత గై డె ముపాసా (Guy de Maupassant) సాహిత్యంతో ఇతడు ప్రభావితుడయ్యాడంటారు.

ఫ్రాన్స్ దేశపు పారిస్ నగరంలో సోమర్‌సెట్ మామ్ 1874వ సంవత్సరం జనవరి 25వ తారీఖున జన్మించాడు. సంతానాన్ని చక్కగా ప్రేమించే తండ్రిగా రాబర్ట్ అర్మాండ్ మామ్ (Robert ormond Maugham) వ్యవహరించాడు. తల్లి శ్రీమంతి ఎడిత్ (Edith) నిజంగానే అందరి ఆదరానికి పాత్రురాలైంది. సోమర్‌సెట్ మామ్‌కు ముగ్గురు సోదరులు ఉండేవారు. 10సంవత్సరాల ప్రాయంలో ఉన్నప్పుడు మామ్ తన తండ్రిని పోగొట్టుకున్నాడు.

ఇంగ్లాండులోని కెంట్‌కు చెందిన విట్‌స్టేబుల్ (Whitstable)లో మతాధికారిగా పనిచేస్తున్న మామ పెంపకంలో మామ్ పెరిగాడు. కెంట్‌లోని కాంటర్‌బరి (Canterbury)కు చెందిన కింగ్స్ పాఠశాలలో మామ్ చదువుకున్నాడు. జర్మనీలోని

---

### ఉత్తమశ్రేణి మనసు

*అధిక సంఖ్యాకులతో కలిసి ఆలోచిస్తున్నప్పుడు మాత్రమే మూడవ తరగతి మనసు సంతోషాన్ని పొందుతుంది. అల్ప సంఖ్యాకులతో కలిసి ఆలోచిస్తున్నప్పుడు మాత్రమే రెండవ తరగతి మనసు ఆనందాన్ని అనుభవిస్తుంది. తానుగా ఆలోచిస్తున్నప్పుడు మాత్రమే ఉత్తమశ్రేణి మొదటి తరగతి మనస్సు సంతోషంగా ఉంటుంది.*

– ఎ.ఎం. మిల్నీ

"మతం అన్నది కారును నడిపే చక్రమే కానీ అదనపు టైర్ కాదు."
– చార్లెస్ ఎల్. వీలర్

హైడెల్‌బర్గ్ (Heidelberg) విశ్వవిద్యాలయంలో చేరిన తరువాత లండన్‌లోని సెయింట్ థామస్ ఆసుపత్రిలో చేరి ఆరు సంవత్సరాల పాటు మామ్ వైద్యవిద్యను అభ్యసించాడు. అ తరువాత వైద్యరంగాన్ని పూర్తిగా వదిలి వేసి రచనవైపు తన మొత్తం దృష్టిని సారించే నిర్ణయం



Maugham eighteen-
-year-old medical student
at St.Thomas's Hospital

Maugham

అతడు తీసుకున్నాడు. లండన్ మురికివాడలలో డాక్టర్‌గా పని చేస్తున్నప్పుడు పొందిన అనుభవాల ఆధారంగా మామ్ తన తొలి నవల – "లిజా ఆఫ్ లాంబెత్" – (Liza of lambeth)ను 1896వ సంవత్సరంలో రాసాడు. అతడు 1915లో రాసిన ఉత్తమ రచనగా పరిగణించబడుతున్న నవల "ఆఫ్ హ్యూమన్ బాండేజ్" (Of Human Bondage)లో రచయితగా తన తొలి అనుభవాలను అతడు రాసుకున్నాడు.

మొదట్లో అతడు నవలాకారుడిగా కంటే కూడా నాటక రచయితగానే బాగా గుర్తింపును పొందాడు. కానీ చాలా సంవత్సరాలు నిరంతరం శ్రమించడం కారణంగానే తొలి ప్రపంచ యుద్ధానికి ముందు1907లో రచించిన "లెడీ ఫ్రెడరిక్" (Lady Frederick) నాటకం ఇతడికి మంచి గుర్తింపును ఇచ్చింది.

గుప్తచరుల విభాగంలో (Intelligence Department) మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్నప్పుడు మామ్ పనిచేసాడు. ఇతడు రష్యాలో బ్రిటిష్ గూఢచారిగా పని చేసాడు. అక్కడే అతడు గూఢచారులకు సంబంధించిన కథలకు (1928లో రాసిన అషిండెన్' (Ashenden)) కావలసిన విషయాలను పొందాడు. 1915వ సంవత్సరంలో మామ్ డా. బర్నార్డో కూతురు లేడీ వెల్‌కం (Lady Wellcome)ను పెండ్లి చేసుకున్నాడు. 1927లో వారు విడిపోయారు. 1930వ సంవత్సరంలో సోమర్‌సెట్

---

### తనను తాను దైవత్వంతో నింపుకునే మంచి మనిషి

*"నా వరకు రాదు" అన్న సామెతను అంత తేలికగా కొట్టి పారవేయకండి. నీటి చుక్కల కారణంగానే కుండ నిండుతుంది. అదే విధంగా మంచి మనుషులు తమను తాము కొంచెం కొంచెంగా దైవత్వంతో నింపుకుంటారు. – ధర్మపాదుడు*

"ఏ ఒక్కరూ చూడలేని వస్తువును చూసి గురి పెట్టి కొట్టగలిగినవాడే ప్రతిభా సంపన్నుడు." – జార్జ్ హెర్బర్ట్

మామ్ ఫ్రాన్స్‌లోని కాప్ ఫెర్రాట్ (Cap Ferrat)లో స్థిరపడ్డాడు. కానీ రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్న సమయంలో జర్మన్ ఆక్రమణదారుల కారణంగా మొత్తం ఆస్తిపాస్తులను ఇతడు పోగొట్టుకున్నాడు.




ఆ తరువాత సోమర్‌సెట్ మామ్ ఎన్నో నవలలనూ, నాటకాలనూ, కథానికలను రచించాడు. 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' 'ది మూన్ అండ్ సిక్స్ పెన్స్', 'ది పెయింటెడ్ వీల్', 'కేక్స్ అండ్ ఏల్', 'ది రేజర్స్ ఎడ్జ్', 'కాటలీనా' (Catalina) మొదలైనవి ఇతడు రచించిన సుప్రసిద్ధ నవలల పేర్లు. ఇతని రచనలలో మంచి ఎత్తుగడనూ, మంచి పాత్రచిత్రణనూ, మంచి వర్ణనాశక్తిని మనం చూడగలం. ఆయన కథలు ఇంగ్లీష్‌లో ఇంతవరకు రాయబడిన ఉత్తమోత్తమ కథలుగా పరిగణింపబడుతున్నాయి. ఆసియా ఖండంలో పర్యటిస్తున్నప్పుడు తన కథలకు కావలసిన కథా విషయాలను ఇతడు సంగ్రహించాడు. 'ది ట్రెంబ్లింగ్ ఆఫ్ ఎ లీఫ్' (The Trembling Of a Leaf), 'సాడీ థాంప్సన్' (Sadie Thompson), 'ఫస్ట్ పర్సన్ సింగులర్' (First Person Singular) 'ది ఆషెండెన్' (The Ashenden) అన్న పేర్లతో ఇతడి కథా సంకలనాలు వెలువడ్డాయి. జీవితపు చేదు వాస్తవాలను చిత్రీకరించినందువల్ల ప్రజలు ఇతడిని ఇంగ్లీషు భాషకు చెందిన మొపాసాగా పరిగణిస్తున్నారు.

ఇతను రచించిన నాటకాలు చాలా వరకు ఆచారాలకు సంబంధించిన హాస్య నాటకాలుగా ప్రసిద్ధిని పొందాయి. 'ది సర్కిల్', 'అవర్ బెటర్స్' 'ఈస్ట్ ఆఫ్ సూయాజ్' (East of suez), 'ది లెటర్', 'ది కాన్‌స్టెంట్ వైఫ్' మొదలైనవి ఇతడు రచించిన ఉత్తమ నాటకాలు. కొన్ని నాటకాలలో హాస్యోక్తుల ద్వారా కొన్ని భావా

## విమాన ప్రయాణం చేసిన అతి వయోవృద్ధురాలు

*111 సంవత్సరాల శ్రీమతి జెస్సికా స్విఫ్ట్ (Jessica Swift) విమాన ప్రయాణం చేసిన తొలి అతి వయోవృద్ధురాలిగా పరిగణింపబడుతోంది. ఈమె 1981వ సంవత్సరంలో వెర్మొంట్ (Vermont) నుండి ఫ్లోరిడాకు ప్రయాణం చేసింది.*

''ప్రతిభతో ప్రారంభమైన గొప్ప పనులను పరిశ్రమే పూర్తి చేయగలదు.''

లను అహ్లాదపరిచే విధంగా వ్యక్తం చేసే మరికొన్ని నాటకాలలో మన ఆచారాలు, మూఢనమ్మకాలు, మన మూర్ఖపు చర్యలను గేలిచేయడం జరిగింది. అతడు రచించిన అనేక నాటకాలు చాలా రోజులు క్రిక్కిరిసిన జనంతో విడవకుండా ప్రదర్శింపబడ్డాయి. ఉదాహరణకు 'స్ట్రిక్ట్‌లీ పర్సనల్' లాంటి కొన్ని ఆత్మ కథాత్మక వ్యాసాలను కూడా మామ్ రాయడం జరిగింది.

1954వ సంవత్సరంలో 'కంపానియన్ ఆఫ్ ఆనర్' (Companion of Honour)తో సోమర్‌సెట్ మామ్ సత్కరింప బడ్డాడు. 1961వ సంవత్సరంలో లండన్‌లోని రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ వారు 'కంపానియన్ ఆఫ్ లిట్రేచర్' అన్న గౌరవంతో సత్కరించారు. ఆశియా ఖండం లోనూ అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ ఇతడు విస్తృతంగా పర్యటించాడు.

1965వ సంవత్సరం డిసెంబరు నెల 10వ తారీఖున ఒక తివాచీపై కాలు జారి పడ్డాడు. దాంతో అతడి పరిస్థితి ప్రమాద భరితంగా మారింది. కోమాలోకి వెళ్ళిపోయి 1965వ సంవత్సరం డిసెంబరు నెల 16వ తారీఖున సోమర్‌సెట్ మామ్ కళ్ళుమూసాడు. 91వ సంవత్సరాలు జీవించిన సోమర్‌సెట్ మామ్ సుప్రసిద్ధ రచయిత, నవలాకారుడిగా సాహిత్యాన్ని సంపన్నం చేసాడు.

## పెట్రోలియంను ఉత్పత్తి చేసే సూక్ష్మజీవి

*సూక్ష్మమైన జీవిని వాడి చమురు (పెట్రోలియం) బావులను కనుగొన వచ్చునన్న ఆశాభావనను జపానీసు శాస్త్రజ్ఞులు కలిగి ఉన్నారు. ఒసాకా విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య తడయుకి ఇమానాకా (Tadayuki Imanaka) నేతృత్వంలోని పరిశోధకులు చమురును ఉత్పత్తి చేసే సూక్ష్మజీవిని కనుగొన్నారు. సెుడోమొనాస్ నీయరూలియోఫిలా (Pseudomonas Anaerooleophila) అనే అణుజీవి (Microbe) లో ఒక గ్రాముకు 10 మిల్లీగ్రాముల చమురు ఉంటుంది. ఇది భూగర్భంలో చమురు శిధిలమయే క్రియను సులభం చేయగలదని కనుగొనబడినది. భూగర్భంలో ప్రాణవాయువు, వెలుతురు లేని కారణంగా హైడ్రోజన్ సహాయంతో కార్బన్‌డై ఆక్సైడ్‌ను డి ఆక్సీడైజ్ అవుతుంది. ఈ అణుజీవులు చమురును తమకు వాతావరణంలో చమురు లేకున్నా తామే ఉత్పత్తి చేసుకుంటాయని కనుగొనబడింది.*

---

## 'స్నానం చేయడం''

*''స్నానం చేయడం'' (taking a bath) అన్న మాటను షేర్ల వ్యాపారంలో వాడుతుంటారు. షేర్ మార్కెట్టులు పెరగవచ్చునని భావించి షేర్లు కొని భారీగా నష్టపోతే అక్కడి పారిభాషిక పదావళిలో దాన్ని స్నానం చేయడం అంటారు.*

''నేల తల్లితో తనకున్న బంధం నుండీ విముక్తిని కలిగించడం చెట్టుకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వడం అనిపించుకోదు.'' – రవీంద్రనాధ్ ఠాగూర్

# దొంగలు నేర్చుకున్న పాఠం

సదానంద మొహంతీ

ఒకానొక చలికాలంలో చలిగాలులు విపరీతంగా దేశం మొత్తంలో వీచసాగాయి. రాజు తన మంత్రులను సమావేశ పరిచాడు. పేదవాళ్ళకి కంబళ్ళు పంచి



పెట్టాలన్న నిర్ణయం ఆ సమావేశంలో తీసుకోబడింది. రాజ్యంలో ఉన్న నిజాయితీ పరుల, నమ్మకస్తులైన వ్యక్తులు పర్యవేక్షణలో ఆ పని జరగాలని నిర్ణయం తీసుకోబడింది.

ఈ అధికారులు బీదలకు కంబళ్ళను పంచే పనిని ప్రారంభించారు. కొన్ని రోజుల తరువాత పంపిణీకోసం నిలువ ఉంచబడిన కంబళ్ళు దొంగిలించబడ్డాయనీ, దొంగలను పట్టుకోవడం చాలా కష్టంగా ఉందని అధికారులు రాజుతో విన్నవించుకున్నారు. రాజుకు చీకాకు బాగా పెరిగింది. తన ప్రక్కనే ఉన్న ప్రధాన సలహాదారుడివైపు రాజు తిర్గాడు. ఆ ప్రధాన సలహాదారుడు కాస్సేపు ఆలోచించి కంబళ్ళ పంపిణీను తాను చేస్తాను అన్నాడు. ఆవ్యక్తి పట్ల రాజుకున్న గౌరవభావం కారణంగా ఆపనిని అతడు చేపట్టడం రాజుకు నచ్చలేదు. ఆపనిలో అతడు స్వయంగా కలుగజేసుకోవడం వల్ల సమస్యకు తప్పక పరిష్కారం దొరుకుతుందన్న నమ్మకం రాజుకు కలుగలేదు. రాజు మనసును అర్థం చేసుకున్న ఆ సలహాదారుడు చిరునవ్వు నవ్వుతూ ''అయ్యా! నేను ఆ పనిలో తప్పక విజయాన్ని సాధించగలను'' అని రాజుతో అన్నాడు.

పంపిణీ చేయవలసిన కొత్త కంబళ్ళను తన ఇంటిలో అతడు భద్రపరిచాడు. దొంగలకు ఎలా అయితేనేమి ఈ కొత్త కంబళ్ళ విషయం తెలిసిపోయింది. పూరి

---

### తొలి జ్ఞానపీఠ్ బహుమతి గ్రహీత

*1965వ సంవత్సరంలో ప్రారంభింపబడిన తొలి జ్ఞానపీఠ్ అవార్డును మలయాళం భాషకు చెందిన మహాకవి జి.శంకర్ కురూప్ అందుకున్నాడు.*

''మీరు కలిసి మెలసి తిరిగే వారిని గురించి జాగ్రత్తగా ఉన్నట్లే మీరు ఎన్నుకునే పుస్తకాల విషయంగా కూడా జాగ్రత్తగా ఉండండి. మొదటిదాని లాగే రెండవది కూడా మీ గుణాలనూ, నడవడికనూ ప్రభావితం చేస్తుంది.''

పాకలాంటి సలహాదారుడి ఇల్లును వారు అర్ధరాత్రి సమయంలో దొంగతనం చేసేందుకు చేరారు.

తన ముసలి తల్లి పక్కన చాపపై పడుకుని ఉన్న రాజు ప్రధాన సలహాదారుడిని దొంగలు చూసారు. ఆ తల్లీ కొడుకులిద్దరు చినిగిపోయిన పాత చింపిరి కంబళ్ళనం కప్పుకుని చల్లటి గాలి వీచినప్పుడంతా చలికి వణకడం వారు చూసారు. వారికి పక్కనే కొత్త కంబళ్ళు పేర్చి పెట్టబడి ఉండడం కూడా వారు గమనించారు. ఆ దృశ్యం వారిని ఆశ్చర్యంలో ముంచెత్తింది. కొత్త కంబళ్ళు వారి పక్కలో ఉన్నా కూడా వాటిని వాడకుండా చిరిగిన కంబళ్ళను వారెందుకు కప్పుకుని చలికి వణుకుతున్నారో ఆ దొంగలు అర్థం చేసుకోలేకపోయారు.

వారు చేయబోయే పని ప్రమాదంతో కూడినదనీ, దాని కారణంగా వారు పట్టుబడే అవకాశం ఉందని తెలిసికూడా ఆ సలహాదారుడిని నిద్రలేపి ఎందుకు పక్కనే ఉన్న కొత్త కంబళ్ళను కప్పుకోలేదని అడిగారు. ఆ కొత్తకంబళ్ళు కేవలం పేదవారికేననీ వాటిపై వారికి మాత్రమే అధికారం ఉన్నదని ఆ సలహాదారుడు జవాబిచ్చాడు. ఆ కొత్త కంబళిని కప్పుకుని పడుకున్న పక్షంలో ప్రజలు మీలాగ నన్ను కూడా దొంగ అనుకునే అవకాశం ఉన్నందువల్లనే వాటిని కప్పుకోలేదని కూడా అతడు చెప్పాడు. ప్రజల సంక్షేమంకోసం పాటుపడే అధికారిగా ఉంటూ ఆ కంబళ్ళు ఒకదానిని కప్పుకుని ఉంటే తాను తప్పు చేసిన వ్యక్తిని అయి ఉండేవాడినని చెబుతూ తన జవాబును ఆ సలహాదారుడు పూర్తి చేసాడు.

ప్రధాన సలహాదారుడి మాటలను విన్న ఆ దొంగలు నోట మాట రాకుండా బొమ్మల్లాగా నిలుచుండి పోయారు. తాము చేసిన పనికి సిగ్గుపడి, పశ్చాత్తాపంతో వారు కృంగిపోయారు. ప్రధాన సలహాదారుడి కాళ్ళపైనపడి వారు క్షమాభిక్షను కోరారు.

సాధారణమైన జీవితాన్ని గడిపిన ఆ ప్రధాన సలహాదారుడు మరెవరోకాదు. మనందరి ఆదరానికీ, గౌరవానికీ పాత్రుడైన చాణక్యుడు. అతడొక గొప్ప రాజనీతి దురంధరుడు. ఆ రాజు కూడా మరెవరోకాదు. పాటలీ పుత్రాన్ని రాజధానిగా చేసుకుని మౌర్య సామ్రాజ్యాన్ని స్థాపించిన చంద్రగుప్తమౌర్యుడు. ●

---

## ఇటలీదేశపు తేలాడే నగరం

*ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఇటలీదేశపు వెనిస్ నగరంలో మంచి రోడ్లు లేవు. ఇది ఒక తేలాడే నగరం. ఈ నగరంలో 160 జలమార్గాలు ఉన్నాయి. ఇక్కడి ప్రజలు ఒక చోట నుండి మరో చోటుకు పోవడానికి మోటారు బోట్లను వాడుతారు.*

''పనుల కారణంగా నౌకర్లనూ, కష్టకాలంలో బంధువులనూ, ప్రతికూల పరిస్థితులలో స్నేహితులనూ, పేదరికంలో భార్యనూ అర్థంచేసుకోగలము.''

# వేమన వేదం

తాత్పర్య రచన: ఎమ్.వి.ఎస్. సుబ్రహ్మణ్యం

కనగ సొమ్ము లెన్నొ కనకంబదొక్కటి
పసుల వన్నె లెన్నొ పాలొకటియె
పుష్పజాతులెన్నొ పూజ యొక్కటె సుమీ
విశ్వదాభిరామ! వినురవేమ!



(ఆభరణములు వేరైనా బంగారమొక్కటే. పశువుల రంగులు వేరైనా పాలు ఒక్కటే. సుగంధసంభరిత పుష్పజాతులు వేరైనా చేసే పూజ మాత్రం ఒక్కటే. అలాగే శాస్త్ర పరిజ్ఞానము గల పండితులు వేరైనా జ్ఞానం మాత్రం ఒక్కటే.)

★ ★ ★

మర్మమెఱుగక లేక మతములు కల్పించి
యుర్విజనులు దుఃఖ మొందుచుంద్రు
గాజుటింటి కుక్క కళవళపడురీతి
విశ్వదాభిరామ! వినురవేమ!

(అద్దాల గదిలో ఉన్న కుక్క దర్పణంలో తన ప్రతిబింబాన్ని చూసి కలతబడి ఏ విధంగా బాధపడుతుందో, అలాగే మూఢ జనులు ఆత్మతత్వం తెలు



సుకోలేక, విభిన్న మతాలను కల్పించి, మతమౌఢ్యంలో చిక్కుకుని, ఒకరినొకరు ద్వేషించుకొనుచూ, దుఃఖంతో కాలం గడుపుతున్నారు. నిజానికి పరబ్రహ్మం ఒక్కటే అని గుర్తించలేని అజ్ఞాన స్థితిలో ఉన్నారు.) ●

## 'స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా' పాత పేరు

ఇప్పుడు మనం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా పిలుస్తున్న బ్యాంకు ఒకప్పుడు ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా పిలువబడేది.

"ఒక మిత్రుడిని కోల్పోయినప్పుడు మనం కొంత మరణిస్తాము."

# ఆరోగ్యకరమైన భోజనపు అలవాట్లు

బాగా అలసిపోయినప్పుడూ, దిగులు లేదా కోపంగా ఉన్నప్పుడూ తినకండి. ఆ పరిస్థితులలో తొలుత విశ్రమించండి.



విశ్రమించండి లేదా నిదానంగా లోతుగా ఊపిరితీసుకోండి. ఉద్రిక్తత తగ్గి శాంతంగా ఉండగల పరిస్థితి వచ్చేంత వరకూ నిదానంగా ఊపిరి పీల్చి వదులుతూ ఉండండి.

మానసిక ఒత్తిడి లేదా ఉద్రిక్తతకు గురి అయినప్పుడు మితంగా భోజనం చేయండి. సులభంగా జీర్ణంకాని భారీ భోజన పదార్థాలను తినకండి.

ఎల్లప్పుడూ నిదానంగా నమలండి. పూర్తిగా ఆహారాన్ని పండ్లతో బాగా నమిలి (Mastication) ఆ తరువాత దాన్ని మింగండి.

భోజనంతోపాటు ద్రవాన్ని తీసుకోకండి. భోజనానికి అరగంట లేదా గంట ముందుగానీ భోజనం తరువాత గానీ తాగండి. భోజనంతోపాటు ద్రవాన్ని తాగవలసిన అవసరం వస్తే 4–6 ఔన్సులకు మాత్రమే దాన్ని పరిమితం చేయండి. ప్రశాంత వాతావరణంలో విశ్రాంతిని ఇచ్చే సంగీతం వింటూ తినండి.

భోజనం చేసిన వెంటనే తిన్నది జీర్ణం అయేందుకు తేలికపాటి వ్యాయామం చేయండి.

భోజనం చేసిన వెంటనే పడుకోవడం లేదా కళ్ళు మూసుకోవడం చేయకండి.

– ''హెల్త్'' సౌజన్యంతో

## ఆ[illegible] తాకే కట్టడాలున్న నగరాలు

*ఉత్తర అమెరికా ఆకాశాన్ని తాకే కట్టడాలకు చాలా ప్రసిద్ధి చెందింది. 50 కు మించిన అంతస్తులున్న కట్టడాలు ఏ ఏ నగరాలలో ఎన్ని ఉన్నాయో మీకు తెలుసా? న్యూయార్క్ నగరంలో 53, చికాగోలో 23, హూస్టన్‌లో 12, లాస్ ఏంజెల్స్‌లో 10, డల్లాస్‌లో9, అట్లాంటాలో 8, టొరాంటోలో 7, ఫిలడెల్ఫియా, సీటల్‌లో తలా5– ఆకాశాన్ని తాకే కట్టడాలు ఉన్నాయి.*

*(వరల్డ్ అల్‌మనాక్ ఆఫ్ ఫాక్ట్స్ 1996 సౌజన్యంతో)*

''అన్ని సుగుణాలను ఒకే ఒక వ్యక్తిలో చూడాలని అనుకోను.'' – కన్ఫ్యూషియస్

# నీళ్ళు గడ్డకట్టుకునే వాతావరణంలో డియోడర్ వృక్షం ఎలా ఉండగలుగుతుంది?

ఒక రకమైన హిమాలయ ప్రాంతపు దేవ దారు వృక్షాన్ని డియోడర్ (Deodar) అంటారు. అతి ఎత్తైన హిమాలయ పర్వత ప్రాంతాలలో కూడా పొడి వాతావ




రణం ఉంటుంది. అటువంటి పరిస్థితులను కూడా ఎల్లప్పుడూ తాజాగా ఉండే డియోడర్ తట్టుకోగలదు. వీటి ఆకులు సూదులలాగా ఉంటాయి. ఆ కారణంగా బయట కనబడే ప్రాంతం కొద్దిగా మాత్రం ఉంటుంది. ఈ విధమైన ఆకారం కారణంగా ఆకులలోని నీరు ఎక్కువగా నష్టపోకుండా ఉంటుంది. ఇది కాకుండా ఈ చెట్టు ఆకులను మైనం లాంటి ఒక వస్తువు కప్పుతుంది. ఈ మైనం నీరు నష్టపోవడాన్ని మరింతగా అరికడుతుంది. ఈ మైనం చలికాలంలో ఆకులను గడ్డకట్టుకున్న మంచు బిందువుల నుండి కూడా కాపాడుతుంది. డియోడర్ చెట్టు కూడా బంకలాంటి వస్తువును తయారుచేస్తుంది. ఈ చెట్టు ఒక కొమ్మ విరిగితే ఆ విరిగిన భాగాన్ని ఈ జిగురు త్వరగా కప్పేస్తుంది. ఈ విధంగా వాతావరణంలోని వెలుతురు పైపడడం కారణంగా నీరు నష్టపోవడం అరికట్టబడుతుంది.

(సి.ఇ.ఇ. ఎన్.ఎఫ్.ఎస్.)

## జంతువులపట్ల దయ కలిగి ఉండండి

*మొత్తం జంతు ప్రపంచంలో మనిషి తనను తాను అతి ఉత్తమమైన ప్రాణిగా భావిస్తున్నాడు. ఇతర ప్రాణులపట్ల దయాగుణాన్నీ కలిగి ఉంటూ సహాయం చేయగలిగినప్పుడే అతడు ఉత్తమ ప్రాణి అవుతాడు. అలా వ్యవహరించినప్పుడే ఇతర ప్రాణులు మనుషులను తమ కంటే ఉత్తములుగా భావించగలవు.*

– మొరార్జీదేశాయ్

''పూర్తి నిజాయితియే ప్రతి గొప్ప గుణానికి అడుగులో ఉన్న పునాది.''

# సరసోకులు

## జీవితసారమైన స్వేచ్ఛ

మానవ శరీరానికి ఎముకా, చక్రానికి ఇరుసు కర్రా, పక్షికి పాటా, రెక్కకుగాలీ ఎలాగో అలాగే స్వేచ్ఛ జీవితసారమవుతుంది. స్వేచ్ఛ లేకుండా మనం ఏది చేసినా అది వ్యర్థం అవుతుంది.

– జోస్ మర్టీ



## హృదయ ద్వారాన్ని తట్టే దురాకర్షణలు

దురాకర్షణలు దారినపోయే దానయ్యాలు వలె వస్తాయి. లోపలికి రానివ్వమని హృదయ ద్వారాన్ని తట్టుతూ అవి ప్రార్థిస్తాయి. మీరు వాటిని లోపలికి రానిస్తే అవి యజమానిలా మీపై సవారీ చేస్తాయి. – టి.ఎల్. వాస్వాని

## సరైన సమయం

ఏదీ పూర్తిగా తప్పుకాదు. ఆగిపోయిన గడియారం కూడా రోజుకు రెండుసార్లు సరైన సమయాన్ని చూపుతుంది.

## మీరు ముసలివారైపోయారు

పుట్టినరోజున కొనే కేకు కంటే కూడా కొవ్వొత్తులపై డబ్బులు ఎక్కువ ఖర్చు అయితే మీరు ముసలివారైనట్లే.

– బాబ్ పోప్

## ఆమె వయసును మాత్రం కాదు!

దౌత్యవేత్త (Diplomat) ఎల్లప్పుడు మహిళ పుట్టిన రోజును మాత్రం గుర్తుంచుకుంటాడు కానీ ఆమె వయసును కాదు.

## నీతి

మనం ఇష్టపడని వారిపట్ల ప్రదర్శించే వైఖరిని నీతి (Morality) అంటారు.

---

## మనుషులు నడిపే అతి పొడవైన నావ

*కేరళకు చెందిన చందన్ వల్లం నావ (Chundan Vallam Boat) మనుషులు నడిపే అతి పొడవైన నావ.*

''మనం అనుకున్నది ఎప్పటికీ జరగదు. మనం ఎదురుచూడనిదే ఎల్లప్పుడూ సాధారణంగా జరుగుతుంది.''

## ప్రతి జవాబు

మనం ఇచ్చే ప్రతి జవాబు ఒక పాత ప్రశ్నకు జవాబు ఇస్తూ వంరో కొత్త ప్రశ్నకు చోటు ఇస్తుంది.



## మీ దురదృష్టాన్ని చూసి నవ్వండి

మీ దురదృష్టాన్ని చూసి మీరు నవ్వగలిగితే మిమ్మల్ని చూసి నవ్వే అవకాశం మీరు ఇతరులకు కల్పించని వారవుతారు.

## హృదయం నుండీ వెలువడిన కవిత

వ్యాసం మెదడు నుండీ పుట్టుక వస్తే కవిత హృదయం నుండీ పుట్టుక వస్తుంది.

## సోమరితనం!

కష్టపడి పనిచేయడానికి ముందు విశ్రమించడాన్నే సోమరితనం అంటారు.

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్: 1. నిప్పుకోడి. కొన్ని కోళ్ళు 8 అడుగుల ఎత్తు ఉంటూ 300 పౌండ్ల బరువు ఉంటాయి, 2. (సి) మహారాష్ట్ర లోని ఎల్లోరా, 3. (బి) గోల్డ్ కోస్ట్, 4. (సి) బాక్సైట్, 5. (ఎ) 760 కి.మీ.లు, 6. (డి) హంపి – కర్నాటక లోని బళ్ళారి జిల్లా హొసపేటకు సమీపంలో ఉంది, 7. (సి) ఖాసీ, జయంతియం మరియు గారోలు, 8. (బి) సెంట్రల్ ఎక్సైజ్, 9. (డి) ఒరిస్సాలోని కటక్‌లో, 10. (సి) సిడ్నీ.

మాటలమహిమ: 1. (బి) ఇంద్రుడు, 2. (సి) మాటలకారి, 3. (ఎ) సర్పము, 4. (డి) అలస్యం, 5. (సి) ఉఱుము, 6. (బి) చలించినది, 7. (ఎ) గాయకుడు, 8. (డి) ఆడకుక్కల సమూహము.

తెలివికి పరీక్ష: 1. యూరో (Euro) 2. షియం, సున్నీ, 3. హెమ్‌లాక్ (Hemlock), 4. జ్యోతిర్మాయ్ సిడక్, 5. ఒకే పరిమాణం (Quantity) ఉన్న సముద్రం నీళ్ళనూ మనిషి రక్తాన్నీ తీసుకొని పరీక్షిస్తే ఆ రెండు పరిమాణాలలో ఉప్పు దాదాపు సరిసమానంగా ఉంటుంది. 6. బ్రిటిష్ ప్రధానమంత్రి నివాసగృహం. ●

"మీ భయాల్ని మీవద్దే జాగ్రత్త పరుచుకోండి. కానీ మీ ధైర్యాన్ని మాత్రం ఇతరులతో పంచుకోండి.''

# తాను కనుగొన్న విషయాల ఆధారంగా సృష్టివికాస సిద్ధాంతాల్ని తీర్చిదిద్దిన డార్విన్

శాస్త్రీయ చదువులకు పేరుపొందిన పాఠశాలలో బాలుడు డార్విన్ రాణించలేకపోయాడు. కొడుకును మొద్దుగా భావించి చీవాట్లు పెడుతూ అతడి తండ్రి ఒకసారి అతడితో "నీవు కుక్కల్ని



Charles Darwin

కొట్టడం, ఎలుకల్ని పట్టడం తప్ప దేన్నీ కూడా ఖాతరు చెయ్యడం లేదు. నీకు నీవుగా చెడ్డపేరు తెచ్చుకోవడంతోపాటు కుటుంబానికి కూడా చెడ్డపేరు తెస్తావు" అని అన్నాడు. ఎడిన్‌బర్గ్ (Edinburgh) విశ్వవిద్యాలయం వైద్యపరీక్షలో చాలా నిరాశాజనకంగా తప్పాడు. కేంబ్రిడ్జ్‌లో ఉంటున్నప్పుడు గొప్ప నిరాశకు ఇతడు గురి అయ్యాడు. 1831వ సంవత్సరంలో ప్రకృతి చరిత్రపట్ల ఇతడికి ఉన్న ఉత్సాహం కారణంగా హెచ్.ఎం.ఎస్. బీగల్ (Beagle) నౌకలో ప్రయాణం చేసే అవకాశం ఇతడికి దక్కింది. ఆ పడవ ప్రయాణాన్ని అతడు చరిత్రపరమైన గొప్ప వైజ్ఞానిక యాత్రగా మార్చుకున్నాడు. తన యాత్రాకాలంలో తెలుసుకున్న మరియు చూసిన విషయాల ఆధారంగా అతడు సృష్టి విశ్వాస సిద్ధాంతాన్ని అభివృద్ధి పరిచాడు.

– ది బుక్ ఆఫ్ లిస్ట్స్ 2

## తాజాతనాన్నిచ్చే కొబ్బరి బోండాం నీళ్ళు

*కొబ్బరిబోండాం నీళ్ళకు గొప్ప పౌష్టిక గుణం ఉన్నదన్న సంగతి కొద్దిమందికి మాత్రమే తెలుసు. మాంసకృత్తులు, సజీవ ఆమ్లాలు (Organic Acids) చక్కెర, విటమిన్లు, పొటాషియం, కాపర్, మెగ్నీషియం లాంటి ఖనిజాలు అతి ఎక్కువ పాళ్ళలో కొబ్బరిబోండాం నీళ్ళలో ఉంటాయి. ఆరోగ్యవంతులూ, అనారోగ్యవంతులూ, ఇద్దరూ కొబ్బరి బోండాం నీళ్ళను తాగి తాజాతనాన్ని పొందగలరు.*

'తన మనో గుణానికి తగిన పరిస్థితులు ఉన్నప్పుడు మనిషి సంతోషంగా ఉంటాడు. కానీ పరిస్థితులు అవి ఏమైనా కానివ్వండి తన గుణానికి అనుకూలంగా మార్చుకోగలిగిన వాడే మరింత సంతోషంగా ఉంటాడు''

# ఆత్మవిశ్వాసంతో తలెత్తుకుని జీవించండి

జీవితపు పథంపైన నడుస్తున్నప్పుడు ఆత్మవిశ్వాసంతో తలెత్తుకుని నడవండి. ఈ గుణం మీకు కావలసిన మనస్తత్వశా



స్త్రపరమైన (Psychological) ఊపును ఇస్తుంది. ఆ కారణంగా మీరు బలంగానూ, మరింత అతి ముఖ్యమైన వ్యక్తిగానూ తయారవుతారు.

ఇది తన ప్రభావాన్ని ఇతరులపై కూడా పడేలా చేస్తుంది. అందుకే నాయకులు ఆత్మవిశ్వాసంతో తలెత్తుకుని తిరుగగలుగుతున్నారు. సైనికులను అధికారులు తమ టోపీలను నుదిటి కింద వరకు ఉండేలా ధరించమంటారు. అలా చేయడం వల్ల వారి ఆత్మవిశ్వాసాన్ని సూచించే చుబుకాన్ని మనం చూడగలుగుతాము

ఆత్మవిశ్వాసంతో చుబుకాన్ని పైకి ఎత్తి నడవడం వల్ల జీవితం బాగుపడ్డాన్ని కూడా మనం గుర్తిస్తాము. ఈ గుణాన్ని ఈ రోజు నుండీ అమలు పరచండి. మీరు ముందుకంటే కూడా ఎంతగా మెరుగయ్యారో మీ అనుభవంలోకి వస్తుంది. మీపై ఇది మందులా ఎలా పనిచేస్తుందో, మీరు కలిసే వ్యక్తులను ఎలా ప్రభావితం చేస్తుందో మీరు గమనించండి.

ఎల్లప్పుడూ ఆత్మవిశ్వాసాన్ని సూచించేలా మీ చుబుకాన్ని ఎత్తుకుని గర్వంగా జీవించండి! ●

## న్యాయరహితమైన అధికారబలం నిరంకుశత్వమే

*అధికార బలం లేని న్యాయం సామర్థ్యం లేనిది. అదేవిధంగా న్యాయరహితమైన అధికారబలం నిరంకుశత్వం అవుతుంది. న్యాయం లేని అధికారబలం వ్యతిరేకించబడుతుంది. కారణం ఇటువంటి వ్యవస్థలో చెడ్డవారు ఉండడమే. న్యాయరహితమైన అధికారబలం త్వరలో ప్రశ్నింపబడుతుంది. అందుకే న్యాయాన్నీ, అధికారబలాన్నీ ఒక చోటపైకి తేవాల్సి ఉంటుంది. అటువంటప్పుడే న్యాయమైనది అధికారంతో కూడినదిగానూ, అధికారంతో కూడినది న్యాయమైనదిగానూ ఉండగలదు.* – పాస్కల్

"నిరాశకు ఎప్పటికీ గురికాడు కాబట్టే కోరికలు లేనివాడే ప్రపంచంలో ధన్యుడు."

# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసప్రతిక

చందా వివరాలు:
సంవత్సర చందా రూ. 60/-
3 సంవత్సరాల చందా రూ. 175/-
ఎయిర్‌మెయిల్ (1 సం) రూ. 250/-
సీమెయిల్ (1 సం) రూ. 110/-

చందాపంపవలసిన చిరునామా
రత్నా ఏజెన్సీస్
9, దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద
చెన్నై - 600 004,
ఫోను: 4990327

జూన్ 1999
Vol.18 No.6



★ తెలుగు విస్డమ్‌కు ఇది 18వ సంవత్సరం ★

# సంపాదకుని పేజీ

## ప్రమాదకరమైన అల్పజ్ఞానం

మిడిమిడి జ్ఞానం చాలా హానికరమైన విషయం. మీకు తెలియని దాన్ని తెలుసు అన్న విధంగా వ్యవహరించడం కంటే తెలియదని ఒప్పుకుని దాని విషయంగా



నేర్చుకోవడం మంచిది. అడిగి తెలుసుకోవడానికి లేదా నేర్చుకోవడానికి సిగ్గుపడకండి. వివిధ విషయాలు మనకు తెలియవన్న విషయాన్ని గుర్తుంచుకోండి.

ఒక కిరాణా కొట్టువాడు ''మేడమ్ ఇప్పుడే తాజా హార్స్ రాడిష్ వచ్చింది. ఇవ్వమంటారా?'' అని అడిగాడు. ''దానివల్ల మాకు ఎలాంటి ప్రయోజనం లేదండి. మేము గుర్రాలను పెంచడం లేదని'' వచ్చిన ఆమె జవాబు చెప్పింది. మీకు మిడిమిడి జ్ఞానం ఉన్నప్పుడు, అసలు ఏమాత్రం తెలియనప్పుడు అన్నీ తెలిసినట్లుగా నటించకండి.

పిల్లలను కన్నవారికంటే పిల్లలకు చదువు చెప్పేవారు చాలా సన్మానీయులు.

## భగవంతుణ్ణి మరచిపోయేలా చేసిన రూపాయి

భగవంతుడి పేరును జపిస్తూ ఒక ఫకీరు తన దారిన పోతున్నాడు. బహుదూర ప్రాంతం నుండి కొంతమంది అతడి వైపు వస్తున్నారు. ఆ గుంపులోని ఒక వ్యక్తి ఎదురుపడిన ఫకీరుకు ఒక రూపాయి బిళ్ళను ఇచ్చాడు. ఈ రూపాయితో గింజలు కొనాలా లేదా గుడ్డలు కొనాలా అని ఆ ఫకీరు ఆలోచించసాగాడు.

ఈ ఆలోచనలో పడ్డ ఫకీరు భగవంతుడి పేరును జపించడం మరచిపోయాడు. తన ఆలోచనలో మునిగిపోవడం వల్లే ఫకీరు నామ జపాన్ని మరచిపోయాడు. ఉన్నదున్నట్లు, ఇవ్వబడిన రూపాయి కారణంగా తాను భగవంతుడి పేరును తలుచుకోవడం మరిచిపోయానన్న విషయం ఫకీరుకు గుర్తు వచ్చింది. విసుగ్గా ఫకీరు రూపాయి బిళ్ళను పారవేసాడు. కిందపడిన బిళ్ళను చూస్తూ నాకు ఇవ్వబడిన ఈ రూపాయి బిళ్ళ కారణంగా నేను దేవుడి పేరును జపించడం మరచిపోయాను. కానీ ధనవంతులు ఈ ప్రపంచంలో చాలామంది ఉన్నారు. మరివారు భగవంతుడి పేరును ఎలా గుర్తుచేసుకోగలుగుతారు? – (ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్)

''అర కొఱగా ఏ పనినీ చేయవద్దు.''

తల్లితండ్రులు జన్మను మాత్రం ఇస్తారు. కానీ చదువు చెప్పేవారు బాగా జీవించే కళను నేర్పుతారు. ఆస్తి సంపాదనకంటే కూడా విద్యను పొందిన మనిషి ఎక్కువ కాలం ఉండగల ఆనందాన్ని పొందగలడు. చదువువల్ల స్థిరమైన తరగని ఆనందానుభూతిని పొందవచ్చును.

అప్పుడప్పుడు నేర్చుకున్న చదువును సరిగ్గా వాడకపోవడం కూడా జరుగుతుంది. తమనుతాము డిగ్రీలతో అలంకరించుకోవడానికే విద్యార్థులు తరచుగా కళాశాలలకు పోతుంటారు. ఒకానొక విశ్వవిద్యాలయంలో ఉపన్యాసాలు ఇవ్వడానికి వచ్చిన ఒక విజిటింగ్ ప్రొఫెసర్‌కు ఆ విశ్వవిద్యాలయంను చూపించడం జరిగింది. తాను అక్కడ చూసిన విషయాలు అతడిని బాగా ప్రభావితం చేసాయి. ఇంకా ఎక్కువగా తెలుసుకోవాలన్న ఆసక్తిగల ఆ ఆచార్యుడు ''హౌమెనీ స్టూడెంట్స్ హి హేడ్ దేర్'' అని ప్రశ్నించాడు. ''వెల్, ఐ ఉడ్ సే అబౌట్ ఒన్ ఇన్ హండ్రెడ్ స్టూడెంట్స్'' అని ఎంతో సాలోచనగా డీన్(DEAN) గారు జవాబిచ్చారు. ●

## దూరాలను కొలిచే సాధనం

*చక్రాలున్న వాహనాలు ప్రయాణం చేసిన దూరాన్ని కొలిచేందుకు వాడే సాధనంను ఇంగ్లీషులో హోడోమీటర్ (Hodometer) అంటారు.*

## విస్‌డమ్ పాతకాపీలు

***మే .'84, జూన్ '84, అక్టోబర్ '84, నవంబరు '84 (రూ. 5.50); మార్చి '85 నుంచి జూన్ '85 (రూ. 5.50); ఫిబ్రవరి '86 నుంచి ఏప్రిల్ '86, అక్టోబర్ '86 (రూ. 6.00); మార్చి '87, ఏప్రిల్ '87, డిసెంబర్ '87 (రూ. 4.00), జనవరి '88, ఏప్రిల్ '88 నుంచి డిసెంబర్ '88 (రూ. 17.00); జనవరి '89 నుంచి డిసెంబర్ '89 (రూ. 24.50); ఫిబ్రవరి '90 నుంచి మే '90, ఆగస్టు '90, సెప్టెంబర్ '90, నవంబర్ '90, డిసెంబర్ '90 (రూ. 18.00); ఫిబ్రవరి '91 నుంచి జూలై '91, సెప్టెంబర్ '91 నుంచి డిసెంబర్ '91 (రూ. 24.00); జనవరి '92 నుంచి డిసెంబర్ '92 (రూ. 33.00); జనవరి '93 నుంచి అక్టోబర్ '93, డిసెంబర్ '93 (రూ. 30.00); జనవరి '94 నుంచి డిసెంబర్ '94 (రూ. 35.00); జనవరి '95 నుంచి డిసెంబర్ '95 (రూ. 36.00); జనవరి '96 నుంచి డిసెంబర్ '96 (రూ. 36.00); జనవరి '97 నుంచి డిసెంబర్ '97 (రూ.36.00); జనవరి '98 నుంచి డిసెంబర్ '98 (రూ. 41.00) కాపీలు మావద్ద ఉన్నాయి. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 12.00 చేర్చి M.O. ''రత్నా ఏజన్సీస్'', 9, దేశికారోడ్డు (ఆళ్వారు పేట వద్ద) చెన్నై – 600 004కు పంపాలి.***

***– సర్క్యులేషన్ మేనేజర్***

''మనలో లోపాలే లేవనుకోవడానికి మించిన తప్పిదం లేదు.'' – కార్లయిల్

# నవభారత నిర్మాతలు

## హెన్నింగ్ హోల్క్ - లార్సన్

అంతర్జాతీయ అవగాహనకు సంబంధించిన 1976వ సంవత్సరపు ప్రతిష్ఠాత్మకమైన మెగ్సెసె బహుమతిని గెలుచుకున్న హెన్నింగ్ హోల్క్ లార్సన్




ప్రస్తుతం 90 సంవత్సరాల వృద్ధుడు. లార్సన్ అండ్ టూబ్రో (Larsen & Toubro) సహనిర్మాతలలో ఇతడొకడు. లార్సన్ అండ్ టూబ్రో చెయిర్మన్‌గానూ, ప్రధాన నిర్వహణా అధికారి (Cheif excutive)గానూ భారతదేశపు సాంకేతిక ఆధునీకరణకూ, సంఘాభివృద్ధికి ఇతడు చేసిన సేవలు మంచి గుర్తింపును పొందాయి.

డెన్మార్క్ దేశపు కోపన్‌హాగన్‌కు చెందిన హోల్క్ లార్సన్ యువ సివిల్ ఇంజినీరుగా, భారతదేశపు ముంబాయి నగరంలో 1935వ సంవత్సరంలో అడుగు పెట్టాడు. భారతదేశపు సిమెంట్ పరిశ్రమకు సంబంధించిన ఒక ముఖ్యమైన బాధ్యతను నిర్వహించడానికి అతడు భారతదేశం వచ్చాడు. ఒక డానిష్ ఇంజినీరింగ్ కంపెనీ అధికారి ఎఫ్.ఎల్. స్మిడ్త్ (F.L. Smidth) ఇతడిని భారతదేశం పంపాడు. చొరవ, ముందుకు తోసుకుపోయే గుణం కారణంగా లార్సన్ భారతదేశంలో తనకొక బంగారు బాటను వేసుకోగలడన్న నమ్మకంతో స్మిడ్త్ ఇతడిని భారతదేశం పంపాడు. అప్పటికి భారతదేశం పారిశ్రామికరంగంలో అనుకున్నంత ప్రగతిని సాధించలేకపోవడమే అతడి ఆ భావనకు ప్రధాన కారణం.

మూడు సంవత్సరాల తరువాత లార్సన్ 1938వ సంవత్సరంలో తన సహచరుడు ఎస్.కె. టూబ్రోతో వెనుతిరిగి వచ్చి లార్సన్ అండ్ టూబ్రో అనే పేరుతో పారిశ్రామిక రంగంలో ముడిపడిన ఉక్కు, సిమెంటు, రసాయనాలు, మందుల తయారీ, కాగితం, గనులు, ఆహారపదార్థాలను తయారుచేయడం, అణుశక్తి మొద

"ఎదుటి వారిని సంతోషింపజేయడంలోనే సంతోషం ఉంది." - స్మిత్

లైన పరిశ్రమలకు చెందిన మేలురకం యంత్రాలను తయారుచేసే ఒక ఇంజినీరింగ్ సంస్థను నెలకొల్పాడు. కంపెనీను కోపెన్‌హాగన్ నుండీ ఇంజినీరింగ్ పట్టాను



Construction engineers

పుచ్చుకున్న ఇద్దరు ఇంజినీర్లు – లార్సన్, టూబ్రోలు – 15,000 రూపాయల పెట్టుబడితో 1938వ సంవత్సరం మే నెలలో ప్రారంభించారు. ముంబాయిలోని నికోల్ (Nicol) రోడ్‌లో వారు ఒక చిన్న సంస్థను ప్రారంభించారు. వారి కార్యాలయంలో అప్పుడు ఒక జవాను, ఒక క్లర్క్ మాత్రం ఉండేవారు. అంతేకాదు ఒక టేబుల్ పట్టేంత స్థలమే ఆఫీసుగా అప్పట్లో ఉండేది. ఈ రోజు ఈ సంస్థ తన త్రివిక్రమ రూపాన్ని దాల్చి బృహత్ పారిశ్రామిక సంస్థగా తయారైంది.

హోల్క్ లార్సన్, టూబ్రోలు కలిసి డెన్మార్క్ దేశానికి చెందిన ఎన్నో ఏజెన్సీలను సంపాదించారు. కానీ తమ వ్యాపారంలో స్థిరపడడానికి ముందే రెండవ ప్రపంచయుద్ధం జ్వాలలు ప్రజ్వలించడంతో డెన్మార్క్ నుండీ రావలసిన దిగుమతులు ఆపుచేయబడ్డాయి. అప్పుడు వారు కాలీకట్ వీధిలో పులవని పాలను (Pasteurisers) వెన్న చిలికే యంత్ర సామగ్రీను ప్రారంభించి భారతీయ సైనికులకు పాల్సన్ బట్టర్ పేరుతో ఆ వస్తువులను అమ్మసాగారు. బ్రిటిష్ అడ్మిరాలిటీ వారు తమకిచ్చిన "హిల్డా" నావను కూడా వీరు వినియోగించుకున్నారు. ఆ నావను నీళ్ళపై తేలే వర్క్ షాప్‌గా మార్చుకుని ఒక అయిల్ (చమురు) కంపెనీ నావ మరమ్మత్తును విజయవంతంగా చేసారు.

మంచి తెలివితేటలున్న హోల్క్ లార్సన్ తన పనిని ఎంతో శ్రద్ధాసక్తులతో చేసాడు. జీవితంలో ఎదురైన సవాళ్ళను ఎంతో

---

## సక్రమవైఖరి

*ఇంట బయట సక్రమవైఖరిని పాటించండి. మీరు ఎందుకు చేయగలరో దానికి కారణాలను చూడండి. అంతేకాని "ఎందుకు చేయలేను?" అన్న దానికి కారణం చెప్పడం కాదు! "నేను గెలుస్తున్నాను" అన్న సక్రమ వైఖరిని మీలో పెంపొందించుకోండి.*

– డా. డి.జె. స్క్వార్ట్జ్

"తరిచి తెలుసుకోవడం కంటే తప్పుపట్టడం ఎప్పుడూ తేలిక." – జియక్స్

ధైర్యంతో అతడు ఎదుర్కొన్నాడు. అంతే కాదు వాటిని అతడెంతో చాకచక్యంతో అధిగమించాడు. 1944వ సంవత్సరంలో ముంబాయి రేవులో ఒక ప్రేలుడు సంభవించింది. మరమ్మత్తు చేయడం అసాధ్యం అని అందరిచేత భావింపబడిన ఒక నావను ఇతడు మరమ్మత్తు చేయగలిగాడు. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారత దేశపు అణుశక్తి ప్రణాళిక కోసం నిర్మించవలసిన అవసరం వచ్చింది. అందులో ఉన్న ప్రమాదాలను తెలుసుకున్న అందరూ దాన్ని చేపట్టడానికి తిరస్కరించారు. కానీ లార్సన్ ఆ సవాలును స్వీకరించాడు. ఆ తరువాత అతడు తయారు చేసిన ఆ వస్తువు, సంస్థ కలిసి కట్టుకృషికీ, సంస్థ సామర్థ్యానికీ అద్దం పట్టింది. 1946వ సంవత్సరంలో లార్సన్ అండ్ టూబ్రో ఒక ప్రైవేట్ కంపెనీగా మారింది. ఆ తరువాత అది పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా 1950వ సంవత్సరంలో మారింది. అతడు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డేనిష్ సివిల్ ఇంజినీరింగ్‌లో సభ్యుడిగా ఉన్నాడు. 1978వ సంవత్సరంలో అతడు లార్సన్ అండ్ టూబ్రో ఛెయిర్మన్‌గా పదవీ విరమణ చేసాడు.

డేనిష్ పౌరుడే అయినా హోల్క్ లార్సన్ తనను తాను భారతీయుడిగానే భావించాడు. యోగాలో ఆసక్తిని చూపి దాన్ని అతడు ఆచరణలో పెట్టాడు. అతడు తీరిక సమయాన్ని ప్రకృతి సౌందర్య నిరీక్షణలోనూ, సంగీతంలోనూ గడిపేవాడు. ఈ దేశాన్ని సుదృఢంగా నిర్మించేందుకు మనోవాక్కాయ కర్మలలో అతడు కృషి చేసాడు. అతడిలో పాండిత్యం, వినయం, ఉత్సాహం, విశ్వాసంల అద్భుతమైన కలయిక ఉండేది. చేపట్టాలన్న పట్టుదల ఉంటే ఏ పనినైనా సాధించవచ్చునన్న గట్టి నమ్మకం ఈ నవ భారత నిర్మాతకు ఉంది.

●

---

ఉపరాష్ట్రపతి పదవిలో చాలా సంవత్సరాలు కొనసాగిన వ్యక్తి




*భారతదేశపు ఉపరాష్ట్రపతిగా డా. సర్వేపల్లి రాధాకృష్ణ 1952 మొదలు 1962 వరకూ పదిసంవత్సరాలు పాటు - కొనసాగారు. ఆ పదవిలో అన్ని సంవత్సరాలు కొనసాగిన వ్యక్తి వీరే.*

"మనలో తప్పులు లేకపోతే ఇతరుల తప్పులను ఎత్తిచూపడానికి అంత ఉత్సాహపడము." - రోషి

# రక్తదానంకు సంబంధించిన వాస్తవాలు

## రక్తం అంటే...

రక్తం మానవ శరీరంలోని అతి ముఖ్య భాగం. తాను చేస్తున్న అనేక పనులతో పాటు శరీరంలోని అణువణువు వరకు ప్రాణవాయువును వ్యాపింపజేసే అతి



ముఖ్యమైన పనిని కూడా ఇది చేస్తుంది. కణాలు సజీవంగా ఉండడానికీ, శక్తికీ ఈ ప్రాణవాయువు కావలసి ఉంటుంది. రక్తం ఘన ద్రవ వాయు పదార్థాల మిశ్రణం. ఇందులోని 45 శాతం జీవ కణాలు ఎర్రకణాలూ, తెల్లరక్తకణాలూ అయితే 55 శాతం ద్రవం ప్లాస్మా అవుతుంది.

## మన శరీరంలోని రక్తం:

ఆరోగ్యవంతుడైన ఒక వ్యక్తి శరీరంలో గుండె నుండీ బయటికి గుండె లోపలకు సుమారు 5–6 లీటర్ల రక్తం ప్రవహిస్తుంటుంది. దీనితోపాటు శరీరంలోని ఇతర భాగాలలో కూడా రక్తం ప్రవహిస్తూ ఉంటుంది.

## రక్తంలోని గ్రూపులు:

జనాభాలోని దాదాపు 22 శాతం ప్రజలు "A" గ్రూపుకు చెందినవారై ఉంటారు. 40 శాతం ప్రజలు "B" గ్రూపుకూ, 8 శాతం ప్రజలు "AB" గ్రూపుకూ, 30 శాతం మంది "O" గ్రూపుకు చెందినవారై ఉంటారు. దీనితో పాటు రక్తంలో "RH" పదార్థం (Factor) కూడా ఉంటుంది. 95 శాతం ప్రజలు

---

## ''నన్ను సహాయం చేయనివ్వండి''

*దయాగుణమే రెండు కాళ్ళ జంతువులైన మనుషులను నాలుగు కాళ్ళ జంతువుల నుండీ వేరు పరుస్తుంది. ఈ దయాగుణం కారణంగానే మనుషులు జంతువుల లాగా నాలుగు కాళ్ళతో నడవకుండా నిటారుగా రెండుకాళ్ళపై ఎత్తుగా నిలబడగలుగుతున్నారు. అలా నిటారుగా, ఎత్తుగా నిలబడగలగడం వల్లనే రెండు చేతులను వాడే స్వాతంత్ర్యం వారికి అబ్బుతోంది. ఈ స్వాతంత్ర్యం వల్లనే మనుషులు ''నన్ను సహాయం చేయనివ్వండి'' అని అనగలుగుతున్నారు.*

''ఒకరికి మేలు చేసి ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవద్దు. కానీ ఒకరు మనకు మేలు చేస్తే మాత్రం ఎప్పుడూ మర్చిపోవద్దు.'' – చిడిస్

RH పాజిటివ్ వర్గం వారైతే 5 శాతం ప్రజలు అరుదైన RH నెగటివ్‌కు చెందిన వారై ఉంటారు.

రక్తం ఎలా తయారవుతుంది?

మనం రోజూ తీసుకునే ఆహారం – ఇనుము, మాంసకృత్తులు, విటమిన్లు, ఇతర కావలసిన పదార్థాలను వాడుకోవడం ద్వారా మన శరీరంలో రక్తం తయారవుతుంది. శరీరం ఎముకలలో నుంచి మెత్తటి కొవ్వు లాంటి పదార్థం రక్తాన్ని తయారుచేసే కార్ఖానాలాంటిది. ఇంత వరకు రక్తాన్ని ప్రయోగశాలలో కృత్రిమంగా వైజ్ఞానికులు తయారుచేయలేదు.

రకం చేసే పనులు:

రక్తంలోని ఎర్ర సూక్ష్మకణాలు (Corpuscles) సాధారణంగా 120 రోజుల దాకా జీవించి ఉంటాయి. ఆ తరువాత అవి శరీరంలో విచ్ఛిన్నం అవుతాయి. హెమోగ్లోబిన్ (Haemoglobin) ద్వారా రక్తం ప్రాణవాయువును తీసుకవెళుతుంది. ఇది అంటువ్యాధులకు విరుద్ధంగా పోరాడుతుంది. అంతేకాదు తగిలిన గాయాలను మాన్పుతుంది. రక్తస్రావాన్ని అరికట్టి శరీరంలోని అన్ని జీవకణాలకూ ఆహారాన్ని అందజేస్తుంది. శరీరంలోని వ్యర్థ పదార్థాన్ని రక్తం మూత్రపిండాల వరకు తీసుకువెళుతుంది. మూత్రపిండాలు వాటిని విసర్జిస్తాయి.

రక్తం అవసరం ఎవరికి ఉంటుంది?

ప్రమాదాలకూ, పుట్టుకురుపు వ్యాధికీ, రక్త లేమితో తీవ్రంగా బాధపడేవారికీ, ప్రసూతి శస్త్ర చికిత్స ద్వారా రక్తం బాగా కోల్పోయిన వారికీ, రక్తం శరీరంలో అసాధారణ రీతిలో నష్టం అయిపోయే వ్యాధికి గురి అయినవారికీ వ్యాధి కారణంగా శరీరంలో రక్తం తయారుకాకుండా ఉండేవారికీ, రక్తం అవసరం ఉంటుంది. వారికి రక్తం ఎక్కించడం జరుగుతుంది.

---

మెగసెసె అవార్డును అందుకున్న తొలి వ్యక్తి.




*భూదానయజ్ఞ ప్రారంభకుడైన వినోబాభావే ప్రతిష్ఠాత్మకమైన మెగసెసె అవార్డును అందుకున్న తొలి భారతీయుడు. సముదాయానికి కావలసిన నేతృత్వాన్ని వహించినందుకు ఈ అవార్డు ఆయనకు 1958 వ సంవత్సరంలో ఇవ్వబడింది.*

"ఆత్మవిశ్వాసంతో అడుగు వేయలేని మనిషి దేనినీ నమ్మడు." – జార్జ్

## ఎంత రక్తాన్ని దానం చేయవచ్చును?

ఒక్కొక్కసారి రక్తదానం చేస్తున్నప్పుడు 250 మొదలు 300 మిల్లీలీటర్ల వరకు రక్తాన్ని దానం చేయువచ్చును. ఈ విధంగా ఇవ్వబడిన రక్తం శరీరంలో అతి త్వరగా తయారవుతుంది. ఇచ్చిన రక్తం భర్తీ కావడానికి ఎలాంటి ప్రత్యేకమైన పథ్యం లేదా విశ్రాంతి లేదా మందు అవసరం లేదు. ఒకసారి రక్తదానం చేసిన దాత నుండీ రక్తం మూడు నెలల తరువా తనే తీసుకోబడుతుంది.

### రక్తదానం చేయడానికి ఎవరెవరు అర్హులు?

రక్తానికి కులజాతిమత లింగ బేధం లేదు. 18 మొదలు 55 సంవత్సరాల వరకు వయస్సున్న 45 కి.గ్రా.లకు తగ్గని బరువున్న వ్యక్తులూ రక్తదానం చేయ వచ్చును. క్షయ, పుట్టకురుపు వ్యాధి, రక్త లేమితో తీవ్రంగా బాధపడేవారూ, తీవ్ర రక్తపోటుగలవారూ, చక్కెర వ్యాధికి గురైన వారు, మలేరియా, సవాయిరోగం (Syphilis) టైఫాయిడ్, పచ్చకామెర్లు, ఎయిడ్స్ తదితర అంటు రోగాలకు గురైన వారు రక్తదానం చేయుడానికి అర్హులు కారు.

(– 'ఆవేపా' సౌజన్యంతో)

## మీ మనిషికై పనిచేస్తే...



మీరు మనిషి కోసం పని చేస్తున్నా భగవం తుడి కోసం పనిచేస్తున్నామనుకోండి. మీకు అవ సరమైన భుక్తికి కావల్సిన ధనం జీతంగా ఇస్తుంటే ఆ మనిషికై పనిచేయండి. ఆయన కోసం వాదించండి. ఆయనకు తోడు నీడగా ఉండండి, అంతేకాదు ఆయన సంస్థకై పాటు పడండి. గోరంత నిజాయితీ కొండంత తెలివితే టలతో సరితూగుతుంది. మీరు మీ యజమానిని లేదా సంస్థను విమర్శించాలంటే చేస్తున్న పనికి రాజీనామా ఇచ్చి బయటపడండి. బయటికి వచ్చిన తర్వాత మీ ఇష్టం వచ్చినట్లు వ్యవహరిం చండి. కానీ ఒక సంస్థలో అంతర్భాగంగా ఉన్నంతవరకు ఆ సంస్థను నిందించకండి. మీరు అంతర్భాగంగా ఉంటూ కూడా నిందిం చారంటే సంస్థబంధాన్ని వదులు చేసిన వారవు తారు. అంతే కాదు అప్పుడు వీచిన తుఫాను గాలికి మీరు వ్రేళ్ళతో సహా పెకిలించబడిన చెట్టులాగా కూలిపోతారు. మీరు దూరంగా తోసి వేయబడతారు. అప్పుడు ఏ కారణంచేత మీరు తీసివేయబడ్డారో ఆ కారణాన్ని బహుశా మీరు ఊహించలేకపోవచ్చు. – ఎల్బర్ట్ హబ్బర్డ్

''మీ కళ్ళద్దాలు సరిగ్గా తుడుచుకోక ఈ ప్రపంచం మురికిగా ఉందని అనకండి.'

– హబ్బర్డ్

# సామాన్యునికి న్యాయశాస్త్రం

## హిందూ వారసత్వపు చట్టం 1956

(1956వ సంవత్సరపు 30వ ఆక్ట్)

### కొడుకుకూ, కూతురుకూ ఇతరులకంటే ఎక్కువ ప్రాధాన్యత

జస్టిస్ జి. రాధాకృష్ణరావు, ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ మాజీ జడ్జి

**రా**జశేఖరం భార్య పేరు సోమమ్మ. ఆమెకు తల్లి ఆస్తి కొంత సంక్రమించింది. రాజశేఖరం, సోమమ్మలకు కృష్ణ మోహన్ అనే కొడుకూ, రామలక్ష్మి అనే



కూతురు ఉన్నారు. తమ కూతురు పెండ్లిని రాజశేఖరం – సోమమ్మలు జరిపించారు. రామలక్ష్మి పెండ్లి ఫల్గుణ రావుతో జరిగింది. కొంతకాలం తరువాత సోమమ్మ చనిపోయింది. చనిపోయిన సోమమ్మ ఆస్తికి ఎవరు చట్టపరమైన వారసులు?

వీలునామా రాయకుండా చనిపోయిన మహిళ ఆస్తికి హిందూవారసత్వపు చట్టం 1956లోని 15వ శాఖ ప్రకారం కొడుకుకూ, కూతురుకూ ముందే చనిపోయిన కొడుకు లేదా కూతురు సంతానంకూ, భర్తకూ ఇతరులకంటే కూడా ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాల్సి ఉంటుంది. ఆ కారణంగా సోమమ్మ ఆస్తి కొడుకు కృష్ణమోహన్‌కూ, కూతురు రామలక్ష్మికీ, భర్త రాజశేఖరంకు చట్టప్రకారం దక్కాలి. ఈ మహిళా ఆస్తికి – స్త్రీధనంకు – వారే చట్టరీత్యా వారసులు. ●

---

### 19 వికెట్లను పడగొట్టిన జిమ్‌లేకర్

*1956వ సంవత్సరంలో ఓల్డ్ ట్రాఫోర్డ్ (Old Trafford)వద్ద జరిగిన టెస్టు మ్యాచిలో డేవిడ్ షెపర్డ్ (David Shepherd) వంద పరుగులను సాధించాడు. అదే టెస్ట్ మాచ్‌లో ఇంగ్లాండుకు చెందిన బౌలర్ జిమ్ లేకర్ (Jim Laker) రెండు ఇన్నింగ్స్‌లో కలిపి మొత్తం 19 వికెట్లను పడగొట్టాడు.*

''ఆదర్శప్రాయమగు భార్య లభించాలంటే భర్త ఆదర్శవంతుడై ఉండాలి.''
– పార్కింగ్‌టన్

# నాయకత్వపు రహస్యం

సుప్రసిద్ధ ఆంగ్లేయ రాజనీతి శాస్త్రజ్ఞుడైన ఆచార్య సిరిల్ నార్త్‌కోట్ పార్కిన్‌సన్ (Cyril Northcote Parkinson) ప్రకారం నాయకత్వపు రహస్యం దిగువ కనబరిచిన ఆరు సూత్రాలలో దాగుంది.



1. భావన (Imagination): ఒకటికి బదులు మరొక విషయాన్ని ఊహించుకోగల సామర్థ్యంగా ఇమేజినేషన్‌ను నిర్వచించవచ్చును. తెలివితేటలతో ప్రణాళికను తయారు చేసుకుని ఆచరణలో పెట్టగలగడంలో ఇది నాయకుడికి తోడ్పడగలదు. ఏ కొద్దిమంది వ్యక్తులు మాత్రమే చివరిగా సాధించగల దూరదర్శకత్వాన్ని ఇది ప్రసాదించగలదు.

2. జ్ఞానం (Knowledge): ఇది ఒక నాయకుడికి కావలసిన అమూల్య విషయం. గతంలో తాను ఆర్జించుకున్న జ్ఞాన బిందువుల సేకరణ ద్వారానే అతడు తన లక్ష్యాన్ని చేరగలగడానికి ప్రణాళికను తయారుచేసుకోగలడు. సరైన చదువే అతడికి కావలసిన ఆత్మవిశ్వాసాన్నిచ్చి లక్ష్యాన్ని సాధించగలిగేలా చేస్తుంది. ఆత్మవిశ్వాసం కరువైనప్పుడే వ్యక్తులు కోపతాపాలకు గురై తప్పులు వెతుకుతూ కేకలు వేయడం, సతాయించడం లాంటి పద్ధతులను అవలంభిస్తుంటారు. నిజమేమిటంటే సైన్యంలో చెడ్డ సైనికులుండరు, చెడ్డ సైన్యాధికారులే ఉంటారు.

3. సామర్థ్యం (Ability): ఇతరులకు దారిచూపుతూ వారుచేస్తున్న పనులను అత్యధిక సామర్థ్యంతో నిర్వహించడానికి కావలసిన మార్గాలను సూచిస్తూ వారిని ఉత్సాహ పరచడాన్ని సామర్థ్యం అంటారు. ఇతరులు కష్టసాధ్యం అనుకున్న పనిని ఈ సామర్థ్య గుణం నాయకుడి ద్వారా చేయించగలుగుతుంది.

4. దృఢనిర్ణయం (Determination): తాను చేస్తున్న పనిలో అచంచలమైన విశ్వాసాన్ని కలిగి ఉండడాన్ని నిర్ణయం అంటారు. ఈ నిర్ణయం గుణం ఇతరులలో తాము చేస్తున్న పనిని సజావుగా చేయడానికి కావలసిన ప్రేరణను ఇస్తుంది.

5. నిర్దయ (Ruthlessness): ఇది సంఘం మెచ్చని గుణం. కాని ఈ దిగువ

''మనతో ముష్టియుద్ధానికి దిగే వ్యక్తి మన నరాలను బలపరిచి మన నైపుణ్యానికి పదును పెడతాడు. మన పోటీదారుడే మన సహాయకుడు.'' – ఎడ్మండ్ బర్క్

ఇవ్వబడిన కారణాలు ఈ గుణం లేని పక్షంలో నాయకుడు ఏదీ సాధించలేడని తెలియచేస్తాయి.

(ఎ) సోమరులు, విశ్వాసం లేనివారినీ నకిలీ మనుషులను నిర్దాక్షిణ్యంగా తీసివేయాల్సి ఉంటుంది.

(బి) ఇలాంటి శక్తులను అణచని పక్షంలో పనిచేయడానికి ఇష్టపడే సామర్థ్యం గల వ్యక్తులపైన అధిక భారం మోపాల్సి వస్తుంది. ఈ పరిస్థితి చాలా కాలం కొనసాగలేదు. ఇష్టపడి పనిచేసేవారి నైతికతను ఇది దెబ్బతీస్తుంది.

(సి) సంస్థాగత సామర్థ్యం అన్నది అనువైన వారికి పారితోషకాలను అందివ్వడం అనువుకాని వారిని ఏరిపారేయడంలోనే ఉంది.

(డి) గుర్తింపు ఇవ్వవలసిన అవసరం వచ్చినప్పుడు గుర్తింపు ఇవ్వాలి. లేనట్లైతే సామర్థ్యం లేదా పనితనానికి అర్థం అంటూ ఉండదు.

6. ఆకర్షణ (Attraction): ఇతరులను ఆకర్షించడం అన్నది నాయకుడికి ఉండవలసిన లక్షణం. కనబడని నాయకుడు వినబడడు. కానీ ఈ రోజు జరుగుతున్న భారీ వ్యాపారంలో ఒకే వ్యక్తి అన్నిచోట్ల ఉండడం అన్నది సాధ్యం కాదు. అందుకే అతడిని గురించి మాట్లాడుకోవడం మొదటిదానికంటే మెరుగైనది. సాధారణం కాని, సాధ్యం కాని పనులను చేసే వ్యక్తిని గురించే ప్రజలు చెప్పుకుంటుంటారు.

నాయకత్వపు లక్షణం లేదా సామర్థ్యం పుట్టుకతోనే వస్తుందన్న సిద్ధాంతంలో ఆచార్య పార్కిన్‌సన్‌కు నమ్మకం లేదు. అదేవిధంగా ఇది పాఠశాలలోనో లేదా కళాశాలలోనో నేర్చుకోగల విద్య అని కూడా అతడు నమ్మడం లేదు. నాయకత్వం అన్నది ఒక కళ. ఇది ప్రయత్న పూర్వకంగా సాధించగలిగే విషయం. దీనికి విద్యార్హతల అవసరం లేదు. ●

## అత్యున్నత పౌర విమానయానం అవార్డు గ్రహీత




*అంతర్జాతీయ పౌర విమానయాన సంస్థ (International Civil Aviation Organisation) వారి అత్యున్నత పౌర విమానయాన అవార్డు అయిన ఎడ్వర్డ్ వార్నర్ (Edward Warner) అవార్డును 1986 వ సంవత్సరం అక్టోబరు నెల 2వ తారీఖున కెనడా దేశపు మాంట్రియల్ (Montreal) నగరంలో శ్రీ జె.ఆర్.డి టాటా అందుకున్నాడు.*

"బాగా అలసట పొందిన వాడిని కొంచెం పొగడ్త ఉత్సాహపరుస్తుంది." – జేమ్స్ మోన్‌రో

# ప్రపంచపు అతి ప్రాచీనమైన అతి పొడవైన చెట్లు

అంత సులభంగా ఎక్కడానికి వీలు కాని ఖజకిస్థాన్ (Kazakhstan)లోని చిన్ కెంట్ (Chin Kent) ప్రాంతపు నిటారు ప్రదేశంలో వైజ్ఞానికులు సుమారు 1000 సంవత్సరాలకు మించిన వయసున్న టర్క్‌మాన్ జూనిపర్ (Turkman Juniper) చెట్లను కనుగొన్నారు.




మనం అందరం ఎరిగిన దేవదారు (Pine) చెట్టు 580 సంవత్సరాల కాలం జీవించి ఉండగలదు. రష్యాదేశపు సైబీరియా (Siberia)లోని సెడర్‌పైన్ (Cedar Pine) చెట్టు ఆయుఃపరిమాణం 800 సంవత్సరాలు. జపానుదేశపు 26వ చక్రవర్తిచే అక్కడ నాటబడిన "ఉసుజుమి" (Usuzumi) అని పిలువబడే చెర్రీ (Cherry) చెట్టు వయసు 1300 సంవత్సరాలుగా భావించబడుతోంది. దీని బోదె (Truck) చుట్టుకొలత 41 అడుగులు.

జపానులోని కొన్ని కర్పూరం చెట్లు వయసు 2800 సంవత్సరాలు ఉంటుందని చెప్పుకుంటున్నారు. 124 అడుగుల చుట్టుకొలత గల మెక్సికోలోని ఎల్ ట్యూడ్ (El Tude) చెట్టు వయసు 5000 సంవత్సరాలు అయి ఉంటుందని భావిస్తున్నారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని కాలిఫోర్నియా రాష్ట్రంలోని సెక్వోయా (Sequoia) చెట్లూ, ఆస్ట్రేలియాలోని యూకలిప్టస్ (Eucalyptus) చెట్లు ప్రపంచపు అతి పొడవైన చెట్లు. ●

## శక్తిని వృద్ధిపరిచేది

*100 గ్రాముల స్పినాచ్ – రక్తంలోకి ప్రాణవాయువునూ, సి విటమిన్‌నూ తీసుకుపోగలుగుతుంది. అంతేకాదు "ఇనుము"ను శరీరం పీల్చుకునేందుకు తోడ్పడుతుంది.*

*100 గ్రాముల చికోరి – శక్తి విడుదలకు కావలసిన బి విటమిన్‌ను కలిగి ఉంది.*

*50 గ్రాముల ఉల్లి – త్వరగా కలిసిపోయే బ్లడ్ షుగర్ స్థాయిని పెంచగల చక్కెరను అదుపులో ఉంచగల అరుదైన కూరగాయలలో ఒకటి.*

*రుచికి వాడే మిరియాలు – శక్తి విడుదలకు కావలసిన నియాసిన్ (Niacin) (B3)ను సమకూరుస్తుంది.* – హెల్

"మనం ఇచ్చినంతగా ధనవంతులవుతావు. మనం ఇవ్వకుండా దాచిపెట్టుకున్నంతగా పేదలం అవుతాం."

# నవ్వు

## చప్పట్లు చరచడం

మీకు మించిన గొప్ప నటుడు కావాలని నాకుంది అని ఒకసారి ఒక యువ నటుడు ఒక గొప్ప రంగస్థల నటుడితో అన్నాడు. "దానికేముంది?. అది చాలా తేలిక. రంగ ప్రవేశం చేస్తున్నప్పుడూ, రంగం నుండీ నిష్క్రమిస్తున్నప్పుడు జనం చప్పట్లు చరిస్తే చాలు" అని రంగస్థల నటుడు జవాబిచ్చాడు.



## మా నాన్న హోమ్‌వర్క్ చేసిపెట్టాడు

"బాచిలర్" (బ్రహ్మచారి) అన్న మాటకు వ్యాఖ్యానం రాయమని టీచర్ అడిగినప్పుడు ఒక అమ్మాయి "చాలా సంతోషంగా జీవించే వ్యక్తి" అని రాసింది. నీకు ఈ వ్యాఖ్యానం రాయాలన్న ఆలోచన ఎట్లా వచ్చిందని టీచర్ ఆ అమ్మాయిని అడిగింది. "మా నాన్న హోమ్‌వర్క్ చేయడంలో నాకు సహాయపడ్డాడు" అని ఆ అమ్మాయి బెదురుతూ జవాబిచ్చింది.

## ప్రకృతి చేసిన చెడ్డపని

బాగా పేరుమోసిన ఒక వ్యక్తి బొమ్మను గీసి దాన్ని ఆ వ్యక్తికి చూపించి "ఎలా ఉంది?" అని చిత్రకారుడు అడిగాడు.

"నాకు నచ్చలేదు. ఇది కళ చేసిన చెడ్డ పని అని నేను చెప్పాలి" అంటూ ఆ వ్యక్తి జవాబిచ్చాడు.

"నిజమే" అని జవాబిచ్చి, "అయితే ప్రకృతి చేసిన చెడ్డపని మీరన్న విషయం ఒప్పుకోవాలి" అని అన్నాడు.

## స్వచ్ఛమైన హృదయం

*స్వచ్ఛమైన హృదయంతో*
*చేసినపని చిన్నదైనాసరే*
*చిన్నదిగా లేదా అల్పమైనదిగా పరిగణింపబడదు.*
*మొక్కానికి మర్రి విత్తనం*
*మరి చిన్నదిగా కనిపించడం లేదా?*

*– యోగి వేమన*

"భగవంతుడిచే రక్షింపబడే వ్యక్తికి ఎవరూ హాని చేయడానికి సాహసించలేరు."

– మహాత్మాగాంధీ

## శాంతిని ప్రేమించాను అందుకే సైన్యంలో చేరాను

మొదటి సైనికుడు: "మీకు సైన్యంలో చేరాలని ఎలా అనిపించింది?"

రెండవ సైనికుడు: "నాకు భార్య లేదు. కాబట్టి నేను యుద్ధాన్ని ఇష్ట పడ్డాను. అందుకే సైన్యంలో చేరాను. మరి అయితే మీరెందుకు సైన్యంలో చేరారు?"

మొదటి సైనికుడు: "ఏముంది? నాకు భార్య ఉండేది. నేను శాంతిని ప్రేమిం చాను. కాబట్టి నేను సైన్యంలో చేరాను."



## మీరు మాలో ఒకరిలాగా కనబడుతున్నారు

పిచ్చాసుపత్రిలోని ఒక రోగి: "ఇదివరకిటి నర్సుకంటే కూడా మిమ్మల్ని మేము ఎక్కువ ఇష్టపడుతున్నాము."

కొత్తనర్సు (ప్రశంసకు ఉప్పొంగిపోయి): "అలా ఎందుకు అంటున్నారు?"

రోగి: "ఏముంది? మీరు మాలో ఒకరి లాగా కనబడుతున్నారు."

అధ్యాపకుడు: గోపాల్! ఎవరిని అర్థ శాస్త్రవేత్త అంటారు?

గోపాల్: బాగా డబ్బున్న వారి కంటే కూడా డబ్బును గురించి బాగా తెలిసిన

## గుర్తుపట్టడం తేలిక

చెయిర్మన్ (మేనేజర్‌తో): "మెల్లకన్ను, సొట్టముక్కు, చాట చెవులు ఉన్న వ్యక్తిని మీరు ఎందుకు కాషియర్‌గా నియ మించారు?"

మేనేజర్: "మీరు చెప్పిందంతా కరెక్టే. అతడు చెప్పకుండా పారిపోయాడనుకోండి అతడిని గుర్తుపట్టడం తేలిక అవుతుంది."

## చదువు

"చదువు అన్నది పురోగతిని సాధించిన తరువాత పొందగల విలాస సామగ్రి కానే కాదు. అది అభివృద్ధి పథంలోని అంతర్భాగం. అంతే కాదు మనం ఏమాత్రం తప్పించుకోలేని అవసరమైన అంశం."

– డీన్ ర్యూస్

"మనం ఎంత శాంతంగా ఉంటే అంతగా మన నరాలు ఉద్రిక్తతకు గురి కావు. మనం ఎంతగా ప్రేమమార్గాన్ని అవలంబిస్తే అంతగా పనులను బాగా చేయగలం."

– స్వామీ వివేకానంద

## ఒకేసారి

విమాన ప్రమాదానికి సంబంధించిన దర్యాప్తు జరుగుతోంది. ప్రమాదానికి గురి అయిన విమానం నుండీ కొన్ని క్షణాల ముందే గాలి గొడుగు ద్వారా తప్పించుకున్న పైలెట్ జరిగిన ప్రమాదాన్ని గురించి ఇలా వివరించాడు.

''అయ్యా! ఏమి చెప్పమంటారు? ఇంధనం అయిపోవడం, ఎత్తుపడిపోవడం, బుద్ధి పనిచేయకపోవడం అన్నీ ఒకేసారి జరిగాయి.''



## నాకు అయిదు సంవత్సరాలు

ఒక తండ్రి తన కొడుకును చాలా గర్వంతో ఆఫీసువారికి తొలిసారిగా పరిచయం చేసాడు.

ఆ అబ్బాయి తండ్రితో కూడా పని చేసే ఒక వ్యక్తి ''అబ్బాయి నీకు ఎన్ని సంవత్సరాలు?'' అని అడిగాడు.

''నేను ఇంట్లో ఉన్నప్పుడు నా వయసు ఏడు సంవత్సరాలు. కానీ నేను బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడు నా వయసు ఐదు సంవత్సరాలే' అని కొంటెగా జవాబిచ్చాడు.

## అవును! రెండుసార్లు

ఖాతాదారుడు: ''నేను పంపిన చెక్కు అందిందా?''

వ్యాపారస్థుడు: ''రెండుసార్లు అందుకున్నాను. మొదట మీ వద్ద నుండీ, రెండవసారి బాంకు వారి వద్దనుండీ.''

## ఇంతవరకూ పోట్లాడుకోనేలేదు!

మాధవ: ''అయితే నీవు ఇప్పటివరకు నీ భార్యతో పోట్లాడలేదంటావు?''

రాఘవ: ''లేదు అసలు పోట్లాడుకోలేదు. ఆమె ఆమె దారిలో పోతుంది నేను ఆమె దారిలో పోతాను.''

---

## చాంద్రమానం నెల!

*భూమి చుట్టూ తిరగడానికి చంద్రుడికి పట్టేకాలాన్ని పౌర్ణమి మొదలు పౌర్ణమి వరకు లేదా 29.53 రోజులను ఇంగ్లీషులో సినోడిక్ (Synodic) నెల అంటారు.*

''ఎల్లప్పుడూ కొత్తవిషయాలను కనుగొనే సక్రమమైన మనసే ఈ ప్రపంచంలోని అత్యుత్తమ సౌందర్యసాధనం.''

### అది నా నెక్టై

బాగా క్రిక్కిరిసిన బస్సులో వినబడ్డ మాటలు:

అబ్బాయి (అమ్మాయితో): "క్షమించండి. ఈ స్ట్రాప్‌ను నాతో పంచుకుంటారా?"

అమ్మాయి: "వద్దండి. నా దగ్గర ఇప్పటికే ఒకటుంది."

అబ్బాయి: "లేదండి. మీ దగ్గర లేదు. మీరు పట్టుకున్నది నా నెక్టై."

### మరైతే డాక్టరుగారు కనుగొన్నారా?

భార్య (డాక్టర్ వద్ద నుండీ తిరిగి వచ్చిన భర్తతో): "అయితే డాక్టరుగారు మీ గురించి అంతా తెలుసుకున్నారా?"

భర్త: "చాలావరకు తెలుసుకున్నారు. 50 రూపాయలు నా వద్ద ఉన్నాయని తెలుసుకుని 45 రూపాయల ఫీజును పుచ్చుకున్నాడు."

### నిన్ను బర్తరఫ్ చేస్తున్నాను

ఫోర్‌మన్ (కోపంగా): "నిన్ను బర్తరఫ్ చేస్తున్నాను."

ఉద్యోగి (సోమరితనంతో): "నేను ఏమీ చేయందే?"

ఫోర్‌మన్: "అది నాకు తెలుసు. అందుకే బర్తరఫ్ చేస్తున్నాను."

### నేను ఖచ్చితంగా చెప్పగలను

కిషన్: మూర్ఖుడు మాత్రమే తాను చెప్పిన విషయం అది ఏమైనాసరే ఖచ్చితమైనదని భావిస్తాడు.

రమేష్: ఈ విషయం నీవు ఖచ్చితంగా చెప్పగలవా?

కిషన్: అనుమానమే వద్దు. నేను ఖచ్చితంగా చెప్పగలను.

### నెహ్రూ జ్ఞాపకార్థం జారీ చేయబడిన తొలినాణెం




*1964వ సంవత్సరంలో పండిత్ జవహర్ లాల్ నెహ్రూను గౌరవిస్తూ ఆయన జ్ఞాపకార్థం నాణాలు జారీ చేయబడ్డాయి. నికెల్‌తో చేయబడిన ఒక రూపాయి బిళ్ళ, అర్ధ రూపాయి బిళ్ళలను అప్పుడు జారీ చేయడమైంది.*

"రేపన్నది సోమరులు ఎక్కువగా పని చేయవలసిన రోజు." – నార్వేజియన్ సామెత

# ముందు చూపును కలిగి ఉండండి

ఫ్రెంచ్ విప్లవానికి సంబంధించిన పుస్తకం రాసే పనిని థామస్ కార్లైల్ చాలావరకు పూర్తి చేసాడు. తన పొరుగు వాడైన జాన్ స్టువర్ట్‌మిల్‌కు అతడు దాన్ని చదివేందుకు ఇచ్చాడు. కొన్ని రోజుల తరువాత పాలిపోయిన మొహంతో దిగా




లుగా మిల్, కార్లైల్ ఇంటికి వచ్చాడు. అతడి ఇంట్లో పనిచేసే పనికత్తె పొయ్యి రాజెయ్యడానికి వ్రాతప్రతిని వాడడం జరిగిందన్న విషయం మిల్ తెలియం జేసాడు.

చాలా రోజుల వరకూ కార్లైల్ కోపంతో ఉడికిపోయాడు. రెండు సంవత్సరాల ప్రయాస వ్యర్థం అవడంతో రెండవసారి దాన్ని తిరిగిరాసేంతటి శక్తి అతని వద్ద లేకపోయింది. మళ్ళీ మొదటినుంచి తిరిగి రాయడం అన్న ఆలోచన అతనిలో తిరగబడింది.

---

## దోపిడి దొంగల హృదయాన్ని చూరగొన్న పెండ్లికూతురు

పేదవారైన దోపిడీ దొంగలు ఒకప్పుడు ఇండ్లపై దాడి చేసి ఇళ్ళను గుల్ల చేసేవారు. ఒకసారి ఒక ఇంటిపై దొంగలు దాడి చేసారు. ఇంట్లో ఉన్న కొత్త పెండ్లి కూతురుతో ఒంటిమీద ఉన్న అన్ని నగలను ఇవ్వమన్నారు. ఆ పెండ్లికూతురు మొదట్లో బాగా బెదిరి పోయింది. అయినా నగలను తీసి ఇస్తున్నప్పుడు ధైర్యాన్ని కూడగట్టుకుని ''అయ్యాల్లారా! నా నగలను మీకిస్తే నా అత్తమామలు మళ్ళీ నగలు తీసుకురమ్మని నన్ను ఇక్కడి నుండీ మా పుట్టింటికి తరిమేస్తారు. నా తల్లిదండ్రులేమో చాలా పేదవారు. వారు మళ్ళీ నగలను చేయించి నాకు ఇవ్వలేరు. ఆ కారణంగా నా శేషజీవితాన్ని పుట్టింటిలో, నా పుట్టింటి వారికి భారంగా ఉండేలా జీవించాల్సి వస్తుంది'' అని వారితో మొరపెట్టుకుంది. బెదిరినా కూడా ధైర్యంగా దొంగలతో మొరపెట్టుకున్న ఆ పెండ్లికూతురు కన్నీటి గాథ వారి మనసులను కరిగించింది. దయాగుణంలేని కఠినాత్ములైనా ఆ దొంగల గుండె కూడా కరిగింది. ఆ పెండ్లి కూతురు నగలు ఆమెకు తిప్పి ఇచ్చి అక్కడ నుండి వారు వెళ్ళిపోయారు.

**''తాను శ్రమించిన పనివల్ల అతడికి లభించే ఫలితంపై కాకుండా అతడు మారిన విధమే అతిగొప్ప బహుమతి అవుతుంది.'' – జాన్ రస్కిన్**

ఒకానొక రోజు కార్లైల్ రోడ్డుపై నడిచి వెళుతున్నాడు. ఎత్తైన రాతిగోడను కడుతున్న ఒక తాపీ పనిమనిషిని అతడు చూసాడు. చాలాసేపు కార్లైల్ ఆ దృశ్యాన్ని చూస్తూ గడిపాడు. ఉన్నట్టుండి గోడ ఎత్తును ఒక ఇటుకపై మరొక ఇటుకను పేర్చి పెంచడాన్ని అతడు చూసాడు. దానితో ప్రేరణను పొంది "ఈ రోజు ఒక పేజీను రాస్తాను. రేపు రెండవ పేజీను రాస్తాను. ఒక రోజుకు ఒక పేజీనే రాస్తాను. ఆ పేజీ వరకే ఆలోచిస్తాను" అన్న నిర్ణయాన్ని తీసుకున్నాడు.

నిదానంగా అతడు రాయడాన్ని చిన్నగా ప్రారంభించాడు. చేయవలసిన పని చాలా శ్రమతో కూడినదే అయినా తన నిర్ణయానికి కట్టుబడి ఉంటూ మొత్తం రాత పనిని పూర్తి చేసాడు. మొదటిసారి రాసిన దానికంటే ఈసారి మంచి ఫలితం తనకు దక్కిందన్న భావన ఆయనలో కలిగింది.

చెడు జ్ఞాపకాలు లేదా దురదృష్టకరమైన సంఘటనలను మీపై స్వారీ చేయనీయకండి. అవి మిమ్మల్ని తమ స్వాధీనంలో ఉంచుకుంటే వాహనం వెనుక దృశ్యాన్ని చూపే అద్దంలో చూసుకుని మీరు – ముందుకు సాగలేరు. అందుకే ముందు చూపును కలిగి ఉండాలి.

## నవ్వులో దాగున్న వెలుగు

హెలెన్ స్టెయినర్ రెస్



*జీవితం ఎండావానల*
*నవ్వుల కన్నీటి జల్లుల, బాధల కలయిక.*
*అన్నిరోజులూ కావు కాంతివంతం*
*కానీ సూర్యుడు వెలుగు నింపని మేఘం లేదు నిజం*
*అందుకే నవ్వుతూ ఉండు, ఏదైనాసరే కష్టం.*
*దేవుడు నా సంరక్షకుడన్న భావం కావాలి నీకవచం.*
*అవుతుంది నీముఖం ప్రమోదభరితం.*
*నీరోజులు అవుతాయి కాంతివంతం.*
*బరువు బాధ్యతలు తేలికపడ్డ భావం.*
*నీనవ్వువల్ల ఉదయించడం ఖాయం.*
*ఎవరో ఎక్కడో చూపుతారు నీపై వాత్సల్యం.*
*ఈ ఇలపై జీవించడం ఒక మహాభాగ్యం.*
*అవుతుంది జీవితం అందమైన నవ్వుల మయం.*

*–సేకరణ డా. డి.ఆర్. గుప్త*

"అప్పు ఇవ్వండి మీ స్నేహితులను పోగొట్టుకోండి."

# చిరచిరలాడే గుణం మానుకోవడానికి ఆరుమార్గాలు

★ మీ కష్టాలను మీవరకే పరిమితం చేసుకోవడాన్ని మానేందుకు ప్రయత్నించండి. సానుభూతితో అర్థం చేసుకుని వినేవారితో మిమ్మల్ని బాధపెడుతున్న విషయాన్ని చర్చించి మీ భుజాలపైనున్న అపారమైన బరువును మీరు తగ్గించుకోగలరు. శ్రద్ధగా వినేవారు ఎవరైనా కానివ్వండి – భార్య, తండ్రి, తల్లి, దగ్గరి స్నేహితుడూ లేదా తెలియని వ్యక్తి అయినాసరే – వారితో మనసు విప్పి మాట్లాడండి.



★ కనీసం కాస్సేపు అయినాసరే మీ బాధలను మరచిపోగల అలవాటును చేసుకోండి. మిమ్మల్ని బాధపెడుతున్న ఆలోచనల నుండీ అప్పుడప్పుడు దూరం జరిగి మీ రోజు వారి పనిలో నిమగ్నులు కండి. మీ చెడు మనోభావాలను ఇతరుల వరకు వ్యాపింపజేయడానికి ప్రయత్నించకండి.

★ మీ కోపాన్ని బయటపెట్టే ముందు దాన్ని నిగ్రహించుకునే అలవాటును చేసుకోండి. అలా నిగ్రహించుకుంటున్న సమయంలో పరిస్థితులను బాగా బేరీజు వేసుకోండి. ఇలా చేసారంటే కోపంతో విరుచుక పడడం వల్ల మీరు ఏమీ సాధించలేరని, మరింత అలజడికి గురి కాగలరని తెలుసుకోగలుగుతారు. మీ మనసులో ఉన్న కోపాన్ని తగ్గించుకునే ఉత్తమ మార్గం ఏదైనా శారీరక శ్రమను లేదా వ్యాయామాన్ని చేపట్టడమే.

★ అప్పుడప్పుడు ఇతరుల కోసం కొన్ని వదులుకోవాల్సి వస్తుంది. మొండి పట్టుతో నేను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అని వాదిస్తున్నప్పుడు మనం దారి తప్పిన పిల్లల్లా వ్యవహరించిన వారమవుతాము. మీ ప్రత్యర్థి మాటలను అభిప్రాయాలను విని వాటికి ఇవ్వవలసిన మర్యాదనిచ్చి మీ సొంత అభిప్రాయానికి సంబంధించిన విమర్శతో కూడిన పద్ధతిని అవలంభించండి. యుక్తాయుక్తమైన ఆలోచనలు మనకు సహాయపడడమే కాదు ఇతరుల గౌరవాన్ని కూడా పొందగలిగినవిగా ఉంటాయి.

★ ప్రతి విషయంలోనూ ప్రథము లుగా ఉండడం అన్నది పూర్తిగా అసం భవం. ప్రతి ఒక్కరి తెలివితేటలకూ, సామర్థ్యానికీ ఒక హద్దు అంటూ ఉంటుందన్న విషయాన్ని మనం మరిచి పోకూడదు. కానీ మీ ప్రధానమైన రంగంలో ఉత్కృష్టమైన స్థాయికి చేరుకోవ డానికి ప్రయత్నించండి. అదేవిధంగా మీకు బాగా రుచించే విషయాలలో, మీకు నైపుణ్యం ఉన్న రంగంలో కూడా అభివృద్ధిని సాధించడానికి ప్రయత్నిం చండి. ఇలా చేయడంవల్ల ఒకటి లేక రెండు రంగాలలో విజయాన్ని సాధించా రన్న తృప్తి మిగులుతుంది.

★ మీ గుప్పెట్లో సముద్రాన్ని బంధిం చాలన్న కోరికను కలిగి ఉండకండి. ఇత రుల నుండి చాలా ఎక్కువగా అభిల షించే వ్యక్తులు ఎడతెగని చిరాకుకు గురి అవుతుంటారు. విరామం లేకుండా విమర్శిస్తూ ఉండడం వల్ల మీ భార్యనో, మీ అత్తగారినో, లేదా స్నేహితుడినో సరి దిద్దగలరని అనుకుంటే మీరు పొరపడు తున్న వారవుతారు. పెద్దవారికి తెలియజె ప్పడం చాలా కష్టమైన పని అని తెలుసు కోకుండా ఉన్నారంటే ప్రతి ఒక్కరూ మీ అభిరుచి ప్రకారమే నడుచుకోవాలని కోరు కునే వారవుతారు. ఈ విధమైన వ్యవహారం బెడిసికొడుతుంది. అనవసరమైన శత్రు త్వాన్ని విరోధాన్ని కొని తెచ్చుకోవాల్సి వస్తుంది. ఇతరులలో ఉన్న మంచిని చూడడం నేర్చుకోండి. వారిలో ఉంటున్న ప్పుడు ఆ మంచి వైపే మీ దృష్టిని కేంద్రీకరించండి. ఇలా వ్యవహరించారంటే ఒక మంచి రోజున మీ చుట్టూ ఉన్నవారు తమనుతాము అర్థం చేసుకున్నారన్న సంగతీ, మీరు తెలిసి ఏ ప్రయత్నం చేయకుండానే అందరూ మీ మార్గాన్ని అనుసరిస్తున్న సంగతీ మీకు తెలిసి పోతుంది. ●

---

## నౌకల కంపెనీను స్థాపించిన తొలి భారతీయుడు




*తమిళనాడుకు చెందిన స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ. వి.ఒ. చిదంబరం పిళ్ళే ఒక నౌకల కంపెనీను – ది స్వదేశీ షిప్పింగ్ కంపెనీ –1909లో స్థాపించాడు. ఇటువంటి స్వదేశీ షిప్పింగ్ నౌకల కంపెనీను స్థాపించిన మొదటి భారతీయుడు ఇతడే.*

''ఇతరుల తప్పులను ఎత్తిచూపే ముందు మీ సొంత తప్పులను గురించి తెలుసుకోండి.''

# హృదయ కవాటాలను తెరిచే ప్రార్థన

ప్రార్థన ఒక అంతరంగ అన్వేషణ. భగవత్ కృపకు తపించే కోరిక.

ప్రార్థన హృదయ కవాటాలను తెరచి భగవంతుడి రాకపోకలకు సహకరిస్తుంది. అది ప్రేమను తన హృదయంలోకి ఆహ్వానించి ద్వేషాన్ని తరిమివేస్తుంది. అహంకారాన్ని తరిమి అణకువకు ప్రవేశం కల్పిస్తుంది.



ప్రార్థన బిక్షం అడుక్కోవడం కానీ లేదా బేరంకానీ కానేకాదు. ప్రార్థన ద్వారా అధికంగా పొందడానికి కాక అధికంగా కలిగి ఉండడానికి అవకాశం ఉంది. మన జీవితాన్ని సార్థకం చేసే పరోపకార గుణానికి ప్రార్థన ద్వారా ఒక మార్గాన్ని అన్వేషించడం కుదురుతుంది.

మనల్ని మనం అర్థం చేసుకోవడానికి, తెలుసుకోవడానికి ప్రార్థన సహాయపడుతుంది. ప్రార్థన ద్వారా మనం మన బలహీనతలను బయటపెట్టుకుని భగవంతుడికి తెలియజేస్తాము. అలా చేసి అతడి దయకు పాత్రులమై అతడి ప్రేమ,

---

## మీ బుద్ధికి పదును పెట్టుకోండి

*1. ఎండకాలం నుండీ కొత్త సంవత్సరం ఎంత దూరంలో ఉంటుంది?*

*2. గ్రెగేరియన్ కాలెండర్‌లో ఏ నెలలో 28 రోజులు మాత్రం ఉంటాయి?*

*3. పాఠశాల విద్యార్థులు తరచుగా వాడే ఇంగ్లీషు మాటలేవి?*

*4. గడియారం 13 గంటలు కొడితే అది ఏ సమయాన్ని సూచిస్తుంది?*

*5. గోడల ద్వారా ఆవలివైపు చూడగల సాధనం పేరేమి?*

*6. ఏ రాష్ట్రపతి ఎక్కువ పెద్ద జోళ్ళను వాడాడు?*

*7. రెండు రెళ్ళు ఎప్పుడు అయిదవుతుంది?*

*8. రెళ్ళను కనుగొనేందుకు ప్రేరణ ఎక్కడి నుండి లభించింది?*

*9. ఈ ప్రపంచంలోని అతి బలశాలి ఎవరు?*

*10. మీరు చూడలేనిది అది లేకుండా జీవించలేనిది ఏది?*

*(జవాబులకు వ పేజీ చూడండి)*

''మీరు ధనవంతులన్న భావనను కలిగి ఉండాలనుకుంటున్నారా? అయితే మీ దగ్గరున్న ధనం కొనలేని వస్తువులను లెక్కపెట్టండి.''

న్యాయం, దయకోసం మన జీవితాలను అతడి స్వరంలో స్వరం కలుపుదాం.

ప్రార్థన భగవంతుణ్ణి మార్చదు. అది మనల్ని మారుస్తుంది. అది అంతర్ దృష్టిని ప్రసాదించి అంతరాత్మను వ్యాపింపజేస్తుంది. ఈ గుణం మనసుకు మందుగా పనిచేస్తుంది. ప్రార్థన వ్యక్తిత్వాన్ని సంపూర్తిగా మార్చివేస్తుంది.

మన తోటి వారితో ప్రార్థన భగవత్ సంబంధాన్ని తెచ్చిపెడుతుంది. ఇతరుల అవసరాలను మనం గుర్తించగలుగుతాము. అంతే కాదు ఇతరుల అవసరాలకు ఎలా స్పందించాలన్న వివేకాన్ని కూడా పొందుతాము.

భగవంతుడిని మనలో ఆవేశింపజేసుకుని అతడి ఆశీర్వాదాలకు ధన్యవాదాలను తెలియజేసే క్రియే ప్రార్థన

ప్రార్థన ద్వారా మనం భగవంతుడికి దాసోహం అవుతాము. ఈ సమర్పణ జీవితపు అత్యుత్తమ ఉద్దేశాలనూ, లక్ష్యాలనూ, గమ్యాలనూ చేరుకోవడానికి అవకాశం కల్పిస్తుంది. మనం ఎక్కడున్నాసరే, మనకు కావలసినప్పుడంతా ప్రార్థన భగవంతుని దయను మనకు అందజేస్తుంది.

ప్రార్థన భగవద్ కాంతిని మనలో వ్యాపింపజేసే కిటికీ లాంటిది.

ప్రశాంత ధ్యానానికి ప్రార్థన దారి చూపుతుంది. ఈ ధ్యానం చివరిగా పవిత్రమైన నిశ్శబ్దాన్ని పరిశుద్ధం చేస్తూ అతని ద్వారా మొత్తం శరీరంలో దాన్ని వ్యాపింపజేస్తుంది. ●

## మంచి నిద్రకు చిట్కాలు



*కొన్ని మందులు నిద్రపోవడానికి సహాయపడతాయి. నిద్రపోవడానికి మందుల వాడకం తప్పనిసరి అయినప్పుడు మాత్రమే వాడటం మంచిది.*

*కొన్ని సలహాలు:*

★ *పగటి వేళల్లో బాగా వ్యాయామం చేయండి.*

★ *సాయంకాలంపూట ముఖ్యంగా కాఫీనుగానీ, పాలు కలపని టీ డికాషన్‌ను గానీ సేవించకండి.*

★ *పడుకోబోయేముందు గోరువెచ్చని పాలనుగానీ, తేనె కలిపిన పాలనుగానీ తాగండి.*

★ *గోరు వెచ్చని నీళ్ళలో పడుకోబోయే ముందు స్నానం చేయండి.* – హెల్త్

"మీరు ఈ దేశంలో పుట్టారు గనుక ఇతరదేశాల కంటే మీ దేశం గొప్పదన్న మీ దృఢ విశ్వాసమే దేశభక్తి." – జార్జ్ బెర్నార్డ్ షా

# అవీ - ఇవీ

## 50 మిలియన్ డాలర్ల విలువగల అధునాతన సాంకేతిక వసతులుగల నివాస భవనం




మైక్రోసాఫ్ట్ బిలియనీర్‌గా పరిగణింపబడుతున్న బిల్ గేట్స్ తన కుటుంబ సభ్యులతో సహా 50 మిలియన్ డాలర్లు విలువ చేసే అధునాతన సాంకేతిక వసతులున్న నివాస భవనానికి మారాడు. సీటల్ (Seattle)కు సమీపంలో ఉన్న నదీ తీర ప్రాంతంలో నిర్మించబడిన ఇతడి నివాస భవనం విలువ 50 మిలియన్ల డాలర్లుగా అంచనా వేయబడింది. ఇక్కడున్న ప్రత్యేక ఎలక్ట్రానిక్ సిస్టం ద్వారా వారు వారు ధరించిన పిన్నుల (Pins) ఆధారంగా వారి వారి సౌకర్యం ప్రకారం వేడి చేయడం, కాంతిని ప్రసారం చేయడం ఇతర సుఖాలను అందివ్వడం చేస్తుంది.

## ప్రపంచ ఫుట్‌బాల్ కప్ సందర్భంగా నిర్మించబడిన అధునాతన స్టేడియం

1998వ సంవత్సరంలో జరిగిన ప్రపంచ ఫుట్‌బాల్ కప్ పోటీలను నిర్వహించేందుకు అప్పట్లో ఫ్రాన్స్ ప్రభుత్వం పారిస్ నగరంలో ఒక అత్యాధునిక స్టేడియంను నిర్మించింది. 445 మిలియన్ డాలర్ల వ్యయంతో నిర్మించబడిన ఈ అధునాతన స్టేడియంలో 80,000 ప్రేక్షకులు కూర్చోగలరు.

---

## నవ్వు పుట్టించే పొడుపు కథలు

★ *పరుగు పందెంలో మొదటి బహుమతిని పొందే ఉత్తమ మార్గం ఏది? మిగతా వారి కంటే కూడా ఎక్కువ వేగంగా పరిగెత్తడం.*

★ *రాత్రిళ్ళు రమేష్ కొలత బద్దను పరుపు దాకా ఎందుకు తీసుకువెళతాడు? తాను ఎంత కాలం పడుకున్నాడో కొలవడానికి.*

★ *చిమ్నీ ద్వారా వచ్చే జాబును మీరే పేరుతో పిలుస్తారు? బ్లాక్ మెయిల్.*

★ *నిదురపోయే ఎద్దును ఏమంటారు? బుల్ డోజర్.*

★ *పైకి పోకుండా కిందకు వచ్చేది ఏది? వాన.*

*– ఫాదర్ ఎ.డి. లిమ*
*(ఇన్‌స్పిరేషనల్ కోట్)*

''సంతృప్తి శత్రువులు దాడిచేసి వశపరచుకోలేని కోటలాంటిది. మీలో ఈ సంతృప్తిని బలపరుచుకోండి.''
– ఎపిక్టెటస్

## డా. శివరామ కరంత్ స్మృతి




1997వ సంవత్సరం డిసెంబర్ నెల 9వ తారీఖున సుప్రసిద్ధ కన్నడ సాహితీవేత్త డా. శివరాం కరంత్ కర్నాటకలోని మణిపాల్‌లో కన్నుమూసారు. నాటకరంగంలో అనేక విజయాలను సాధించిన ఈ రంగస్థల నటుడు కన్నడ జానపద కళ 'యక్షగాన'ను బాగా మధించాడు. ''మూకజ్జియ కనసుగలు'' (మూకవ్వ కలలు) అన్న రచనకుగాను 1978వ సంవత్సరంలో ఇతడికి జ్ఞానపీఠ్ అవార్డు ఇవ్వబడింది.

## వక్కలను నమలడం – పుట్టకురుపు వ్యాధి

వక్కలను నమలడం ఏమాత్రం మంచిని చేయదు. తైవాన్‌కు చెందిన తైపై (Taipai)లోని చాంగ్ గుంగ్ (Chang Gung) ఆసుపత్రిలో పనిచేస్తున్న త్సాయ్ మింగ్ షౌ (Tsai Ming Shou) సేకరించిన గణాంకాల ప్రకారం నోటి పుట్టకురుపు (Oral Cancer) వ్యాధితో బాధపడుతున్న 80 శాతం వ్యక్తులు వక్కలను నమిలేవారే. వక్కలలో ఉన్న అత్యధిక రాగి వారి వ్యాధికి కారణం అవుతోంది.

## రుబిన్‌స్టెన్ బహుమతిని తొలి మహిళా శాస్త్రజ్ఞులు

ఫ్రాన్స్, ఛిలీ, దక్షిణ కొరియా, నైజీరియాలకు చెందిన మహిళలు హెలెనా రుబున్‌స్టైన్ (Helena Rubinstein) బహుమతిని అందుకున్న తొలి మహిళా శాస్త్రజ్ఞులు అయ్యారు. విజ్ఞానరంగంలో మహిళలు సాధించిన వాటికి గుర్తింపుగా, ఫ్రాన్స్‌దేశపు రాజధాని నగరం పారిస్‌లో ఏర్పాటైన సభలో ఈ బహుమతి ఇవ్వబడింది.

---

## దేవుడి మర్మం

ప్రతి గడ్డిపోచ
ప్రతి పురుగు – చీమ
ప్రతి బంగారు – తేనెటీగ
అన్నింటికీ తమ తమ మార్గం
చాలా బాగా తెలుసు...
ఇవన్నీ కలిసి
దేవుడి మర్మానికి సాక్ష్యాలు

– ప్రాచీనకాలపు వివేకం

''స్థిరమైన మీ న్యాయబుద్ధి మీ ప్రతి వ్యవహారంపై తన చెరగని ముద్రను వేస్తుంది.''

## అతి ప్రాచీనమైన రైలు ఇంజిన్



World's oldest steam locomotive, Fairy Queen

ప్రపంచపు అతి ప్రాచీనమైన రైలు ఇంజిన్‌గా పరిగణింపబడుతున్న ''ఫెయిరీ క్వీన్''ను భారతీయ రైల్వే వారు మళ్ళీ పట్టాలపైకి ఎక్కించారు. రెండే రెండు భోగీలను లాగగల ఈ రైలు ఇంజిన్ రాజస్తాన్‌లోని అల్వార్ నుండీ ఒక నెల ఆఖరి వారాంతంలో- శని, ఆదివారాలలో పర్యాటకులతో బయలుదేరి మళ్ళీ వాపసు వస్తుంది. ఐదు నెలలపాటు అది నెలకొకసారి ప్రయాణం చేస్తుంది. 1909వ సంవత్సరంలో చివరిసారిగా 142 సంవత్సరాల వయస్సున్న ఈ ఆవిరియంత్రం ప్రయాణం చేసింది.

## వాకిళ్ళు కిటికీలు లేని ఇళ్ళు

కటక్ నగరానికి సుమారు 60 కి.మీ.ల దూరంలో వెలసిన సియదియ (Siadia) గ్రామం వాకిళ్ళులేని గ్రామంగా పిలువబడుతుంది. సుమారుగా 25 హెక్టార్ల భూమిలో విస్తరించిన ఈ గ్రామంలో వాకిళ్ళు, కిటికీలూ లేని 80 ఇండ్లు ఉన్నాయి. ఖర్ఖై (Kharkhal) గ్రామదేవత దొంగలబారి నుండి తమ ఇండ్లను రక్షిస్తుందన్న నమ్మకం ఈ గ్రామ ప్రజలకు ఉంది. ఇటీవలి కాలంలో దొంగతనం జరిగిన ఒక కేసు కూడా ఈ గ్రామంలో నమోదు కాలేదు.

## పరిశోధనకు పనికొచ్చే 10 మిలియన్ల మైక్రోఫిల్మ్ వ్రాత ప్రతులు

న్యూఢిల్లీలోని ఇందిరాగాంధీ జాతీయ కళల కేంద్రం వివిధరకాలైన భారత దేశపు వివిధ భాషలకు చెందిన అముద్రిత మరియు ముద్రిత వ్రాతప్రతులను, సంగ్రహించి 10 మిలియన్ల మైక్రోఫిల్మ్‌లను పరిశోధకులకుగాను, వాడుకునే వారికి ఉపయోగపడే కంప్యూటర్ సిస్టం ద్వారా తయారుచేస్తున్నారు.

---

## కొత్త శిశువు

*కొత్త శిశువు స్వచ్ఛమూ, పవిత్రమూ అయిన పువ్వుతో సమానం. శిశువనే ఈ లేత మొక్కను జాగ్రత్తగా, పెంచగలిగితే అది వికసించి సూర్య కాంతితో వెలిగిపోగలుగుతుంది.*

''మిత్రుడిని ఎన్నుకున్నట్లే రచయితను కూడా ఎన్నుకోండి.''

## ప్రపంచపు తొలి పాకెట్ ఫాక్స్‌మిషన్

ఫాక్స్‌వ్యూ అని పేరున్న చేత్తో పట్టుకో గల సంచాలక (Mobile) పాకెట్ ఫాక్స్ మిషన్ – మొత్తం ప్రపంచంలో తొలి ఫాక్స్‌మిషన్ – మనదేశంలో విక్రయింప బడుతోంది. కాగితం లేని ఈ చిన్న ఫాక్స్ మిషన్ సుమారు 500 గ్రాముల బరువు తూగుతుంది. ఈ ఫాక్స్ మిషన్ ఫాక్స్ చేయబడిన దస్తావేజులను – అవి ఎప్పుడైనా సరే, ఎక్కడి నుండి అయినా సరే – అందుకోగలదు. దీన్ని మనం చదివి భద్రపరుచుకోవచ్చును. అంతేకాదు ఫాక్స్‌లను కూడా పంపవచ్చును.

## అనారోగ్యం నుండీ కాపాడగల రక్షక కవాటం

క్రమం తప్పకుండా వారానికొకసారి ఉపవాసం చేయగలిగితే అది అనారోగ్యం నుండీ కాపాడగల రక్షణ కలిగిస్తుందని న్యూఢిల్లీలోని భారతీయ హార్ట్‌కేర్ ఫౌండే షన్ వారు అంటున్నారు. వారానికి ఒక రోజు శరీరానికి కావలసిన ఆహారం తిన కుండా ఉంటే అది శరీరంలో హార్మో నుల పెరుగుదలకు దోహదపడి మెటబా లిజం– జీవకణాలలో కలిగే రాసాయినిక మార్పు–కు ప్రోత్సాహాన్ని ఇస్తుంది. ఈ మార్పు కారణంగా జీవించేందుకు చురుగ్గా ఉండేందుకు కావలసిన శక్తి మనకు లభిస్తుంది.

## పునర్ స్థాపితం చేయబడిన సుప్రసిద్ధ స్మారకం

ఈజిప్ట్, గ్రీకు కథల ప్రకారం ఒక రాక్షసిగా వర్ణించబడిన స్ఫిన్క్స్ (Sphinx) మళ్ళీ పునర్‌స్థాపితం అయింది. ఈజిప్ట్ దేశానికి చెందిన ఈ సువిఖ్యాత స్మారకం ఇప్పటికి 4600 సంవత్సరాల క్రింద టిది. ఇప్పటివరకు 1,00,000 రాళ్ళను వాడి ఈ స్మారకాన్ని పునర్‌స్థాపిం చడమైంది.

## ఆణిముత్యాలు

★ *విసుగు, చెడు, అవసరం అనే దుర్గుణాల నుండీ మనల్ని పని రక్షిస్తుంది.*
*– వోల్టైర్*

★ *వేగానికన్నా ముఖ్యమైనది జీవితానికి మరెంతో ఉంది.* *– మహాత్మాగాంధీ*

★ *చదవడం వల్ల మనస్సు భౌతిక విషయాలతో బాగా అలంకరింపబడుతుంది. కానీ ఆలోచించడం వల్లనే మనం చదివిన విషయం మనస్సులో ముద్రింపబడుతుంది.*
*– జాన్‌లోరి*

★ *నేర్చుకుంటున్నంతవరకూ, మంచి అలవాట్లను కలిగి ఉన్నంతవరకూ, వ్యతి రేకతను ఖాతరు చేయనంతవరకూ మీరు యౌవ్వనులుగా ఉంటారు.*

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

1. ''రామ్‌జనమ్ భూమి – బాబ్రి మస్జిద్'' అన్నది ఏ ఊరితో ముడిపడి ఉన్నాయి?

   (ఎ) ఝాన్సీ (బి) అయోధ్య (సి) మధుర (డి) ఫైజాబాద్

2. సూర్యదేవాలయం కింద కనబరచిన ఏ నగరంలో వెలసింది?

   (ఎ) ప్రయాగ్ (బి) శ్రీకాకుళం (సి) కోణార్క్ (డి) ఇండోర్

3. రాష్ట్రపతి పదవీ బాధ్యతలను చాలా సంవత్సరాలపాటు నిర్వహించిన వ్యక్తి పేరేమి?

   (ఎ) రాజేంద్రప్రసాద్ (బి) వరాహ గిరి వెంకటగిరి (సి) జైల్‌సింగ్ (డి) శంకర్‌దయాళ్‌శర్మ.

4. మనదేశపు ఆర్థిక వ్యవస్థను ఏ పేరుతో పిలుస్తారు?

   (ఎ) లైస్సెజ్‌ఫెయిర్ (Laissezfaire) (బి) గాంధియన్ (సి) సోషలిస్ట్ (డి) మిక్సెడ్ ఎకానమీ.

5. 'లాండ్ ఆఫ్ మిడ్‌నైట్ సన్' అన్న పేరుతో ఏదేశాన్ని పిలుస్తున్నాము?

   (ఎ) జపాను (బి) నార్వే (సి) స్వీడన్ (డి) ఫిన్‌లాండ్.

6 భారతదేశపు చరిత్రలో 1857వ సంవత్సరంలో జరిగిన అపూర్వ సంఘటనను పేర్కొనండి.

   (ఎ) ముంబాయి – థానె మధ్య రైలుమార్గం ప్రారంభించబడింది (బి) విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ జన్మించాడు (సి) చికాగోలోని సర్వ ధర్మ సమావేశంలో స్వామీ వివేకానంద ప్రసంగించాడు (డి) తొలి భారత స్వాతంత్ర్యసంగ్రామం (సిపాయిల కలహం) జరిగింది.

మన శరీరంలోని ఏ భాగంలో తిన్న పదార్థాలు చాలావరకు జీర్ణం అవుతాయి?

   (ఎ) నోరు (బి) కడుపు (సి) పాంక్రియాస్ (డి) చిన్నప్రేగులు.

8. అతి తేలికైన లోహం ఏది?

''మనసు ప్రతిబింబం ముఖమైతే కళ్ళు దాన్ని తెలియజేస్తాయి.'' – సిసిరో

(ఎ) అల్యూమినియం (బి) వెండి (సి) కాడ్మియం (Cadmium) (డి) లిథియం (Lithium).

9. 'అయొడిన్' ఏ రోగంతో బాధపడే వారికి ఇవ్వబడుతుంది?

(ఎ) నిమోనియా (బి) తలనొప్పి (సి) చక్కెరవ్యాధి (డి) గొంతుమీది కణితి (Goitre).

10. మెగసెసె అవార్డును ఎవరు ప్రారంభించారు?

(ఎ) భారతప్రభుత్వం (బి) ఫిలిప్పైన్స్ (సి) యునెస్కో (డి) కామన్‌వెల్త్‌దేశాలు.

## మాటలమహిమ

1. సుషిరము: (ఎ) చలికాలం (బి) జీలకర్ర (సి) చల్లనైన (డి) పిల్లనగ్రోవి.
2. శూకలము: (ఎ) శిక్షింపబడని దుష్టాశ్వము (బి) కందురీగ (సి) పంది (డి) కనికరం.
3. వ్యాహతము: (ఎ) చంపబడినది (బి) పులిగోరువల్ల కలిగిన గాయం (సి) వంచింపబడినది (డి) పాముకాటు.
4. లోచకము: (ఎ) బుద్ధిహీనత (బి) చిన్న పాత్ర (సి) బ్రహ్మలోకం (డి) కాటుక.
5. రామమాడ: (ఎ) రాములవారి దేవాలయం ఉన్న వీధి (బి) ఒక బంగారు నాణెము (సి) టొమేటోలు (డి) ఒక ధాన్య విశేషం.
6. ముఖరము: (ఎ) మహమ్మదీయుల పండుగ (బి) తలవాకిలి (సి) ఉపాయం (డి) అసంబద్ధమైన మాటలాడునది.
7. బౌరికుడు: (ఎ) కోశాధికారి (బి) నరకాసురుడు (సి) రాహువు (డి) జీతగాడు.
8. ప్రదరము: (ఎ) కడుపుకింద భాగం (బి) ఉత్తమమైన (సి) బాణము (డి) మేలుకొనుట.

## తెలివికి పరీక్ష

1. ఇటీవల వార్తాపత్రికల వారు నాటో (Nato) అన్న పదాన్ని విపరీతంగా వాడుతున్నారు. ఈ 'నాటో' పదాన్ని విడమరచి చెప్పండి.
2. ప్రపంచఖ్యాతి ఆర్జించిన వర్ణచిత్రకారుడు లియోనార్డో డా విన్సీ మోనాలిసాతోపాటు మరో చిత్రాన్ని కూడా చిత్రించాడు? ఆ చిత్రం పేరేమి?
3. శ్రీరాచకొండ విశ్వనాథశాస్త్రిగారు మూడు కథా సంపుటాలను వెలువరించారు? వాటి పేర్లను తెలపండి?
4. బైబిల్‌లోని నోవాస్ ఆర్క్ జలప్రళయం తరువాత ఎక్కడ ఆగింది?

(జవాబులకు 60వ పేజీ చూడండి)

''సంతోషం మనిషి తీరు అవుతుందేకాని మనిషి దగ్గరున్న వస్తువు ఏమాత్రం కాదు.'

# మానవ శరీరానికి సంబంధించిన వాసవాలు

★ చెవిలో ఉన్న మూడు చిన్న ఎముకలు (Ossicles) మానవ శరీరంలో ఉన్న ఎముకలలో అతి చిన్న ఎముకలు. ఇందులో కూడా స్టిర్రప్ (Stirrup) ఎముక మరీ చిన్నది. దీని పొడవు 3 మిల్లీ మీటర్లు మాత్రమే.




★ ఎముకల సందులలో (Cavities) ఉన్న మెత్తటి కొవ్వు పదార్థం (Bone marrow) ద్వారా ఒక సెకనుకు 3 మిలియన్ల చొప్పున ఎర్రకణాలు ఉత్పత్తి చేయబడుతున్నాయి.

★ ధమనులు (Arteries) హృదయం నుండీ రక్తాన్ని శరీరంలోని వివిధ భాగాలకు తీసుకుపోతాయి. సిరలు (Veins) రక్తాన్ని మళ్ళీ హృదయం వరకు తీసుకు వెళతాయి. సిరలను ధమనులతో కలిపే సూక్ష్మనాళాలను (Capillaries) మనం సాగదీస్తే అవి 1,00,000 కి.మీ.ల దూరం వరకు – భూమికి, చంద్రుడికి మధ్యనున్న దూరంలో 1/4 వంతు– వ్యాపిస్తాయి.




★ ఖాళీ పొట్టలో 60 మిల్లీ లీటర్లు ఆహారం పట్టేంత చోటు ఉంటుంది. కానీ మంచి రుచికరమైన భోజనం తరువాత ఇది సాగి రెండు లీటర్లు ఆహారం తనలో ఇముడ్చుకోగలదు.

★ మానవుడి మెదడులో 10,000 మిలియన్ల న్యూరాన్లు (Neurons) లేదా కణజాలంలు (Nerve Cells) ఉంటాయి. ఈ సంఖ్య భూమికి రెండు మిలియన్ల కాంతి సంవత్సరాలు (Light years) దూరంలో ఉన్న అండ్రోమెడా

"ఎవరు ఎక్కువ వివేకవంతుడు అని అడగకుండా ఎవరు ఉత్తమ వివేకవంతుడు అని అడగండి." – మోంటైగ్నే

(Andromeda) నక్షత్రవీధిగా పిలువబడు తున్న దేవయాని నక్షత్రవీధిలోని నక్షత్రాల సంఖ్య కంటే కూడా చాలా ఎక్కువ.

★ మన ఘ్రాణేంద్రియాలు (Sense of Smell) రుచిని తెలిపే ఇంద్రియాల కంటే కూడా కనీసం 2000 రెట్లు ఎక్కువ గ్రాహ్యశక్తిని కలిగి ఉంటాయి. మనిషి నాలుక ప్రధానంగా నాలుగు




రుచులను మాత్రం పసికట్టగలిగితే ముక్కు లక్షకు ... ఖకు వివిధ వాసనలను పసిగట్టగలదు.

★ నడుము నొప్పి కారణంగా ఒక సంవత్సరానికి ఒక దేశం 200 మిలియన్ల పని గంటలను (Man-days) కోల్పోతున్నదని అంచనా వేయబడింది.

★ మనిషి మేధ 100 ట్రిలియన్ల (మిలియన్ మిలియన్లు కలిస్తే ఒక ట్రిలియన్ అవుతుంది) సమాచారాన్ని భద్రపరుచుకోగలుగుతుంది. మానవ నిర్మితమైన కంప్యూటర్ ఒక ట్రిలియన్ సమాచారాన్ని మాత్రమే భద్రపరుచుకోగలదు.

★ జీవిత సమతౌల్యాన్ని చెవాపు మాత్రమే దెబ్బతీయదు. చెవి లోపల ఉన్న గజిబిజి దారి మరింత ముఖ్యమైనది.




★ మన శరీరపు రెండవ పెద్ద అంగం – కాలేయం– 500ల పనులను చేయగలుగుతుందని అంచనా వేయబడింది. ఇది ఒక రసాయనిక ప్రాసెసింగ్ ప్లాంటులాంటిది!

– సేకరణ: శ్రీమతి ఆర్. అనురాధ

"శ్రీ అరబిందో ఆశ్రమం వారి ఫిజికల్ ఎడ్యుకేషన్ శాఖ" వారి సౌజన్యంతో

"బాధలను తట్టుకోగల అనంత సామర్థ్యాన్నే ప్రతిభ అంటారు." – కార్లైల్

# స్టాంపుల కథలు

## నోబెల్ ప్రైజ్‌ల స్థాపకుడు – దాని విజేత

కవితారాయ్

ఆల్‌ఫ్రెడ్ నోబెల్‌తోపాటు నోబెల్ బహుమతి విజేత కార్రర్ (Karrer) గౌరవార్థం స్వీడన్, స్విట్జర్లాండ్ ప్రభుత్వాల వారు 1997వ సంవత్సరంలో సంయుక్తంగా




స్టాంపులను జారీ చేసారు. ఈ రెండు స్టాంపుల వెనుక అంతర్జాతీయ ఖ్యాతిని పొందిన ఇద్దరు స్వీడిష్ కళాకారులు ఉన్నారు. వారు నోబెల్ కార్రర్‌ల అసలైన చిత్రాల ఆధారంగా బొమ్మలను గీస్తూ వారి వారి పనులతో సంబంధించిన వస్తువులను కూడా అందులో సూచించారు.

స్విస్ (Swiss) నోబెల్ ప్రైజ్ గ్రహీత పౌల్ కార్రర్ (1889 – 1917) 'ఎ' విటమిన్‌ను కనుగొన్నాడు. కరోటిన్ (Carotene)తోపాటు విటమిన్ 'ఎ' నిర్మాణాన్ని నిర్ణయించడంలో ఇతడు విజయాన్ని సాధించాడు. మానవ శరీరంలో కరోటిన్ విటమిన్ 'ఎ'గా మారుతుందని అతడు విశదీకరించాడు. విటమిన్ 'ఎ'ను డబ్ల్యు. నార్మన్ హావర్త్‌తో కలిసి కనుగొన్నందుకు ఇతను 1937వ సంవత్సరం నోబెల్ బహుమతిని రసాయనశాఖలో అందుకున్నాడు.

ఆల్‌ఫ్రెడ్ నోబెల్ (1833–1896) డైనమైట్‌ను కనుగొని దాని ద్వారా అపారమైన సంపదను సంపాదించాడు. తన సంపాదనను సద్వినియోగం పరిచేందుకు నోబెల్ సంస్థను అతడు స్థాపించాడు.

### అందమైన ప్రార్థన

*ప్రాణుల దుఃఖాన్ని దూరం చేయమని భగవంతుణ్ణి ప్రార్థించే హిందువుల ప్రార్థనకు మించిన అందమైన ప్రార్థన నాకు తెలిసినంత వరకూ వేరొకటి లేదని జర్మన్ తత్త్వవేత్త ఆర్థర్ స్కోపెన్‌హోవర్ (Arthur Schopenhauer) అంటున్నారు.*

''బలమైన మనోబలం, స్థిరమైన ఉద్దేశ్యం, చెరగని నిర్ణయం ద్వారా చాలావరకు అన్నింటినీ సాధించవచ్చును. దీనిపైనే గొప్పమనిషికీ, సామాన్యునికీ ఉన్న బేధం ఆధారపడి ఉంటుంది.'' – ముఖేష్ ఎం.పటేల్ ''ఇన్‌స్పిరేషనల్ జెమ్స్'' నుండి

# ఆనందాన్ని ప్రసరింపజేసే మంచి అలవాట్లు

డా॥ పూరన్ బాత్రియ

మంచి సంస్కారం ఉన్న వ్యక్తి లక్షణాలు మంచి అలవాట్లుగా భావింపబడుతున్నాయి. ఇతరుల పట్ల తమకున్న శ్రద్ధపైనే ఈ లక్షణాలు ఆధారపడి ఉంటాయి. వ్యక్తిత్వపు హోదా అది ఏదైనా కానివ్వండి ప్రతి వ్యక్తి – ఆడ,



మగ – మంచి నడవడికకు సంబంధించిన ప్రాథమిక గుణాలనం కలిగి ఉండాలి. ప్రతిమనిషి తన అలవాట్లను తాను కూర్చునే, తినే, నిలబడే, నడిచే, దుస్తులు ధరించే, మాట్లాడే తీరు ద్వారా తెలియజేస్తాడు. మంచి అలవాట్లన్నవి ఒక్క ముక్కలో చెప్పాలంటే మనం ఉండే తీరుపై ఆధారపడి ఉంటాయి.

ఒక కుర్చీలో కూర్చున్నప్పుడు జారగిలపడకుండా లేదా ముందుకు వంగకుండా సరిగ్గా కూర్చోవాలి. రెండు మోకాళ్ళను తెరుచుకుని కూర్చోవడం సభ్యత అనిపించుకోదు.

## నేను తాళం చెవి తేవడం మర్చిపోయాను

*ఒక రోజు ఒకే గదిలో ఉంటున్న ముగ్గురు పనివారు తమ ఇంటివైపు నడిచి వెళుతున్నారు. వారి గది 99వ అంతస్థులో ఉండేది. ఆ రోజు లిఫ్ట్ పనిచేయడం మానేసింది. మెట్లు ఎక్కుతున్నప్పుడు అలసట మరచిపోవడానికీ, కాలక్షేపానికి పనికివచ్చే ఒక ఏర్పాటును వారు చేసుకున్నారు. ఆ ఒప్పందం ప్రకారం ఆ ముగ్గురిలో ఒకతను పాటలు పాడాలి. రెండవ మనిషి జోకులు చెప్పాలి. గుండెలను పిండి చేసే విషాద వార్తను చెప్పవలసిన బాధ్యత మూడవ వ్యక్తి పనిగా వారు తమలో తాము నిర్ణయించుకున్నారు. అనుకున్న ప్రకారం మొదటి ఇద్దరూ తమ తమ బాధ్యతను నిర్వహించారు. 99వ అంతస్తు చేరుతున్నప్పుడు మూడవవాడి వంతు వచ్చింది. తన వంతు రాగానే మూడవవాడు "చూడండి నేను తాళం చెవి తీసుకురావడం మరచిపోయానన్నదే అతి విషాదమైన వార్త" అని స్పష్టంగా తెలియజేసాడు.*

"మిమ్మల్ని కిందకు దించినప్పుడు సవినయంగా ఉండడం గొప్పకాదు. కానీ మిమ్మల్ని ఆకాశానికి ఎత్తుతున్నప్పుడు సవినయంగా ఉండడమే ఒక గొప్ప అరుదైన సాధన అవుతుంది."

– సెయింట్ బెర్నార్డ్

మిత్రులతోనూ, బంధువులతోనూ కలిసి భోజనం చేస్తున్నప్పుడు తనకిష్టమైన వంట కాల కోసం వెతుక్కోకుండా తన వరకు వచ్చిన వంటకాలనే వడ్డించుకోవాలి. తింటున్నప్పుడు లేదా తాగుతున్నప్పుడు ఎలాంటి శబ్దం చేయకుండా తినాలి. నోటిలో పెద్ద పెద్ద ముద్దలను నోరు నిండా పెట్టుకోకూడదు. భోజనం ముగిం చినప్పుడు కంచం లేదా ఆకులో తినగా




మిగిలిన వస్తువులను చిందరవందరగా వదలకుండా ఒక వైపుకు సర్దిపెట్టి లేవాలి. డైనింగ్ టేబుల్‌పై భోజనం ముగించి లేచిన తరువాత కుర్చీని తన పూర్వస్థానంలో పెట్టాలి.

నిలుచున్నప్పుడు నిటారుగా నిల్చోవాలి. భుజాలు చతురస్రంగా ఉండేలా కడుపు లోపలికి ఉండేలా, కాళ్ళు దగ్గరిగా ఉండేలా నిలుచుకోవాలి. మహిళ లేదా వయసు మళ్ళిన వ్యక్తితో లేదా శిశువుతో వెళుతున్నప్పుడు వారికి వాహనాల రద్దీకు మధ్యలో ఉండేలా పోతుండాలి.

ధరించే దుస్తులు వ్యక్తి వ్యక్తిత్వానికి అద్దంపడతాయి. సరైన దుస్తులను ధరిం చడం వల్ల అవి మనిషికి గౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదిస్తాయి. బయటికి వెళుతున్నప్పుడు అది చాలా దగ్గరి దూరం అయినాసరే, సక్రమంగా దుస్తులు ధరించే వెళ్ళాలి.

ఎవరితో మాట్లాడని వ్యక్తిని ఎవ్వరూ, ఎక్కడా ఆహ్వానించరు. ఇతరులతో కలిసి ఉంటున్నప్పుడు స్వచ్ఛమైన భాషలోనే మాట్లాడాలి. అంతేకాని చెవులు కొరుకు తున్నట్లు గుసగుసలాడరాదు. సాంఘిక కార్యక్రమంలో పాల్గొంటున్నప్పుడు ముఖ్యంగా గొప్పవారూ, పెద్దహోదాలో ఉన్నవారితో మాట్లాడుతున్నప్పుడు దయ చేసి, 'థాంక్యూ' 'యు ఆర్ వెల్‌కం', 'సారీ', 'ఎక్స్‌క్యూజ్‌మీ', 'దయచేసి నాకు

---

అపజయానికి కావలసిన సామగ్రీను తయారుచేసుకోవడం

మీరు మొత్తం నిమగ్నులై సాధించింది మీ పూర్తి ప్రతిభకు అర్థమైనదిగా ఉంటుంది. అదే లేనిపోని అనుమానాలతో పనులను చేప ట్టడం అన్నది మన అపజయానికి కావలసిన పరిస్థితి తయారుచేసుకోవడం అవుతుంది.

– విక్టర్ కియం

---

"ప్రతిభ, పరావర్తనం (Reflection) ద్వారా కాదు. అనుభూతి కారణంగానే మనం ఔన్నత్యాన్ని, పవిత్రమైన నిజాన్ని సాధించగలం." – అనటోలె ఫ్రాన్స్

ఈ పనిలో సహాయం చేసిపెట్టగలరా', 'నన్ను సలహా ఇవ్వమంటారా', 'మీరు అంతగా పట్టించుకోకండి' లాంటి మాట లను సందర్భానుసారంగా తరచుగా వాడుతూ ఉండాలి.

చెప్పిన సమయానికి చేరడం, అందు కున్న సహాయానికి కృతజ్ఞతను తెలియజే యడం, మంచి పనిని ప్రశంసించడం ఇతరుల జాబులను చదవకుండా ఉండడం, తప్పు చేసిన పక్షంలో వెంటనే క్షమాపణను కోరడం మొదలైనవి కూడా మంచి అలవాట్ల జాబితాలోకి చేర్చబడ తాయి. వీటిపట్ల కూడా శ్రద్ధ చూపాల్సి ఉంటుంది. సినిమా హాళ్ళ వద్ద, రైల్వే స్టేషనులో, బాంకులలో క్యూలో నిలు చుని మీవంతు వరకు ఓపిక పట్టండి.

ఎక్కడపడితే అక్కడ ఉమ్మి వేయకండి. కసువును చెత్తబుట్టలోనే పారేయండి. వయ సుకు తగినవిధంగా అందర్నీ సంభోదిం చండి. ఇతరులతో కరచాలనం చేస్తున్న ప్పుడు వారిని కలవడం వల్ల మీకు ఎంత ఆనందమైందో తెలియజేసేలా గట్టిగా బిగుతుగా ఉండేలా కరచాలనం చేయండి.

మంచి అలవాట్లు వ్యక్తిగత సంబంధా లను సజావుగా ఉంచి, సంతోషాన్ని ఆనందాన్ని నలుదిశలలో ప్రసరింప జేసాయి.

## ఓ భగవంతుడా నా దేశానికి దారిచూపు



*ఓ భగవంతుడా!*
*నా ఈ దేశాన్ని, రెండు పూటలు అందరికీ అన్నం దొరికే దారి పైకి,*
*ఆడవారు గౌరవించబడి శీలం రక్షించబడే దారిపైకి,*
*న్యాయం ఆలస్యం కాకుండా తొందరగా దొరికే దారిపైకి,*
*ప్రజలు విశ్వాసం, నమ్మకం, సత్ప్రవర్తన ఆధారంగా గౌరవింపబడే దారిపైకి,*
*లంచగొండితనం అన్నది రూపుమాపబడి మరచిపోయేలా చేసే దారిపైకి,*
*మత్తుపానీయాలుకు బానిస కాకుండా యువత దేశపు వెన్నెముకగా మారే దారిపైకి,*
*ఎలాంటి పక్షపాత భావం లేకుండా దృఢ మైన అల్లికగా మారగల దారిపైకి,*
*వ్యక్తిగత అభివృద్ధికోసం కాకుండా దేశాభివృ ద్ధికే రాజకీయనాయకులు శ్రమించే దారిపైకి,*
*సనాతనమైన మన వేదాంతం ప్రజల మెద డులో దూసుకుపోగల దారిపైకి,*
*ఓ భగవంతుడా నా దేశాన్ని నడిపించు!*

*- ఎస్.బి. గుర్జ*

"అన్నింటిని గురించి ఎంతో కొంత తెలుసుకోవడం తేలికే. కానీ అన్నింటిని గురించి అంతా తెలుసుకోవడం చాలా కష్టం."

- ఎమ్మోన్స్

# భారతరత్నాలు

## రుక్మిణీదేవీ అరుండేల్

తమిళనాడులోని మధురై పట్టణానికి చెందిన ఒక సంప్రదాయబద్ధమైన కుటుంబంలో రుక్మిణీదేవి 1904వ సంవత్సరం ఫిబ్రవరి నెల 29వ తారీఖున జన్మించింది. నీలకంఠశాస్త్రి, శేషమ్మాళ్‌లు ఈమె తల్లితండ్రులు. లేప్రాయంలోనే ఈమె దివ్యజ్ఞానసమాజానికి (Theosophical Society) చెందిన డా. అనిబిసెంట్, డా. జార్జ్ ఎస్. అరుండేల్‌లచే ప్రభావితం అయింది. వారి నిస్వార్థ సేవాగుణమే ఆ రోజులలో భారతీయ మహిళ సాంఘిక అలవాట్ల పరిధిలో లేని రంగాలలో రుక్మిణీదేవిని పనిచేసేలా చేసింది.




తనకంటే వయసులో చాలా పెద్దవాడైన ఆస్ట్రేలియా దేశవాసి డా. అరుండేల్‌ను 16 సంవత్సరాల రుక్మిణీ 1920వ సంవత్సరంలో పెండ్లి చేసుకుని ఒక సామాజిక సంచలనాన్ని సృష్టించింది. ఆ తరువాత ఆమె దివ్యజ్ఞాన సమాజపు కార్యకలాపాలలో నిమగ్నురాలైంది. ఆస్ట్రేలియాలో ఉంటున్నప్పుడు సుప్రసిద్ధ నర్తకి అన్నా పవలోవా (Anna Pavlova)ను కలవడం తటస్థించింది. 1926వ సంవత్సరంలో ఆమె ద్వారా పాశ్చాత్య నృత్య నాటకాలకు సంబంధించిన పాఠాలను నేర్చుకుంది. భారతదేశం తిరిగి వచ్చిన రుక్మిణీదేవి మైలాపూర్ గౌరీ అమ్మాళ్ ఆధ్వర్యంలో తరగతులను ప్రారంభించింది.

### అవరోధాలను ఎదిరించండి

*అడ్డంకులను ఎదుర్కొన్నప్పుడు వాటిని ధైర్యంగా ఎదుర్కోవడమే మొదటి పని అవుతుంది. దానిని గురించి ఫిర్యాదు చేయకండి. ధైర్యంతో అడ్డంకులపై దాడి చేయండి.*

*మీ జీవితంలో మోకాళ్ళపై చేతుల సహాయంతో సగం ఓడిపోయి ప్రాకుతూ పోకండి. వాటిని ఎదుర్కొనేందుకు ఏమైనా తలపెట్టండి.*

*ఇలా చేస్తే మీ అడ్డంకులకు మీరు అనుకున్న దానిలో సగమంత బలం కూడా లేదని మీకు తెలిసివస్తుంది.* – విన్సెంట్ పీలే

''మనం న్యాయమైనది అని నమ్మినదాన్ని సమర్థించే మన పోరాటంలో ఓడిపోయే అవకాశం ఉన్నదని మనం నమ్మిన సత్యాన్ని వదులుకోకూడదు.''
– అబ్రహాంలింకన్

చింది. తన గురువైన శ్రీ మీనాక్షి సుందరం పిళ్ళై వద్ద చాలా సంవత్సరాలు తన నృత్య విద్యను కొనసాగించింది. ఆ రోజులలో దేవదాసీలు లేదా




ఆలయ నర్తకీమణుల ద్వారా మాత్రమే స్వీకరింపబడే గౌరవనీయం కాని వృత్తిగా భావింపబడుతున్న నృత్యకళను ఎంతో ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో రుక్మిణీదేవి చేపట్టింది.

దివ్యజ్ఞాన సమాజం స్వర్ణ జయంతి సందర్భంగా ఏర్పాటైన సభలలో ప్రతినిధుల సమక్షంలో శ్రీమతి రుక్మిణీదేవి తన తొలి ప్రదర్శనను 1935వ సంవత్సరంలో ఇచ్చింది. మద్రాసు అడయారులో జరిగిన ఈ సమావేశంకు హాజరైన ప్రతినిధులు ఆమె నృత్య లావణ్యానికీ, కదలికల ఒదుగుతనానికి ముగ్ధులయ్యారు. శారీరిక కళ నృత్యాన్ని అసభ్యం కాకుండా ఎంతో పవిత్రంగా కూడా ప్రదర్శించవచ్చు అని ఆమె తన నృత్యం ద్వారా నిరూపించింది.

నిజం చెప్పాలంటే ఈనాడు మనం అందరూ వాడుతున్న ఎక్కువ ప్రచారంలో ఉన్న 'భరతనాట్యం' అన్న మాటకు జన బాహుళ్యంలో ప్రచారం చేసిన ఘనత ఈమెకే దక్కుతుంది. ఇది వరకు ఈ నృత్యాన్ని సదిర్ (Sadir) లేదా దేవదాసి నృత్యం అన్నపేరుతో పిలిచేవారు.

1936వ సంవత్సరంలో శ్రీమతి రుక్మిణీదేవి అంతర్జాతీయ కళల అకాడమీను స్థాపించింది. ఆ తరువాత ఈ అకాడమీ పేరును కళాక్షేత్ర అని మార్చారు. తొలుత ఆ సంస్థ దివ్యజ్ఞాన సమాజానికి చెందిన బెసెంట్ గార్డన్‌లో నెలకొల్పబడింది. ఆ తరువాత 1963వ సంవత్సరంలో దక్షిణ మద్రాసుకు చెందిన తిరువాన్మయూర్‌కు మార్చబడింది.

---

### కొండంత పని!

*"నేను ఒంటరివాడను, ఆ కారణంగా నేను అన్ని పనులను చేయలేను అయితే ఎంతో కొంత నేను తప్పక చేయగలను. మన మంతా కాకపోయినా మనలో కొంతమంది అయినాసరే ఏదో కొంత చేయగలిగితే అదంతా కలిసి సంఘానికి పనికొచ్చే కొండంత సేవను అర్జించి పెడుతుంది."*

– ఫ్లారెన్స్ నైటింగేల్

"అవసరమైన దాన్ని అవసరమైనదానిగానూ, అనవసరమైనదాన్ని అనవసరమైనదానిగానూ తెలుసుకుని సరైన ఆలోచనలను చేపట్టేవారు ఈ అవసరమైన లక్ష్యాన్ని చేరుతారు."

---

శ్రీమతి రుక్మిణీదేవి ఆండాళ్ చరిత్రం, బుద్ధ అవతారం, గీతగోవిందం, కుమార సంభవం, శాకుంతలం, మహాపట్టాభి షేకంతోపాటు స్వాతి తిరునాళ్ రచన అజామీలోపాఖ్యానం లాంటి అనేక నృత్య నాటికలను తయారు చేసింది. లైట్ ఆఫ్ ఏసియా, భీష్మ, రుక్మిణీ కల్యాణం, ఉషా




పరిణయం లాంటి ఆంగ్ల నృత్య నాటికలను కూడా ఆమె తయారుచేసింది. దేశంలో కళలను, కళపట్ల జాగృతిని ప్రోత్సహించడంలో ఆమె గొప్ప కృషిని చేసింది.

రుక్మిణీదేవి చదువు పట్ల కూడా తన దృష్టిని సారించింది. 1938వ సంవత్సరంలో అరుండేల్ దంపతులు సుప్రసిద్ధ విద్యాశాస్త్రజ్ఞురాలైన డా. మరియా మాంటిస్సోరి (Dr. Maria Montessori)ను ఆహ్వానించారు. 1939వ సంవత్సరం మొదలు మరియా ఆధ్వర్యంలో జాతీయ అధ్యాపకులు శిక్షణ పాఠ్యక్రమాన్ని మద్రాసు మహానగరంలోని మహిళా అధ్యాపకుల కోసం ప్రారంభించారు. 1947వ సంవత్సరంలో అధ్యాపకుల కోసం అరుండేల్ శిక్షణ కేంద్రాన్ని ఆమె నెలకొల్పింది.

డా. యు.వి. స్వామినాథ అయ్యర్ పుస్తకాలయమునూ క్రాఫ్ట్స్ కౌన్సిల్ ఆఫ్ ఇండియానూ రుక్మిణీదేవి స్థాపించారు. 1962 –80 దాకా ఆమె భారతదేశపు పశుసంక్షేమ బోర్డు (Animal Welfare Board) ఛెయిర్మన్‌గా ఉన్నారు. లండన్ స్థావరంగా ఉన్న ''బ్యూటీ విథౌట్ క్రూయల్టీ'' సంస్థకు ఉపాధ్యక్షురాలిగా కూడా ఉన్నారు. వస్త్రాల కోసం (పట్టు గుడ్డలు) సౌందర్య సాధనాల కోసం జంతువులను చంపడాన్ని ఈ సంస్థ ఖండిస్తుంది. లండన్‌లోని అంతర్జాతీయ శాఖాహార సంస్థ (International Vegetarian Union)కు ఉపాధ్యక్షురాలిగా వీరు పనిచేసారు.

---

### కష్టాలు లేకుండా ఉండాలంటే...

*''కష్టాలలో ఉన్నప్పుడు ప్రతి ఒక్కడూ భగవంతుణ్ణి గుర్తుకు తెచ్చుకుంటాడు. కష్టాల నుండి గట్టెక్కిన తరువాత ఆ దేవుడిని బొత్తిగా మరచిపోతాడు. కానీ సుఖాలలో కూడా దేవుడిని గుర్తుపెట్టుకుంటే అసలు కష్టాలనేవే రావు.*

*– కబీర్ దాస్*

''ప్రేమ ప్రేరణను పొంది విద్య మార్గదర్శకత్వాన్ని అభిలషించే జీవితమే మంచి జీవితం.''

– బెర్ట్రాండ్ రస్సెల్

మొత్తం రెండుసార్లు పార్లమెంట్ ఎగువ సభ (రాజ్యసభ) సభ్యురాలిగా ఉంటూ తమ అవధికాలాన్ని పూర్తిచేసారు. ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి జంతువుల పట్ల క్రూరత్వాన్ని అరికట్టే చట్టంను 1960వ సంవత్సరం తేగలిగారు.

1956వ సంవత్సరంలో భారత ప్రభుత్వం ఈమెకు పద్మభూషణ్‌తో సత్కరించింది. 1957వ సంవత్సరంలో



Smt. Rukmini Devi – Dance postures

భారతదేశపు అగ్రశ్రేణి నర్తకురాలిగా సంగీత నాటక అకాడమీ అవార్డు అందుకుంది. 1958వ సంవత్సరంలో జంతువులపట్ల క్రూరత్వాన్ని నిలుపుదల చేయడాన్ని ఉద్దేశంగా పెట్టుకుని పనిచేస్తున్న సంస్థ – ది రాయల్ సొసైటీ ఫర్ ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు అనిమల్స్ – వారి క్వీన్ విక్టోరియా వెండి పతకం (Medal)ను అందుకున్నారు. 1960వ సంవత్సరంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని వేన్ స్టేట్ యూనివర్సిటీ (Wayne State University) వారు తమ హ్యూమానిటీస్ గౌరవ డాక్టర్ పట్టాతో గౌరవించారు. 1969వ సంవత్సరంలో కలకత్తాలోని రవీంద్ర భారతి విశ్వవిద్యాలయం వారు ఈమెను గౌరవ డి.లిట్‌పట్టాతో సత్కరించారు. ఇవి కాకుండా ఆమె విశ్వభారతీ, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం, ఇందిరా కళా సంగీత విశ్వవిద్యాలయం (మధ్యప్రదేశ్) నుండీ కూడా గౌరవ డాక్టరేట్ పట్టాను పొందారు.

కళాక్షేత్రలోని నృత్య పాఠశాల ఆమె శ్రావ్యమైన గొంతుకతో మార్మోగుతుంటుంది. అంతేకాదు భారతదేశపు కళాప్రపంచంలో ఆమె తెచ్చిన మార్పులు కూడా చిరస్మరణీయంగా నిలిచిపోతాయి.

1986వ సంవత్సరం ఫిబ్రవరి నెల 24వ తారీఖున శ్రీమతి రుక్మిణీ అరుండేల్ కన్నుమూసారు.

పొదుపైన – అర్థశాస్త్ర సంబంధమైన

'ఎకనామికల్' (*Economical*) అన్న మాట జాగ్రత్తగా పొదుపు చేయడం అన్న అర్థాన్ని ఇస్తుంది. 'ఎకనామిక్' (*Economic*) అన్న మాట అర్థశాస్త్ర సంబంధమైన అర్థాన్ని సూచిస్తుంది.

''ధనవంతుడి జోకులు ఎల్లప్పుడూ తమాషాగానే ఉంటాయి.''

# మీ జీవితాన్ని మార్చుకోండి

బ్రయాన్ ఆడమ్

★ మార్పు ప్రగతికి పునాదిలాంటిది. మీ ఆలోచనలూ, భావాలూ, వైఖరి మారుతున్నట్లు మీ ప్రగతి మారుతుంటుంది. మీ మనసును కొత్త భావాల వైపుకు మళ్ళించగలిగితే ఎవరి ప్రమేయం లేకుండా మీరంగా భావాత్మకంగా,



ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతూ వస్తారు. మార్పు అన్నది అప్పుడప్పుడు బాధాకరంగా ఉంటుంది. అయినా మార్పు అన్నది తప్పనిసరి.

★ ప్రతికూల పరిస్థితులను మార్చాలంటే సక్రమంకాని వైఖరిని మార్చుకోవాలి. నాటిన విత్తనంపై పంట ఆధారపడి ఉన్నట్లే అన్ని విషయాలూ మన వైఖరిపైనే ఆధారపడి ఉంటాయి. ప్రేమ, శాంతి, ఆరోగ్యం, ఆనందం, సుసంపద అనే విత్తులను నాటినప్పుడే దానికితగ్గ ప్రతిఫలం మనకు లభిస్తుంది. దీనినే కార్యపరిణామ నియమం (The Law of Cause and effect) అంటారు. మంచినే చేయండి. మంచినే ప్రతిఫలంగా పొందండి.

★ మీ జీవితానికి తర్కాన్ని వర్తించుకోండి. నేను ఇక్కడ ఎందుకున్నాను? (Why am I Here?), నేను ఎక్కడికి పోతున్నాను? (Where am I Going?) నేను కోరిన జీవితంను సాధించడానికి నేను దేన్ని మార్చుకోవాలి? (What Needs tobe Changed to accomplish the life I Desire) అన్న ఈ మూడు ప్రశ్నలను మీరు వేసుకోండి. ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతకవద్దు. వచ్చిన సమాధానాలను జాగ్రత్తగా పరిశీలించండి. ఆ తరువాత వాటిని రాసిపెట్టుకోండి.

★ నేను మరింతగా మారాలి అన్న నిర్ధారణ చేసుకుంటే కానీ మీరు మీ జీవితాన్ని మార్చుకోలేరు. మీరు ఏమి కావాలో మొదట్లో తెలుసుకోండి. దాన్ని గురించి ఖచ్చితమైన అభిప్రాయాన్ని కలిగి ఉండండి. ఆ తరువాత సాధించేందుకు దాని వెంటపడండి. ●

''మీరు సంతోషంగా ఉన్నా లేకపోయినా మిమ్మల్ని బాధపెట్టగల తీరిక సమయంను కలిగి ఉండడంలోనే దుఃఖపూరిత జీవితపు రహస్యం దాగుంది.''

– జార్జ్ బెర్నార్డ్‌షా

# గాలి ఉష్ణోగ్రతను క్రమబద్ధం చేసే ముక్కు

మనముక్కు మన శరీరంలోని అతి ముఖ్యమైన భాగం. ముక్కును ఏమాత్రం అలక్ష్యం చేసినా అది అంటురోగానికి దారి తీస్తుంది. క్రింద కనబరచిన ముఖ్యమైన పనులు ముక్కు చేయవలసి ఉంటుంది.




1. ముక్కు ద్వారా గాలి పీల్చడం వల్ల అది గొంతు, ఎదలకు అంటురోగం ప్రాకకుండా ఉండేందుకు సహాయపడుతుంది.

2. ముక్కు వాసన చూడడానికి పనికి వచ్చే ఇంద్రియంగా పనిచేస్తుంది. సువాసనలను ప్రశంసించేందుకు కూడా ఇది ఉపయోగపడుతుంది.

3. కంఠ ధ్వనితోపాటు గొంతు ఇతర గుణాలను అనునాదం చేసే గదిగా ముక్కు పని చేస్తుంది. మీకు జలుబు చేసినప్పుడు లేక ముక్కు దిబ్బడ కలిగినప్పుడు మీ గొంతుక మారిపోతుంది.

4. మనం పీల్చేగాలి ఉష్ణోగ్రతను ముక్కు శరీర ఉష్ణోగ్రతకు తగ్గట్టు క్రమబద్ధం చేస్తుంది.

5. పీల్చినగాలికి ముక్కు తేమను సమకూరుస్తుంది. ఊపిరితిత్తుల వాయువులమార్పిడి చేసేందుకూ సంరక్షణ క్రియను కొనసాగించేందుకూ ఈ తడి ఉపయోగపడుతుంది.

6. గేటు వద్ద కాపలాకాచే వాచ్‌మన్‌గా ముక్కు పనిచేస్తుంది. దుమ్ము, మసి లాంటి హానికరమైన వస్తువులను శరీరంలో ప్రవేశింపజేయకుండా బయటే ముక్కు వడగడుతుంది.

### ముక్కుకు సంబంధించిన సాధారణ రుగ్మతలు:

ముక్కులోని మాంసకండరాలవాపు (Adenoids) ముక్కు వెనకాల భాగంలో కణజాలాల కుదురులు (Pads) ఉంటాయి. వీటి ఆకారం పెరిగినప్పుడు దాన్ని 'అడినాయిడ్స్' అంటారు. ఈ కుదురులు వడగట్టే పనులను చేస్తుంటాయి. గాలి చొరబడే మార్గాలలో

"తమ నిర్ణయాలను కాదని మూర్ఖులు మాత్రమే భవిష్యత్తును నమ్ముతారు. ఈ కోవకు చెందిన మనుషులే దుఃఖానికి గురి అవుతారన్న విషయాన్ని తెలుసుకున్న వారికే తెలుస్తుంది." – ఈరిపిడెస్

సూక్ష్మక్రిములు జొరబడకుండా ఉండేలా చేయడంలో షవి సహాయపడతాయి.

జలుబు: జలుబు చేసినప్పుడు ముక్కు లోని పొర ఉబ్బి ముక్కు ద్వారానికి అడ్డు తగులుతుంది. ద్వారాన్ని మూసివే స్తుంది. జలుబు చేసినప్పుడు చీమిడి




(Mucous) తయారీ ఎక్కువ అవుతుంది. ఆ కారణంగా ముక్కు ద్వారా నీళ్ళు కారడం కంఠధ్వని విచిత్రంగా మారడం జరుగుతుంది.

ఈ పరిస్థితులు కొంతకాలం వరకు మాత్రమే కొనసాగుతాయి. ఈ పరిస్థితులు మరీ మరీ రావడం వాటిని నిర్లక్ష్యం చేసి నప్పుడు సుదీర్ఘంగా క్రిక్కిరిసిపోవడం అనే – నాసల్ కటార్ర (Nasal Catarrh) – వ్యాధి సంక్రమిస్తుంది. ఈ వ్యాధిని అలాగే సాగనిస్తే అది దీర్ఘ వ్యాధిగా ముక్కులోని మాంసకండరాల కుదురు వరకు వ్యాపించి అది వాచేలా (Adenoicds) చేస్తుంది. ఆ కారణంగా గాలి ద్వారంకు అడ్డుపడుతుంది.

ఈ వాపు ముక్కు వెనుక భాగం నుండీ చెవుల మధ్యభాగం వరకు ఉన్న చిన్న నాళాల వరకు వ్యాపించగలదు. చెవుడుకు ఇదొక సర్వసాధారణమైన కారణం అవు తుంది. పిల్లల్లో చెవినుండీ ధారగా కార డానికి కూడా దారితీస్తుంది.

దీర్ఘకాలిక రొంప (Catarrh) ముక్కుకు రెండు వైపుల ముఖంలో ఉన్న చిన్న కణ జాలం వరకు వ్యాపించి సైనసస్ (Sinuses) అన్న వ్యాధికి కారణం అవు తుంది. ఈ అంటువ్యాధి సైనస్ (Sinus) నుండీ రక్తనాళాల ద్వారా శరీరంలోని ఇతర భాగాల వరకు వ్యాపిస్తుంది.

శిశువు దుర్వాసనతో కూడిన మల విస ర్జన చేస్తున్నప్పుడు లేదా ముక్కులోని ఒక రంధ్రం ద్వారా మాత్రమే గాలి పీలుస్తు న్నప్పుడు ప్రతి తల్లి తప్పక డాక్టరును పరామర్శించాల్సి ఉంటుంది.

సాధారణంగా పిల్లలకు తమ ముక్కులో పెన్సిల్ ముక్కలు, కాగితం తునకలు జొప్పుకునే అలవాటు ఉంటుంది. అప్పుడు ముక్కు ద్వారా గాలి పీల్చడా నికి వారు కష్టపడుతుంటారు. ముక్కు నుండీ కారుతున్న ద్రవం దుర్వాసనతో

**"జీవితపు లక్ష్యాన్ని ఎరిగి ఉండడమే మనం జీవితంలో తెలుసుకోవలసిన ప్రశస్తమైన విషయం. ఇది బయట వెతికినప్పుడు కాకుండా హృదయంలో వెతికినప్పుడు మాత్రమే లభ్యమౌతుంది."**

**– రాబర్ట్ లూయీస్ స్టీవెన్‌సన్**



కూడివదిగా అనుమానం వచ్చిన వెంటనే డాక్టరును సంప్రదించాల్సి ఉంటుంది.

### ఈ క్రింది విషయాలను గుర్తుంచుకోండి:

1. అన్ని వేళలలో ముక్కును శుభ్రంగా ఉంచుకోవాలి.

2. ముక్కులోని మాంసకండరాల వాపు లేదా శ్వాసనాళం మూసుకుపోవడం వల్ల శిశువుకు శ్వాస తీసుకోవడం కష్టమై పోతుంది.

3. ముక్కు లోపలి భాగాన్ని ఆరోగ్య కరమైన స్థితిలో ఉంచుకోండి.

4. వెచ్చటి ఉప్పునీరుతో ముక్కును కడుక్కోవడం అన్నది అతి సురక్షితమైన మార్గం. మరిగిన వెచ్చటి నీటిలో ఒక చెంచాడు ఉప్పువేసి ఆ ఉప్పు నీరును తయారుచేసుకోవచ్చును. అరచేతిలో ఈ నీళ్ళు వేసుకుని ముక్కు ద్వారా ఆ నీళ్ళను నోటిలోకి వచ్చే వరకూ పీల్చి ఆ తరువాత ఆ నీరును ఉమ్మివేయండి. 5 ఔన్సుల నీరులో 5 గ్రాముల బొరాక్స్, 5 గ్రాముల సోడా బైకార్బ్ (Soda - Bicarb)తో పాటు 5 గ్రాముల ఉప్పును కలిపి ముక్కు లోషన్‌ను తయారు చేసుకోవచ్చును.

5. ఒక్కొక్క ముక్కు రంధ్రాన్ని విడి విడిగా చీదండి, రెండు రంధ్రాల నుండీ ఒకేసారి చీదితే అంటువ్యాధి చెవుల దాకా తోయబడే అవకాశం వుంది.

6. మాటి మాటికి ముక్కు నుండీ నీరు ఎక్కువగా కారుతున్న పక్షంలో ప్రత్యేకంగా డాక్టరును సంప్రదించాలి.

(– 'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో)

---

### మంచి స్నేహితులు ఒకేలా ఉంటారు



మంచి స్నేహితులు
విలువైన అరుదైన నగలవంటివారు.
మీ హృదయంలోని భావాలను
స్వేచ్ఛగా పంచుకోండి వారితో
పోరాడుతూ ముందుకు సాగడానికి
ఇస్తారు కావల్సిన ప్రేరణవారు.
మీ జీవిత విజయపథంలో
అవుతారు మూలరాళ్ళువారు.
మీ జీవితం సార హీనమైన తరుణంలో
మీ మనసును ఉత్సాహంతో నింపుతారు వారు.

– రాజా మార్టిన్

''పుస్తకం విలువను ధరకాదు దాని ఉపయోగం నిర్ణయిస్తుంది.''

– జెఫ్రివాకర్

# ఈ శతాబ్దంలో

## ''హోమ్ రూల్ లీగ్''




మహారాష్ట్ర కేసరి శ్రీ బాలగంగాధర్ తిలక్ సహకారంతో దాదాభాయి నౌరోజి అధ్యక్షతలో శ్రీమతి అనిబిసెంట్ 1916వ సంవత్సరం ఆగస్టు నెల ఒకటవ తారీఖున ''హోమ్ రూల్ లీగ్''ను స్థాపించారు.

## భారతదేశపు జాతీయపతాక తొలి ఆవిష్కరణ

ఇండియన్ నేషనల్ ఆర్మీ నేతాజీ సుభాష్ చంద్రబోస్ నేతృత్వంలో జపాను వారి సైన్యంతో సహా బర్మా సరిహద్దును దాటి మనదేశపు ఈశాన్య ప్రాంతంపై 1944వ సంవత్సరం మార్చినెల 18వ తారీఖున దండెత్తింది. భారతదేశపు గడ్డపై ఇండియన్ నేషనల్ ఆర్మీ వారు తొలిసారిగా మార్చి 19వ తారీఖున మన జాతీయపతాకాన్ని (ఇండియన్ నేషనల్ ఆర్మీ సైనికులు) కొహిమా (నాగాలాండ్)లో ఆవిష్కరించారు. ఆ తరువాత తిప్పి కొట్టబడడంతో అక్కడి నుండీ వెళ్ళిపోయారు.

## భారతదేశపు తొలి ఎయిర్ మైల్ స్టాంపు

1929వ సంవత్సరంలో తొలిసారిగా మనదేశంలో ఎయిర్‌మైల్ స్టాంపు జారీ చేయబడింది.

## నేతాజీ సుభాష్‌చంద్రబోస్ రాజీనామా

భారతమాత సేవకు తన జీవితాన్ని అంకితం చేయాలన్న సదుద్దేశ్యంతో నేతాజీ సుభాష్ చంద్రబోస్ మహాశయుడు ఇండియన్ సివిల్ సర్వీస్‌కు 1921వ సంవత్సరం ఏప్రిల్ నెల 22వ తారీఖున రాజీనామా చేసాడు.

## ప్రపంచపు అతి పెద్ద వజ్రం

1905వ సంవత్సరం జనవరి నెల 26వ తారీఖున దక్షిణ ఆఫ్రికాలోని ప్రిటోరియా (Pretoria)కు చెందిన ప్రీమియర్ (Premier) వజ్రాల గనులలో ప్రపంచపు అతి పెద్ద వజ్రాన్ని కాప్టెన్ వెల్స్

'విజయం అన్నది ఒక మనోభావన, అది మీ మనోబలంతో ప్రారంభమవుతుంది.''
– వాల్టర్ డి. వింట్లే

(Captain Wells) కనుగొన్నాడు. కల్లినన్ (Cullinan) వజ్రంగా నామకరణం జరిగిన ఈ వజ్రం బరువు ఒకటింపావు పౌండ్లు.

## అదుపులో ఉంటూ ఇంధనశక్తితో నడిచే విమానం తొలి ప్రయాణం

తన సోదరుడు విల్‌బర్ రైట్ (Wilbur Wright)తో కలిసి ఆర్‌విల్లీ రైట్ (Orville Wright) అదుపులో ఉంటూ ఇంధనశక్తితో నడిచే విమానాన్ని తొలిసారిగా 1903వ సంవత్సరం డిసెంబర్ నెల 17వ తారీఖున నడిపాడు.

## మిత్రదేశాల సైన్యం సర్వసైన్యాధ్యక్షుడు

మిత్రదేశాల సైన్యం సర్వసైన్యాధ్యక్షుడిగా అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన జనరల్ ఐసన్ హోవర్ – ఆ తరువాత వీరు అమెరికా అధ్యక్షులుగా ఎన్నికయ్యారు– ఐరోపాలో 1944వ సంవత్సరం (రెండవ ప్రపంచయుద్ధం) జనవరి నెల 16వ తారీఖున నియమించబడ్డాడు. హిట్లర్ నేతృత్వంలోని జర్మన్ సైనిక దళాలను ఓడించి ఇతడు ఆ యుద్ధాన్ని జయించాడు.

## ''కాశ్మీరం వదలండి'' – ప్రచారం

కాశ్మీర్ దేశపు మహారాజు పాలనా అధికారాన్ని సవాలు చేస్తూ 1946వ సంవత్సరం మే నెలలో షేక్ మహమ్మద్ అబ్దుల్లా – ప్రస్తుతపు జమ్ముకాశ్మీర్ రాష్ట్ర ముఖ్యమంత్రి డా. ఫరూఖ్ అబ్దుల్లా తండ్రి – 'కాశ్మీర్‌ను వదలండి' ప్రచారాన్ని ప్రారంభించాడు.

---

## అందరి దరిచేరే సదవకాశాలు



Swami Chinmayananda

*అవకాశాలు అందరి తలుపులూ తట్టుతాయి. శ్రద్ధగలవారు వచ్చిన అవకాశాలను గట్టిగా పట్టుకుంటారు. కానీ మూర్ఖులు మాత్రం వాటిని తమ చేతినుండీ జారిపోయేలా వ్యవహరిస్తారు. అందుకే అవకాశాలు వచ్చినప్పుడు జాగ్రత్తగా ఉంటూ గుర్తించి వాటిని వాడుకునేంత బుద్ధిమంతులుగా ఉందాం. ఈ అవకాశాలు మన అందుబాటులో ఉన్నట్లైతే వాటిని వదురుముకుని మనకు కావలసిన ఫలితాల్ని ఇచ్చేవాటిగా ఆ అవకాశాలను మలుచుకుందాం.*

– స్వామి చిన్మయానంద

''తన దేశాన్ని నిజంగానే ప్రేమించాలని కోరేవాడు మానవాళిని ఎలా ప్రేమించాలన్న విషయం కూడా తెలుసుకుని ఉండాలి. ఈ ప్రేమ అన్నది ప్రపంచశాంతి కోసం సాగాలి, నిరంతర తరగని శక్తి కావాలి.'' – అడ్లై ఇవింగ్ స్టీవెన్‌సన్

## గాంధీజీ కస్తూరీబాల గృహం

అహమ్మదాబాద్‌లోని సబర్మతీ ఆశ్రమపు ''హృదయ్ కుంజ్'' 1917వ సంవత్సరం జూన్ నెల 17వ తారీఖు నుండీ గాంధీజీ - కస్తూర్‌బాల గృహంగా మారింది.

## విమానదళానికి చెందిన తొలి జట్టులోని ఆరుగురు ఆఫీసర్లు

భారతీయ విమాన దళానికి చెందిన తొలి జట్టులోని ఆరుగురు ఆఫీసర్ల విమానదళపు ఉన్నత అధికారులుగా 1932వ సంవత్సరం అక్టోబరు నెల 8వ తారీఖున నియమింపబడ్డారు. వారి పేర్లు సుబ్రోతో ముఖర్జీ, అమర్‌జిత్ సింగ్, భూపేంద్ర సింగ్, ఎ.డి. అవాన్, శంకర్, టండన్.

## సముద్రంలో 35,800 అడుగుల లోతు వరకు ప్రయాణం

ఆచార్య పికార్డ్ (Piccard) పసిఫిక్ మహాసముద్రంలో 35,800 అడుగుల లోతువరకు 1960వ సంవత్సరం జనవరి నెల 23వ తారీఖున లోతు ప్రాంతాలలో గోతా కొట్టేందుకు ఉపయోగపడే మనుషుల ద్వారా నడపబడే 'ట్రీస్ట్' (Trieste) పేరున్న జలాంతర్గామి (Bathyscaphe) లో ప్రయాణం చేసి రికార్డును సృష్టించాడు.

## 16 సంవత్సరాలు పదవిలో కొనసాగిన ప్రధానమంత్రి

16 సంవత్సరాల పాటు ప్రధానమంత్రి పదవీ బాధ్యతను నిర్వహించి ఆస్ట్రేలియా దేశపు ప్రధానమంత్రి సర్ రాబర్ట్ మెన్‌జీస్ (Sir Robert Menzies) 1966వ సంవత్సరంలో తన పదవికి రాజీనామా ఇచ్చాడు. అదే సంవత్సరం శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి హఠాత్తు మరణం తరువాత శ్రీమతి ఇందిరాగాంధీ భారత దేశపు ప్రధానమంత్రి అయింది.

## కారు సీటు బెల్టును ధరించడం

1983వ సంవత్సరం జనవరి నెల 31వ తారీఖు నుండీ కారు సీటు బెల్టులను ధరించడాన్ని యునైటెడ్ కింగ్‌డం వారు తప్పనిసరి చేసారు. ●

## శాంతపరచడం లాంటి దివ్యశక్తులు కలిగి ఉన్న మొక్కలు

*లూస్‌స్ట్రయిఫ్ ప్లాంట్ (Loosestrife plant) శాంతపరచగల అద్భుత శక్తిని కలిగి ఉన్న దివ్యమైన మొక్కగా పరిగణింపబడుతోంది. పోట్లాటవల్ల ఎడమొఖం పెడముఖంగా ఉన్న దంపతులు ఈ మొక్క రెమ్మను వారి తలగడ క్రింద ఉంచుకునేవారు. ఆ రెమ్మ కారణంగా వారి అభిప్రాయ భేదాలు, పోట్లాటలు రాత్రికి రాత్రి మాయం కాగలవన్న నమ్మకం వారికి ఉండేది.*

''మేల్కొని తాము అభిలషిస్తున్న పరిస్థితుల కోసం ఎదురుచూసే మనుషులే ఈ ప్రపంచంలో నెగ్గుకురాగలరు. అటువంటి పరిస్థితులు లేనిపక్షంలో అటువంటి పరిస్థితులను వారు సృష్టించుకుంటారు.'' - జార్జ్ బెర్నార్డ్ షా

# మీరొక థర్మామీటరా? లేక థర్మోస్టాటా?

హగ్ ఆర్. హర్నే

ఒక థర్మామీటర్‌కు, థర్మోస్టాట్‌కు మధ్య ఉన్న భేదాన్ని మీరు తెలుసుకోవడానికి ఎప్పుడైనా ప్రయత్నించారా?



చుట్టూ ఉన్న పరిస్థితులు థర్మామీటర్‌ను అదుపులో ఉంచుతాయి. దేనిపైన కూడా దాని అధికారం లేదు. ఉదాహరణకు వాతావరణం వేడిగా ఉందనుకోండి. థర్మామీటర్‌లో పాదరసం మట్టం (Level) పెరుగుతుంది. అదే వాతావరణం చల్లగా ఉందనుకోండి. థర్మామీటర్‌లోని పాదరసం మట్టం తగ్గుతుంది. చుట్టూ ఉన్న పరస్థితులు ఎలా శాసిస్తే థర్మామీటర్ అలా ప్రవర్తించాల్సి ఉంటుంది.

కానీ థర్మోస్టాట్ అన్నది దీనికి భిన్నమైనది. తన చుట్టూ ఉన్న పరిస్థితులను ఇది తన అదుపులోకి తీసుకుంటుంది. ఉదాహరణకు పరిస్థితులను వేడిగా మార్చాలనుకుంటే తాను చేయవలసిన పనులకు అనుకూలంగా పరిస్థితులను మార్చడానికి ఇది ప్రయత్నిస్తుంది. పరిస్థి

## తృప్తికరమైన జీవితానికి ఎనిమిది మార్గాలు

★ పనిని సంతోషంగా చేయడానికి కావల్సిన ఆరోగ్యం.

★ అవసరాలను ఆదుకునేందుకు కావలసిన ఐశ్వర్యం.

★ కష్టాలతో పోరాడి వాటిని అధిగమించడానికి కావలసిన శక్తి.

★ చేసిన తప్పులను ఒప్పుకోవడానికి కావలసినంత సౌమ్యత.

★ మంచిని సాధించేంత వరకు కష్టపడి పనిచేసేందుకు కావలసినంత ఓపిక.

★ పొరుగువారిలో మంచిని చూడగలిగేందుకు కావలసినంత ఉదారత.

★ ఇతరులకు ఉపయోగపడేందుకూ, సహాయపడేందుకూ కావల్సినంత ప్రేమ.

★ భవిష్యత్తుకు సంబంధించిన అన్ని భయాలనూ పారద్రోలేందుకు కావల్సినంత ఆశ. – గోథె

"శక్తి ప్రశాంతత వైశిష్ట్యం అవుతుంది. ప్రశాంతత అన్నదే శక్తి యొక్క రూపం. సహనం బలాన్ని సూచిస్తుంది." – బుల్వర్

తులు చల్లగా ఉండాలంటే థర్మోస్టాట్‌ను మార్చాల్సి ఉంటుంది. అప్పుడు అది ఆ ప్రకారం పనిచేస్తుంది.

మరోవిధంగా చెప్పాలంటే థర్మామీట రను పరిస్థితులు అదుపులో ఉంచితే థర్మోస్టాట్ పరిస్థితులను తన అదుపులో ఉంచుకుంటుంది.

మరి ప్రస్తుతపు ప్రశ్న – మీరు థర్మా మీటరా లేక థర్మోస్టాట్‌టా అంటే మీరు పరిస్థితులకు లొంగుతారా లేదా పరిస్థితు లను లొంగదీసుకుంటారా?

విమర్శ అంటూ ఉంటే మీరు విమర్శ దారిలో వెళతారా లేక దాన్ని మార్చే గట్టి ప్రయత్నం చేస్తారా?

నిరాశ ఆవరించినప్పుడు మీరు నిరాశా వాదులవుతారా? లేదా పరిస్థితులను మార్చి ఆశావాదిగా మారడానికి ప్రయత్నం చేస్తారా?

సందేహం కలిగినప్పుడు మీరు కూడా సందేహపడతారా? లేదా నమ్మకం కలిగి ఉండడానికి ప్రయత్నిస్తారా? ఈ విధమైన ప్రయత్నం ద్వారా మరొకరికి కూడా నమ్మకాన్ని కలిగిస్తారా?

ఇప్పుడు చెప్పండి. మీరు థర్మా మీటరా లేక థర్మోస్టాటా?

('ఈస్ట్ అండ్ వెస్ట్' సౌజన్యంతో)

## ప్రపంచంలో విస్తరిస్తున్న ఎడారులు



*వాణిజ్యపరంగా అడవులను నాశనం చేయడం, చెట్లను నరకొట్టడం వల్లనే ఈ రోజు ఎడారులు ప్రధానంగా విస్తరిస్తున్నాయి. కొట్టి వేయబడినంత వేగంగా చెట్లను నాటడం జర గడంలేదు. ఆ కారణంగా ఎడారులు మొత్తం ప్రపంచంలో ఏడాదికి 60,000 చ.కి.మీ.ల మేరకు విస్తరిస్తున్నాయి. ఈ వైశాల్యం బెల్జియం దేశం వైశాల్యానికి రెండింతలుగా ఉంటుంది. అంతేకాకుండా సుమారు 20 మిలియన్ చద రపు మైళ్ళ ప్రాంతం ఎడారిగా మారడానికి సిద్ధంగా ఉంది. ఈ వైశాల్యాన్ని కెనడా దేశ వైశాల్యానికి రెండింతలుగా మనం లెక్క కట్టవ చ్చును. మొత్తం ప్రపంచంలో ముఖ్యంగా అభి వృద్ధి చెందుతున్న దేశాలలో అడవులను నరికి వేయడం వల్లా, వాటిని సరిగ్గా చూసుకోకపో వడం వల్లా నీటిని సరఫరా చేసే రిజర్వాయర్లలో నీటి నిలువ జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 50 శాతం దాకా పడిపోతోంది. వరదల కారణంగా మన దేశంలో మనం సాలీనా 1500 మొదలు 8000 మిలియన్ల రూపాయలను నష్ట పోతున్నాము. – వివేకనంద కేంద్ర పత్రిక*

''సంతోషం అన్నది మీరు పొందే వస్తువుపై కాకుండా మీరు ఇచ్చే వస్తువుపై ఆధారపడి ఉంటుంది.''

# మీకు తెలుసా?

## అస్సాంకు స్థానికమైన పేరు

మనదేశపు ఈశాన్య ప్రాంతపు రాష్ట్రమైన అస్సాంను స్థానికులు అహోమ్ (Ahom) అన్న పేరుతో పిలుస్తారు.




## బరామీటర్

వాతావరణ పీడనాన్ని కొలిచేందుకు బరామీటర్‌ను వాడుతారు.

## పర్యాయపదం

మాటవేరుగా ఉన్నప్పటికీ ఒకటే అర్థాన్ని ఇచ్చే పదాన్ని ఉదాహరణకు తెలుపు, శ్వేతం, ధవళం మొదలైన మాటలు – ఇంగ్లీషులో సినోనిమ్ (Synonym) అంటారు.

## అంతర్జాతీయ భాషపేరు

డా. జమెన్‌హాఫ్ తీర్చిదిద్దిన అంతర్జాతీయ భాషను ఎస్పిరాంటో (Esperanto) అంటారు.

## రష్యాదేశపు సంగీత వాద్యం

మనం వాడే గిటార్ (Guitar) లాంటి సంగీత వాద్యాన్ని రష్యన్లు ''బలాలైకా'' (Balalaika) అంటారు.

## భవనాలను అధిరోహించే క్రీడాకారుడు

భవనాలను అధిరోహించే క్రీడాకారుడిని ఇంగ్లీషులో స్టెగోఫిలిస్ట్ (Stegophilist) అంటారు.

## శబ్దం

శబ్దాన్ని కొలిచేందుకు డెసిబల్ (Decibel) ప్రమాణాన్ని (Unit) వాడుతారు.

## రోమన్ల ప్రేమదేవత

క్యూపిడ్‌ను రోమన్లు తమ ప్రేమ దేవతగా భావిస్తారు.

''మీరు నిజాన్ని చెబితే ఏ విషయమూ గుర్తుపెట్టుకోవలసిన అవసరం ఉండదు.''

– మార్క్‌ట్వేన్

# వేమనవేదం

తాత్పర్య రచన: ఎం.వి.ఎస్. సుబ్రహ్మణ్యం

అనువినాశమైన నానంద సుఖకేళి
సత్యనిష్ఠపరుని సంతరించు
సత్యనిష్ఠజూడ సజ్జన భావంబు
విశ్వదాభిరామ! వినురవేమ!



(సత్యానిష్ఠాపరుడు తన ప్రాణాలు పోగొట్టుకోవడానికైనా ఆనందంగా సిద్ధపడుతాడుగానీ అసత్యమాడటానికి మాత్రం అంగీకరించడు. అటువంటి సత్యవంతుడే సజ్జనుడు, పూజ్యుడు, చిరస్మరణీయుడు. దీనికి హరిశ్చంద్రుడే తార్కాణం.)

★ ★ ★

చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు చేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ! వినురవేమ!

(చిక్కితే చాలు - చంపేయాలి - అన్నంత కోపాన్ని మనకు కలుగజేసిన శత్రువు మనచేతికి చిక్కినప్పుడు వాడికి ఏ అపకారం చేయరాదు. ప్రతీకార వాంఛను



వదలి వాడికీ ఉపకారం చేసి పంపడమే సజ్జన లక్షణం. క్షమించబడడమే ఆ శత్రువుకు నిజమైన శిక్ష.)

## మీ కొలస్ట్రాల్‌ను పరీక్షించుకోండి

*మీ కొలస్ట్రాల్ స్థాయి ఎక్కువగా ఉందనుకోండి. అది గంభీరమైన పరిణామానికి దారి తీస్తుంది. 40 సంవత్సరాల వయసురాకముందే 10 శాతం కొలస్ట్రాల్‌ను మీరు తగ్గించుకుంటే గుండెపోటుకు గురి అయ్యే ప్రమాదాన్ని 50 శాతం వరకు తగ్గించుకోవచ్చును.*

''కోపపు క్షణంలో సహనంను కలిగి ఉంటే నూరు దుఃఖపూరిత రోజుల నుండీ తప్పించుకోగలము.''

# సంతోషంగా జీవించడం ఎలా?

## దయ, ప్రేమ, సేవాభావాలను కలిగి ఉండండి

జస్టిస్ ఎం.ఎం. ఇస్మాయిల్
మద్రాసు హైకోర్టు మాజీ ముఖ్యన్యాయాధిపతి

మొత్తం విశ్వంలో ఉన్న వారందరూ సర్వశక్తి సంపన్నుడైన ఒకే ఒక దేవుడి ద్వారా సృష్టించబడినవారే. మనమందరం అతడి అనంతమైన దయ, ప్రేమ క్షమ నుండీ వచ్చిన వారమే. ఆ విధంగా మన మంతా సోదరీ సోదరీమణులమే.




సంతోషాన్ని అందరూ కోరుకుంటారు. పరస్పర దయాభావం ద్వారానూ, అంద రికీ ఉపయోగకరమైన మంచి పనులను చేపట్టడం ద్వారానూ ఇతరులను ద్వేషించ కుండా ఎలాంటి అసూయాభావాన్ని ప్రక టించకుండా ఉండడం ద్వారానూ దీన్ని సాధించగలం.

ఇదొక సిద్ధాంత ప్రతిపాదన కాదు. వాస్తవిక నిరీక్షణ, స్వచ్ఛమైన విశ్లేషణ, గందరగోళరహితమైన ఆలోచనల సరైన ముగింపు అవుతుంది.

దయాగుణం, పరస్పరసహాయం, స్వచ్ఛంద సేవను, మనస్ఫూర్తిగా చేపట్టి నప్పుడే అవి మన మధ్య ఉన్న అన్ని రకాల ప్రత్యేకతలను, విభేదాలను రూపు మాపి మనల్ని సంతోషంగా జీవించడంలో చేయూతను ఇస్తాయి. ●

---

### మీ బుద్ధికి పదును పెట్టుకోండి

(జవాబులు)

*1. ఒక వసంతకాలం 2. అన్ని నెలల లోను 28 రోజులు ఉంటాయి. 3. "ఐ డోంట్ నో" 4. సరి చేయించాలన్న సమ యాన్ని తెలియజేస్తుంది. 5. కిటికీ 6.. అతి పెద్ద పాదంగల రాష్ట్రపతి 7. మీరు తప్పు చేసి నప్పుడు 8. లోకోమోటివ్ (మోటివ్ అంటే ప్రేరణ) 9. ఒక చేత్తో అనేక వాహనాలను ఆప గలిగే పోలీసు. 10. గాలి.*

"ఏ వస్తువు చేత కూడా మలిన పడకుండా ప్రతి వస్తువు ప్రతిబింబాన్ని ఉన్న దున్నట్లు చూపే అద్దాన్ని పోలి వివేకహృదయం ఉండాలి." – కన్ఫ్యూసియస్

# వీరిని గురించి తెలుసుకోండి

జౌక్వీస్ – వైవిస్ కౌస్టియు (Jacques - Yves Cousteau): ఫ్రాన్స్ దేశానికి చెందిన సముద్రగర్భ అన్వేషకుడు. సముద్రశాస్త్రం (Oceanography)కు చెందిన తన ఫిల్మ్‌ల కారణంగా పుస్తక రచయితగా, జగత్ప్రసిద్ధిని పొందాడు. వాతావరణ పారిశుద్ధ ఉద్యమ ప్రచారకుడుగా కూడా పేరు ప్రఖ్యాతులను పొందాడు.

జీన్ జాక్వీస్ రౌస్సియు (Jean Jacques Rousseou): 1712వ సంవత్సరంలో పుట్టి 1778వ సంవత్సరంలో మృతి చెందిన ఫ్రాన్స్ దేశపు తాత్త్వికుడు. సంఘసంస్కర్తతో పాటు సాహితీవేత్త కూడా. తన తరువాత వచ్చిన తరం ఆలోచనలను, రచనలను గొప్పగా ప్రభావితం చేసాడు.

దాదా కోండ్కే: మరాఠీ సినిమాకు చెందిన గొప్ప హాస్యనటుడు. తన ప్రత్యేక బాణీ, హాస్యోక్తుల కారణంగా అందరి మన్ననలను అందుకున్నాడు. సినీ నిర్మాతగా, వరుసగా 9 రజతోత్సవ చిత్రాలను నిర్మించి చరిత్రను సృష్టించాడు.

కమల్‌హాసన్: అందరికీ తెలిసిన నటుడు. ఇప్పటికి 160కు మించిన చిత్రాలలో నటించాడు. ఇతడు నటించిన తొలి చిత్రం 'కలత్తూర్ కణ్ణమ్మ'. అప్పట్లో రాష్ట్రపతి బంగారు పతకాన్ని గెలుచుకుంది. భారత ప్రభుత్వం 1990వ సంవత్సరంలో ఇతడిని పద్మశ్రీతో సత్కరించింది.

## స్వేచ్ఛాలోచనలు



★ *రహస్యం తనకు సంబంధించిన దైనపుడు ప్రతి ఒక్కరు రహస్యాన్ని దాచుకోగలరు.*

★ *సిద్ధాంతరీత్యా మీతో ఏకీభవిస్తున్నానని చెప్పే వ్యక్తి మీ ఆలోచనలు తప్పు అని ఎంతో మెత్తగా మిమ్మల్ని నొప్పించకుండా మీకు తెలియజేస్తున్నాడు.*

★ *అతి, అవమానాన్ని పెంచుతుంది.*

★ *మనకు చాలినంత అనుభవం లేదని మనలో చాలామంది అనుభవం పూర్వకంగా తెలుసుకుంటారు.*

★ *ధనాన్ని ఏకైక సంపదగా కలిగిన వ్యక్తే అతి పేదవాడు.*

"తప్పులను చేయని వ్యక్తి సాధారణంగా ఏమీ చేయలేడు."

ఓంప్రకాష్: హిందీ చిత్ర పరిశ్రమకు చెందిన సుప్రసిద్ధ నటుడు. హాస్యంతో నిండిన పాత్రలతోపాటు చాలా గంభీరమైన పాత్రలను పోషించాడు. ఇప్పటికి 307 సినిమాలలో ఇతడు నటించాడు. ఇతడు నటించిన తొలి సినిమా 'దాసి' 25 వారాలపాటు దేశమంతటా ఆడింది. గత సంవత్సరం ఇతడు కన్ను మూసాడు.

సారా గుల్ మొహమ్మద్: బహు భాషలలో పాటలు పాడిన గాయనీమణి. తన పాటలను గ్రామఫోనుపై రికార్డు చేసిన తొలి మహిళ. అందరిచే మెచ్చుకోబడిన 'అబిదా విజయం', 'లక్కీ అమ్మినా' మలయాళ చిత్రాలలో తన భర్తతోపాటు కలిసి పాడింది.

12వ పోప్ పయస్ (Pope Pius XII): శాంతిని ఆకాక్షించే సాహసి. అనేక భాషలను మథించిన భాషాకోవిదుడు. అణు శాస్త్రాల ద్వారా జరుగుతున్న మానవాళి వినాశాన్ని ఆపేందుకు శతవిధాల ప్రయత్నించాడు. ప్రజాస్వామిక ప్రతిభ, దివ్య జ్ఞాపకశక్తి, దివ్యమైన మృదు స్వభావపు సుందర సంగమంగా ఇతడు భావింపబడుతున్నాడు.

నోర్రిస్ బ్రాడ్‌బర్రి (Norris Bradbury): తొలి ఆటంబాంబును కూర్చిన తొలి భౌతిక శాస్త్రవేత్త. అమెరికాలోని లాస్ అలమోస్ అణు ప్రయోగశాల (Los Alamos Nuclear Laboratory) ఉన్నతోద్యోగిగా పనిచేసాడు.

అన్వర్ అలి: మలయాళ భాషకు చెందిన కవి, అనువాదకుడు, రంగస్థల నటుడు, దర్శకుడితో పాటు ఫ్రీలాన్స్ వీడియో ఫిల్మ్ నిర్మాతగా కూడా పనిచేసాడు. జగత్ప్రసిద్ధి చెందిన జపానీసు నవల ''టోటోచాన్'' (Totochan)ను మలయాళంలోకి అనువదించాడు.

## ఆలోచింపజేసే సంఘటన

### సన్యాసి – కోతి

*స్వామి వివేకానందులవారు వెళ్ళిన చోటల్లా ప్రశంసలనే పొందారు. కానీ కొంతమంది అతడిని కించపరిచే లాగా కూడా అప్పుడప్పుడు వ్యవహరించేవారు. ఒకసారి రాత్రి భోజనం తరువాత తమాషాగా ఉండాలన్న ప్రయత్నంతో వివేకానందులవారికి ఎదురుగా ఉన్న బల్లవైపు నిలబడి ఒకతను ''స్వామిగారూ! స్వాములకు, కోతులకు ఉన్న తేడాను తెలియజేయండి'' అని ప్రశ్నించాడు. కొంటెతనంను అర్థం చేసుకున్న స్వామీజీ ''మరీ పెద్దగా వ్యత్యాసం లేదు. ఉన్న వ్యత్యాసమంతా బల్లకు ఏవైపున ఉన్నారన్నదే'' అని అన్నారు.*

''సహనమే చదువు యొక్క అతి గొప్ప పరిణామము. ఇదే సముదాయపు మొదటి సిద్ధాంతం. అందరూ ఆలోచించే అతి ఉత్తమ భావనను భద్రపరుస్తుంది.''
– హెలెన్ కెల్లర్

# సి' విటమిన్ పుష్కలంగా ఉన్న జామపండు

భువన్ మోహన్

జామపండ్లను అనేక రకాలుగా విభజించవచ్చు. కానీ ప్రధానంగా వాటిని రెండు రకాలుగా విభజించవచ్చును. మొదటిరకం జామపండు గుజ్జు తెల్లగా ఉంటుంది. రెండోరకం జామపండు



గుజ్జు ఎర్రగా లేదా లేత గులాబిరంగు (Pink)ను పోలి ఉంటుంది. తెల్లగుజ్జు ఉన్న జామ దోరగా ఉన్నప్పుడు కూడా తియ్యగా ఉంటుంది. కానీ ఎర్ర లేదా గులాబీ రంగు గుజ్జు ఉన్న జామపండు బాగా పండినప్పుడే తియ్యగా ఉంటుంది.

జామపండు మాత్రమే పూర్తిగా తినగల పండు. ఇతర రకాల పండ్లలాగా దీని పైనున్న తోలునుగానీ, లోపలున్న గింజలనుకానీ తీసి పారవేయవలసిన పనిలేదు.

జామచెట్లు దృఢమైన జాతికి చెందిన చెట్లు. ఆ కారణంగా ఈ చెట్లను అన్ని రకాల భూములలోనూ అన్ని వాతావరణ పరిస్థితులలోనూ పండించవచ్చును. జామ చెట్లకు క్రిములను, పురుగులను చంపే మందు వాడవలసిన అవసరం ఉండదు. ఈ చెట్లకు ఎరువు అవసరం కూడా ఉండదు. బాగా దృఢంగా పెరిగిన తరువాత ఇవి కరువుకాటకాలను కూడా తట్టుకోగలవు.

ఒక రాచ ఉసరికలో తప్ప మనదేశపు మరే పండు లేదా కూరగాయలలోగాని ఇంత ఎక్కువ మోతాదులో 'సి' విటమిన్ – నారింజ లేక నిమ్మతో సహా – మనకు లభించదు. బాగా పండిన జామ పండులో 'సి' విటమిన్ ఆధిక్యం తగ్గి ఉంటుంది. జామపండు తొక్క, తొక్కకు

---

### ఆనందం రహస్యం

*ఆనందం రహస్యం తాను ఇష్టపడే పనులను చేయడంలో కాదు తాను చేయవలసిన పనులను ఇష్టపడడంలోనే దాగుంది.*

– జేమ్స్ ఎం. బార్రీ

''మీ ముఖం మలినమైన విషయాన్ని మీ అసలు స్నేహితులు మాత్రమే చెప్పగలరు.''

దగ్గరున్న గుజ్జులో 'సి' విటమిన్ పుష్కలంగా ఉంటుంది.

జామపండు మలబద్ధకానికి అతి దివ్యమైన ఔషధం. రక్తప్రవాహాన్ని ఇది శుభ్రపరుస్తుంది. ఇది చల్లగా ఉంటుంది. పిత్తం (Bile) అతిగా ప్రవహించకుండా అడ్డుకుంటుంది. ఆకలిని కలిగించే వస్తువు (Appetiser)గా పనిచేస్తూ కడుపు




లోని మంటను చల్లారుస్తుంది. ప్రేగులలో ఉన్న పురుగులను నాశనం చేస్తుంది. అంతేకాదు ఎదకు పొడిదగ్గు నుండీ విముక్తిని ప్రసాదిస్తుంది. జామపండును ముఖ్యంగా బాగాపండిన జామపండును తినేవారు దగ్గురొంప నుండీ త్వరగా ఉపశమనాన్ని పొందగలుగుతారు.

బొప్పాయి, అరటి, నారింజ లాంటి పండ్లు కొబ్బరి ముక్కలతోపాటు పండ్ల సాలడ్ (Salad)ను తయారు చేసేందుకు పండిన జామపండును కూడా వాడుతారు. ఈ పండ్ల మిశ్రమానికి పాలు, తేనె లేక బెల్లం, చెర్రి, ద్రాక్షను కూడా కలిపి పండ్ల క్రీమును తయారుచేస్తారు. కావలిస్తే పాలకు బదులుగా పెరుగును వాడి మరో రకమైన ఫ్రూట్ క్రీమ్‌ను తయారుచేసుకోవచ్చును.

బాగా పండిన జామపండుతో బ్రెడ్ సాండ్‌విచ్‌ను కూడా తయారుచేసుకోవచ్చును. ఈ సాండ్‌విచ్ కోసం పెద్ద సైజు జామపండును పెద్ద పెద్ద గుండ్రని ముక్కలుగా తరిగి రెండు బ్రెడ్‌ముక్కల మధ్య ఉంచాలి. పైన తేనె రాసి తినవచ్చును.

జామపండు రెమ్మలను పండ్లు రుద్దుకునే బ్రష్‌గా ప్రజలు పల్లెలో వాడుతారు. పండ్లను శుభ్రం చేసుకునేందుకు, నోటి దుర్వాసనను పోగొట్టుకునేందుకు జామ చెట్టు ఆకులను వాడవచ్చును. ఇలా వాడుకోవడానికి జామచెట్టు ఆకులను ఎండలో ఎండబెట్టాలి. ఆ తరువాత వాటిని కాల్చాలి. కాలిన బూడిదను

---

మంచి పుట్టుక

*ఒక వ్యక్తిపట్ల మనకున్న అంతరంగిక ఆదర భావాన్ని బాహ్య చేష్ట ద్వారా తెలియజేసే విధానం మంచి పుట్టుక వల్ల సంక్రమించే కళ అవుతుంది. మంచివారితో మాట్లాడడం వల్ల మనకు సజ్జన సాంగత్యం ఏర్పడుతుంది.*

*– కాటో ది ఎల్డర్*

''న్యాయాన్ని తెలుసుకుని న్యాయం చేయకపోవడం అన్నది పిరికితనం అవుతుంది.'' – షింటో

పండ్లపొడిగా వాడవచ్చును. కొంత ఆమనూ నెను వాడి పేస్టుగా తయారుచేసుకుని వాడవచ్చును.

బాగా పండిన జామపండును వాడి మంచి జెల్లీ (Jelly) లేదా జామ్ (Jam)ను తయారుచేసుకోవచ్చును. జామ్‌ను లేదా జెల్లీ తయారుచేసుకోవడానికి జామ పండును చిన్న చిన్న ముక్కలుగా తరగాలి. ఆ తరువాత వేడి నీటిలో వీటిని మరిగించాలి. మరగడం ప్రారంభమైన తరువాత సన్నటి సెగపై సుమారు గంట సేపు దాన్ని ఉంచండి. అప్పుడు మొత్తం రసం బయటకు వస్తుంది. ఒక జల్లెడ లేదా ముతక గుడ్డ సహాయంతో దాన్ని వడగట్టండి. ఆ తరువాత కావలసినమేరకు (రెండు కేజీల జామకు 1/4 కేజీ చక్కెర వంతున) చక్కెర కలపండి. ఆ తరువాత చక్కెర కరిగిపోయేంతవరకు దాన్ని మరిగించండి. చక్కెర స్థానంలో ఖండసరి (Khandasari)ను చాలా సునాయాసంగా దొరుకుతున్నప్పుడు వాడడం మంచిది. చిటికెడు ఉప్పువేసి నిమ్మరసం పిండండి. ఇవి రెండూ ఆ జామ్‌ను చెడిపోకుండా ఉండేలా కాపాడుతాయి. అంతేకాదు ఒక సువాసనను కూడా అందజేస్తాయి. ఇలా తయారైన పదార్థాన్ని రిఫ్రిజరేటర్‌లో భద్రపరచండి.

(– "నేచర్ క్యూర్" సౌజన్యంతో)

## కర్తవ్యాన్ని విస్మరించరాదు




*తమ తమ కర్తవ్యాన్ని శ్రద్ధతో పూర్తిచేసేవారు పరిపక్వతను సాధిస్తారు. ప్రతి ఒక్కరిలో నివసించే ఆ భగవంతుణ్ణి తన కర్తవ్యాన్ని పూర్తి చేసే వ్యక్తి ఎలా పూజించగలడో మీకు వివరిస్తాను. ఇలాంటి ఆరాధనే అతడికి సంతృప్తిని ఇస్తుంది. తమ కర్తవ్యాన్ని సక్రమంగా కాకపోయినా కాస్తంత వక్రంగా తప్పులతో కూడినదిగా అయినాసరే చేయడం ఇతరుల కర్తవ్యంపై అజమాయిషీ చేయడం కంటే గొప్పది. పుట్టుకతో సంక్రమించే కర్తవ్యాన్ని పూర్తి చేయడంలో మనం సంతృప్తిని పొందగలము. ఈ విధంగా చేయడం వల్ల మనం ఎలాంటి బాధకు గురికాము. కర్తవ్యంలో తప్పులు ఉన్నాయని ఎవరూ తమ కర్తవ్యాన్ని విస్మరించరాదు. నిప్పు పొగతో కూడి ఉన్నట్లే ప్రతి పని, తప్పులతో కూడి ఉంటుంది.*

*– భగవద్గీత 18/ 44–48*

*('టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో)*

"మనం చదివినదంతా మరచిపోయినప్పుడు చదువే వెనుక నుండి మనల్ని బలపరిచేందుకు మిగులుతుంది."

# సరసోకులు

## నిరంతర నిఘా

అర్థరహితంగా వ్యక్తిగత, జాతీయ చరిత్ర ఎలా దిగజారుతుందో ఏ దిశను అవలంభిస్తుందో తెలుసుకోవడానికి నిరంతర నిఘా అవసరం ఉంటుంది.

– డబ్ల్యూ.హెచ్. లెకి



## తల్లిపని

శిశువు భవిష్యత్తు తల్లి పనిపైనే ఎప్పుడూ ఆధారపడి ఉంటుంది.
– నెపోలియన్ బోనపార్టే

## నాముఖమొక అద్దం అని నాకు తెలియదు

అహంకారిగా పేరుపొందిన ఒక లాయర్ తన ముందున్న సాక్షిని తికమక పెట్టేందుకు ప్రయత్నిస్తూ ''నీ ముఖంలో నేనొక వంచకుడివి చూస్తున్నాను'' అన్నాడు. సాక్ష్యం చెప్పడంలో ఆరితేరిన ఆ సాక్షి ''అయ్యా! నా ముఖం ఒక అద్దం అన్న సంగతి నాకు ఇంతవరకు తెలియలేదు'' అని అన్నాడు.

## ఆధునిక యజమాని

40 సంవత్సరాల అనుభవం ఉన్న 21 మొదలు 30 సంవత్సరాల వయస్సున్న వ్యక్తులను– ఆడ, మగ – నియమించడం కోసం వెతుకుతున్న వ్యక్తిని ఆధునిక యజమాని (Employer) అంటారు.

## ఆడ–మగ మధ్య ఉన్న వ్యత్యాసం

మగవాడు తనకు కావలసిన ఒక రూపాయి విలువగల వస్తువును రెండు రూపాయలు ఇచ్చి కొంటే తనకు ఏమాత్రం అవసరంలేని రెండు రూపాయల వస్తువును ఆడది ఒక రూపాయకు కొంటుంది. ఇదే మగవారికి, ఆడవారికి మధ్య ఉన్న వ్యత్యాసం.

## అతి ముఖ్యమైన సేవ

ప్రచురింపబడిన వార్తను అపనమ్మకంతో గ్రహించేలా తయారుచేయడమే నేడు వార్తా

పత్రికలవారు మనకు అందిస్తున్న అతి ముఖ్యమైన సేవ - శామ్యూల్ బట్లర్

## విశ్వాసం

మీ సమస్యను అర్థం చేసుకునే ముందు మీలో ఉన్న భావాన్ని విశ్వాసం అంటారు.



## అనారోగ్యానికి సమయం

వినోదం కోసం తన సమయాన్ని కేటాయించలేని వ్యక్తి సాధ్యమైనంత త్వరలో తప్పక అనారోగ్యం కోసం సమయాన్ని కేటాయించుకుంటాడు.

- జాన్ వనమాకర్

## ఓపిక

కారులో మీ ముందు పోతున్న వాహనాల డ్రైవర్‌పై మండిపడుతూ, మీ కారు వెనుక వస్తున్న వాహన డ్రైవరులో ఏది ఉండాలని ఆశిస్తారో దాన్నే ఓపిక అంటారు.

## తెలుసుకునేంతలో..

తన తండ్రి చెప్పింది సరైనదే అని తెలుసుకునేంతలో మా నాన్న చెప్పింది సరికాదు అని ఆలోచించే కొడుకు అతడికి ఉంటాడు.

## ఇద్దరూ నిరాశ చెందారు

అలసిపోవడం వల్ల మగవాడు పెండ్లి చేసుకుంటే పెండ్లిలో ఉన్నదేంటో తెలుసుకోవాలన్న ఉత్సాహం కొద్దీ ఆడవారు పెండ్లి చేసుకుంటారు. కాని చివర్లో ఇద్దరూ నిరాశను చెందుతారు.

- ఆస్కార్ వైల్డ్

## విమర్శకులు

కళ సాహిత్య రంగాలలో విఫలులైనవారే విమర్శకులవుతారు.

- బెంజమిన్ డిస్రేలీ

---

## సోమరులు లేరు

సోమరులు అనేవారు లేరు. సోమరిలా కనబడేవాడు బహుశా దురదృష్టవంతుడై ఉంటాడు. తాను సమర్థవంతంగా చేయగల పనిని చేపట్టలేని దురదృష్టవంతుడిగా అతడిని మనం భావించాలి. - ''లా ఆఫ్ సక్సెస్'' లోని నెపోలియన్ హిల్ మాటలు

''తమ హక్కుల కోసం పోరాడుతూ తమ కర్తవ్యాల నిర్వహణలో వెనుకబడడమే ఈ ప్రపంచంతో వచ్చిన పెద్ద చిక్కు.''

## అరవ ఇంద్రియం

ధనం ఆరవ ఇంద్రియంలాంటిది. ఈ ఇంద్రియం లేని పక్షంలో మనం మిగతా ఐదు ఇంద్రియాలను వాడుకోలేవు.

– సోమర్‌సెట్ మామ్

## ఒక వ్యక్తి పరాకుతనం

ఒక అమ్మాయి, పెండ్లి చేసుకున్నప్పుడు ఒక వ్యక్తి పరాకుతనంకుగానూ చాలామంది దృష్టిని ఆకర్షిస్తుంది.

– హెలెన్ రొలండ్

## అంతా పోగొట్టుకోవడం

ధనాన్ని పోగొట్టుకున్నవాడు చాలా పోగొట్టుకుంటాడు. ఒక స్నేహితుడిని పోగొట్టుకున్నవాడు మరింత పోగొట్టుకుంటాడు. కానీ ధైర్యాన్ని కోల్పోయిన వ్యక్తి సమస్తాన్ని కోల్పోతాడు.

## నిజమైన ప్రతిభ

మూర్ఖులందరూ కట్టకట్టుకుని ఒక వ్యక్తిని ఎదిరిస్తున్నారంటే అతడే నిజమైన ప్రతిభాసంపన్నుడని గుర్తుంచుకోండి. నిజమైన ప్రతిభ ప్రపంచంలో ఆవిర్భవించిందని అప్పుడే తెలుసుకోండి.

– జొనాథన్ స్విఫ్ట్

## ఆ మనిషి ఎక్కడ?

మిడిమిడి జ్ఞానం అన్నది ప్రమాద భరితమైనదైతే ప్రవాదం నుండి బయటపడేంత విషయజ్ఞానం ఉన్న వ్యక్తి ఎక్కడున్నాడు?

– థామస్ హక్సల్

## అసలైన వైద్యుడు బూటక వైద్యుడు

బూటక వైద్యుడు రోగులను చంపితే అసలైన వైద్యుడు వారిని చనిపోయేలా చేస్తాడు.

– లాబ్రుయెరీ

## 20వ శతాబ్దంలో యుద్ధాలలో చనిపోయిన వారి సంఖ్య

*20వ శతాబ్దంలో యుద్ధాల కారణంగా 100 మిలియన్ల జనం చనిపోయారు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత మొత్తం ప్రపంచంలో 100కి మించి యుద్ధాలు జరిగాయి. గత 20 సంవత్సరాల కాలంలోనే యుద్ధాలవల్ల పౌరుల పోరాటాల వల్ల 7 మిలియన్ల జనం చనిపోవడం జరిగింది. యుద్ధపరమైన మారణ అస్త్రాలను తమ అంతఃకలహాల కారణంగా, సరిహద్దు సమస్యల కారణంగా, మతపరమైన ఘర్షణల కారణంగా 30 మొదలు 40 దేశాల వారు వాడారు. 6 బిలియన్ల (6000 మిలియన్లు) జనాభాగల మన ప్రపంచంలో ప్రతి ముగ్గురిలో ఒకడు చొప్పున ఆయుధాలతో పోరు సలుపుతున్న దేశాలలో నివసిస్తున్నాడు.*

# గుర్తింపును తెచ్చిపెట్టే పనులు

పనులు మనలోని ముఖ్యమైన అంతర్భాగం. పనులు చేయని పక్షంలో మనిషి మరణిస్తాడు. పనులే మనిషిని జీవింపజేస్తాయి. పనులన్నవి మన ఆలోచనల పరిణామాలే. మనం చేస్తున్న పనుల ద్వారా మన



ఆలోచనలు బయటపడుతుంటాయి. మనం చేస్తున్న పనుల ద్వారా ఈ ప్రపంచం మనల్ని గుర్తిస్తుంది. మనం బాధ్యతాయుతులమైన వ్యక్తులమా కాదా, మనం నిర్దయులమా లేక ఉదారస్వభావంగలవారమా లేక పిసినిగొట్టులమా అన్న విషయాన్ని మన పనులు తెల్పి చెప్పగలవు.

మనం చేస్తున్న పనులను చూసే ఈ ప్రపంచం తన ప్రతిక్రియను వ్యక్తం చేస్తుంది. మన క్రియ కోపంతో కూడినదైతే ప్రతిక్రియ కూడా కోపంతో కూడి ఉంటుంది. మన పనులు శాంతియుతంగా ఉంటే ప్రతిక్రియ కూడా శాంతియుతంగానే ఉంటుంది.

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్: 1. (బి) అయోధ్య 2. (సి) కోణార్క్ 3. (ఎ) రాజేంద్రప్రసాద్ 4. (డి) మిక్సెడ్ ఎకానమీ 5. (బి) నార్వే 6. (డి) తొలి భారత స్వాతంత్ర సంగ్రామం జరిగింది 7. (డి) చిన్న ప్రేగులు 8. (డి) లిథియం (Lithium) 9. (డి) గొంతుమీది కణిత (Goitre) 10. (బి) ఫిలిప్పైన్స్ ప్రభుత్వం.

మాటలమహిమ: 1. (డి) పిల్లనగ్రోవి 2. (ఎ) శిక్షింపబడని దుష్టాశ్వము 3. (సి) వంచింపబడినది 4. (డి) కాటుక 5. (బి) ఒక బంగారు నాణెము 6. (డి) అసంబద్ధమైన మాటలాడునది 7. (ఎ) కోశాధికారి 8. (సి) బాణము

తెలివికి పరీక్ష: 1. 'నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్' – ఇదొక సైనిక ఒప్పందం పేరు. 2. సినకోలా (తుది విందు) 3. ఆరుచిత్రాలు, ఆరు సారా కథలు, మరో ఆరు సారా కథలు 4. టర్కీలోని మౌంట్ అరారా (Arara)పై ఆగింది.

"విద్యను ఆర్జించడం కంటే కూడా అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడం చాలా [illegible]ం."
– ఆఫీస్ ఎకానమిస్ట్

మన పనులే మన భవిష్యత్తుకు పునాది రాళ్ళు. పాత సామెత చెప్పినట్లు ''దురద గొండి (Nettle) నాటితే గులాబీలు పూయవు.'' మన క్రియకు తగినట్టుగానే ప్రతిక్రియ ఉంటుంది.

ఒక్క విషయాన్ని మనం అర్థం చేసుకోవాలి. మన పనుల ప్రతిఫలం త్వరగా, వెంటనే స్పష్టం కాగలదు. లేదా చాలా కాలం తీసుకుని ఆలస్యంగా రూపం దాలుస్తుంది. ప్రతిఫలం అన్నది – త్వరగానో లేదా ఆలస్యంగానో తప్పక లభిస్తుందన్న మాట మాత్రం నిజం.

మనం చేస్తున్న పనుల స్థాయిని జాగ్రత్తగా గమనిస్తూ వస్తే అది మనకు ఎంత అదృష్టాన్ని ఇస్తోందో లేక ఎంత దురదృష్టాన్ని వెంట తీసుకువస్తోందో అన్న సంగతి తెలిసిపోతుంది.

మన చేతలు అన్నవి పవిత్రంగా ఉండాలి. చేతలన్నవి చెడు ఉద్దేశాలకు దూరంగా ఉండాలి. మన చేతలన్నవి నిర్మాణాత్మకంగానే ఉండాలి. కానీ వినాశాత్మకంగా ఉండరాదు. నాటిన మొక్క మొలకెత్తడానికి ఎంత సమయం పట్టినా మనకు తృప్తినీ, భవిష్యత్తులో అఖండమైన సంతోషాన్ని తెచ్చిపెట్టగలదన్న నమ్మకంతో పనులను చేస్తూ రావాలి.

(''బి.కె.రాజయోగ సెంటర్'' సౌజన్యంతో)



## వేప చెట్టు ఔషధగుణం



*అమెరికా సంయుక్త రాష్ట్రాల అకాడమీ ఆఫ్ సైన్సెస్ (Academy of Sciences) వారు కావించిన అధ్యయనం తరువాత వేప చెట్టు, దాని రెమ్మల, ఆకుల, విత్తనాల ఔషధ గుణాన్ని ప్రపంచం గుర్తించింది.*

*ఈ అద్భుతమైన చెట్టు అనేక గుణాలను గురించి ఆయుర్వేదంలో రాయబడింది. మెక్సికన్ బీటిల్స్ (Mexican Beetles), కాబేజీ లూటర్స్ (Cabbage Looters), జిప్సీ మోత్స్ (Gypsy Moths), బొద్దింకలు, ఈగలు, దోమలు లాంటి 200 రకాల క్రిములను నాశనం చేసే వివిధ రకాల రాసాయనిక మిశ్రమాలను, మందులను తయారు చేసేందుకు వేపను వాడుతున్నారు. వేప రెమ్మలను, దంతాలను శుభ్రం చేసుకునేందుకు వాడుతున్నారు. పుండ్లు, గజ్జి, తామర లాంటి చర్మవ్యాధులను నివారించేందుకు వేప ఆకుల రసాన్ని వాడుతున్నారు. వేపవిత్తుల నూనె తామర వ్యాధి నుండి విముక్తిని పొందడానికి వాడుతారు.*

*– (ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్)*

''మన ప్రారబ్ధాన్ని మనం మార్చలేము. కానీ ప్రారబ్ధం పట్ల మనం అవలంభిస్తున్న వైఖరిని మార్చుకునే శక్తి మనలో ఉంది.''

# వారలు

## గ్రామాల్లో నివసిస్తున్న 70 శాతం జనాభా



మనదేశపు జనాభాలోని సుమారు 70 శాతం ప్రజలు గ్రామాలలో నివసిస్తున్నారు. ప్రపంచంలోని భూమిలో మన దేశపు వంతు 2.5 శాతమే అయినా ప్రపంచపు వ్యవసాయభూమిలో మనవద్ద 12 శాతం వ్యవసాయ భూమి ఉంది.

## లతామంగేష్కర్‌కు ''దేశికోత్తం'' అవార్డు

పశ్చిమ బెంగాల్‌కు చెందిన శాంతినికేతన్‌లోని విశ్వభారతి విశ్వవిద్యాలయం వారు తమ దేశికోత్తం అవార్డుతో సుప్రసిద్ధ గాయని లతామంగేష్కర్‌ను సత్కరించారు.

## రోజుకు 700 మైళ్ళ సముద్ర ప్రయాణం

కెనడాకు చెందిన ఆర్కిటిక్ మహాసముద్ర ప్రాంతంలోని బెలుగా (Beluga) తిమింగిలం రోజుకు 700 మైళ్ళ చొప్పున సముద్రంలో ప్రయాణం చేయగలదు. ఈ తిమింగిలాలు 20 నిమిషాలకు ఒకసారి మాత్రమే ఊపిరి పీల్చుకుంటాయి.

## దక్షిణ ఆసియాలోని శరణార్థులు

ప్రస్తుతం దక్షిణ ఆసియాలో 1.5 మిలియన్ల శరణార్థులు ఉన్నారు. తమ దేశాల నుండీ తరిమివేయబడ్డ శరణార్థులు భారతదేశం, బంగ్లాదేశ్, నేపాల్‌లో తలదాచుకుంటున్నారు.

---

## కేశ సౌందర్యాన్ని పెంచే హెన్నా

*''గోరింటాకు లాంటి ఆకు రకాన్ని హెన్నా (Henna) అంటారు. ఇదొక మొక్క పేరు. ఈ మొక్క ఉత్తర ఆఫ్రికాలోనూ, తూర్పు భారతదేశంలోనూ, ఆస్ట్రేలియాలోనూ, మెడగాస్కర్‌లోనూ ఎక్కువగా పండుతుంది. ఈ మొక్క ఆకులు, కాండం చాలా ఉపయోగపడతాయి. వీటిరసం వాడకం వల్ల తల వెంట్రుకలు సహజంగా నిగనిగలాడడం ప్రారంభిస్తాయి.''* – హెల్త్

## 2025 నాటికి ప్రపంచపు రెండవ అతి పెద్ద నగరంగా మారనున్న ముంబాయి




2025వ సంవత్సరం నాటికి ముంబాయి మహానగరం 20 మిలియన్లకు మించిన జనాభాతో ప్రపంచపు రెండవ అతి పెద్ద నగరంగా మారనున్నది.

## ''సూపర్ దిగుబడిని ఇచ్చే బియ్యం''

చైనాకు చెందిన అగ్రశ్రేణి వ్యవసాయ శాస్త్రజ్ఞుడు యువన్ లాంగ్‌పింగ్ (Yuan Longping) సూపర్ దిగుబడిని ఇచ్చే వరివంగడానికి రూపురేఖలు ఇవ్వడంలో దిగ్విజయాన్ని సాధించాడు. ఈ వంగడం ద్వారా ఒక హెక్టారుకు సరాసరిగా 13.26 టన్నుల దిగుబడిని సాధించవచ్చును.

## మహిళల స్వాధీనంలో ఉన్న భూమి

ఈ రోజు మొత్తం ప్రపంచంలో జరుగుతున్న పనిలో 60 శాతం పనిని స్త్రీలు చేస్తున్నారు. ప్రపంచపు ఆదాయంలోని 10 శాతం ఆదాయం మాత్రమే మహిళలకు చేరుతోంది. కానీ ప్రపంచంలో ఉన్న నేలలో కేవలం ఒక శాతం నేలకు మాత్రమే మహిళలు సొంతదారులు.

## చోదకుడు లేని వాహనం

చెన్నైలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్‌లో పరిశోధన చేస్తున్న పరిశోధకుడు శ్రీ సంజీవ్ కుమార్ చోదకుడు (Driver) లేకుండా నడిచే వాహనాన్ని అభివృద్ధి పరిచాడు. ఉపరితలం ఎలాంటిదైనా సరే ఈ వాహనం ఇతర వాహనాలూ చుట్టూ ఉన్న వస్తువులు ఇచ్చే సంకేతాల ద్వారా నడుస్తుంది.

## హానికరమైన దోమల మందులు

దోమల మందులుగా ప్రచారంలో ఉన్న చాలా మందులు తైలాలు, మాట్లు (Mats), చుట్టలు (Coils) క్రీములతో సహా – మనుషులకు హానికరమని, మంట లాంటి అనేక రకాల సైడ్ ఎఫెక్ట్స్‌ను కలిగి ఉన్నాయని న్యూఢిల్లీలోని మలేరియా పరిశోధనా కేంద్రంలోని నిపుణులు కనుగొన్నారు.

''ప్రార్థనానంతరం సద్భావాలు మనసులో మెలిగితే మన ప్రార్థనకు దేవుడు జవాబిచ్చాడని తెలుసుకోవాలి.''

## 70 శాతం జనాభాకు జీవనోపాధిని కల్పిస్తున్న వ్యవసాయం

వాస్తవ స్థూల జాతీయోత్పత్తి (GDP)కి మనదేశపు వ్యవసాయరంగం ఈ రోజు సుమారు 30 శాతం దాకా తోడ్పడుతోంది. మనదేశ జనాభాలోని 70 శాతం ప్రజలకు ప్రత్యక్షంగానో లేదా పరోక్షంగానో వ్యవసాయం జీవనోపాధిని కల్పిస్తోంది.

## వరల్డ్‌వైడ్ వెబ్‌పై న్యూయార్క్ టైమ్స్

న్యూయార్క్ టైమ్స్‌లో అచ్చు అయిన చాలావరకు వార్తలు, ఫీచర్ వ్యాసాలు వర్గీకృత విజ్ఞాపనలు మనకు ఇప్పుడు వరల్డ్ వైడ్ వెబ్‌పై లభిస్తున్నాయి.

## తివాచీల ఎగుమతి

ప్రపంచంలో తయారవుతున్న తివాచీలలో ప్రతి నాల్గవ తివాచీ మనదేశంలోనే తయారవుతోంది. సాధారణంగా ఈ తివాచీలు జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఎక్కువగా అమ్ముడుపోతుంటాయి. ఈ రెండు దేశాలకే మనదేశంలో తయారైన తివాచీలలో 65 శాతం తివాచీలు ఎగుమతి అవుతున్నాయి.

## జర్మనీలో భారతదేశ అధ్యయనం

జర్మనీలోని బాన్ (Bonn) నగరంలో 1818వ సంవత్సరంలో భారతదేశ అధ్యయానికి చెందిన తొలి పీఠం ప్రారంభింపబడింది. నేడు భారతదేశంతో సంబంధమున్న వివిధ కోర్సులు సుమారు 20 జర్మన్ విశ్వవిద్యాలయాలలో ఉన్నాయి. ●

## ఆలోచనారహితంగా ఒకే బాటను అనుసరించడం

*ఫ్రాన్స్ దేశానికి చెందిన ఒక ప్రకృతి శాస్త్రజ్ఞుడు క్రిమికీటకాలకు చెందిన ఒక ప్రయోగాన్ని చేసాడు. ఆ ప్రయోగాన్ని అతడు క్రమబద్ధతగల ''గొంగళి పురుగులు'' (Processionary Caterpillars) అన్న పేరుతో పిలిచాడు. గొంగళి పురుగులను ఒక పెద్ద పూలకుండి అంచువరకు తీసుకువెళ్ళాడు. ఒక వరుసలో ఒకదాని వెనుక ఒకటిగా అవి కదిలాయి.*

*పూలకుండీ అంచులు గుండ్రంగా ఉండడం వల్ల ఆ గొంగళి పురుగులు వృత్తంలో ఏడురాత్రులు, ఏడు పగళ్ళు గడిపాయి. కంటికి ఎదురుగా ఆహారం కనిపిస్తున్నా ఆ గొంగళిపురుగులు, ఆకలి కారణంగా కృంగి కృశించి అలసటతో చనిపోయాయి.*

*ఆలోచించకుండా ఒకే మార్గాన్ని గుడ్డిగా అనుసరిస్తే అది ప్రజలకు హానికరం అవుతుందని ఈ ప్రయోగం ఋజువు చేసింది.*

''జీవితం నాకు ఆలోచించడం నేర్పింది. కానీ ఆలోచనలు ఎలా జీవించాలో తెలియజేయలేదు.'' – హెర్‌యన్

# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



**చందా వివరాలు:**

సంవత్సర చందా రూ. 60/-

3 సంవత్సరాల చందా రూ. 175/-

ఎయిర్‌మెయిల్ (1 సం) రూ. 250/-

సీమెయిల్ (1 సం) రూ. 110/-



చందాపంపవలసిన చిరునామా

రత్నా ఏజన్సీస్

9, దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద

చెన్నై - 600 004,

ఫోను: 4990327



అక్టోబరు 1999 5

**Vol.18 No.10**




ముఖచిత్రం:
యోగా

★ తెలుగు విస్డమ్‌కు ఇది 18వ సంవత్సరం ★

# సంపాదకుని పేజీ

## వాస్తవాలను ఎదుర్కోండి

కొంతమంది కడుపులో పుండునైనా సహిస్తారు. కానీ వాస్తవాలను ఎదుర్కోలేరు. ఎంతో డబ్బును వెచ్చించి అపాయంతో కూడిన భారీ ఆపరేషన్‌కైనా సిద్ధ



పడతారుకాని ఒక డాక్టరుతోగానీ, ఒక మతాధికారితోగానీ, లేక మానసిక రోగ చికిత్సకుడితోగానీ మనస్సు విప్పి మాట్లాడి సలహా తీసుకోవడానికి తయారుగా ఉండరు.

తరచుగా మనిషి వాలకం చూసి అప్పుడప్పుడు అతడి మిత్రులు, బంధువులు, పొరుగువారు అతడిలో ఏదో లోపం ఉందని అంచనా వేస్తుంటారు. అయితే ఆ మనిషి మాత్రం అబ్బే ఏమీలేదని దాటేస్తుంటాడు. నిజానికి వారు వాస్తవాల నుండీ పారిపోతుంటారు. ఆ వాస్తవాలు

---

### జీవించేందుకు ఉపయోగపడే ఐదు తీర్మానాలు

*గొప్పవాడుగా, నలుగురికి సహాయపడే వ్యక్తిగా పేరుపొందిన జొనాథన్ ఎడ్వర్ట్స్ (Jonathan Edwards) యవ్వనదశలో ఉన్నప్పుడు ఐదు తీర్మానాలను అమలు పరచాలని నిర్ణయించుకున్నాడు. ఆ ఐదు తీర్మానాల కోసం జీవితాంతం విశ్వసనీయంగా పాటుపడ్డాడు.*

*1 నేను జీవించి ఉన్నంత వరకు పూర్తి సామర్థ్యంతో జీవిస్తాను.*

*2. జీవితపు ఒక్క క్షణాన్ని కూడా వృధా పోనివ్వను. ప్రతి క్షణాన్ని ఎంత లాభదాయకంగా అభివృద్ధి పరచడం సాధ్యమో అంతగా అభివృద్ధి పరుస్తాను.*

*3 పనికిరాని పనిని లేదా ఇతరుల పట్ల నీచంగా ఆలోచించడం లాంటి పనిని ఎప్పుడూ చేయను.*

*4. పగ తీసుకోవాలన్న దృష్టితో ఏ పనీ చేయను.*

*5. నా జీవితపు చివరి ఘడియలైనాసరే నేను భయపడవలసిన పనిని ఎప్పుడూ చేయను.*

*– ఓహాయో సండే స్కూల్ వర్కర్*

కూడా వారితో కలసి పరుగెత్తుతాయన్న విషయాన్ని వారు తెలుసుకోలేకపోతారు.

నిజం బాధాకరంగానే ఉంటుంది. చాలామంది తమ ఆరోగ్యాన్ని పణంగా పెట్టి జీవితంతోపాటు సాగిపోతుంటారు. వారు నిజాన్ని ఎదుర్కోవడానికీ, కష్టం కారణాలను గురించి గాఢంగా ఆలోచించి దాని నివారణకూ లేదా పరిష్కారానికీ తయారుగా ఉండరు.

వాస్తవాలను చూచి పారిపోకూడదు. కారణం ఈ వాస్తవాలు పారిపోయి వారి వెంటబడతాయి. అంతేకాదు ఆ మనిషిని వెనక్కునెట్టి ఇవి ముందుకు పోగలుగుతాయి. ఏమి తినాలో తెల్సుకోలేక మధనపడడం కంటే వారిని ఏ సమస్య మనల్ని తింటోందో తెలుసుకోవాలి. ●

## టెన్నీస్ మైదానం పేరు

*పారిస్‌లోని స్టేడె రోలాండ్ గ్యారోస్ (Stade Roland Garros) మైదానంలో ప్రతి సంవత్సరం ది ఫ్రెంచ్ ఓపన్ టెన్నీసు పోటీలు జరుగుతాయి. మొదటి ప్రపంచయుద్ధంలో ఫ్రెంచ్ సైన్యపు ఫైటర్ విమానపు పైలెట్‌గా పనిచేసిన రోలాండ్ గ్యారోస్ పేరు ఈ మైదానంకు ఇవ్వబడింది. ప్రపంచపు తొలి ఉత్తమ పైలెట్‌గా ఇతడు – ఐదు జర్మన్ విమానాలను కూలదూయడం ద్వారా – అప్పట్లో గుర్తింపబడ్డాడు.*

## విస్‌డమ్ పాతకాపీలు

***మే '84, జూన్ '84, అక్టోబర్ '84, నవంబర్ '84 (రూ. 5.50); మార్చి '85 నుంచి జూన్ '85 (రూ. 5.50); ఫిబ్రవరి '86 నుంచి ఏప్రిల్ '86, అక్టోబర్ '86 (రూ. 6.00); మార్చి '87, డిసెంబర్ '87 (రూ. 3.00), జనవరి '88, ఏప్రిల్ '88, జూన్ '88 నుంచి డిసెంబర్ '88 (రూ. 16.00); జనవరి '89 నుంచి డిసెంబర్ '89 (రూ. 24.50); ఫిబ్రవరి '90 నుంచి మే '90, ఆగస్టు '90, సెప్టెంబర్ '90, నవంబర్ '90, డిసెంబర్ '90 (రూ. 18.00); ఫిబ్రవరి '91 నుంచి జూలై '91, సెప్టెంబర్ '91 నుంచి డిసెంబర్ '91 (రూ. 24.00); జనవరి '92 నుంచి డిసెంబర్ '92 (రూ. 33.00); జనవరి '93 నుంచి అక్టోబర్ '93, డిసెంబర్ '93 (రూ. 30.00); జనవరి '94 నుంచి డిసెంబర్ '94 (రూ. 35.00); జనవరి '95 నుంచి డిసెంబర్ '95 (రూ. 36.00); జనవరి '96 నుంచి డిసెంబర్ '96 (రూ. 36.00); జనవరి '97 నుంచి డిసెంబర్ '97 (రూ.36.00); జనవరి '98 నుంచి డిసెంబర్ '98 (రూ. 41.00) కాపీలు మావద్ద ఉన్నాయి. రిజిస్టర్ట్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 14.00 చేర్చి M.O. "రత్నా ఏజన్సీస్", 9, దేశికారోడ్డు (ఆళ్వారు పేట వద్ద) చెన్నై – 600 004కు పంపాలి.***

***– సర్క్యులేషన్ మేనేజర్***

# భారత రత్నాలు

## డా. సి.పి. రామస్వామి అయ్యర్

**1879**వ సంవత్సరం దీపావళి పర్వదినాన (నవంబరు 12వ తారీఖున) రామస్వామి అయ్యర్ తమిళనాడులోని వందవాసి గ్రామంలో జన్మించాడు.




విజయవంతమైన లాయర్ శ్రీ సి.ఆర్. పట్టాభిరామ అయ్యర్, శ్రీమతి సీతాలక్ష్మీ అమ్మాళ్ దంపతుల ఏకైక పుత్రుడుగా శ్రీ సి.పి. రామస్వామి అయ్యర్ జన్మించాడు.

మద్రాసులోని వెస్‌లే (Wesley) ఉన్నత పాఠశాలలో ఇతడు ప్రారంభిక విద్యను పొందాడు. బంగారు పతకాన్ని గెలుచుకుని మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల నుండి పట్టాను పొందాడు. రెండుసార్లు బి.ఎ. ఇంగ్లీషు, సైన్సు, గణితం పరీక్షలలో ఉన్నత స్థానాన్ని పొందుతూ ఉత్తీర్ణుడు అయ్యాడు. ఆ తరువాత లా పట్టాను కూడా పొంది 1903వ సంవత్సరంలో మద్రాసు బార్‌లో వకీలు వృత్తిని చేపట్టాడు. ఆ తరువాత 1923వ సంవత్సరంలో ఇతడు ప్రత్యేకంగా అడ్వొకేటుగా నమోదు చేసుకోబడ్డాడు.

యువకుడు రామస్వామి అయ్యరు బైబిల్‌నూ, పాశ్చాత్య క్రైస్తవ ధర్మశాస్త్రాన్ని (Theology) క్షుణ్ణంగా అధ్యయనం చేసాడు. అతడు మిల్ (Mill) డార్విన్ (Darwin), హక్స్‌లే (Huxley), స్కోపెన్ హార్ (Schopenhauer) మొదలైనవారి కృతులను చదివాడు. శ్రీ ఎడ్విన్ ఆర్నాల్డ్ పుస్తకం 'లైట్ ఆఫ్ ఆసియా' ఆధారంగా బౌద్ధతత్త్వాన్ని నేర్చుకున్నాడు. ప్రాచీన కాలం మొదలు ఆధునిక కాలం వరకు

---

### ఎల్లిస్ పార్క్

*దక్షిణ ఆఫ్రికాలోని జొహన్నస్‌బర్గ్ (Johannesberg)లో ఉన్న క్రికెట్ మైదానం పేరు ఎల్లిస్ పార్క్ (Ellis Park).*

"పుస్తక పఠనం ఆలోచనలకు తగ్గట్టుగా, ఆలోచనలు పుస్తక పఠనంకు తగ్గట్టుగా ఉండాలి."
– ఎమ్మోన్స్

ఉన్న వివిధ విషయాలకు సంబంధించిన అనేక పుస్తకాలను చదివాడు.

శ్రీ రామస్వామి అయ్యర్ స్వాతంత్ర సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నాడు. 1917-18 మధ్య ప్రాంతంలో శ్రీ రామస్వామి అయ్యర్ కార్యదర్శిగా,



C.P.Ramaswamy Aiyar's house in Madras (Chennai)

పండిత జవహర్‌లాల్ నెహ్రూ సహ కార్యదర్శిగా భారతీయ కాంగ్రెసు సంస్థలో పనిచేసారు. డా. అనిబిసెంట్ చేపట్టిన రాజకీయపరమైన, చదువుపరం అయిన పనులలో ఆమెకు సహాయపడ్డాడు. స్వయం పరిపాలనా సంస్థ (Home Rule Leaque)లో ఉపాధ్యక్షుడిగా, జాతీయ విద్యా ఉద్యమాలతో (National Education Movement) ఇతడికి సన్నిహిత సంబంధం ఉండేది. భారతదేశపు సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా పనిచేసిన ఎడ్విన్ మాంటెగుకు ఇతడు సన్నిహిత స్నేహితుడు. అయినా రాజకీయ సమస్యలలో ఇతడు మాంటెగుతో ఏకీభవించలేదు.

పార్లమెంటరీ ప్రభుత్వానికి నాంది పలికే పార్లమెంట్ చట్టం 1919వ సంవత్సరంలో ఆమోదింపబడింది. జస్టిస్ పార్టీ అభ్యర్థికి విరుద్ధంగా ఆ తరువాతి సంవత్సరం రామస్వామి అయ్యర్ మద్రాసు లెజిస్లేచర్ (ఉమ్మడి మద్రాసు రాష్ట్రం)కు పోటీ చేసాడు. తన ప్రత్యర్థులను ఆశ్చర్యంలో ముంచెత్తుతూ అత్యధిక మెజారిటీతో ఇతడు ఎన్నికయ్యాడు.

రామస్వామి అయ్యర్ స్నేహితుడు లార్డ్ విల్లింగ్‌డన్ (Lord Willingdon) గవర్నర్ ఎక్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యత్వాన్ని 1923వ సంవత్సరంలో ఇతడికి ఇచ్చాడు. డా. బెసెంట్ సలహా మేరకు ఆ పదవిని ఇతడు స్వీకరించాడు. ప్రభుత్వంకు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌గా ఇతడు బాగా ఉపయోగపడ్డాడు. మెట్టూరు, భవాని, పైకరా (Pykara) లాంటి వ్యవసాయం, నీటిపారు

---

"గుర్తించేవాడు"

*రేడియో ప్రసారణ లేదా టెలివిజన్ ప్రసారణ జరుగుతున్నపుడు ఆట ఆడుతున్న వ్యక్తులను గుర్తుపట్టగల వ్యక్తిని క్రీడారంగపు జర్నలిజంలో "స్పాట్టర్" (Spotter) అంటారు.*

"అన్ని విషయాలను గురించి పూర్తిగా తెలిసిన వ్యక్తిగానీ ఏ విషయమూ తెలియని వ్యక్తిగానీ ఎవడూ ఉండడు."

దల, విద్యుచ్ఛక్తి ఉత్పత్తితో ముడిపడిన ప్రణాళికలకూ, పారిశ్రామిక ప్రణాళికలకూ (Schemes) కొచ్చి, విశాఖపట్నం, ట్యుటికోరిన్ (Tuticorin)లాంటి రేవు పట్టణాల అభివృద్ధికీ ఇతడే బాధ్యత వహించాడు. ఈ పదవిలో అతడు 1928వ సంవత్సరం దాకా రాణించాడు. ఆ తరు



Dr.C.P.Ramaswamy Aiyar in Conversation with Pandit Jawaharlal Nehru, First Prime Minister of India
ack : Sakunthala Jagannathan

వాత అతడు బార్ (Bar)లో చేరాడు. 1926-27వ సంవత్సరంలో జెనీవాలోని నానాజాతి సమితి (League of Nations)కు భారతీయ జట్టు ప్రతినిధిగా పంపబడ్డాడు. 1931-32వ సంవత్సరంలో కొత్త ఢిల్లీలోని కేంద్ర కాబినెట్‌లో చట్టం, వాణిజ్యం, రైల్వేలూ, సమాచార శాఖ సభ్యుడిగా నియమించబడ్డాడు.

1931 మొదలు 1935వ సంవత్సరం వరకు రామస్వామి అయ్యర్ ట్రావన్కూర్ రాజు కుటుంబానికి న్యాయశాస్త్రం, రాజ్యాంగం (Legal and Constitutional) సలహాదారుడిగా పనిచేసాడు. ఆ తరువాత అతడు ట్రావన్కూర్ దివానుగా నియమింపబడ్డాడు. ఈ పదవిలో అతడు 1947వ సంవత్సరం దాకా కొనసాగాడు. ట్రావన్కూర్ దివానుగా తిరువాన్కూర్ ఆధునికత్వానికి పాటుపడ్డాడు. తిరువాన్కూరు ఆర్థిక పారిశ్రామిక అభివృద్ధికి ఎంతో కృషి చేసి భారతదేశంలోని ఇతర ప్రాంతాలకు ఆదర్శమైన ప్రాంతంగా దానిని తీర్చిదిద్దాడు.

ఎరువులు, రసాయనాలు, రేయాన్, సిమెంట్, అల్యూమినియం, టిటానియం మొదలైన ప్రధాన పరిశ్రమల స్థాపన ఇతడు సాధించిన ఇతర విజయాల పరంపరలోనివే. కొచ్చిన్ రేవుపట్టణ ఆధునీకరణను పొరుగు రాష్ట్రాలతో చేతులు కలిపి సాధించాడు. కొన్ని నెలల వ్యవధిలో తిరువనంతపురంలో విమానాశ్రయాన్ని నిర్మించగలిగాడు!

చదువు, రామస్వామి అయ్యరుకు అరవప్రాణంలాంటిది. ట్రావన్కూర్ విశ్వవిద్యాలయాన్ని స్థాపించడానికి తొలి ఉపా

---

పనుల ద్వారానే..

*సార్థక జీవితానికి కొలబద్ధ పనులే కానీ వయసు కాదు.* - *షరిడన్*

"సహృదయంతో కూడిన సుస్వాగతం పసందైన విందు కంటే కూడా మంచిది"

ధ్యక్షుడిగా (Vice Chancellor) పనిచేసాడు. మ్యూజిక్ అకాడమీనూ, మెరీనా బయొలాజికల్ సంస్థనూ, వందల సంఖ్యలో పాఠశాలలనూ, కళాశాలలనూ, అనేక సంస్థలనూ ఇతడు స్థాపించాడు. విద్యారంగంలో కేరళ రాష్ట్రం సాధించిన విజయాలకూ, మొత్తం భారతదేశంలో అక్షరాస్యత శాతం ఎక్కువగా ఈ రోజు కేరళ రాష్ట్రంలో ఉందంటే దానికి ప్రధాన కారణం శ్రీ రామస్వామి అయ్యర్ అకుంఠిత కృషియే.

రామస్వామి అయ్యర్ భారతదేశపు తొలి ఎరువుల ఫాక్టరీను ప్రారంభించాడు. పచిపర జలవిద్యుత్ ప్రణాళికకూ (Pachipara Hydroelectric Scheme)పెరియార్ గేమ్ సాంక్చురీ స్థాపనకూ ఇతడు ప్రేరణను (initiate) ఇచ్చాడు. పల్లివాసల్ జలవిద్యుత్ ప్రణాళికను అతడు విస్తరింపజేసాడు.

హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించిన మొదటి వ్యక్తి ఇతడే. అప్పటి తిరువాన్కూర్ మహారాజును ఒప్పించి చారిత్రాత్మకమైన దేవాలయ ప్రవేశ ఆజ్ఞను జారీ చేయించాడు. ఈ ఆజ్ఞ అంటరానితనాన్ని ఆ సంస్థానం నుండీ తొలగించింది. అంతేకాదు ఆ సంస్థానం నుండీ మరణశిక్షను రద్దు చేయించాడు. భూ ఆదాయం (land revenue) స్థానంలో క్రమబద్ధమైన (graded) వ్యవసాయ ఆదాయం పన్ను (Agricultural Income tax)ను ప్రవేశపెట్టాడు. పేద పిల్ల

---

## సామరస్యానికీ ఏకీభావనకు దారితీసే సరైన అవగాహన




*ప్రాణులన్నీ ఒకే విధంగా సృష్టించబడ్డాయి. ఒక ప్రాణికి కలిగే బాధ అన్ని ప్రాణులకు బాధను కలిగిస్తుంది. ఒక ప్రాణికి బాధ నుండీ ఉపశమనాన్ని (alleviates) కలిగించేది అన్ని ప్రాణులకు బాధ నుండీ ఉపశమనాన్ని ప్రసాదించగలదు. మనిషికి ఇతర ప్రాణులకు మధ్య నున్న శరీర పరిమాణాలలో మార్పు ఉంది కానీ రకంలో లేదు. అన్నింటిలో సామ్యాన్ని చూడడం అన్నది సరైన అవగాహన అవుతుంది. సరికాని అవగాహన విభేదానికి దారి తీస్తుంది. సరైన అవగాహన అన్నది సామరస్యానికీ ఏకీభావనకు దారితీస్తుంది.* – బుద్ధుడు

''చిన్న చిన్న ఊరూ పేరూ లేని, గుర్తుపెట్టుకోని దయ, ప్రేమలతో కూడిన చర్యలే మనిషి జీవితపు ఉత్తమోత్తమ భాగం అవుతుంది.'' – వర్డ్స్‌వర్త్

లకు మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రవేశ పెట్టాడు. తిరువనంతపురం నుండీ కన్యా కుమారీ వరకు భారతదేశపు తొలి సిమెంట్ రోడ్డును నిర్మించాడు. శ్రీమతి అన్నా చాండీను తొలి జిల్లా జడ్జిగా నియమించిన తొలి వ్యక్తి శ్రీ రామస్వామి అయ్యర్. ఆ తరువాత శ్రీమతి అన్నా చాండీ భారతదేశపు తొలి మహిళా హైకోర్టు జడ్జిగా నియమించబడింది.

చేపట్టిన పనులను చేయడమన్న అరుదైన ఆలోచనలో ఇతడికి అపారమైన నమ్మకం ఉండేది. గ్రామాల విద్యుదీకరణనూ, సంస్థానం పొడవును మంచి కంకరరోడ్లను నిర్మించడమూ, వందలకొలది లఘు పరి శ్రమలనూ స్థాపించడంలో ఇతడు సఫలు డయ్యాడు. తిరువనంతపురం సంస్థానానికి విశిష్టమైన ఆర్థిక, సాంస్కృతిక, విద్యాప్రగ తికరమైన రూపాల్ని ఇతడు ఇవ్వగలిగాడు.

శ్రీరామస్వామి అయ్యర్ వివేకంతో, పరిపూ ర్ణజ్ఞానంతో మాట్లాడగల ఒక గొప్ప వక్త. దేశపు పేరున్న రాజకీయ నాయకులు అసూ యపడే మేరకు ప్రజలను ఆకట్టుకోగల వాక్చాతుర్యంగల వ్యక్తి. భారతీయ వర్ణచిత్ర కారుల పోషకుడుగా ఇతడుండేవాడు. లక్షలు విలువలు చేసే ఆస్తులను ధర్మసంస్థ లకు విరాళంగా ఇచ్చిన గొప్ప దాత.

అణ్ణామలై విశ్వవిద్యాలయానికి మూడు సార్లు, బెనారస్ హిందూ విశ్వ విద్యాలయానికి రెండుసార్లు ఇతడు ఉపాధ్యక్షుడిగా (Vice Chancellor) నియ మించబడ్డాడు. విద్యపట్ల అతనికున్న ప్రేమ వివిధశాఖలకు చెందిన అధ్యాపకుల, విద్యార్థుల లాభం కోసం పనిచేయడంగా మారింది.

87 సంవత్సరాల పండు వయసులో ఇంగ్లాండులోని లండన్‌లో 1966వ సంవత్సరం సెప్టెంబరు నెల 26వ తారీఖున డా. సి.పి. రామస్వామి అయ్యర్ మరణించాడు ●

---

## మొదటి ముద్రణాలయం వెలసిన చోటు




*1556వ సంవత్సరంలో గోవాలో తొలి ముద్రణాలయం నెలకొల్పబడింది. ఆ భవన ప్రధాన ద్వారాన్ని పై చిత్రంలో చూడవచ్చును.*

''నేర్చుకోవడానికి ఇష్టపడకుండా ఉండడం కంటే విషయాలను గురించి తెలుసుకోక పోవడం అన్నది మరీ అవమానకరమైన విషయం కాదు.'' – రుత్ మెక్రీ

# మార్పును తేగల ఉత్సాహం

నార్మన్ విన్సెంట్ పీలె

తమ జీవితంలో గొప్పగా సాధించగలిగిన అదృష్టవంతులు చాలావరకు ఉత్సాహం కారణంగానే చురుగ్గా ఉండగలరు. మానవ అస్తిత్వాన్ని దాని అవకాశాలనూ, సమస్యలనూ, విశ్వాసపు వైఖరిలో ఉత్సాహపు దృష్టికోణంతో చూచినప్పుడు చాలామంది వ్యక్తులు తమ జీవితాన్ని చాలా బాగా తీర్చి దిద్దగలిగారని తెలుస్తుంది.



నిజంగా కూడా ఉత్సాహం మార్పును తేగలదు. ఉదాహరణకు ఇద్దరు వ్యక్తుల మధ్యనున్న అపారమైన భేదాభిప్రాయాలను తీసుకోండి. ఒకరకం వ్యక్తిత్వంగల వ్యక్తులు ఆశావాదంతో, సంతోషంతో, విశ్వాసంతో ఉంటారు. కొన్ని విషయాలలో వారికి గట్టి నమ్మకం ఉన్నందువల్ల వారు అన్నింటినీ ముందుకు తోస్తూ సమాజ శ్రేయస్సు కోసం పాటుపడే ఉదాత్త మనస్కులై ఉంటారు. మరొకరకం వ్యక్తులు వీరికి పూర్తిగా విరుద్ధంగా విషాదంతో నిండిన మనుషులుగా ఉంటారు. వీరు తమ తల్లిదండ్రులకూ, తమ అధ్యాపకులకూ ఎదురు తిరిగే వారుగా ఉంటారు. వారు దూరదృష్టి లేనివారుగా బలం లేనివారుగా ఉంటారు. వారి ఆలోచనలు గందరగోళంగా ఉంటాయి.

మానవాళిలో విజయాన్ని సాధించినవారి సృజనాత్మక ప్రాంగణంలో మనల్ని తీసుకుపోగల ఉత్సాహాన్ని, వాడుకోవడంను నేర్చు

## ఆణిముత్యాలు

★ మూర్ఖత్వం తప్ప వేరే పాపం ఏదీ లేదు.

★ మనం అనేక సందర్భాలలో కోప్పడతాము.

★ మనుషులు సహజంగా మంచివారే. కానీ మన సంస్థలు వారిని చెడ్డవారిగా తయారుచేస్తాయి.

★ ఇప్పటి వారికి అన్ని వస్తువుల వెల తెలునుకానీ ఏ వస్తువు విలువ తెలియదు.

''మీ శత్రువు కోసం మీలో రగుల్చుకున్న పగ మీ శత్రువు కంటే మిమ్మల్నే ముందుగా దహించి వేస్తుంది.''
—చైనా సామెత

కోవాలి. వారి మధ్యలో మొత్తం ఏకాభి ప్రాయాన్ని మనం చూడగలం. అంతేకాదు ఉత్సాహం అన్నది వెలకట్టలేనంత వ్యక్తి వ్యక్తిత్వ నిర్మాణానికీ, ఆనందానికీ, సంతృ ప్తికీ దోహదకారిగా ఉంటుంది.

ఉత్సాహం కరిగిపోకుండా అలానే ఉంచుకోవడం అన్నది ముఖ్యంగా వయసు మళ్ళిన వారిలో సాధారణంగా చాలా కష్ట మైన పని. యవ్వన దశలో పరుగులు తీసే వారి ఉత్సాహం వయసు పెరిగే కొద్దీ బాగా దెబ్బతింటుంది. కానీ ఈ విధమైన జీవితశక్తి క్షీణం కావడం అన్నది జరగకపోవచ్చును. నిజం చెప్పాలంటే ఇలా క్షీణించాలి అని మనం అనుకున్న ప్పుడే అది క్షీణిస్తుంది.

ఉత్సాహపు శక్తి తగ్గడాన్ని మనం ఆపు చేయవచ్చును. వయసు బాధ, రోగం, నిరాశ, నిస్పృహలాంటి వాటిని ఖాతరు చేయకుండా ఉత్సాహం ద్వారా నిరంత రంగా ముందుకు సాగవచ్చును.

జీవిత అధ్యాయం ముగిసేంతవరకు కొంతమంది ఉత్సాహవంతులుగానే ఉండి పోయారు. ఆ తరువాత కళ్ళలో ఉత్సా హపు వెలుగు ఇంకా వెలుగుతుండగా రెక్కలు కట్టుకుని ఎగిరిపోతారు.

(-'నందంబాక్కం లయనస్ క్లబ్ వారి సావనీరు సౌజన్యంతో)

## ప్రకటనలను ఇవ్వని వ్యాపారిని చూసేందుకు




*సుప్రసిద్ధ సాహిత్యవేత్త మార్క్‌ట్వైన్ ఒకప్పుడు మిస్సోరీ (Missoun)లోని ఒక చిన్న పత్రికకు సంపాదకుడిగా పనిచేసాడు. ఒక రోజు అతడు ఒక విచిత్రమైన ఉత్తరాన్ని అందుకున్నాడు. "అయ్యా! నేను ఈ రోజు మీ పత్రిక మధ్యలో ఒక సాలెపురుగును చూసాను. ఇది శుభసూచ కమో, అశుభసూచకమో దయచేసి తెలియజే యగలరు" అని అందులో రాసి ఉంది.*

*"మా పత్రికలో సాలెపురుగును చూడడం అన్నది అటు మంచిది కానీ, ఇటు చెడ్డది కానీ కానేకాదు. మా పత్రికలో ప్రకటనను ఇవ్వని వ్యాపారి కోసం ఆ సాలెపురుగు వెదు కుతోంది. ఆ వ్యాపారిని గురించి తెలుసుకుని ఆ వ్యాపారి అంగడికి పోయి అక్కడ తన గూడు అల్లుకుని ఆ తరువాత నిశ్చింతగా, శాంతియుతంగా ఉండాలని అనుకుంటోంది" అని ఉత్తరాన్ని రాసి మార్క్‌ట్వైన్ పంపాడు.*

*("ఇన్స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో)*

**"కొత్తవారి పట్ల గౌరవంగా, మర్యాదతో వ్యవహరించే వ్యక్తి విశ్వ కుటుంబానికి చెందిన వక్తిగా ఉంటాడు." —ఫ్రాన్సిస్ బేకన్**

# అద్భుతమైన పంట - సోయాబీన్

చిత్రా రామస్వామి

అద్భుతమైన పంట సోయాబీన్ అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. ఇది పశువులకు గడ్డిని సమకూరుస్తూ ఆకలితో అలమటించే లక్షలాది ప్రజలకు ఆహారాన్ని సమకూరుస్తుంది. పారిశ్రామిక ముడిపదార్థంగా కూడా ఇది ఉపయోగ




పడుతుంది. పెయింట్, నూనెవస్త్రం (Oilcloth), కృత్రిమ పెట్రోలుతోపాటు ఆటో విడిభాగాల వరకు ఇలా పారిశ్రామిక రంగంలో సోయాబీన్ చాలా ఉపయోగపడుతోంది. ముఖ్యంగా ఆటో భాగాలలో వీటి ఉపయోగాన్ని హెన్రీ ఫోర్డ్ ప్రవేశపెట్టాడు. సోయాబీన్‌కు నివాళులు అర్పిస్తూ జేమ్స్ గుర్నే (James Gurney) అనే చిత్రకారుడు సోయా ద్వారా లభ్యమయ్యే సుమారు 60 వస్తువులను సోయా నుండీ తయారుచేయబడిన పెయింట్లను వాడి తయారు చేసాడు.

సుమారు 250 సంవత్సరాల క్రితం ఈ సోయా చైనా నుండీ పాశ్చాత్యదేశాలలో ప్రవేశపెట్టబడింది. అప్పటినుండీ ఈ సాంస్కృతిక విస్తరణ ప్రారంభమైంది. ఇది జపాను దేశంలో అక్కడి వారి ఆధ్యాత్మిక అవసరాలను తీర్చడమే కాకుండా భోజనంలో ఒక భాగంగా వడ్డించబడుతుంది. ఈ సోయాలోని ఔషధగుణం గ్యాస్ట్రిక్‌కాన్సర్‌ను, మరి ఇతర రోగాలను అరికడుతుంది.

సోయాలో మాంసకృత్తులు పుష్కలంగా లభిస్తాయి. ముఖ్యంగా ఇందులో 'గంజి' లేకపోవడంవల్ల మధుమేహంతో బాధపడుతున్న వారికి డాక్టర్లు వీటిని సిఫారిసు చేస్తున్నారు. సోయాబీన్ పిండి నుండీ చైనా, జపాను దేశాలలో పెరుగు తయారు చేయబడుతున్నది. ఇది విపరీతంగా వాడబడుతోంది. ●

''కన్ను: శరీరపు వెలుగు.'' – మాథ్యూ

# తెలుసుకోదగిన విషయాలు

## ఏనుగుల ఆహారం




ప్రతిరోజూ దాదాపు 228 కి.గ్రా.ల పచ్చికను ఏనుగులు ఆహారంగా తీసుకుంటాయి.

## ప్రపంచపు ఏకైక మంచినీటి సరస్సు

మధ్య అమెరికాలోని నికరాగ్వా (Nicaragua) సరస్సు సముద్రం జంతువులకు నివాసయోగ్యమైన ప్రపంచపు ఏకైక మంచినీటి సరస్సు.

## మేట్ అనబడే టీ

దక్షిణ అమెరికాలోని అర్జెంటీనా ప్రజలకు మేట్ (Mate) అనబడే టీ దిన సరి పానీయం.

## ప్రపంచపు తొలివర్ణమాల

ప్రాచీన కాలపు సిరియా (Syria)కు చెందిన యుగారిట్ (Ugarit) నగరంలో ప్రపంచపు తొలి వర్ణమాల (Apphabet) కనగొనబడింది.

## 800 బిలియన్ల సైకిళ్ళు

ఈ రోజు మొత్తం ప్రపంచపు రహదారులపై 800 మిలియన్ల సైకిళ్ళు ఉన్నట్లు అంచనా వేయబడింది.

## స్విట్జర్లాండ్ దేశపు ఆవిష్కారాలు

మధ్య యూరప్‌లోని స్విట్జర్లాండ్‌లో బేబీఫుడ్ మరియు ఘనీభవింపజేసిన పాలు ఆవిష్కరించబడ్డాయి.

---

## వాయుశక్తి వాడకంలో నాల్గవస్థానం

***వాయుశక్తి వాడకంలో భారతదేశం నాల్గవ స్థానంలో ఉంది. ప్రస్తుతం మనదేశంలో 800 మెగావాట్ల విద్యుచ్ఛక్తి వాయుశక్తి వాడకం ద్వారా ఉత్పత్తి అవుతోంది.***

''మెరుగైన పుస్తకం రాసి, మెరుగైన ఉపదేశం ఇస్తూ లేదా తన పొరుగింటివాడి కంటే మెరుగైన ఎలుకల బోను తయారుచేయగలిగితే, తన ఇల్లును అడవిలో కట్టుకున్నా ఆ అడవి దారిని రహదారిగా మార్చి ప్రజలు వస్తారు.'' – రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

## నేపాల్‌లో...




బౌద్ధ ధర్మస్థాపకుడైన బుద్ధుడి రూపం నేపాలులోని చాలా దేవాలయాల గోడలను అలంకరింపజేస్తోంది.

## జాతీయ మ్యూజియం

హాస్యం – వ్యంగ్యం కోసమే బల్గేరియా (ఆగ్నేయ యూరప్)లో ఒక జాతీయ మ్యూజియం ఏర్పాటు జరిగింది.

## కండరాల శాతం!

మనశరరంలోని 40 శాతం బరువు కండరాలకు చెందుతుంది.

## నామిబ్ ఎడారి

నైఋతి ఆఫ్రికాలోని నమీబియాలో ఉన్న నామిబ్ (Namib) ఎడారి ప్రపంచపు అతి ప్రాచీనమైన ఎడారి. దీనికి మించిన ఎండిన ఎడారి ఈ ప్రపంచంలోనే లేదు.

## ప్రపంచంలో అతి ఎక్కువ సినిమాల నిర్మాణం

ముంబాయిలోని సినిమా పరిశ్రమ నిర్మాణ విషయంలో మొత్తం ప్రపంచంలో అతి పెద్దది.

## తుఫాను గాలికి గురి...

వెస్ట్ ఇండీస్‌లోని కరిబ్బియన్ (Caribbean) దీవులు తరచుగా తుఫాను గాలికీ, పెను తుఫానుకు గురి అవుతూ ఉంటాయి.

## రేసు గుర్రాల పెంపక కేంద్రం

మధ్య ఆసియాలోని టర్క్‌మెనిస్తాన్ (Turkmenistan) లోని అష్గబట్ (Ashgabat) అఖల్ – టెకె (Akhal-Teke) జాతికి చెందిన రేసు గుర్రాలు పెంపకం కేంద్రం. ఈ జాతి గుర్రాలు ఎడారిలాంటి పరిస్థితులలో కూడా తమ వేగాన్ని కాపాడుకోగలవు. ●

## కృత్రిమమైన నేలపై హాకీ

*1976వ సంవత్సరం కెనడాలోని మాంట్రియల్‌లో జరిగిన ఒలింపిక్ క్రీడల సందర్భంగా తొలిసారిగా కృత్రిమ నేలపై హాకీ ఆడబడింది.*

"నీరు శరీరాన్ని పవిత్రం చేస్తే సత్యసంధత మనసును పవిత్రం చేస్తుంది."

# మాట్లాడే కంప్యూటర్

కీవ్ (Kiev)లోని వైజ్ఞానికులు మాట్లాడే కంప్యూటర్‌ను తీర్చిదిద్దారు. ఈ కంప్యూటర్ కవిత్వం రాయడం మాత్రమే కాకుండా చదరంగం ఆట కూడా ఆడగలదు. అయితే ఈ కంప్యూటర్ మొహాన్ని చూసి ఆ మొహం ఆడదానిదా లేదా మగవాడిదా అని మాత్రం చెప్పలేదు. ముఖం వరకు ఆడమగకున్న వ్యత్యాసాన్ని చిన్న పిల్లలు కూడా గుర్తించగలరన్నది అందరికీ తెలిసిన విషయమే. భవిష్యత్ కంప్యూటర్లకు ప్రతిబింబాలను చూసి గుర్తుపట్టే కళను శాస్త్రజ్ఞులు బోధిస్తారు.

ఈ కీవ్‌లోని వైజ్ఞానికులు కంప్యూటర్లకు మరో వృత్తిని కూడా నేర్పారు. టెలిఫోనులో అవతలి వైపు నుండీ వచ్చే గొంతుకను విని దాన్ని వెంటనే లిఖిత భాషలోకి మార్చగలుగుతుంది. కంప్యూటర్‌తో మనిషి మాట్లాడడానికి ఇది చాలావరకు ఉపయోగపడుతుంది.

భవిష్యత్తులో కంప్యూటర్ మన ఇంట్లో అడుగుపెట్టి అన్ని ఇంటి పనులను చేసి పెట్టగలదన్న విషయాన్ని చెప్పే పరిపక్వ దశకు రాగలమని ఇప్పట్లో చెప్పలేము. కానీ ఇల్లాలుకు ఉపయోగపడే సలహాల నిస్తూ పూర్ణం (Pie) లేదా బీట్రూటు సూప్ వండడానికి సరైన ఉష్ణోగ్రత లేదా వేడి పరిస్థితులకు సంబంధించిన సూచనలను ఇవ్వగల కంప్యూటర్లు రాగల సూచనలు ఉన్నాయి.

త్వరలోనే కంప్యూటర్ ద్వారా కార్ఖానాలనూ, ఉత్పత్తినీ, హద్దులో ఉంచుకుని జాతీయ ఆర్థిక ప్రణాళికను తయారుచేయడానికీ, రోగులకు వైద్య సలహాలను ఇస్తూ మనిషి ఆజ్ఞలను అందుకుని మనిషి గొంతుకతో వివరణను ఇవ్వగల కంప్యూటర్లు రానున్నాయి. ●

## అతి ఎతైన కూలింగ్ టవర్



**Tallest cooling tower, rising to 590 feet, is in Uentrop, Germany**

*జర్మనీలోని యుఎన్‌ట్రాప్ (Uentrop)లో ఉన్న అతి ఎత్తైన కూలింగ్ టవర్లను పై చిత్రంలో చూడవచ్చును. దీని ఎత్తు 590 అడుగులు.*

''సామర్థ్యం అన్నది పేదవాని పెన్నిధి.''

# మీరు ఎంతవరకు సర్దుకుపోగలరు?

తమ దైనిక చర్యకు భంగం వాటిల్లితే కొంతమంది పరిస్థితి చాలా అధ్వాన్నంగా తయారవుతుంది. తాము అనుకున్నట్లు లేదా తమ ప్రణాళిక ప్రకారం జీవితం ముందుకు సాగకపోతే కొంత మంది తమ సమతౌల్యాన్ని కోల్పోతారు.

అయినా మన జీవితపు జయం - అపజయం ఈ రెండూ, మనం కఠినమైన దాన్ని మృదువుగా మార్చుకోగలిగి జీవితం నుండి ఉత్తమమైన దాన్ని ఎలా రాబట్టుకోగలమన్న విషయంపైనే ఆధారపడి ఉంటాయి.

ఈ క్రింద ఇవ్వబడిన పరీక్షను చేయడానికి ప్రయత్నించండి. చివరిలో ఇవ్వబడిన జవాబులను చూచేందుకు ముందు 'అవును' 'కాదు' అని జవాబులు రాసుకుంటూ పొండి.

1. వాతావరణం ఉత్సాహవంతంగా లేనప్పుడు మీరు సంతోషంగా, ఆనందంగా ఉండగలరా?

2. కుటుంబసభ్యులు - భార్యాపిల్లలు - బయటకు వెళ్ళినప్పుడు మిమ్మల్ని మీరు బాగా చూసుకోవడంలో ఆనందాన్ని అనుభవిస్తారా?

3. మీరు చిన్న పిల్లలతో, వయసు మళ్ళినవారితో, మీ తరంవారితో సర్దుకుపోగల సామర్థ్యం గల అతిథులా?

---

## కచేరీను మరింత ఆనందించగలరు

*అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని న్యూయార్క్ నగరంలో సుప్రసిద్ధ సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్ సంగీత కచేరీ ఏర్పాటైంది. కచేరీలో తొలి భాగంగా సితారును శ్రుతి చేయసాగాడు. అతడు తన సంగీత కచ్చేరీను ప్రారంభించాడనుకుని జనం చప్పట్లు చరిచారు. అప్పుడు రవిశంకర్ ''శ్రుతి వేయడాన్ని మీరు ఇంతగా ప్రశంసిస్తున్నారంటే నా కచేరీని వీరందరు తప్పక మరింతగా ఆనందించగలరు'' అని అన్నాడు.*

**''తరగని ఆనందాన్ని ప్రసాదించే ఖజానా ద్వారాలను ఓపిక తెరుస్తుంది.''**

4. కుటుంబపరమైన దినచర్య 'రోగ్యం లేదా అత్యవసర పరిస్థితుల కారణంగా దెబ్బతిన్నప్పుడు ఇతరులకు సహాయపడడంలో భాగస్వాములు అవుతారా?

5. చేస్తున్న పని కాకుండా పని మార్పును ఇష్టపడతారా?




6. మీ ఉన్నత అధికారి పదవీ విరమణ చేసినప్పుడు ఆ వచ్చే వ్యక్తితో ఎలా ఉండాలన్న భావన లేకుండా అతడి స్థానంలో వచ్చిన వ్యక్తిని ఆహ్వానిస్తారా?

7. సంస్థలో మార్పులు చేసినప్పుడు లేదా కొత్త పద్ధతులను ప్రవేశపెట్టినప్పుడు మీరు సహకారాన్ని అందిస్తారా?

8. తెలియని స్థలంలో, తెలియని మనుషుల మధ్య గట్టి ప్రయత్నం చేయకుండా స్థిరపడి పోగలరా?

9. అన్నిరకాల మనుషులతో సులభంగా సర్దుకుపోగలరా?

10. సులభంగా కొత్తవారిని మీ మిత్రులుగా చేసుకోగలరా?

11. సమయానికి మీతో తోడ్పడకుండా, మీకు ఇతరులు నిరాశను కలిగించినప్పుడు మీ మానసిక శాంతిని కాపాడుకోగలరా?

12. మీ తప్పుల నుండీ, మీ అపజయాల నుండీ మీరు పాఠాలు నేర్చుకుంటారా?

తరచుగా మైళ్ళ కొద్దీ
ప్రయాణం చేసే కష్టాలు

చీకట్లు కమ్మినప్పుడూ, మేఘాలు ఆవరించినప్పుడూ
ఫిర్యాదులు చేసి ప్రయోజనం లేదు.
మనం ఓడిపోతున్నట్లనిపించినప్పుడూ, మన ప్రపంచం మన మధ్య నుండీ మాయం అవుతున్నప్పుడు ఫిర్యాదు చేసి ప్రయోజనం లేదు.
మన జీవితాలు వెలుగునీడల, ఆశనిరాశల, సుఖదుఃఖాల కలయిక.
మనం ప్రయాణం చేసే దారి నునుపుగా, సాఫీగా ఉండదు. కారణం కష్టాలు తరచుగా మైళ్ళ కొద్దీ దూరం ప్రయాణం చేయడమే.

– ఈ.డబ్ల్యు. హిల్

''చదువు, చదవగలిగిన జనాభాను విపరీతంగా పెంచగలిగిందే కానీ ఏది చదువతగినది, ఏది తగనిది అని గుర్తించగల జనాభాను పెంచలేకపోతోంది'' – జి.ఎం. ట్రివెల్యన్

13. మీ పాత అభిప్రాయాలనూ, ఉద్దేశాలను తొందరగా మార్చుకోగలరా?

14. మీ కోరిక, మీ సామర్థ్యంకు దూరంగా ఉన్నప్పుడు సాధించలేని దాని వెంట పరుగెత్తడం కంటే బాగా ఆచరించగల పనులలో మీ సామర్థ్యాన్ని వెచ్చించగలరా లేక నేను బొత్తిగా పరాజయాన్ని పొందానన్న భావనను కలిగి ఉంటారా?

15. మీ కంటే ఎక్కువ ఉన్నవారిని చూసి మీ జీవితాన్ని పాడు చేసుకోకుండా మీకున్నదాన్ని లాభదాయకంగా వాడుకుంటారా?

ప్రతి 'అవును'కు ఐదు మార్కుల ప్రకారం ఇవ్వండి. 55 మార్కులు చాలా మంచి మార్కులు 45 మార్కులు అన్నవి మంచి సరాసరి మార్కులు. 35–45 మార్కులు సంతోషజనకమైన మార్కులు. 35 లోపు మార్కులు సంతోషజనకమైనవికావు.

సర్దుకపోవడానికి ఉత్తమ స్థాయి పరిపక్వతను కలిగి ఉండాలి. అందుకే మీ వైఖరిని, ప్రతి క్రియలను ఉత్తమంగా ఉంచుకోగల లక్ష్యాన్ని కలిగి ఉండండి.

## ప్రేమ–శూన్యత


KAHLIL GIBRAN

★ ఇతరుల పట్ల మీకున్న విశ్వాసం, అవిశ్వాసం అన్నవి మీపట్ల మీకున్న ఆత్మవిశ్వాసం లేదా అపనమ్మకంతో దగ్గరగా ముడిపడి ఉంటాయి.

★ చెప్పడానికి లేదా అచ్చువేయడానికి మన వద్ద చెప్పుకోదగ్గది ఏమీ లేకపోయినా వాక్ స్వాతంత్ర్యాన్నీ, పత్రికా స్వాతంత్ర్యాన్నీ మనం కోరుతుంటాము.

★ మనలోని ప్రేమ, శూన్యత అన్నవి సముద్రం ఆటు, పోటులాంటిది.

★ పునాది అట్టడుగున ఉన్నరాయే కట్టడపు చాలా ఘనమైన రాయిగా ఉంటుంది.

★ గాయకుడు గానం చేసి వాద్యం వాయించే వ్యక్తి తీగపై నొక్కులు నొక్కడం ఆపు చేసిన తరువాత చెవులలో రింగుమంటూ నిలిచిపోయే స్పందనపైనే సంగీతం వాస్తవికత ఆధారపడి ఉంటుంది.

– కలీల్ గిబ్రాన్

"ఏ పని చేసినా మీ వరకూ, ఈ ప్రపంచం వరకూ న్యాయంగా ఉండండి. మీ ఆలోచనలను కప్పిపుచ్చకండి. మీ ఆలోచనలను బహిర్గతం చేయడాన్ని సిగ్గుపడవలసినదానిగా భావిస్తే వాటిని గురించి ఆలోచించడం మరింత సిగ్గుపడవలసినదిగా అవుతుంది." – మహాత్మాగాంధీ

# అవీ- ఇవీ

## 112 దేశాలలో 552 ప్రపంచ వారసత్వ స్థానాలు




112 దేశాలలోని ప్రపంచ వారసత్వ స్థానాల సంఖ్య ఇప్పుడు 552కు పెరిగింది. ఈ స్థానాలలో నేపాల్‌లోని గౌతమ బుద్ధుడి జన్మస్థానం లుంబినీ (Lumbini) నెదర్‌లాండ్స్‌లోని కిండర్‌డిజ్క్ - ఎల్స్ హౌట్ (Kinderdijk - Elshout) వద్ద నున్న వాయుయంత్రాల (Wind-mill) అల్లిక, బంగ్లాదేశ్‌లోని సుందర్‌బాన్స్‌లో ఉన్న రావి చెట్ల లాంటి చెట్లవనం (Mangrove) మొదలైనవి కూడా చేర్చబడ్డాయి.

– 'యునెస్కో సోర్సెస్' సౌజన్యంతో

## జపానుకు చెందిన తొలి అంతరిక్ష పాదచారి

43 సంవత్సరాల టకావ్‌డోయ్ (Takao Doi) జపానుకు సంబంధించిన తొలి అంతరిక్ష పాదచారి అయ్యాడు. 1997వ సంవత్సరం నవంబర్ 25వ తారీఖున అతడు అంతరిక్షంలో నడిచాడు. ''ఎక్స్‌ట్రా వెహికులర్ ఆక్టివిటీస్ (EVA)ను అధ్యయనం చేయడం కోసం అతడు ఒక అమెరికన్‌తో కలసి కొలంబియా అంతరిక్షయానంను వదలి బయటకు వచ్చాడు. తొడుగులు తొడుక్కున్న చేతులతో తమ నియంత్రణలోని ఉపగ్రహాన్ని పట్టుకోవడంలో వీరు విజయాన్ని సాధించారు.

---

## ఇంగ్లాండుకు చెందిన అతి వయోవృద్ధుడు

*శ్రీ జార్జ్ కుక్ ఇంగ్లాండుకు చెందిన అతి వయోవృద్ధుడిగా భావించబడుతున్నాడు. ఇంగ్లాండులో ఉన్న సుర్రే (Surrey)లో ఓల్డ్ ఫోక్స్ హోమ్‌లో జార్జ్ తన 108వ ఏట 1997వ సంవత్సరం సెప్టెంబరు నెల 27వ తారీఖున మరణించాడు.*

''మీరు నిజాయితీపరులుగా ఉండండి. ఈ ప్రపంచంలోని జనాభా నుండీ ఒక దుర్మార్గుడి సంఖ్య తప్పక తగ్గిందన్న భావన మీకు కలుగుతుంది.''

– థామస్ కార్లైల్

## ప్రపంచ వారసత్వ రైల్వే




82 కిలోమీటర్ల పొడవున్న డార్జిలింగ్ హిమాలయన్ (Toy) రైల్వేను ప్రపంచ వారసత్వ పట్టీ (World Heritage Listings)లో ప్రపంచ వారసత్వ (World Heritage) రైల్వేగా చేర్చడమైనది. రెండు అడుగుల వెడల్పుగల (నారోగేజ్) ఈ రైల్వే మనదేశపు తొలి హిల్ రైల్వే (Hill railway) ఇది 1881లో ప్రారంభించ బడింది. ఈ రైలు 7,000 అడుగుల ఎత్తు వరకు ప్రయాణం చేస్తుంది.

## కంటివ్యాధిని కనుగొనే అతి చౌక సాధనం

అల్ట్రాసౌండ్ ఎ-స్కాన్ ఆప్తాల్మో స్కోప్ (Ultrasound A-Scan Opthalmoscope) అనే అద్భుతమైన చౌక సాధనాన్ని జాతీయ భౌతిక ప్రయోగశాల (National Physical Laboratory) న్యూఢిల్లీ లోని అఖిల భారత వైద్యవిజ్ఞాన సంస్థ (All India Institute of Medical Sciences) కలిసి సంయుక్తంగా తయారు చేసారు. ఈ సాధనం కంటికి సంబంధించిన అనేక రోగాలను, కంటిలోని నలుసునూ, గడ్డలనూ, రక్తస్రావాన్ని, రెటీనా కదలిపోవటాన్నీ, చత్వారాన్ని కనుగొనగలదు.

## ఇజ్రాయిల్ త్రవ్వకాలలో బయటపడిన ప్రాచీన ఎస్సెనెస్ గ్రామం

ఇజ్రాయిల్‌లోని టెల్ అవివ్ నగరానికి సమీపంలో ఉన్న బార్ ఇలన్ విశ్వవిద్యాలయం (Bar Ilan)కు చెందిన ఇజార్ హిర్షిఫెల్డ్ (Yizhar Hirshfeld) మహాశయుడు ప్రాచీన ఎస్సెనెస్ విభాగంకు చెందిన అతి ప్రాచీన గ్రామాన్ని కనుగొన్నాడు. ఇజ్రాయిల్ త్రవ్వకాలలో ఇంత

---

## 47 టెస్టులకు నాయకత్వం వహించిన గవాస్కర్

*మనదేశపు క్రికెట్ జట్టుకు 47 టెస్ట్ మాచీలలో సునీల్ గవాస్కర్ నాయకత్వం వహించాడు. నవాబ్ ఆఫ్ పటౌడీ (జూనియర్) 40 టెస్ట్‌లకు నాయకత్వం వహించాడు.*

"నీవు ఎంత గొప్ప పని చేస్తున్నావనేది ముఖ్యం కాదు. ఆ పనిని ఏ భావంతో చేస్తున్నావనేది ముఖ్యం."

వరకు వెలువడిన గ్రావనాలలో ఇది రెండవ గ్రామం. డెడ్‌సీకు ఎదురుగా ఇన్‌గ్యుడి (Einguedi) వద్ద ఉన్న ఈ గ్రావంంలో 22 రాతి కట్టడాలు ఉన్నాయి. ఈ గ్రామంను క్రీ.శ. ఒకటవ శతాబ్దానికి చెందినదిగా భావిస్తున్నారు.

## 21వ శతాబ్దపు విమానం

అటు భూమిపైన ఇటు నీళ్ళపైనా (Amphibious) వాడుకోగల విమానం 'యమల్' (Yamal)ను రష్యాలో అభివృద్ధి పరిచారు. ఈ విమానం 21వ శతాబ్దపు యంత్రం కానున్నది. ఇందులో ఇద్దరు చాలకులుంటారు. దీనిలో 18 మంది ప్రయాణీకులు ప్రయాణం చేయగలరు. 300-500 మీటర్ల వ్యత్యాసం గల జలాశయాల నుండీ ఇది ఎగురగలదు. అదేవిధంగా బాట బాగా వేయబడిన రోడ్డుపైన కూడా ఇది నడవగలదు. ఈ వాహనాన్ని చక్రాలపై కూడా బిగించ వచ్చును.

## చెత్త నుండి కలప

బ్రిటన్‌కు చెందిన సేవ్ ఉడ్ ప్రోడక్ట్ లిమిటెడ్ సంస్థ వారు డ్యూరాఉడ్ (Durawood) అన్న ఒక వస్తువును తయారు చేసారు. ఇది అటు కలప ఇటు ప్లాస్టిక్ గుణాల కలయిక లాంటిది. ఈ వస్తువు మళ్ళీ వాడబడిన పాలిస్టైరిన్, ప్యాకేజింగ్ వేస్ట్ (Recycled Polystyrene Packaging Waste) నుండీ దీనిని తయారు చేయడం జరిగింది. ఈ వస్తువు రూపు ఆకారం చెడకుండా చాలా సంవత్సరాలుండగలదు. దీనిని కాపాడేందుకు ఎలాంటి రక్షణ పదార్థాలను వాడవలసిన అవసరం ఉండదు. ●

## తొలి జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత




*మహాకవి జి. శంకర్ కురుప్ జ్ఞానపీఠ్ అవార్డును గెలుచుకున్న తొలి వ్యక్తి. ఒడకుళల్ (పిల్లనగ్రోవి) అన్న పేరుతో వెలువడిన కవితా సంకలనానికి గాను ఇతడు మనదేశపు అత్యున్నత సాహిత్య అవార్డును- 1965వ సంవత్సరంలో -అందుకున్నాడు.*

"భగవంతుణ్ణి నీ కుడిచేతిలో పెట్టుకో. ఎడమచేతితో ప్రపంచాన్ని పట్టుకో."

# వేమన వేదం

తాత్పర్యరచన : ఎం.వి.ఎస్. సుబ్రహ్మణ్యం

హీనుడెన్ని విద్యలిల నభ్యసించిన
ఘనుడుగాడు మొఱకు జనుడెగాని
పరిమళములు గర్దభము మోయ ఘనమౌనె
విశ్వదాభిరామ! వినురవేమ!



(ఎంతటి ఉన్నత విద్యావంతుడైనా, బహుగ్రంథ పారంగతుడైనా మూర్ఖుడు ఎప్పటికీ గొప్పవాడు కాలేడు. సుగంధ పరిమళ ద్రవ్యాలను మోసినంత మాత్రాన గాడిద గొప్పదౌతుందా? గాడిద గాడిదే. మూర్ఖుడు మూర్ఖుడే. వారిలో మార్పు రాదు.)

ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణములు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా!



(సంపదలు పెరిగే కొద్దీ గర్వం ఎక్కువౌతుంది. గర్వం పెరిగిన కొద్దీ దుర్గుణాలు తప్పనిసరిగా పెరుగుతాయి. సంపదలు తరిగితే గర్వం తనంతట తానే తరుగుతుంది. గర్వం తగ్గిన నాడు దుర్గుణాలు కూడా తగ్గిపోతాయి. దీని భావం ధనవంతులందరికీ గర్వం పెరిగి, దుర్గుణాలు పెరుగుతాయని కాదు. ధనమే దుర్గుణాలకు మూలకారణమని గ్రహించండి.)

"కలిమి బలిమి భగవంతుణ్ణి మరపింపచేస్తాయి. కష్టము, నష్టము భగవంతుడిని స్మరింపచేస్తాయి."

# ధైర్యం అలవరుచుకోండి

క్రింద కనబరచిన మార్గాలను అనుసరించి ధైర్యాన్ని అలవర్చుకోండి.

★ మీ తప్పులను సరిదిద్దినప్పుడు వాటిని పూర్తి ఉత్సాహంతో స్వీకరించండి.



★ దుర్బలతనూ, బలహీనతనూ అధిగమించండి.

★ విమర్శకూ, మోటు నిర్ణయానికీ అతీతంగా ఉండండి.

★ భయ భావాన్ని ప్రతిఘటించండి.

★ మీ తప్పులను ఒప్పుకోండి.

★ కొత్త కొత్త సవాళ్ళను ఎదుర్కొంటూ బాధ్యతలను భుజంపై వేసుకోండి.

★ భగవంతుడి పట్ల విశ్వాసాన్ని, నమ్మకాన్ని కలిగి ఉండండి. తిరుగులేని శ్రద్ధాభావాన్ని కలిగి ఉండండి.

★ జీవితపు వాస్తవాలను సేకరిస్తూ మీ హద్దులను తెలుసుకుని వ్యవహరించండి.

★ అపజయాలు జయాలకు సోపానాలు అన్న పాఠాన్ని స్వీకరించండి.

★ కష్టాలను సహించండి, ప్రమాదాలనూ, అనుకోని సంఘటనలనూ, సహనంతో శాంతంగా స్వీకరించండి.

★ చెడు ప్రభావాలను ప్రతిఘటించండి.

★ మీ ఆశయాలను నిర్భయంగా పాటిస్తూ మీ సిద్ధాంతాల ప్రకారం నడుచుకోండి.

★ చెడ్డపేరు వస్తుందన్న విషయం తెలిసి కూడా నిజాన్ని నిర్భయంగా చెప్పండి.

★ సాంఘిక దురాచారాలకు విరుద్ధంగా పోరాడండి.

★ ప్రత్యేక హక్కులు తక్కువగా ఉన్న వారి హక్కుల కోసం పోరాడండి.

– డా. ఎస్.ఐ. ఇగ్నిసిముత్తుగారి 'వేల్యూస్ ఫర్ లైఫ్' పుస్తకం నుండి

(ఇనిస్పిరేషనల్ కోట్)

'పనితోపాటు అంతరంగిక క్రమశిక్షణ ద్వారానే మనిషి సంతృప్తిని, ఆనందాన్ని పొందుతాడు.''
– సర్దార్ కే.ఎం. పణిక్కర్

# చెషైర్ శరణాలయాలు

చెషైర్ శరణాలయాలను (Cheshire Homes) లియోనార్డ్ చెషైర్ (Leonard Cheshire) 1948వ సంవత్సరంలో స్థాపించాడు. ఈ రోజు నయంకాలేని రోగాలకు గురైన వారికీ, వికలాంగులకూ ఆశ్రయాన్ని కల్పించే ప్రపంచ సంస్థగా



Leonard Cheshire

అది అభివృద్ధి పొందింది. శారీరక అంగపరమైన లోపాలు గల వారికి నివాసయోగ్యమైన వసతిని కల్పించడం వారి లక్ష్యం. తమ కాళ్ళపై తాము నిలబడుతూ సమాజానికి వారు చేయగలిగిన సేవ చేయడానికి అవకాశాల్ని కల్పించడం కూడా వారి ధ్యేయం. వారి వారి అవసరాలను బట్టి అంగలోపం గల వ్యక్తులు ఇందులో జాతి కుల మత హోదాల సంబంధం లేకుండా చేర్చుకోబడతారు. ఇందులో నివసించే వారికి తమ తమ మతాలను అవలంభించే స్వాతంత్ర్యం ఉంటుంది. యునైటెడ్ కింగ్డంలో ఈ తరహా శరణాలయాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. దాని తరువాతి స్థానంలో భారతదేశం ఉంది. ప్రతి శరణాలయాన్ని ఒక స్థానిక కమిటీ నడుపుతుంది. స్వతంత్ర ప్రతిపత్తిగల ఈ స్థానిక కమిటీ ఈ శరణాలయాన్ని సక్రమంగా నడిపేందుకు కావల్సిన ఆర్థిక వనరులను ఏర్పాటు చేస్తుంది. ●

---

## అభివృద్ధి చెందుతున్న దేశాలలో తరుగుతున్న అరణ్యాలు

*ప్రపంచపు అరణ్యాలలో 48 శాతం అడవులు ఉష్ణప్రాంతాలలో ఉన్నాయి. ఉష్ణప్రాంతాలలో లేదా ఉష్ణప్రాంతాలుకాని ప్రాంతాలలో అభివృద్ధి చెందుతున్న దేశాల అడవులు తగ్గిపోతున్నాయి. ఫిలిప్పైన్స్‌లో అడవులు మరో 30 సంవత్సరాల పాటు ఉంటాయి. అడవులు ఆఫ్ఘనిస్థాన్‌లో 16 సంవత్సరాల వరకూ లెబనాన్‌లో 15 సంవత్సరాల వరకు మాత్రం ఉంటాయి.*

*(– యునెస్కో సౌజన్యంతో)*

''నిజం చెప్పండి. నీతిని పాటించండి. పవిత్ర గ్రంథాలను చదవండి తల్లితండ్రులనూ, అధ్యాపకులనూ, అతిథులనూ గౌరవించండి.'' – తైత్తరీయ

# నేను మాట్లాడుతున్నప్పుడు భారతదేశం మాట్లాడుతున్నట్లు అనిపిస్తుంది

భారతదేశపు భూమి నా శరీరం.

కన్యాకుమారి నా పాదాలు, హిమాలయాలు నా శిరస్సు.




నా శిరోజాల నుండి గంగ ప్రవహిస్తుంది. నా శిరస్సు బ్రహ్మపుత్రకు ప్రారంభ స్థానం.

వింధ్యాచలాలు నా నడుముకు చుట్టబడిన వడ్డాణం.

ఆగ్నేయ కోస్తా ప్రాంతం నా ఎడమ కాలు –మలబారు నా కుడి కాలు.

నేనే సమస్త భారతదేశం. తూర్పు పడమరలు నా రెండు చేతులు. మానవాళిని నా బాహుబంధాలతో బంధించడానికి నేను వాటిని సరళరేఖ లాగా చాచుతాను.

నా ప్రేమ విశ్వజనీనమైనది.

ఓహ్! ఇదే నా అందమైన శరీరం.

అది నిటారుగా నిలబడి అనంత ఆకాశంలోకి చూస్తోంది కానీ నా అంతరంగ స్ఫూర్తే అన్నింటికీ ఆత్మలాంటిది.

నేను నడుస్తున్నప్పుడు నా దేశం నడుస్తున్న భావన కలుగుతుంది.

నేను మాట్లాడుతున్నప్పుడు నా దేశం మాట్లాడుతున్న భావన కలుగుతుంది.

నేను శ్వాస తీసుకున్నప్పుడు నా దేశం శ్వాస తీసుకుంటుందన్నట్లు అనిపిస్తుంది.

నేనే భారతదేశాన్ని.

ఇదే దేశభక్తిపరమైన ఉత్తమ భావన.

– స్వామీ రామతీర్థ

---

## భారతదేశపు తొలి పత్తిమిల్లు

ఇప్పుడు ముంబాయిగా పిలువబడుతున్న బొంబాయి నగరంలో 1850వ సంవత్సరంలో భారతదేశపు తొలి పత్తి మిల్లు ప్రారంభించబడింది.

"గెలవగలనన్న నమ్మకంగలవాడే గెలుస్తాడు." – జాన్ డ్రైడెన్

# సుప్రసిద్ధ ఖగోళ భౌతిక శాస్త్రవేత్త

## • జయంత్ విష్ణు నార్లేకర్

సుప్రసిద్ధ ఖగోళ భౌతిక శాస్త్రవేత్త (astrophysicist) జయంత్ విష్ణు నార్లేకర్ ప్రఖ్యాత గణితశాస్త్రవేత్తతోపాటు ఖగోళశాస్త్రజ్ఞుడైన విష్ణువాసుదేవ నార్లేకర్ కొడుకు. అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసే థియరీ




ఆఫ్ క్వాసర్స్ (Theory of Quasars) ఆధారంగా ప్రపంచదృష్టిని ఇతడు తన వైపుకు ఆకర్షించుకున్నాడు. ఈ సిద్ధాంతాన్ని అతడు గణితశాస్త్ర లెక్కల ఆధారంతో నిరూపించాడు.

1963వ సంవత్సరంలో రాయల్ అస్ట్రనామికల్ సొసైటీ సభ్యుడిగా ఎన్నికయ్యాడు. గణిత శాస్త్రానికి, ఖగోళ భౌతిక శాస్త్రానికి సంబంధించిన శాఖలలో గణనీయమైన సేవ చేసినందుకు 1965వ సంవత్సరంలో ఇతడిని ప్రభుత్వం పద్మభూషణ్‌తో సత్కరించింది. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం వారి ప్రతిష్ఠాత్మక అవార్డైన ఆడమ్స్ ప్రైజును 1967వ సంవత్సరంలో గెలుచుకున్నాడు. అదే సంవత్సరం అతడు తన డాక్టరేట్ పట్టాను కూడా పొందాడు. విజ్ఞాన శాస్త్ర ప్రచారానికి తోడ్పడినందుకుగాను. యునెస్కో అవార్డును కూడా గెలుచుకున్నాడు.

(యునెస్కో సౌజన్యంతో)

●

## మన దగ్గరిలో ఉన్న కర్తవ్య నిర్వహణ

*మనకు చాలా దగ్గరిలో ఉన్న, మనకు అందుబాటులో ఉన్న కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించడం వల్ల మనం బలశాలులం అవుతాము. ఈ విధంగా మెట్లు మెట్లుగా మన బలాన్ని అభివృద్ధి చేసుకుంటూ పోతే అటు జీవితానికీ, ఇటు సంఘానికి పనికివచ్చే మనం ఎక్కువగా అభిలషించే గౌరవప్రదమైన కర్తవ్యాలను నిర్వహించగల ప్రత్యేక అధికారాన్ని పొందగల స్థితిలో ఉండగలము.*

– స్వామీ వివేకానంద

''ఒక గొప్ప జాతిగా మారాలనుకున్న దేశప్రజలకు సామూహిక క్రమశిక్షణ అన్నది అత్యావశ్యకమైన నిబంధన.''
– మహాత్మాగాంధీ

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

దక్షిణ గంగోత్రి ఎక్కడుంది?
(ఎ) అంటార్కిటికాలోని ఒక ప్రాంతం (బి) గంగానది ఉద్భవ స్థానం (సి) చంద్రుడి ఉపరితలం పైని ఒక ప్రాంతం (డి) కేరళలోని ఒక చిన్న ఊరు.

ఏనుగుకాలు వ్యాధి (Filaria) దేని కారణంగా వ్యాపిస్తుంది?
(ఎ) సాండ్‌ఫ్లై (Sandfly) (బి) ఈగ (సి) దోమ (డి) ఇవేవికావు.

ఎక్కువ పీడన (High Pressure) సోడియం వేపర్ లాంపులను వీధిదీపాలుగా ఎందుకు వాడుతారు?
(ఎ) ఎక్కువ కాంతి సాంద్రత (High Light intensity) కారణంగా (బి) తక్కువ ఖర్చుతో కూడుకున్న కారణంగా (సి) అమర్చడం చాలా సులభం కావడం వల్ల (డి) తెల్లటి కాంతి కంటే కూడా పసుపు పచ్చ రంగు కాంతి మంచును లేదా పొగ మంచును తక్కువగా గ్రహిస్తుంది కాబట్టి.

4. స్విట్జర్లాండ్ కరెన్సీను ఏ పేరుతో పిలుస్తారు?
(ఎ) పౌండ్ (బి) రూబుల్ (సి) ఫ్రాంక్ (డి) క్రోనె (Krone)

5 ''షటిల్ (Shuttle) డిప్లొమసీ'' అనే మాట ఎవరి పేరుతో ముడిపడి ఉంది?
(ఎ) జి.పి. కోయిరాలా (బి) హెన్రీ కీసింగర్ (సి) అటల్ బిహారి వాజ్‌పాయి (డి) యాసర్ అరాఫత్.

6. లేత ఎండ ద్వారా మనకు లభిస్తున్న విటమిన్ ఏది?
(ఎ) ఎ (బి) బి (సి) సి (డి) డి (ఈ) ఈ.

7. డియాగోగార్సియా (Diegogarcia) దీవులు ఎక్కడున్నాయి?
(ఎ) హిందూమహాసముద్రంలోని మెడగాస్కర్ దీవి వద్ద (బి) హిందూ

మహాసముద్రంలోని మెురీషియస్ దీవికి దక్షిణ ప్రాంతంలో (సి) హిందూమహాసముద్రంలో సీచెల్స్ (Seychelles)కు తూర్పు భాగంలో (డి) అరేబియా సముద్రంలోని లక్ష దీవుల వద్ద.

8. రోడ్డు నిర్మాణం పనులలో నిమగ్న మైన కార్మికుడికి ఒక రోజుకు ఎన్ని కేలరీల అవసరం ఉంటుంది?
(ఎ) 5,000 (బి) 3,600 (సి) 3,100 (డి) 2,500.

9. ఏ దేశ సహకారంతో పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని దుర్గాపూర్ ఉక్కు (స్టీలు) కర్మాగారం నెలకొల్ప బడింది?
(ఎ) యునైటెడ్ కింగ్‌డమ్ (బి) యు.ఎస్.ఎ (సి) పాత సోవియెట్ యూనియన్ (డి) జర్మనీ.

## మాటలమహిమ

1. ఒద్దిది: (ఎ) సమీపముగా నున్నది (బి) అనుకూల్యం (సి) సమృద్ధి (డి) విస్తారం.
2. కుతిలి: (ఎ) కుటిలమైన (బి) కంఠము (సి) బాధ (డి) వేడుక.
3. గజత: (ఎ) వెండి (బి) సంఖ్యావిశేషం (సి) విసనకర్ర (డి) గజసమూహము.
4. చాలని: (ఎ) సరిపోని (బి) జల్లిం చెడు జల్లెడ (సి) చురుకైనది (డి) పాలపిట్ట.
5. జవము: (ఎ) యవ్వనం (బి) తెర (సి) బలత్కారం (డి) వడి.
6. డిగియ: (ఎ) అగ్నికణము (బి) నడ బావి (సి) ఎడమ (డి) సమీపించు.
7. నొగులు: (ఎ) దుఃఖము (బి) నిమ్మ రత (సి) ఒకరకమైన చెట్టు (డి) మత్తిపండు.
8. పృథువు: (ఎ) రాజు (బి) పెద్ద భూభాగం (సి) ఇంగువమ్రాను (డి) వెనుక భాగం.

## తెలివికి పరీక్ష

1. గిగావాట్స్ (Gigawatts)లో ఎన్ని మిల్లి యన్ వాట్స్ (Watts) ఉంటాయి?
2. మన సౌరమండలం (Solar System)లోని అతి చిన్న గ్రహం పేరేమి?
3. ఆఫ్రికాలోని అత్యంత దక్షిణం వైపు ఉన్న అగ్రం ఏది?
4. పోమికల్చర్ (Pomiculture) అంటే ఏమి?
5. పెడాలజి (Pedology) ఏ శాస్త్ర అధ్యయనాన్ని తెలియజేస్తుంది?

(జవాబులకు 47వ పేజీ చూడండి)

''పరిపూర్ణమైన మనసుతో కలిసి పనిచేయాలన్న విషయాన్నే జీవితం తెలియజేస్తుంది. మనస్సు ఏకాగ్రతతో పనిచేసినప్పుడే ఏ విషయంపైన అయినా మనసును లగ్నం చేయడం కుదురుతుంది.''
– విల్లియం జేమ్స్

# రంగం ఏదైనా గొప్పగా రాణించండి

కొండపైని దేవదారు వృక్షం కాకపోయినా లోయలోని పొద (Scrub)లా – నదీ తీరంలోని మంచి చిన్న పొదగా– ఉండు.



చెట్టు కాలేకపోయినా గుబురుపొదలా ఉండు. గుబురు పొద కాలేకపోయినా ఫరవాలేదు గడ్డిపోచగా ఉండు.

ఏపుగా పెరిగి దారిన పోయేం వారిని ఆహ్లాదపరచు. మనమందరం నాయకులం కాలేము. మనం సిబ్బందిగా ఉందాం.

మనందరికి ఇక్కడ చేయవలసిన పని ఏదో ఒకటుంది.

చేయడానికి అటు పెద్ద పనీ ఉంది. ఇటు చిన్న పని కూడా ఉంది.

మనం నిర్వహించవలసిన బాధ్యతలు దగ్గర్లో ఉంటాయి.

నీవు రాచబాట కాకపోతే అప్పుడు ఇతరులకు బాటగా ఉండు.

సూర్యుడుగా ప్రకాశించకపోయినా నక్షత్రంగా ఉండు. జయాపజయాలు ఆకారంపై ఆధారపడి ఉండవు.

అందుకే రంగం ఏదైనా అందులో చక్కగా రాణించు. – డగ్లస్ మల్లోచ్

## సెల్యులర్ ఫోనుల వాడకం దారులు

*సెల్యులర్ ఫోనుల వాడకం దారుల జాబితాలో అమెరికా సంయుక్త రాష్ట్రాల పేరు మొదట్లో నమోదైంది. ఈ దేశంలో 32.5 మిలియన్ల వాడకందార్లు ఉన్నారు. ఆ తరువాతి తొమ్మిది దేశాల పేర్లు వరుసలో ఇలా ఉన్నాయి. జపాను (8.5 మిలియన్లు), బ్రిటన్ (5.46 మిలియన్లు), ఇటలీ (4 మిలియన్లు), జర్మనీ (3.71 మిలియన్లు), చైనా (2.5 మిలియన్లు), ఆస్ట్రేలియా (2.3 మిలియన్లు), కెనడా (2.1 మిలియన్లు), స్వీడన్ (2 మిలియన్లు), రిపబ్లిక్ ఆఫ్ కొరియా (దక్షిణ కొరియా) 1.65 మిలియన్లు)*

– కొరియన్ న్యూస్

''మంచి మిత్రుడిగా ఉండడమే మంచి మిత్రుడిని కలిగి ఉండడానికి కావలసిన ఏకైక గుణం.''
– ఎమర్సన్

# యోగ్యులైన నాయకుల గుణగణాలు

డా. పి. ఎస్. శర్మ

★ పక్షపాత రహితమైన వారిగానూ, సహకార గుణంగల వారిగానూ, నిజాయితీ పరులుగానూ, భావనాశక్తిగల వారిగానూ ఉండాలి.

★ చెప్పిన దాన్నే చేసే వ్యక్తులు అయి ఉండాలి.



★ తమ చుట్టూ ఉన్న ప్రజల కోరికల మేరకు నిలకడగల చర్యలు చేపట్టే వారు అయి ఉండాలి.

★ ఇతరుల స్వాభావిక యోగ్యతలను నమ్మేవారిగా ఉండాలి.

★ ఆయా విషయాలతో సంబంధం ఉన్న ప్రతివారికి తమ భావాలను చక్కగా తెలియజేసే వారిగా ఉండాలి.

★ వ్యక్తుల జీవితాలలో మార్పులను తీసుకురాగల సామర్థ్యాన్ని కలిగి ఉండాలి.

★ తమ తప్పులను ఒప్పుకుంటూ ముందు ముందు అలాంటి తప్పులు జరగవని హామీ ఇవ్వగల వారిగా ఉండాలి.

★ తమ ప్రజలలో ఆశావాద తత్త్వాన్ని సక్రమ ఆలోచనల్ని రేకెత్తించే వారిగా ఉండాలి.

★ నమ్మకం, నిర్మోహమాటంతో కూడిన వాతావరణాన్ని నిర్మించగలిగే వారిగా ఉండాలి.

## ప్రపంచపు అతి దృఢమైన చెట్టు

*దక్షిణ అమెరికా దేశపు అతి ధృఢమైన చెట్టు ఓంబు (Ombu) చెట్టును ప్రపంచపు అతి ధృఢమైన చెట్టుగా భావిస్తున్నారు. అన్ని రకాల నీళ్ళను ఇది గ్రహిస్తుంది. ప్రమాదకరమైన క్రిమికీటకాదులు - చెదల లాంటివి - దీన్ని ముట్టడించినా ఇది బ్రతకగలదు. తుపాను గాలులనూ, ఎండవానలను ఇది తట్టుకోగలదు. ఈ చెట్టు చెక్క తేమతో కూడి ఉండడం వల్ల ఇది మండదు. దీని బోదె అతి మెత్తగానూ, తడిగానూ ఉండడం వల్ల ఈ చెట్టును కొట్టివేయడం జరగదు.*

"కష్టాలను అరువు తెచ్చుకునేవారు కట్టే వడ్డీనే చింత అంటారు."
— జార్జ్ వాషింగ్టన్ లెఆన్

# ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించాలన్న గాంధీగారి సంకల్పం

అందరిచే ద్వేషించబడిన ఉప్పు చట్టాన్ని ఉపసంహరించడానికి లార్డ్




ఇర్విన్ నిరాకరించడం వల్ల ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించాలన్న సంకల్పం గాంధీగారికి కలిగింది. తన సబర్మతి ఆశ్రమంలో 78 మంది సభ్యులు కూడా రాగా 1930వ సంవత్సరం మార్చి నెల 12వ తారీఖున బాపూజీ అహమ్మదాబాద్ నుండి గుజరాత్ కోస్తా ప్రాంతంలోని దండి గ్రామానికి ప్రయాణం అయ్యారు. 24 రోజుల తరువాత వారు ఆ గ్రామాన్ని ఏప్రిల్ నెల 5వ తారీఖున చేరారు. ప్రయాణ మార్గంలో వేలాదిప్రజలు గాంధీగారిని అనుసరించారు. పాల్గొన్న వారి సంఖ్య ఉప్పెనలా పొంగింది. ఏప్రిల్ 6వ తారీఖున పిడికెడు ఉప్పును చేత్తో తీసుకుని లాంఛనప్రాయంగా బ్రిటిష్ వారిని ధిక్కరించారు.

ఆ రోజూ, ఆ తరువాత ప్రతిరోజూ - ఇలా కొన్ని వారాలపాటు ఉప్పుచట్టాన్ని ధిక్కరించడం జరిగింది. చేతిలో ఎటువంటి ఆయుధం లేని సత్యాగ్రహంపై బ్రిటిష్‌వారు లాఠీ ఛార్జీ జరిపించారు. 60,000 మంది అరెస్ట్ కాబడ్డారు. చాలామంది ప్రాణాలను పోగొట్టుకున్నారు.

- "పార్థ" సౌజన్యంతో

## ఆస్ట్రేలియాపై తొలి విజయం

*1959-60 ప్రాంతంలో కాన్పూర్‌లో జరిగిన టెస్ట్‌మాచ్‌లో ఆస్ట్రేలియా జట్టుపై భారత జట్టు తొలిసారిగా విజయం సాధించింది. భారతజట్టుకు శ్రీ జి.ఎస్. రాంచంద్ నాయకత్వం వహించాడు. ఈ టెస్ట్ మాచ్‌లో భారత దేశపు 'ఆఫ్ స్పిన్నర్' శ్రీ జసు పటేల్ మొత్తం 14 వికెట్లను (తొలి ఇన్నింగ్స్‌లో 9, రెండవ ఇన్నింగ్స్‌లో 5) పడగొట్టాడు.*

"తీసుకోవడం కంటే ఇవ్వడంలోనే గొప్పతనం ఉంది."

# ఈ శతాబంలో

## ఎక్కడా ఆగకుండా ఒంటరిగా ప్రయాణం చేసిన తొలి విమాన చోదకుడు



Charles A.Lindbergh

విమాన చోదకులలో అగ్రగణ్యుడిగా పరిగణింపబడుతున్న చార్లెస్ లిండ్‌బెర్గ్ (Charles Lindbergh) అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఎక్కడా ఆగకుండా ఒంటరిగా ప్రయాణం చేస్తూ దాటాడు. ఈ సంఘటన తొలిసారిగా 1927వ సంవత్సరం ఫిబ్రవరి నెల 4వ తారీఖున జరిగింది.

## చంద్రుడిపై చోదకులు లేని అంతరిక్షయానం

భూమిచుట్టూ తిరిగే దివ్యగ్రహం చంద్రుడికి దగ్గరగా జరగగల చోదకులు లేని ఒక అంతరిక్షయానాన్ని - లూనా - 1 సోవియట్ యూనియన్ అంతరిక్షంలోకి 1959వ సంవత్సరం జనవరి రెండవ తారీఖున పంపింది.

## భారతీయ సేవకుల సంఘం

భారతీయ సేవకుల సంఘాన్ని (The Servants of India Society) శ్రీ గోపాల కృష్ణ గోఖలేగారు 1905వ సంవత్సరంలో స్థాపించారు. జాతీయ రాజనీతితో సహా ఈ సంఘం అనేక సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొంది.

## విమానం ద్వారా అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటిన తొలి మహిళ

అమెరికాకు చెందిన మహిళా విమాన చోదకురాలు అమిలియా ఎర్‌హర్ట్

---

## 300,000 ఎక్స్‌ట్రాలు పాల్గొన్న దృశ్యం

*సర్ రిచర్డ్ అట్టెన్‌బరో దర్శకత్వం వహించిన "గాంధీ" చిత్రంలోని శవయాత్ర దృశ్యంలో 300,000లకు మించిన ఎక్‌స్ట్రాలు పాల్గొన్నారు.*

"ఆరోగ్యం శ్రమపైనే ఆధారపడి ఉంటుంది. ఆరోగ్యంగా ఉండడానికి కష్టపడి పని చేయడానికి మించిన రాజమార్గం వేరొకటి లేదు." - డబ్ల్యు. ఫిలిప్స్

(Amelia Earhart) అట్లాంటిక్ మహాసము ద్రాన్ని విమానయానం ద్వారా దాటిన తొలి మహిళ. లాక్‌హీడ్ వెగా (Lockheed Vega) విమానంను నడుపుతూ 1928వ సంవత్సరం జూన్ నెల 17వ తారీఖున కెనడాలోని న్యూఫౌండ్‌లాండ్ (New foundland) వద్ద తన ప్రయాణాన్ని ప్రారంభించి బ్రిటన్‌లోని వేల్స్‌కు చెందిన బర్రీ పాయింట్ (Burry Point)ను చేరింది. 1937వ సంవత్సరం పసిఫిక్ మహాసముద్రంపై విమాన ప్రయాణం చేస్తు న్నప్పుడు ఈమె జాడ తెలియకుండా తప్పిపోయింది.

## 1924లో ప్రారంభమైన ప్రసారణ సేవలు

మద్రాసు ప్రెసిడెన్సీ రేడియో క్లబ్ వారి చెప్పుకోదగ్గ ప్రయత్నాల ఫలితంగా ఇండియా బ్రాడ్‌కాస్టింగ్ సేవలు 1924వ సంవత్సరంలో ప్రారంభమ య్యాయి. సరిగ్గా ఆ సమయంలోని ఆనాటి లాహోర్ (ప్రస్తుతం ఈ నగరం పాకిస్తాన్‌లో ఉంది)లోని యంగ్‌మెన్స్ క్రిస్టి యన్ అసోసియేషన్ వారు కూడా గట్టి ప్రయత్నాలను చేసారు. ఇండియన్ స్టేట్ బ్రాడ్‌కాస్టింగ్ సర్వీసు పేరుతో ప్రారంభ మైన ఈ సంస్థ పేరును 1936వ సంవత్సరంలో ఆల్‌ఇండియా రేడియోగా మార్చారు. 1950వ సంవత్సరంలో దీని పేరు ఆకాశవాణిగా మారింది.

– యోజన

## మనదేశానికి ఆవలనున్న అతి పెద్ద దేవాలయం



**Swaminarayan temple near Neasden in London**

*ఇంగ్లాండులో లండన్ నగర పరిసర ప్రాంతమైన నీస్‌డెన్ (Neasden)లోని స్వామి నారాయణ ఆలయం మన దేశానికి ఆవలనున్న దేవాలయాలలో అతి పెద్దది. ఈ దేవాలయం 1.5 ఎకరాల ప్రదేశంలో విస్త రించి ఉంది. దీని ఎత్తు 70 అడుగులు, వెడల్పు 75 అడుగులు. స్తంభాలు లేని ప్రధాన ప్రార్థనా మందిరంలో 4,000 మంది ప్రజలు కూర్చోవచ్చును. ఈ దేవా లయం 1995వ సంవత్సరం ఆగస్టు నెలలో తెరువబడింది.*

"రంగం ఏదైనా కానివ్వండి గెలుపుకు కావల్సింది మిత్రుల పట్ల, కొన్ని ప్రాథమిక సిద్ధాంతాల పట్ల విశ్వాసమే."

– సర్దార్ కె.యం. పణిక్కర్

## తొలి టాకీ సినిమాలు

1928వ సంవత్సరంలో తొలి టాకీ సినిమాలు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నిర్మించబడ్డాయి. అల్ జోల్సన్ (AL Jolson) నటించిన 'ది జాజ్ సింగర్' (The Jazz Singer) చిత్రం అక్కడ నిర్మించబడిన తొలి టాకీ చిత్రం.

## మానవాళి పాలిటి కుప్పించిన గెంతు




"మనిషికి ఇది ఒక చిన్న అడుగే, కానీ మానవాళి పాలిటి కుప్పించిన గెంతు." ఈ మాటలు చంద్రుడు ఉపరితలంపై తొలిసారిగా కాలిడిన కల్నల్ నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ (Colonel Neil Armstrong) అన్నాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన వ్యోమగామి 1969వ సంవత్సరం జూలై నెల 20వ తారీఖున చంద్రుడి ఉపరితలంపై కాలు పెట్టాడు.

## చంద్రుడిపై పంపబడిన తొలి రిమోట్ కంట్రోల్ యంత్రం

సుదూర కేంద్రం నుండీ నడపబడే యంత్రాన్ని రిమోట్ కంట్రోల్డ్ యంత్రం అంటారు. లునోఖోడ్ –1 (Lunokhod-I) అనబడే సుదూర ప్రాంతం నుండీ మీటల ద్వారా నడపబడే యంత్రం చంద్రుడి చుట్టూ పరిభ్రమించింది. 1970వ సంవత్సరం నవంబర్ నెల 17వ తారీఖున సోవియెట్ యూనియన్ వారిచే పంపబడిన ఈ వాహనం చంద్రుడి ఉపరితలంపై దిగింది. ●

---

## తొలి పరుగుపందెం విజేత

*గ్రీసుదేశపు ప్రాచీన ఒలింపిక్ క్రీడలలో ట్రాక్ అండ్ ఫీల్డ్ పరుగుపందాలలో గెలుపొందిన క్రీడాకారులను ప్రత్యేకమైన బహుమతులతో సత్కరించేవారు. వారి శిలా విగ్రహాలను ప్రతిష్ఠించేవారు. కుండలపైన, పూలకుండీలపై వారి బొమ్మలను చిత్రించేవారు. ప్రాచీన ఒలింపిక్ క్రీడలలో ఎలిస్ (Elis) రాష్ట్రానికి చెందిన కొరిబోస్ (Coribos) తొలి పరుగుపందాన్ని గెలిచాడు.*

"భగవంతుడి పట్ల మనకున్న ప్రేమను వ్యక్తం చేయడానికి భగవంతుడి సృష్టిని ప్రేమించాల్సి ఉంటుంది."

# అనేకరోగాలకు కారణమైన ఒత్తిడి

యేల్ విశ్వవిద్యాలయానికి చెందిన ఇద్దరు మనస్తత్వ శాస్త్రజ్ఞులు, మనల్ని పట్టి పీడిస్తున్న రోగాలకు చాలావరకు కారణం ఒత్తిడే అన్న నిర్ణయానికి వచ్చారు. దీర్ఘ కాలం వరకు కొనసాగే ఒతిడి కారణం



గానే మనుషులు ఆస్తమాకూ, చక్కెర వ్యాధికీ, కడుపులోని పుండ్లకూ, పెద్ద ప్రేగుల వ్రణాలకూ (Ulcerative Colitis), ప్రేగుల వాపు వ్యాధి (Inflammatory bowel disease)కీ, రక్తనాళాలు గట్టిపడే వ్యాధి (atherosclerosis)కీ, గుండె పోటుకూ, పుట్టకురుపు వ్యాధికీ, సామాన్య మైన జలుబులాంటి వ్యాధులకూ గురి అవుతున్నారని నమ్ముతున్నారు. భరించరా నంతటి ఒతిడి కొనసాగడం కారణంగానే ఈ వ్యాధులు వ్యాపిస్తున్నాయని పరిశోధ కులు చెబుతున్నారు. అందుకే వారం రోజులు పనిచేసిన తరువాతగానీ, చాలా ఒత్తిడితో పనిచేసిన తరువాత విశ్రాంతి తీసుకుంటున్న సమయంలోగానీ జలుబు చేయడం లేదా ఇతర వ్యాధులు సంక్ర మించడం జరుగుతోంది. డాక్టర్లు ఒత్తి డితో గురి అయిన వ్యక్తులకు అవసరమైన నైపుణ్యాన్ని - వ్యాయామం చేయడం విశ్రమించడం- నేర్పాలని మనస్తత్వ శాస్త్రజ్ఞులు అంటున్నారు

\- హెల్

## టెస్ట్‌మాచ్‌లలో వరుసగా చేయబడిన అతి ఎక్కువ మెయిడన్ ఓవర్లు

*1963-64వ సంవత్సరంలో చెన్నైలోని కార్పొరేషన్ స్టేడియంలో భారతజట్టుకూ, ఇంగ్లాండు జట్టుకూ మధ్య టెస్ట్ పోటీ జరి గింది. అందులోని ఒక ఇన్నింగ్స్‌లో భార తీయ బౌలర్ ఆర్.జి. నడ్‌కర్ణి వరుసగా 21.5 ఓవర్లను లేదా 131 బంతులను, మెయిడన్ (Maiden) ఓవర్లుగా వేసి టెస్ట్ క్రికెట్ చరిత్రలో రికార్డును సృష్టించాడు.*

''విద్యార్థి పూలతో నింపబడే పూలకుండి కాదు. వెలిగించాల్సిన మైనం వత్తి.''

# నా తీర్మానాలు

**నేను నవ్వుతూ ఆనందంగా ఉంటాను:** నన్ను దుఃఖానికి గురి చేసి, నా చెంత నుండే వారిని బాధకూ, నిరాశకూ గురి చేసే చిన్న చిన్న విషయాలు చీకాకు పరచకుండా చూసుకుంటాను.



**నేను ఆలోచనాపరుడినవుతాను:** జాగ్రత్తగా ఉంటూ ఆడిన మాటల వల్ల ఇతరులను బాధపెట్టే మాటలను పలుకకుండా నా నాలుకను నా అదుపులో పెట్టుకునేలా చూస్తాను.

**నేను నేనుగా ఉంటాను:** ఇతరుల దుస్తులనూ, ఇతరుల వ్యక్తిత్వాన్నీ ప్రశంసించినంత మాత్రాన నేను మరొకరిని అనుకరించను.

**ఇతరులలో మంచిని నేను వెతుకుతాను:** ఈ ప్రపంచంలో ఏ ఒక్కరూ పరిపూర్ణులు కారు. అదేవిధంగా బాగా చేయలేనంత చెడ్డవాడు కూడా కాదు. ప్రతి ఒక్కరిలో ఏదో ఒక మంచి గుణం ఉంటుంది. ఆ మంచిని కనుగొనే కళను నేను నేర్చుకుంటాను.

**నేను నవ్వును అలవర్చుకుంటాను:** ఇతరులను చూసి కాదు. నన్ను నేనే చూసుకుని నవ్వే అలవాటును చేసుకుంటాను. స్వచ్ఛమైన హాస్యంతో నా జీవితాన్ని పూర్తిగా నింపుకుంటాను.

– ఇన్స్పిరేషనల్ కోట్

## జాతీయ విజ్ఞాన దినం

*భారతరత్న, నోబెల్ ప్రైజ్ గ్రహీత అయిన సుప్రసిద్ధ భారతీయ వైజ్ఞానికుడు సర్ సి.వి. రామన్ 1888వ సంవత్సరం ఫిబ్రవరి నెల 28వ తారీఖున జన్మించాడు. ఆ కారణంగా ఈ వైజ్ఞానికుడి జన్మదినోత్సవాన్ని భారతీయులు జాతీయ వైజ్ఞానిక దినంగా ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 28వ తారీఖున జరుపుకుంటున్నారు.*

''మీ ఆలోచనలు సదాచార మార్గం నుండీ మిమ్మల్ని దూరం చేసే సంకేతాలను ఇస్తున్నాయంటే దురదృష్టం మీకై కాచుక కూర్చొంది అని భావించండి.''

– తిరుక్కురళ్

# మన హృదయాలు ప్రేమతో నిండినప్పుడు

పోట్లాడేందుకు కనీసం ఇద్దరు కావాల్సి ఉంటుంది. అదేవిధంగా పోట్లాట జరిగిన తరువాత సంధికి కూడా ఇద్దరు కావాల్సి ఉంటుంది. ఇద్దరిలో ప్రేమను మేల్కొల్పనిదే సంధికార్యం పూర్తి కావడం జరుగదు. మీ మెదడులో ప్రేమ వరదలను రానివ్వండి. మీరు పోట్లాడిన



వ్యక్తి కళ్ళలోకి సూటీగా చూస్తూ అతడిని మీ హృదయానికి హత్తుకోండి. ఇక్కడ మాటల పని లేదు. అప్పుడు ఇద్దరి కళ్ళు చెమ్మగిల్లుతాయి. ఆనంద భాష్పాలు వెల్లువగా వెలువడి పోట్లాట అప్పటికి అప్పుడే మరచిపోవడం జరుగుతుంది. ఈ పద్ధతిని ప్రయత్నించండి. ఈ పద్ధతి అన్ని పరిస్థితులలో నిజం అని నిరూపిత మవుతుంది. ఇదే ప్రేమకున్న బలం, శక్తి.

ప్రేమ క్షీణించినప్పుడు తప్పులు బలపడతాయి. ప్రేమ సుడిగుండంగా లేచిన ప్పుడూ, స్వచ్ఛమైన ప్రేమ వెలుగులో మరో సారి చూసుకున్నప్పుడూ, ఆ తప్పులే వారిలో ఉన్న అవసరమైన అందంగా రూపుదిద్దుకుంటాయి. ఇదే ప్రేమకున్న ప్రత్యేకత, ప్రేమ సాధించే అద్భుతం అవుతుంది. మన హృదయాలు ప్రేమతో నిండినప్పుడు జీవితం అందమైన రమణీయమైన, ప్రేమ పూర్వకమైన దివ్య ఆనందపు లోయగా మారుతుంది.

– స్వామీ చిన్మయానంద

---

## భారత పాకిస్తాన్ జట్లలో ఆడిన ఒకే ఒక హాకీ క్రీడాకారుడు

*కల్నల్ అలీ ఇక్తిదర్ షా దర (Colonel Ali Iqtidar Shah Dara) భారతీయ జట్టు తరఫున 1936వ ఒలింపిక్స్‌లో పాల్గొన్నాడు. అతడే 1948వ సంవత్సరపు ఒలింపిక్స్‌లో పాకిస్తాన్ జట్టు కెప్టెన్‌గా పాల్గొన్నాడు. ఇలా రెండు దేశాల తరఫున హాకీ ఆడిన ఏకైక క్రీడాకారుడు ఇక్తిదర్ షా దర.*

''వచ్చిన వాటిని వచ్చినట్లు స్వీకరించి, పోయిన వాటిని పోయినట్లు భావించి వాటితో విడిపోవడం నేర్చుకున్న వ్యక్తే, సంతోషంగా ఉంటూ సంతృప్తితో జీవించే కళను అర్థం చేసుకున్న వ్యక్తి అవుతాడు.''

## అయినా చూడలేకపోతున్నాను మాస్టారూ!

అధ్యాపకుడు: ఎవరెస్టు శిఖరం ఎక్కడుంది?

విద్యార్థి: నాకు తెలియదు మాస్టారు.

అధ్యాపకుడు: అయితే బెంచీపైన ఎక్కి నిలబడు.

విద్యార్థి : బెంచీపైన ఎక్కినా చూడ లేకపోతున్నాను మాస్టారూ!



## నా సైకిలు దిగుడు దిశగాపోతోంది

వ్యాయామ శిక్షణాకాలంలో శిక్షకుడు "వీపునం నేలకు అన్నిపడుకోండి. (అందరూ పడుకున్న తరువాత) ఇప్పుడు సైకిల్ తొక్కుతున్నట్లు మీ కాళ్ళను కదపండి" అని చెప్పాడు.

కాస్సేపైన తరువాత శిక్షకుడు "మరింత వేగంగా" అన్నాడు.

అందులో సురేష్ కాళ్ళు కదపడం మానే సాడు. అది గమనించిన శిక్షకుడు "అదేంటి! నీవు ఎందుకు కాళ్ళు కదపడం ఆపేసావు" అని సురేష్‌ను అడిగాడు.

సురేష్ "నేను బ్రేకులు వేసానండీ. నా సైకిలు ప్రస్తుతం దిగుడు దిశగా పోతోంది" అని జవాబు ఇచ్చాడు.

## దానికి తాళం వేయబడింది

జనంతో క్రిక్కిరిసిన ఒక రైలు పెట్టెలో ఒక ప్రయాణీకుడు ప్రవేశించాడు. ఆ తరువాత తన బరువైన ట్రంకును, సామా న్లుపెట్టే స్థలంలో ఉంచాడు. కదులుతున్న ఆ బరువైన ట్రంకును చూసి తన నెత్తిన

## తొలి డెప్యూటీ వైస్ కాప్టెన్

*సాధారణంగా ఆటలలో కాప్టెన్, వైస్ కాప్టె న్‌లు మాత్రం ఉంటారు. **1932**లో జరిగిన భారతదేశపు తొలి టెస్ట్‌లో విజయనగరం మహా రాజు మనదేశపు తొలి డిప్యూటి వైస్ కాప్టెన్‌గా నియమింపబడ్డారు.*

"ఆనందంగా వస్తువులను చూసే గుణం, జీవితంను గురించి ఆశతో ఆలోచించే నైజం, ఇతర అలవాట్లులాగానే మనలో పెంపొందేలా చేసుకోవాలి." – స్మైల్స్

పడుతుందన్న భయంతో ''మీ ట్రంకు పైన సురక్షితంగా ఉంటుందంటారా?'' అని ఒకతను అడిగాడు.

ఆ ప్రయాణీకుడు (నవ్వుతూ) ''భయ పడకండి సార్, దానికి తాళం వేసి ఉంది'' అని ధీమాగా చెప్పాడు.



## మీ ఆహారం విషయాన్ని గురించి

రాజకీయం నాయకుడు: ''మనం గోధుమ పంటను బాగా అభివృద్ధి పర చాలి, ఆ తరువాత''..

సభలో ఒక కొంటె గొంతుక: ''అది సరే మరి గడ్డి సంగతేమి!''

రాజకీయం నాయకుడు: ''అయ్యా! ప్రస్తుతం నేను మనుషుల ఆహార ధాన్యాన్ని గురించి చర్చిస్తున్నాను. కాని తరువాత మీ ఆహారం ప్రత్యేకతను గురించి కూడా చర్చిస్తాను.''

## లెక్కలేనన్ని రంధ్రాల కలయిక

అధ్యాపకుడు (తన విద్యార్థులతో): ''చేపల వల గురించి మీలో ఎవరైనా చెప్పగలరా?''

చాలాసేపు వరకు ఏ ఒక్క విద్యార్థి జవాబు చెప్పడానికి ముందుకు రాలేదు. ఒక చిన్న కుర్రాడు మాత్రం చాలా బిడి యంగా: ''మాస్టారండీ లెక్కలేనన్ని రంధ్రాలను ఒక దారం ద్వారం ఒకటిగా చేర్పడాన్ని చేపల వల అంటారు'' అని జవాబిచ్చాడు.

## నేను అప్పుతీసుకునే ప్రయత్నంలో ఉన్నాను

సునీల్: ''తన డబ్బుతో రామ్ ఏమి చేసుకుంటాడో నాకు తెలియడంలేదు. నిన్న డబ్బు లేదు అన్నాడు. మళ్ళీ ఈ రోజు కూడా డబ్బు లేదు అన్నాడు.''

---

## బెర్లిన్ గోడ

*1963వ సంవత్సరం ఆగస్టు నెల 12వ తేదీ అర్ధరాత్రి తెల్లవారితే 13 అనగా – ఒక మహత్ సంఘటన యూరప్‌లో జరిగింది. తూర్పుపడమరల మధ్య బెర్లిన్‌గోడ కట్టడానికి ముందున్న సరిహద్దును తొలిగించింది.*

''ఒక సజ్జనుడిని చూసినపుడు అతడి ఆదర్శం ఉదాహరణగా తీసుకునేందుకు ప్రయత్నించండి. అలాగే ఒక చెడు వ్యక్తిని చూసినప్పుడు మీలో ఉన్న చెడుకోసం మీ హృదయాన్ని తడుముకుని చూసుకోండి.'' – కన్ఫ్యూసియస్

**అనిల్: "మరైతే రామ్ ని వద్ద అప్పు తీసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడా?"**

సునీల్: "అబ్బే! లేదు! నేను వాడి దగ్గర అప్పు తీసుకోవాలనుకున్నాను."

## నిద్రపోతున్నప్పుడు ఒక మాత్ర వేసుకోండి

రోగి: డాక్టరుగారు, మీరే నాకు మందివ్వాలి.

డాక్టరు: అదిసరే, అసలు విషయు మేమో చెప్పండి

రోగి: నా కుడికాలు ముందుకుపోతున్నప్పుడు, ఎడమకాలు వెనక్కు ఉండిపోతుంది. అదే ఎడమకాలు ముందుకు పోయినప్పుడు కుడికాలు వెనక్కు ఉండిపోతుంది.

డాక్టరు: మీ కేసు నాకు అర్థం అయింది. మీకు నేను రెండు మాత్రలు ఇస్తున్నాను. మీరు బాగా నిద్రపోయేటప్పుడు ఒక మాత్రను తీసుకోండి. రెండో మాత్రమాత్రం మీరు మేల్కొనే ముందు తీసుకోండి.

రోగి: ధన్యవాదాలు, డాక్టర్.

## తీసుకున్నదేదీ అతడు తిప్పి ఇవ్వడు

**ఇంటి నుంచీ బయటకు వస్తున్నప్పుడు ఒక మిత్రుడు మరొక మిత్రుడితో: "మీరు ఎవరిని చూసి హల్లో అన్నారు?"**

"మా పొరుగింటాయనను చూసి."

"మరైతే మళ్ళీ అతడు జవాబుగా హల్లో అనలేదేం."

"ఓ! అదా! తీసుకున్నదేదీ అతడు తిప్పి ఇవ్వడు." ●

## మనదేశంలోని అతి పెద్ద గులాబీ తోట



*పంజాబ్ హర్యానా రాష్ట్రాల సంయుక్త రాజధాని నగరమైన చండీఘడ్‌లో ఉన్న గులాబీల తోట మనదేశంలోని గులాబీల తోటలో అతి పెద్దది. ఈ తోటలో 36,000లకు మించిన గులాబీ మొక్కలు ఉన్నాయి. ఇక్కడ 1600కు మించిన అద్భుతమైన గులాబీల రకాలు పూస్తున్నాయి.*

"మంచి జీవితం అనే సిద్ధాంతాన్ని అనుకరించాలేగాని చెడు జీవితాన్ని కాదు. ధర్మపరాయణ సంపన్నులు ఈ జన్మలోనూ, రాబోయే జన్మలోనూ సుఖంగా ఉండగలరు."
— బుద్ధుడు

# దేవాలయాల నగరం - కుంభకోణం

ఎన్. రామకృష్ణ

తమిళనాడులోని కుంభకోణం యాత్రా స్థలంగా గొప్ప పేరు ప్రతిష్ఠలను సంతరించుకుంది. తిరుచిరాపల్లికి పోయే ప్రధాన రహదారిలో చెన్నైనగరానికి 310 కిలోమీటర్ల దూరంలో ఈ నగరం వెలసింది.



Mahamakham Tank, Kumbakonam

సౌరమండలంలోని బృహస్పతి (Jupiter) గ్రహం సింహలగ్నంలో ప్రవేశించినప్పుడు - ఇది 12 సంవత్సరాలకొకసారి జరుగుతుంది- ఇక్కడ మహామఖం ఉత్సవాలు జరుగుతాయి. మహామఖం పుష్కరిణిలో ఆ శుభయోగంలో స్నానం చేసి ధన్యులవడానికి ప్రజలు అప్పుడు దేశం నలుమూలల నుండీ వస్తారు. ఇలాంటి శుభయోగాన్ని కుంభమేలా అంటారు. ఇది మన గోదావరి పుష్కరాలవంటిది.

కుంభకోణాన్ని ''దేవాలయాల నగరం'' గా పిలుస్తారు. వాస్తుకళకూ దేవాలయ నిర్మాణ కళ (Architecture) కూ పేరు గాంచిన అనేక ప్రాచీన దేవాలయాలకు ఈ నగరం పెట్టిందిపేరు. ఈ దేవాలయాలలో అతి ముఖ్యమైనది ఆదికుంభే

---

## ప్రపంచపు అతి పెద్ద సినిమా హాలు

*అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన న్యూయార్క్ నగరంలోని రేడియో సిటీ మ్యూజిక్ హాల్ ప్రపంచపు అతి పెద్ద సినిమా హాలుగా గుర్తింపబడింది. ఇక్కడ ఒక్కసారిగా 5874 మంది కూర్చుని సినిమా చూడవచ్చును.*

---

## టిస్కోకు ప్రధానమంత్రి ట్రాఫీ

*సమగ్ర ఉక్కు ఉత్తమ నిష్పాదన (Excellence in Performance in integrated Steel)కు గాను 1994-95వ సంవత్సరపు ప్రధానమంత్రి ట్రాఫీ (Trophy) టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ (Tisco)కు ఇవ్వబడింది.*

---

''మీ వద్ద మంచి తెలివితేటలుంటే పరిశ్రమ దానిని అభివృద్ధి పరుస్తుంది. మీ వద్ద సాధారణ సామర్థ్యం ఉంటే అది ఇతర లోపాలను సర్దివేయగలదు.''

– సర్ జోషువా రెనాల్ట్స్

శ్వరర్ ఆలయం. ఈ ఆలయం కారణం గానే ఆ నగరానికి కుంభకోణం అన్న పేరు వచ్చింది. ఇక్కడి అమ్మవారిని మంగళాంబిక అన్న పేరుతో పిలుస్తారు. తొమ్మిది అంతస్తులుగల ఈ దేవాలయ గోపురం ఎత్తు 128 అడుగులు. రాతితో




చెక్కిన ఒక అద్భుతమైన నాదస్వరం - సన్నాయి-ను ఈ దేవాలయంలో చూడ వచ్చును.

అరవావముధన్ (Aravamudhan)గా పిలువబడే సారంగపాణి పేరుతో ఇక్కడ ఒక ఆలయం నిర్మించబడి ఉంది. ఇక్కడి అమ్మవారి పేరు కోమలవళ్ళి. కుంభకోణం నగరంలో ఉన్న గోపురాలలో 146 అడుగుల ఎత్తున్న సారంగపాణి ఆలయం గోపురమే అతి ఎత్తైనది. ఈ గోపురంలో 11 అంతస్తులున్నాయి. గుడి లోపల 'ఏనుగులు, గుర్రాలు' లాగుతున్న వైదిక విమానం అని పేరున్న రాతి రథం ఉంది. ఒకేరాతితో ఈ రథం చక్రాలు చెక్కబడ్డాయి. విష్ణువు అవతారానికి చెందిన బొమ్మలు గోడలపై అందంగా చెక్కబడి ఉన్నాయి.

గుడిలోని బంగారు కమలం కొలను (Golden Lotus Tank) ఒక ముఖ్యమైన చోటు. ఇక్కడ జరిగే తెప్పోత్సవంలో అనే కమంది పాల్గొంటారు. అందులో 16 స్తంభాలు గల మధ్య మండపం ఉంది.

నాగేశ్వరస్వామి ఆలయం ఆసక్తికర నిర్మాణానికి పేరు పొందింది. ఈ ఆలయం బయటి గోపురం గర్భగుడి కంటే కూడా ఎత్తుగా ఉన్న స్థలంలో నిర్మించబడింది. ప్రతి సంవత్సరం చిత్తిరై (చైత్రమాసం) నెలలో సూర్యుడి కిరణాలు మూడురోజులపాటు నేరుగా శివ లింగంపై ప్రొద్దున ఆరుగంటలకు పడ

---

## మన రైళ్ళలో రోజూ ప్రయాణం చేసే వారి సంఖ్య

*ప్రపంచపు ఏకైక పెద్ద సంస్థ ఇండియన్ రైల్వేస్ రోజుకు 12 మిలియన్ల ప్రయాణీకు లనూ, ఒక మిలియన్ టన్నులకు మించిన సామగ్రీను తనతో మోసుకువెళుతోంది.*

''సాహసించి పనులను చేసేవారినే గెలుపు తరచుగా వరిస్తుంది.''

తాయి. అప్పుడు సూర్యపూజ చేయబడుతుంది.

ఇక్కడి నటరాజు విగ్రహం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. చక్కటి శిల్ప చాతుర్యంతో ఒప్పారే రాతిరథం చక్రాలు ఒకే రాయితో చెక్కబడి ఉన్నాయి.


Ramaswamy Temple Sculpture, Kumbakonam

రామస్వామి ఆలయం స్తంభాలు అందమైన ఒంటరి శిల్పాలతో, జంట శిల్పాలతో అలరారుచున్నాయి. అప్పట్లో తంజావూర్‌ను ఏలిన అచ్యుత నాయకుడు ఈ రామస్వామి ఆలయాన్ని నిర్మించాడు. ఒక కొలను త్రవ్వుతున్నప్పుడు నిలువెత్తు రామలక్ష్మణ సీతా భరత శత్రుఘ్న హనుమంతుల విగ్రహాలు బయటపడ్డాయి. రాజు ఈ విగ్రహాల అందచందాలకు సమ్మోహితుడై ఆ ప్రాంతంలో రామాలయాన్ని కట్టించాడు.

ప్రతిచోట రామాయణ కథను వివరించే శిల్పాలు గోడలపై వరసగా చెక్కబడి ఉన్నాయి. రతీమన్మథుల విగ్రహాలు వారి పేరుకు తగ్గట్టు చాలా అందంగా ఉన్నాయి. గర్భగృహంలో మూడు వరసలలో రామాయణ కథకు సంబంధించిన విస్తృత తైలవర్ణ చిత్రాలు ఉన్నాయి. చివరి పట్టాభిషేకంను తెలియజేసే రంగురంగుల అద్దాలు పొదగబడిన తైలవర్ణచిత్రం అత్యంత భవ్యంగా ఉంది.

కుంభకోణం నగరం వందకు మించిన దేవాలయాలకు ప్రసిద్ధిగాంచింది. ఈ నగరం మధ్య గుండా కావేరి నది ప్రవహిస్తుంది.

దక్షిణ ప్రాంతపు కేంబ్రిడ్జిగా పేరు పొందిన కుంభకోణం కళాశాల వందపై చిలుకు సంవత్సరాల నాటిది. ఫెలోషిప్ ఆఫ్ ది రాయల్ సొసైటీ (F R S.)ని పొందిన తొలి భారతీయ గణితశాస్త్రజ్ఞుడు

---

"నీలవర్ణ బాణం"

*1980వ సంవత్సరం మాస్కోలో జరిగిన ఒలింపిక్స్ పోటీలలో పియట్రో మిన్నియా (Pietro Minnea) 200 మీటర్ల పరుగు పందెం బంగారు పతకాన్ని గెలుచుకున్నాడు.* ***అతడికి "నీలవర్ణ బాణం" అనే ముద్దు పేరు ఇవ్వబడింది.***

"మీ గౌరవ మర్యాదలు పెరగాలంటే మంచి గుణాలున్న వారి సాంగత్యాన్ని పెంచుకోండి. చెడు సహవాసం చేయడం కంటే ఒంటరిగా ఉండడమే మంచిది."

శ్రీనివాస రామానుజంతో సహా అనేక మంది గొప్పవారు ఈ కళాశాలలో చదువుకున్నారు.



Cauvery River and College , Kumbakonam

పట్టుచీరలకూ, ఇత్తడి సామాన్లకూ, ఎవర్‌సిల్వర్ సామాన్లకూ పప్పుధాన్యాలకూ, బియ్యానికీ ఈ కుంభకోణం ప్రసిద్ధిని గాంచింది. ఈ నగరం తమలపాకులకూ చాలా మంచి పేరుగాంచింది.

కుంభకోణానికి మంచి చరిత్ర కూడా ఉంది. కొంతకాలం వరకు ఇది చోళుల రాజధానిగా ఉండేది. అక్కడికి దగ్గరలోనే ఉన్న అణ్ణాకరై (Annakarai)లో పాత కాలపు ఆనకట్టలూ, రిజర్వాయర్లు ఉన్నాయి. చోళుల కాలానికి చెందిన చెక్కుచెదరని అవశేషాలను మనం ఈ రోజుకూ పట్టీశ్వరం (Patteswaram) లోనూ, చోళమాళిగైలోనూ చూడవచ్చును.

## స్వాతంత్ర్యపు స్వర్గం




మనసు నిర్భయంగా విహరించే చోటుకు
వివేకం గౌరవించబడే చోటుకు
చదువుకు ఉచితస్థానం ఉన్నచోటుకు
సంకుచిత స్వార్థ భావాలు ప్రపంచాన్ని ముక్కలు చెక్కలు చేయని చోటుకు
సత్యాంత రాళాల నుండీ మాటలు వెలువడే చోటుకు
అలసట ఎరుగని ప్రయాస తన బాహువులను పరిపక్వత దిశ వైపు చాచుచోటుకు
స్వచ్ఛమైన బుద్ధి ప్రవాహం గతించిన అలవాట్ల ఇసుకనేలలో ఇంకని చోటుకు
నీ మార్గదర్శకత్వంలో మనసు ఆలోచనలూ, క్రియలూ విస్తరించే చోటుకు
అదిగో అలాంటి స్వాతంత్ర్యం స్వర్గంలోకి
ఓ పరమాత్మా, నా దేశాన్ని తీసుకువెళ్ళు.

– రవీంద్రనాథ్ ఠాగూర్

"పోట్లాటలతో కూడిన ఇంట్లో విందు భోజనం చేయడంకంటే, ప్రశాంత వాతావరణంలో ఎండిపోయిన ముద్ద తినడం అన్నదే మంచిది."

# సత్యసంధత

షాజ్‌మాన్ (Shajman) అనే రాజు చాలా సంవత్సరాలకు ముందు అరేబియాలో ఉండేవాడు. ఒకసారి ఖైదీల స్థితి గతులను, యోగక్షేమాలను విచారించేందుకు అతడు తన రాజ్యపు కారాగారాన్ని సందర్శించాడు. ఆ కారాగారంలో దొంగలు, దోపిడీదారులు, హంతకులు మొదలైనవారు ఉన్నారు. తాము చేసిన అపరాధమేమో చెప్పమని రాజు తన ఖైదీలను అడిగాడు.

''నేను ఎలాంటి అపరాధం చేయలేదు. నేను నిర్దోషిని. నన్ను నా శత్రువులు దొంగ కేసులో ఇరికించారు'' అని అందులోని ఒకడన్నాడు.

''నేనూ నిరపరాధినే. నా శత్రువులు జడ్జి గారికి లంచమిచ్చి ఈ దండనను నాకు ఇప్పించారు'' అని రెండవవాడన్నాడు.

ఇలా ప్రతి ఒక్కరు తాము ఎలాంటి అపరాధం చేయలేదని, తాము నిర్దోషులమని చెబుతూ వచ్చారు. చివర్లో ఒక ఖైదీని పిలిచి ''నీవు ఏం అపరాధం చేసావు?'' అని అడిగాడు.

''నేనొక మనిషిని చంపాను. నేనొక హంతకుడను. దానికి ప్రతిఫలంగా శిక్షను అనుభవిస్తున్నాను'' అని అన్నాడు.

ఆ అపరాధి సత్యసంధత రాజుకు చాలా బాగా నచ్చింది. అతడి మాటలు విని రాజు చాలా సంతోషపడ్డాడు. అక్కడి ఖైదీలనందర్నీ ఉద్దేశించి ''ఈ ఖైదీ మాత్రమే నిజం చెప్పాడు. నిజం చెప్పడం వల్ల దానికి ప్రతిఫలంగా నేను ఇతడిని విడుదల చేస్తున్నాను'' అన్నాడు.

రాజుతో అబద్ధాలాడిన ఖైదీలందరూ సిగ్గుతో తలవంచుకున్నారు.

– 'గొప్పవారి 101 మధురస్మృతుల నుండి'

---

## జంతర్ – మంతర్




ఢిల్లీ జంతర్ – మంతర్‌కు చెందిన ఖగోళ శాస్త్రపరమైన స్తంభాలను పై చిత్రంలో చూడవచ్చును.

''ప్రశంసించడం కంటే పొగడడం చాలా సులభం.''

# అవారులు

## అలి సర్దార్ జాఫరీకు జ్ఞాన్‌పీఠ్ అవార్డు

సువిఖ్యాత ఉర్దూ రచయిత అలి సర్దార్ జాఫ్రీకు 1977 మొదలు 1996 వరకు తన ఉర్దూ రచనల ద్వారా భారతీయ సాహిత్యాన్ని సమృద్ధి పరచినందుకు గుర్తింపుగా 1997వ సంవత్సరపు జ్ఞాన్‌పీఠ్ అవార్డు ఇవ్వబడింది.

## ప్రపంచ ఆరోగ్య సంస్థ అత్యున్నతమైన గౌరవం

ఢిల్లీ రాష్ట్ర మంత్రి మండలికి చెందిన ఆరోగ్యశాఖ మంత్రి డా. హర్షవర్ధన్ ప్రపంచ ఆరోగ్యసంస్థ డైరక్టర్‌గారి మెడల్‌ను అందుకున్నాడు. ''పొగాకు వాడని సమాజం'' అన్న అవగాహనను ప్రోత్సహించి ఆవిషయంగా గణనీయమైన సాధన గావించినందులకు ప్రపంచ ఆరోగ్యసంస్థ వారి అత్యున్నత గౌరవంగా భావించబడుతున్న ఈ మెడల్ అతడికి ఇవ్వబడింది.

## కిరణ్‌బేడీకు జోసెఫ్ బియెస్ బహుమతి

దేశంలోని అతి పెద్ద జైలుగా పరిగణింపబడుతున్న ఢిల్లీలోని తిహార్ జైలులో ప్రవేశపెట్టిన సంస్కరణ పరమైన పనికిగాను భారతదేశపు తొలి మహిళా పోలీసు అధికారిణి శ్రీమతి కిరణ్‌బేడీకు 14,000 డాలర్ల జోసెఫ్ బియెస్ బహుమతి ఇవ్వబడింది. ●

## చాలా సంవత్సరాలు కొనసాగిన శీర్షిక




సుప్రసిద్ధ రచయిత, పాత్రికేయుడూ, స్క్రిప్ట్ రచయిత అయిన ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్ 'బ్లిట్జ్' ఆంగ్ల వారపత్రికలో 'లాస్ట్‌పేజ్' అన్న శీర్షికను *1947*వ సంవత్సరంలో ప్రారంభించారు. ఈ శీర్షిక అతడు *1987*లో మరణించే వరకూ కొనసాగింది. ప్రపంచ పాత్రికేయ చరిత్రలో ఇదే ఇన్ని సంవత్సరాలు కొనసాగిన ఏకైక శీర్షిక.

**''ఖూనీకోరులో కూడా పరిశుద్ధమైన ఆత్మ మరణించకుండా ఉంటుంది. అది అతడి పొరబాటు. దానిని వ్యక్తం చేయలేకపోతాడు. దానిని అతడు కప్పిపుచ్చుతాడు.''**
**– స్వామి వివేకానంద**

# శ్రీముత్తుస్వామి దీక్షితర్

ఎం.ఎస్. పద్మనాభశర్మ

కర్నాటక సంగీతత్రయంలో ఒకరుగా పరిగణింపబడుతున్న వాగ్గేయకారుడు ముత్తుస్వామి దీక్షితర్ 1775వ సంవత్సరంలో పుట్టాడు. రామస్వామి దీక్షితర్ - సుబ్బలక్ష్మి అంబాళ్ పుణ్యదంపతుల సంతానంగా ఇతడు పుట్టాడు.



Sri Muthuswamy Dikshitar

భక్తిశ్రద్ధలు గల వ్యక్తి గుణగణాలను తన బాల్యంలోనే ఇతడు ప్రదర్శించాడు. ముత్తుస్వామి తన తండ్రి వద్ద తెలుగు, సంస్కృతంతో పాటు శాస్త్రీయ సంగీతాన్ని కూడా అభ్యసించాడు. సంగీతంపై వెలువడిన 'వెంకటాముఖి' సుప్రసిద్ధ గ్రంథం 'చతుర్దండి ప్రకాశికై'ను అధ్యయనం చేసాడు. కావలసినమేరకు మనధర్మ గ్రంథాల పరమైన జ్ఞానాన్ని కూడ సంపాదించగలిగాడు.

చిదంబరనాథ యోగి ముత్తుస్వామి దీక్షితర్‌ను కాశీకి తీసుకువెళ్ళాడు. అక్కడ ఇతడిని 'శక్తిఉపాసనా' మార్గంలో అతడు ప్రవేశపెట్టించాడు. వారణాసిలో ఉన్నప్పుడు ముత్తుస్వామి ఉత్తరదేశపు సంగీతం - హిందూస్తానీ కూడా నేర్చుకున్నాడు.

'శ్రీనాథాది గరుగుహో జయతి' అనే మాటలతో ప్రారంభమయ్యే తొలి కీర్తనను ఇతడు రచించి రాగం కూర్చాడు తిరుత్తణిలో వెలసిన శివుడి కుమారుడైన మురుగభగవానుడి భక్తిపారవశ్యంలో లీనమైన

## తొలి బంగారు పతకం విజేత

*ఆధునిక కాలపు ఒలింపిక్స్‌లో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన జేమ్స్ బెర్నార్డ్ కొనొల్లీ (James Bernard Conolly) తొలి బంగారు పతకాన్ని గెలుచుకున్నాడు. హాప్, స్టెప్ అండ్ జంప్ అనే క్రీడలో మొదటి బహుమతిని పొందడం వల్ల తొలి బంగారు పతకాన్ని గెలుచుకున్న మొదటి వ్యక్తి అయ్యాడు. ప్రస్తుతం ఈ క్రీడను ట్రిపుల్ జంప్ అంటున్నారు.*

''ఏ పనైనా సగం చేయడాన్ని నేను చూచి సహించలేను. చేస్తున్నపని సరైనదైతే ధైర్యంతో చేయండి. అది తప్పు అయితే దానిని చేయకుండా వదిలివేయండి.''

ప్పుడు పై సంకీర్తనను అతడు రచిం చాడు. ఆధ్యాత్మిక వెలుగులో ఇతడి సృజ నాత్మక ప్రతిభ ప్రకాశించింది. తన శిష్యు లను ఎంతో జాగ్రత్తగా ఎన్నుకుని వారికి తన కృతులను ఆలాపించడం బోధిం చాడు.

ముత్తుస్వామి దీక్షితర్ తమ్ముడు చిన్న స్వామి చనిపోయాడు. ఆ దుఃఖంలో ఉన్న ప్పుడు మధురైమీనాక్షి అమ్మన్ ఆలయాన్ని దర్శించాడు. అక్కడే అతడు 'మీనాక్షి మేముదం దేహి', 'మామవ మీనాక్షి' అన్న కీర్తనలను వరుసగా పూర్వీ కల్యాణి, వరాళి రాగాలలో ఆలాపించాడు.

ధ్యానయోగం, జ్యోతిష్శాస్త్రం, మంత్ర యోగం, పురాణాల సారం మొదలైనవి దీక్షితర్ కృతులలోని ప్రత్యేకతలు. అంబా శ్పై అతడు రాసిన నవవర్ణ కీర్తనలు నవ గ్రహాలపైన రాసిన నవగ్రహ కీర్తనలు ఆయన రచనా గొప్పతనానికి ఉజ్వల ఉదాహరణలు. శక్తి ఉపాసనలోని సూక్ష్మా లను వివరిస్తూ శ్రీ విద్యాతత్వ రహస్యంపై ఇతడు ఎన్నో కీర్తనలను రచించారు.

''శివ పాహి ఓం శివే'' అన్న మంత్రాన్ని ఉచ్చరిస్తున్నవేళ 1835వ సంవత్సరంలో ఇతడిని మృత్యువు తన ఒడిలోకి తీసుకుంది.

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి
### జవాబులు

క్విజ్:- 1. (ఎ) అంటార్కిటికాలోని ఒక ప్రాంతం. 2. (సి) దోరు 3. (డి) తెల్లటి కాంతి కంటే కూడా పసుపుపచ్చ రంగు కాంతి మంచును లేదా పొగమంచును తక్కువగా గ్రహిస్తుంది కాబట్టి. 4. (సి) ఫ్రాంక్ 5. (బి) హెన్రీకీసింగర్ 6. (డి) డి విటమిన్ 7. (బి) హిందూమహాసముద్రం లోని మొరీషియస్ దీవికి దక్షిణ ప్రాంతంలో 8. (బి) 3,600 9. (ఎ) యునైటెడ్ కింగ్డమ్.

మాటలమహిమ:- 1. (ఎ) సమీప ముగానున్నది 2.(సి) బాధ 3. (డి) గజసమూహము 4. (బి) జల్లించెడు జల్లెడ 5. (డి) వడి 6. (బి) నడ బావి 7. (ఎ) దుఃఖము 8. (సి) ఇంగువమ్రాను.

తెలివికి పరీక్ష:- 1. 1000 మిల్లి యన్ వాట్స్ కలిస్తే ఒక గిగావాట్స్ అవు తుంది. 2. బుధగ్రహం (Mercury) 3. కేప్ అగుల్హాస్ (Cape Agulhas) గుడ్ హోప్ అగ్రం (Cape of Good Hope) 4. పండ్లతోట పైరు చేయువృత్తి. 5. మట్టి రకములకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రాన్ని 'పెడాలజీ' అంటారు.

''దూరం మంత్రముగ్ధతకు ఆస్కారాన్ని ఇస్తే చనువు తృణీకారభావానికి ఆశ్రయం ఇస్తుంది.''

# స్టాంపుల కథలు

## పికాసో సుప్రసిద్ధ వర్ణ చిత్రం

### తపన్ రాయ్

పాబ్లో పికాసో సుప్రసిద్ధ వర్ణ చిత్రాలను తపాలా బిళ్ళల రూపంలో అనేక దేశాలు వెలువడించాయి. ఈ గొప్ప కళాకారుడితో బాగా పరిచయం సంపాదించడానికి ఈ తపాలా బిళ్ళలు ఉపయోగపడతాయి.




స్పెయిన్‌లోని మలగా (Malaga)లో ప్లాబో రుయిజ్ పికాసో (Pablo Ruiz Picasso) 1881వ సంవత్సరం అక్టోబరు 25వ తారీఖున జన్మించాడు. బాలుడిగా ఉన్నప్పుడే ఇతడు పరిశీలించి బొమ్మలను తనలో ఇముడ్చుకొని, వాటి నకళ్ళను తయారుచేయగల సామర్థ్యపు గుణాలను ప్రదర్శించాడు. అతనిలోని కళాకారుడికి రూపం ఇచ్చి దానిని అభివృద్ధి పరచి మార్గదర్శకత్వం ఇవ్వడంలో ఇతడి తండ్రి ఎంతో సహాయపడ్డాడు.

ఈ రోజు అందరికీ సుపరిచితమైన 'షూలెస్ గర్ల్' అన్న వర్ణ చిత్రాన్ని పికాసో తన 14వ ఏట చిత్రించాడు. 90 సంవత్సరాల తన సుదీర్ఘ జీవిత కాలంలో తన చిత్రకళా ప్రతిభను అనేక రూప ఆకారాలలో చిత్రించాడు. వర్ణ చిత్రలేఖనంతోపాటు శిల్పకళను కూడా ఇతడు అభ్యసించాడు. అంతేకాదు ఇతడు సెరామిస్ట్ (పింగాణీపాత్రలపై కళాత్మక చిత్రాలువేయడం) గానూ, రచయిత, నృత్య దర్శకుడిగానూ కూడా రాణించాడు. అతనిలోని ప్రతిభా ఉత్పత్తులను తరిగే వయసు అపుచేయలేకపోయింది. 1973వ సంవత్సరం ఏప్రిల్ నెల 8వ తారీఖున ఇతడు పారిస్ (ఫ్రాన్స్) నగరంలో కన్నుమూసాడు.

''తేనె తియ్యనిదే కాని తేనెటీగ కాటు వేస్తుంది.''

# సచిన్ టెండుల్కర్ సాధించిన రికార్డులు

★ తన స్కూలు శారదాశ్రమ తరఫున సెయింట్ క్సేవియర్స్ స్కూలు జట్టుతో తన 14వ ఏట (1987–88) ముంబాయిలో ఆడుతున్నప్పుడు సచిన్ ఔట్ కాకుండా 326 పరుగులను చేసాడు. తన సహ ఆటగాడు మిత్రుడు అయిన వినోద్ కాంబ్లీ (ఔట్ కాకుండా 349 పరుగులు)తో కలిసి మూడవ వికెట్ పార్టనర్ షిప్‌ను 664 పరుగలకు తీసుకుపోయారు.




★ సచిన్ అయిదు టెస్ట్ సెంచురీలను చేసిన అతి పిన్నవయస్కుడు. సచిన్ ఈ రికార్డు స్థాపిస్తున్నప్పుడు అతని వయసు 19 సంవత్సరాల 294 రోజులు మాత్రమే.

★ మొదటి తరగతి క్రికెట్ (First Class Cricket)లో 1000, 2000, 3000, 4000, 5000, 6000, 7000 పరుగులను సాధించిన అతి పిన్న వయస్కుడు సచిన్ టెండుల్కర్.

★ ఆస్ట్రేలియా జట్టుతో ఆడుతున్నప్పుడు టెస్ట్ సెంచురీను చేసిన అతి పిన్న వయస్కుడు ఇతడే. అప్పుడు ఇతడి వయసు 18 సంవత్సరాల, 256 రోజులు.

★ తొలిసారిగా రంజిట్రఫీ మ్యాచ్ ఆడుతున్నప్పుడు వందపరుగులు చేసిన అతి చిన్న వయస్కుడు. సచిన్ 15 సంవత్సరాల 230 రోజుల వయసున్నప్పుడు ముంబాయిలో ఔట్ కాకుండా 1988 – 89లో వంద పరుగులు చేసాడు.

★ 16 సంవత్సరాల 197 రోజుల వయసున్నప్పుడు సచిన్ ఇరానీట్రాఫీలో తొలిసారిగా ఆడుతున్నప్పుడు (1989–90) 103 పరుగులను ముంబాయిలో సాధించాడు. ఇక్కడ కూడా ఈ విధంగా చేయగల అతి చిన్న వాడుగా గుర్తింపబడుతున్నాడు.

★ 1990వ సంవత్సరంలో గౌహతిలో జరిగిన దులీప్ (Duleep) ట్రాఫీలో తొలిసా

''విజయాన్ని సాధించిన వారంతా కర్మయోగులే. మిగతా వారంతా వేచివున్న వారుగా, చూచేవారుగా ఉంటారు.'' – జాన్ టోర్క్వాటో

రిగా పాల్గొన్నాడు. అప్పుడు కూడా వంద పైచిలుకు పరుగులు (159 పరుగులు) ఇతడు సాధించాడు. అప్పట్లో అతడి వయసు 17 సంవత్సరాల 263 రోజులు.

★ రంజీ, ఇరానీ, దులీప్ ట్రాఫీ లలో తొలిసారిగా ఆడుతున్నప్పుడు వంద పరుగులను సాధించిన ఏకైక ఆటగాడు సచిన్ టెండుల్కర్.

★ 1989వ సంవత్సరంలో మన జట్టు వారు పాకిస్తాన్ జట్టుతో టెస్ట్ మ్యాచ్ ఆడారు. 16 సంవత్సరాల 205 రోజుల వయసుగల సచిన్ మన జట్టులోని అతి తక్కువ వయస్సు ఉన్న ఆటగాడు.

★ మనదేశం తరఫున పాకిస్తాన్ జట్టుతో గుజరన్‌వాలా వద్ద ఆడబడిన ఒకరోజు అంతర్జాతీయ క్రికెట్‌లో సచిన్ పాల్గొన్నాడు. 16 సంవత్సరాల 237 రోజుల ప్రాయంగల సచిన్ ఆవిధంగా ఆడిన వారిలో అతి చిన్నవాడు.

★ 1990వ సంవత్సరంలో మన జట్టు ఇంగ్లాండు జట్టుతో ఓల్డ్ ట్రాఫోర్డ్ (Old Trafford) వద్ద టెస్ట్ మ్యాచ్ ఆడడం జరిగింది. మనదేశం తరఫున ఆడిన ఆట గాళ్ళలో సచిన్ అతి చిన్నవాడు. అప్పట్లో అతడి వయసు 17 సంవత్సరాల, 112 రోజులు మాత్రమే.

★ ఇప్పటి వరకు ఇతడు ఒక రోజుఆడబడే అంతర్జాతీయ క్రికెట్ మ్యాచ్ లలో 23 సెంచురీలను చేసాడు.

★ 1998 ఆగస్టు నాటికి – సచిన్ 196వ ఒకరోజు ఆడబడే అంతర్జాతీయ ఆటలలో పాల్గొనడం జరిగింది.

★ ఒక రోజు ఆడబడే అంతర్జాతీయ ఆటలో –1998వ సంవత్సరం నాటికి– 7070 పరుగులను పూర్తి చేసాడు. ●

అన్ని రకాల శీతోష్ణస్థితులలో నివసించగల ఏకైక జంతువు



కుక్క అన్ని రకాల శీతోష్ణస్థితులకూ, వాతావరణానికీ తట్టుకోగల ఏకైక జంతువు. ప్రపంచపు ప్రతి మూలలోనూ, ప్రతి దేశంలోనూ, ప్రతి జాతి వద్దనూ మనం దీన్ని చూడగలం.

"ఏదైనా మనకు భయాన్ని కలిగిస్తుంటే దానివైపు తిరిగి చూసి దానిని ఎదుర్కోండి."

# ప్రపంచ నగరాలు

## ప్రేగ్

చెజ్ (Czech) భాషలో ప్రహా (Praha)గా ఉచ్ఛరించబడే ప్రేగ్ (Prague) చెజ్ రిపబ్లిక్ రాజధాని నగరం. ఇది మధ్య ఐరోపా ఖండంలోని నగరాలలో అతి ప్రాచీనమైన నగరం. ఈ రోజు ప్రేగ్ ఆదేశపు ప్రముఖ వాణిజ్య, పారిశ్రామిక కేంద్రంతోపాటు సాంస్కృతిక నగరంగా వెలుగుతోంది.



Prague

ఎల్బి (Elbe) నది ఉపనది విల్టావా (Vltava) నదీ తీరంపై ఈ ప్రేగ్ నగరం వెలసింది. ఈ నగరం జనాభా 13 లక్షలు.

ఈ నగరపు సంప్రదాయబద్ధమైన ఉత్పత్తులలో చేతి తొడుగులు (Gloves), గాజు, కాల్చబడిన (Smoked) మాంసం మొదలైనవి ఉన్నాయి. అక్కడ కార్ఖానాలో తయారయ్యే వస్తువులతో భారీ యంత్రాలు, రసాయనాలు, కార్లు, విధ యుత భోజన వస్తువులు, విమానాలు, యంత్రాల పనిముట్లు, రసాయనిక ఎరువులు, కాగితం, గుడ్డలు మొదలైనవి ముఖ్యమైనవి.

మధ్య ఐరోపాకు ప్రేగ్ ప్రధాన రవాణా కేంద్రం. ఇక్కడి నుండీ ఐరోపాలోని ఇతర ప్రాంతాలను రోడ్డు, రైలు, విమానాల కలయిక ద్వారా చేరవచ్చును. ప్రేగ్ నగరంలోని మూడు విశ్వవిద్యాలయాలలో

### చెడు ఆలోచనలు పటాపంచలవుతాయి

*ఒక చెట్టు కింద నిలబడి చప్పట్లు చరిస్తే ఆ శబ్దానికి చెట్టుపైనున్న పక్షులు చెల్లాచెదురవుతాయి. హరినామ స్మరణ చేస్తూ చప్పట్లు చరిస్తే మీదేహమనే వృక్షంపై కూర్చుని ఉన్న చెడు ఆలోచనల పక్షులు అక్కడి నుండీ ఎగిరిపోతాయి. – శ్రీరామకృష్ణ పరమహంస*

''మీరు తీసుకునేది కీర్తి అయితే మీరిచ్చేది మీ గుణశీలాలవుతాయి. ఈ సత్యాన్ని మీలో మేల్కొలుపగలిగిన నాటి నుండి మీరు జీవిస్తారు.''

1348వ సంవత్సరంలో పవిత్ర రోమ్ చక్రవర్తి నాల్గవ ఛార్లెస్ ద్వారా స్థాపించబడిన ఛార్లెస్ విశ్వవిద్యాలయం చాలా సుప్రసిద్ధం అయినది. ఇదే మొత్తం మధ్య



Hradcany Castle, Prague

ఐరోపాలోని విశ్వవిద్యాలయాలలో అతి ప్రాచీనమైన విశ్వవిద్యాలయం. ఇక్కడ ఒక సాంకేతిక విశ్వవిద్యాలయం కూడా ఉంది. హ్రాడ్కానీ కాసిల్ (Hradcany Castle), సెయింట్ విటుస్ వారి గోథిక్ కేథడ్రల్ (Gothic Cathedral) మొదలైనవి అక్కడి కట్టడాలలో చాలా ప్రసిద్ధమైనవి.

ప్రాచీన రోమనుల స్థావర స్థానంపైన ఈ ప్రేగ్ నగరం బహుశా క్రీ.శ. 8వ శతాబ్దంలో స్థాపించబడి ఉండవచ్చునని భావించబడుతోంది. క్రీ.శ 10వ శతాబ్దంలో బొహిమియా (Bohemia)కు చెందిన ప్రిమిస్లిడ్ (Premyslid) రాజుల ద్వారా పాలించబడింది. వీరిలో రాజర్షి లాంటి వెన్‌సియస్‌లౌస్ (Wenceslaus) చాలా ముఖ్యమైనవాడు. ప్రేగ్ మొత్తం ఐరోపా ఖండంలో, పారిస్ నగరానికి తరువాతగా చెప్పుకోదగ్గ నగరంగా 14వ శతాబ్దంలో ఉండేది. అప్పుడు అది సిరి సంపదలతో అలరారుతూ ఉండేది. క్రీ.శ. 15వ శతాబ్దం ప్రారంభంలో ఇది జాన్ హస్‌డ్యూ (Jan Husdue) ధార్మిక సంస్కారాల కేంద్రంగా ఉండేది. అప్పట్లో చెజ్ వారికీ, జర్మనీవారికి మధ్య పోటీ ఉండేది. క్రీ.శ. 16వ శతాబ్దంలో ఇది హాబ్స్‌బర్గ్ (Habsburg) పరిపాలనలో ఉండేది. 1918వ సంవత్సరంలో కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన చెకోస్లోవియా దేశానికి ప్రేగ్ రాజధాని నగరం అయింది.

●

## ఐదు టెస్ట్‌లకు నలుగురు కాప్టెన్‌లు

*1958-59 సంవత్సరాల కాలంలో మన దేశంలో వెస్ట్ ఇండీస్ క్రికెట్ జట్టుకూ, మన జట్టుకూ జరిగిన టెస్ట్ సిరీస్‌లో ఐదు టెస్ట్‌లకు నలుగురు కాప్టెన్లుగా వ్యవహరించారు. వారి పేర్లు: ఉమ్రీగర్, గులాం అహమ్మద్ (రెండు టెస్ట్‌లు), ఎం.హెచ్. మంకడ్, హెచ్.ఆర్. అధికారి.*

# పోలార్ ఎలుగుబంటి

## ప్రపంచపు జంతువులలో అతిపెద్ద మాంసాహారి

ప్రీతి రమేష్

ప్రపంచపు జంతువులలో అతి పెద్ద మాంసాహారిగా పరిగణింపబడుతున్న పోలార్ ఎలుగుబంటి (Polar Bear) చాలా భయంకరమైన జంతువు. మగ ఎలుగుబంటి 10 అడుగుల ఎత్తు



Polar Bear

వరకు పెరుగుతుంది. దీని బరువు 600 కేజీల దాకా ఉంటుంది. పసుపుపచ్చరంగుతో కూడిన తెల్లటి బొచ్చుతో తాను నివసిస్తున్న ప్రాంతపు తీవ్ర శీతోష్ణస్థితిని ఇది ఎదుర్కొంటుంది.

పోలార్ ఎలుగుబంట్లు సీల్స్ (Seals), వాల్‌రస్ (Walrus) చిన్న చిన్న తిమింగిలాలను ఆహారంగా తీసుకుంటాయి. అప్పుడప్పుడు ఆర్కిటిక్ ఎండకాలంలో బ్లూబెర్రీలనూ, క్రోబెర్రీలనూ (ఒక రకం టొమేటో లాంటి కండగల పండ్లు) ఇవి తింటాయి. ఈ రకం ఎలుగుబంట్లు బాగా ఈదగలవు. వ్రేళ్ళకు నడుమ చర్మం (Webbed)గల పాదాలు ఉండడం వల్ల అవి తెడ్లలాగా (Paddle) వాడుకోబడేందుకు సహాయపడతాయి. ఇవి గంటల కొలదీ ఆగకుండా ఆర్కిటిక్ సముద్రపు చల్లటి నీళ్ళలో ఈదగలవు. దీనిపై ఉన్న జుట్టు నీరును గ్రహించదు. పాదాలకున్న చిన్నగా వంకర తిరిగిన పంజాల గోళ్ళ కారణంగా అవి మంచునూ, తాము వేటాడిన ప్రాణినీ గట్టిగా పట్టుకునేందుకు సహాయపడతాయి. వీటిని తరిమికొట్టినప్పుడు మనల్ని ఆశ్చర్యంలో ముంచేలా అతి జాగ్రత్తగా మెలగుతాయి. అప్పుడు అవి కొండలను, గుట్టలనూ అవలీలగా ఎక్కగలుగుతాయి. వీటి చెవులూ, తోకా చాలా చిన్నవిగా ఉండడం వల్ల శరీరం నుండీ వేడి అతి తక్కువగా బయటపడుతుంది. ఈ పోలార్ ఎలుగుబంట్ల ఒంటి పైనున్న తెల్లటి జుట్టు ఆర్కిటిక్ మంచు

రంగుతో కలిసిపోవడం వల్ల సీలు (Seal) పైన ఉన్నదున్నట్లు ఆశ్చర్యకరంగా వెనుక నుండి ఇవి దాడి చేయగలవు.

నీళ్ళలోనే ఇవి వలసపోతాయి. అప్పుడు ఎలుగుబంట్లు దక్షిణ అగ్రం వైపు ఉన్న తేలాడే మంచు ప్రాంతంలో మంచులేని ప్రాంతాన్ని వెతుక్కుంటూపోతాయి. ఎలుగుబంట్లు సంధికార్యం (Mating) జరగవలసిన కాలంలో లేదా ఆహారం తీసుకుంటున్నప్పుడు మాత్రం ఇవి దగ్గరవుతాయి. ఈ ఎలుగుబంట్లు సుమారు 25 సంవత్సరాలు జీవిస్తాయి. 5 సంవత్సరాల వయసులోనే సంతానోత్పత్తి స్థితికి ఇవి చేరుకుంటాయి. వీటి సంధికార్యం ఏప్రిల్ మొదలు జూన్ నెల వరకు జరుగుతుంది.

ఆడ ఎలుగుబంటి ద్వారా, ఈనడానికి ముందు త్రవ్వబడిన మంచు గుహలలో వాటి పిల్లలు పుడతాయి. సరాసరిగా ఒకసారి ఇవి మూడు పిల్లలను ఈనుతాయి. కొవ్వుతో నిండిన తల్లిపాలు తాగి పిల్లలు ఎదుగుతాయి. ఆ విధంగా తమ గుహకు అవలనున్న గడ్డకట్టుకునిపోయిన భీకరమైన మంచు వాతావరణాన్ని తట్టుకోగలుగుతాయి. పుట్టిన మూడు నెలలకే బయటి ప్రపంచాన్ని ఎదుర్కోగల స్థితికి ఇవి చేరుకుంటాయి. 28 నెలల వయసు వచ్చేంతవరకు ఎలుగుబంటి పిల్లలు తల్లిని అంటుకుని తల్లికి చేరువుగా ఉంటాయి.

ఎలుగుబంటి తెల్లజుట్టుకుగానూ, చంపిన దానికి గుర్తుగా తెచ్చిపెట్టుకోవడం కారణంగానూ ఆర్కిటిక్ ప్రాంతంలో పోలార్ ఎలుగుబంట్లు సంఖ్య తగ్గుతోంది. ఇటీవల సేకరించిన లెక్కల ప్రకారం ప్రస్తుతం 20 వేల పోలార్ ఎలుగుబంట్లు ఉన్నాయి. (సి.ఇ.ఇ. – ఎన్.ఎఫ్.ఎస్)

## సాహిత్య అకాడమీ తొలి అవార్డు గ్రహీత




*పంజాబీ భాష రచయిత్రి, కవయిత్రి అయిన అమృతా ప్రీతం సాహిత్య అకాడమీ తొలి అవార్డును అందుకున్న మహిళ. 'సునహరే' శీర్షికతో వెలువడిన ఆమె కవితా సంకలనానికి 1956వ సంవత్సరంలో సాహిత్య అకాడమీ అవార్డు ఇవ్వబడింది.*

''వాడిన మాట మరియు విసిరిన రాయి తిరిగిరావు.''

# వారలు

## ''భారతదేశపు ఆపిల్ రాష్ట్రం''



మనదేశంలో పండే ఆపిల్ పంటలో 90 శాతం పండ్లు మనదేశపు హిమాచల్ ప్రదేశ్‌లో పండుతున్నాయి. ప్రతి సంవత్సరం ఈ రాష్ట్రం ఇతర రాష్ట్రాలకు 1 కోటి 75 లక్షల పెట్టెలను ఎగుమతి చేస్తోంది.

## రైలు పట్టాలపై నడిచే తొలి ఆసుపత్రి

టాటా స్టీల్స్‌వారి లైఫ్ లైన్ ఎక్స్‌ప్రెస్ మొత్తం ప్రపంచంలోనే రైలు పట్టాలపై నడిచే తొలి ఆసుపత్రి. ఈ కదిలే ఆసుపత్రి మన గ్రామాలలో నివసించే సామాన్యులకు చూపును ప్రసాదించింది. కదలలేనివారికి నడిచే సదుపాయాన్ని కలిగించడంతో పాటు చెవిటి వారికి వినే పరికరాన్ని ఇవ్వగలిగింది.

## హోమర్ వర్ణ చిత్రానికి 30 మిలియన్ల డాలర్లు

అమెరికన్ వర్ణ చిత్రకారుడు విన్‌స్లో హోమర్ (Winslow Homer) గీసిన 'లాస్ట్ ఆన్ ది గ్రాండ్ బాంక్స్' అన్న చిత్రాన్ని మైక్రోసాఫ్ట్ ఛైర్మన్ బిలియనీర్ బిల్ గేట్స్ 30 మిలియన్ డాలర్ల రికార్డు ధరను చెల్లించి కొన్నాడు.

## చైనా దేశపు వ్యవసాయ ఉత్పత్తి

ప్రపంచపు వ్యవసాయం భూములలో 10 శాతం వ్యవసాయ భూమిని కలిగి ఉన్న చైనా 460 మిలియన్ టన్నుల గింజలను పండిస్తోంది.

---

## ప్రపంచపు రెండవ అతి వయోవృద్ధుడు

*జపానులోని ఓకినావా (Okinava) దీవులలో 112 సంవత్సరాల– జపాను దేశస్థుడైన – గెంగాన్ టొనాకి (Gengan Tonaki) నివసిస్తున్నాడు. ఇతడే ప్రపంచపు రెండవ అతి వయోవృద్ధుడు.*

**''ఆశావాదికి అన్ని వాకిళ్ళకు పిడులూ, మడత బంధులూ (Hinges) ఉంటాయి. అదే నిరాశావాదికి అన్ని వాకిళ్ళకు తాళాలు, గడియలు ఉంటాయి.''**

## 100 కోట్లకు చేరనున్న మన జనాభా




1951వ సంవత్సరంలో మనదేశ జనాభా 36 కోట్లుగా నమోదయింది. 1961వ సంవత్సరంలో 44 కోట్లుగా నమోదైన జనాభా 1971వ సంవత్సరంలో 55 కోట్లుగా మారింది. 1981లో 68 కోట్లున్న మన జనాభా 1991 నాటికి 84.6 కోట్లుగా మారింది. రాబోయే జనగణన- 2001వ సంవత్సరం – నాటికి 100 కోట్లకు చేరవచ్చునన్న మన జనాభా 1999వ సంవత్సరం అగస్టు 15వ తారీఖుకే చేరుకుంది.

## తమిళనాడులోని 2000 టన్నుల గంధపు చెక్క

ప్రతి సంవత్సరం తమిళనాడులో 1500 మొదలు 2000 టన్నుల దాకా గంధపు చెక్క తయారవుతోంది. ఇది ఒక్క భారతదేశంలోనే కాదు, మొత్తం ప్రపంచంలోనే రికార్డు స్థాయి ఉత్పాదన.

## వాటికన్ నగరంలోని రహస్య ప్రాచ్యలిఖిత భాండాగారంలోని 8వ హెన్రీ లేఖ

ఇప్పటికి సుమారు 400 సంవత్సరాల క్రితం ఇంగ్లాండు చక్రవర్తి ఎనిమిదవ హెన్రీ రాసిన లేఖ ఇటలీలోని రోమ్ నగరపు వాటికన్ ప్రాచ్యలిఖిత భాండాగారంలో రహస్యంగా దాచబడింది. ఆ లేఖ ఆంగ్లికన్ చర్చ్ ఉదయించడానికి కారణభూతమైంది.

## అతి ఖరీదైన నగరాలు

మనుగడ దృష్ట్యా ప్రపంచంలోని 120

---

## ప్రపంచపు అతి పెద్దదైన ఫిల్మ్ స్టూడియో కాంప్లెక్స్

*అమెరికా సంయుక్త రాష్ట్రాల కాలిఫోర్నియా రాష్ట్రానికి చెందిన లాస్ ఏంజెల్స్‌లోని యూనివర్సిటీలో ప్రపంచపు అతి పెద్దదైన ఫిల్మ్ స్టూడియో కాంప్లెక్స్ నిర్మాణం జరిగింది. దీని వెనుక భాగంలో 561 కట్టడాలు ఉన్నాయి. ఇందులో 170 హెక్టార్ల విస్తీర్ణంలో కట్టబడిన 34 సౌండు స్టేజీలు ఉన్నాయి.*

''వయసు కారణంగా చర్మం ముడతలు పడుతుంది. ఉత్సాహాన్ని వదులుకుంటే ఆత్మపై ముడతలు పడతాయి.''

అతి పెద్ద నగరాలలో మన దేశపు ముంబాయి, ఢిల్లీ నగరాలు అతి ఖరీదైన నగరాలు.

## అన్నమాచార్య కీర్తనల ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్వర్యంలో నడుస్తున్న 'అన్నమాచార్య ప్రాజెక్టు' వాగ్గేయకారుడైన అన్నమాచార్యులు రచించిన సుమారు 14,000 కీర్తనలను 35 సంపుటాలుగా ప్రచురించే పనిని చేపట్టింది.

## భారతదేశపు తొలి టెలివిజన్ కేంద్రం

1959వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో మనదేశ రాజధాని ఢిల్లీ నగరంలో తొలి టెలివిజన్ కేంద్రం ప్రయోగాత్మకంగా స్థాపించబడింది. ఇక్కడి 500 వాట్స్‌ల ట్రాన్స్‌మీటర్ 24 కిలోమీటర్ల దూరం వరకు ప్రసారణ చేయగలిగింది.

## 2001వ సంవత్సరంలో రానున్న జనగణన

ప్రతి పది సంవత్సరాలకు ఒకసారి తీసుకోబడే జనగణన వరుసలో 14వ జనగణన 2001వ సంవత్సరంలో రానున్నది. ఈ రానున్న జనగణన 21వ శతాబ్దపు తొలి జనగణన అవుతుంది. ఈ జనగణన కార్యక్రమం 2001వ సంవత్సరంలో మార్చి ఒకటవ తేదీన సూర్యోదయంతో మొదలవుతుంది.

## రోజూ వాడే భాషగా హీబ్రూ

సంస్కృతం లాగా హీబ్రూ భాషను కూడా ప్రజలు మృత భాషగా భావిస్తున్నారు. కాని ఈ మృత భాషకు జీవం పోసి ఇజ్రాయిల్ దేశం వారు దానిని రోజూ వాడే భాషగా స్వీకరించారు. ఈ విధంగా మృత భాష - హీబ్రూ-కు ప్రాణప్రతిష్ఠాపన జరిగింది. ●

---

## తొలి భారతీయ సైన్యాధ్యక్షుడు




ఫీల్డ్ మార్షల్ కె.ఎం. కరియప్ప మనదేశపు సైన్యాధ్యక్షుడిగా నియమింపబడిన తొలి భారతీయుడు.

''మీరు చేయలేని పనిని మరొకడు చేయగలడన్న కారణంగా న్యూనతాభావం కలిగి ఉండడం కంటే మీరు మాత్రం చేయగలిగిన, ఇతరులు చేయలేని పనిపై మీ మనసును లగ్నం చేయడం మంచిది.''

# నారతో కూడిన పదార్థాలను ఎక్కువగా తీసుకోండి

మీ బరువు తగ్గించుకోవాలని ఉందా? మీ పెద్ద పేగుల ఆరోగ్యాన్ని పెంచుకోవాలనుకుంటున్నారా? రక్తంలో కొలెస్ట్రాల్ శాతాన్ని తగ్గించుకోవాలనుకుంటున్నారా?




అయితే ఎక్కువ నార (Fibre)తో కూడిన ఆహారం మీకు ఉపయోగపడగలదు. జాతీయ పుట్టకురుపు సంస్థ (National Cancer Institute) వారు రోజూ 20 మొదలు 30 గ్రాముల నారతో కూడిన ఆహారం తీసుకోవాలని సలహా ఇస్తున్నారు.

నార ఉన్న ఆహారానికి సంబంధించిన కొన్ని చిట్కాలు:

ఉదయం మీరు తీసుకునే బ్రేక్‌ఫాస్ట్ జ్యూస్‌కు బదులుగా ఒక తాజా బత్తాయి పండునూ, పైతోలు తీసిన ద్రాక్ష పండునూ, ముక్కలు చేసిన ఆపిల్‌తో చేర్చి తీసుకోండి.

★ పండ్ల, కూరగాయల – ఆపిల్ పీచ్ (దొండపండు వంటి ఎర్రని పండ్లు) టొమేటోలు, క్యారెట్లు మొదలైన– తోలుతో ఉన్న విలువైన నార ఉన్న పదార్థాలు తినండి. పిసికిన లేదా గుజ్జు చేయబడిన బంగాళాదుంపలకు బదులు, తోలుతో ఉన్న ఉడికిన బంగాళాదుంపలను తినండి. ఉడికించడానికి వాటిని శుభ్రంగా కడిగి శుభ్రపరచాలన్న విషయాన్ని గుర్తుపెట్టుకోండి.

★ మీరు సాధారణంగా భుజించే ఆహారానికి బదులుగా నార అధికంగా గల పదార్థాలను తీసుకోండి. తెల్లటి బ్రెడ్, అన్నం లేదా పాస్టా (Pasta)కు బదులుగా తవుడు (Bran) వేరుపరచని పప్పుతో చేసిన బ్రెడ్‌ను, ధాన్యజాతి మొక్కలనూ (Cereals) పాస్టానూ, గోధుమ రంగు బియ్యాన్నీ తినండి.

★ మీరు నారతో కూడిన ఆహారపదార్థాలను తీసుకోవడం మెల్లమెల్లగా ఎక్కువ చేసుకుంటున్నప్పుడు నీళ్ళు ఎక్కువగా తాగుతూ ఉండాలన్న విషయాన్ని గుర్తుపెట్టుకోండి.

– ('హెల్త్' సౌజన్యంతో)

''మోహం, లోభత్వం కారణంగా అవగాహనాశక్తి మందగించి పడుతుంది. తెలివితేటలు తప్పుదారిపడతాయి. జ్ఞాపకశక్తి గందరగోళంగా తయారవుతుంది.''

# కంటి జాగ్రతలు

మీ కన్ను ఒక చిన్న కెమెరా లాంటిది. ఒక వస్తువు నుండీ వెలువడిన కాంతి గాజులాంటి కంటిపాపలో (Cornea) ప్రవేశిస్తుంది. ఆ తరువాత కంటినల్లగుడ్డు మధ్య ఉండే రంధ్రం ద్వారా ప్రయాణం చేసి తెరలాంటి రెటీ




నాపై పడుతుంది. అక్కడ ఆ వస్తువు యదార్థ ప్రతిబింబం ఏర్పడుతుంది. అప్పుడు దానిని మెదడు గ్రహిస్తుంది. ఈ క్రియకు ఒక సెకను మాత్రం పడుతుంది. మీ కన్నులు చాలా అమూల్యమైనవి. మీరు వాటిని గురించి ఏ జాగ్రత్తలు తీసుకుంటున్నారు?

★ దేనినైనా సరే గుడ్లు మిటకరించి చూడకండి. చదువుతున్నప్పుడూ లేదా టెలివిజన్‌ను చూస్తున్నప్పుడు కనురెప్పలను తెరిచి మూసుకోవడం వల్ల కంటికి విశ్రాంతి లభిస్తుంది.

★ చదువుతున్నప్పుడు కూర్చొని చదవండి. వెల్లికిలా పడుకోవడం కానీ, ఒక వైపు తిరిగి పడుకోవడం కానీ – చదివేటప్పుడు– చేయకండి. మీ వెనుక భాగం నుండీ వెలుతురు పుస్తకంపై పడేలా చూసుకోండి. కదులుతున్న వాహనంలో ఉన్నప్పుడు చదవకండి.

★ చాలాసేపు టెలివిజన్‌ను చూడడం కళ్ళకు హానికరం. టెలివిజన్ తెర నుండీ కనీసం 10 అడుగుల దూరంలో కూర్చోండి.

★ చివరిగా రోజుకు కనీసం 8 గంటలసేపు నిద్రపోండి. రాత్రంతా విశ్రాంతి తీసుకున్న కళ్ళు పగటిపూట బాగా చూడగలవు.

(– 'బాలవిహార్')

# తెలియని విషయాలు

*మురికిపట్లా, అంటువ్యాధిపట్లా లూయిస్ పాశ్చర్‌కు చెప్పలేని భయం ఉండేదని ప్రజలు అనుకునేవారు. అందుకే అతడు కరచాలనం చేయడానికి తిరస్కరించేవాడు.*

''నైతికంగా సరైనది రాజకీయంగా సరైనది కాజాలదు.'' – డేనియల్ ఓ సెన్నెల్

# సరసోకులు

## మీరు ఎప్పుడైనా గమనించారా?

★ మీ బస్సు ఎల్లప్పుడూ మీరు బస్సు స్టాపును చేరిన వెంటనే బయలు దేరడం..



★ మీకు తప్పనిసరిగా కావల్సినప్పుడు ఏదో లేదన్న భావన కలగడం...

★ మీరు ఇల్లు త్వరగా చేరుకోవాలన్నప్పుడు రవాణా రద్దీలో చిక్కుకపోవడం..

★ మీరు గొడుగు చేతపట్టుకుని బయలుదేరినప్పుడంతా ఎండకాయడం..

★ ఆడవారు షాపింగ్ చేస్తే మగవారు ఆ సంచులను ఇంటి వరకు మోయడం..

★ కోడలుకు ఇష్టమైన వాటినంతా, అత్త అయిష్టపడడం..

★ అది మీ పేరే అయినా దానిని ఎక్కువగా ఇతరులే వాడడం..

★ జరగకూడదని మీరు భావిస్తున్నప్పుడు అనుకోనిది జరగడం..

★ మీరు ఎగతాళి చేసిన ప్రజలు జీవితంలో మీకంటే ముందుకు సాగిపోవడం..

– వీటిని మీ జీవితంలో మీరు ఎప్పుడైనా గమనించారా?

– కె.ఎస్. రాజశేఖర్

('మద్రాసు ప్లస్' సౌజన్యంతో)

## నావికులు వాడే మత్స్యయంత్రం

ప్రాచీన భారతదేశంలో నావికులు మత్స్యయంత్రాన్ని వాడేవారు. దానినే ఈ రోజు మారినర్స్ కాంపాస్ *(Mariner's Compass)* అంటున్నారు. నీళ్ళు లేక నూనెతో నిండిన పాత్రలో చేపను పోలిన ఒక తేలాడే సూదిని ఉంచేవారు. ఈ సూది బహుశా అయస్కాంత గుణం కారణంగా కావచ్చు ఉత్తరం దిక్కును సూచించేది.

''మంచిగా ఆలోచించడం వివేకంతో కూడినది. మంచి ప్రణాళికను తయారుచేసుకోవడం మరింత మంచిది. మంచిగా చేయడం చాలా మంచిది'' – పర్షియన్ సామెత

# ఇంటర్వ్యూలో పాల్గొంటున్నప్పుడు గుర్తుంచుకోవలసిన విషయాలు

రాబర్ట్ జె. లుమ్స్‌డెన్

తయారీ:

అన్ని విషయాలలో పూర్తిగా తయారయి ఇంటర్వ్యూకు వెళ్ళండి. ఎలాంటి ప్రశ్నలు అడగబడతాయో ఊహించి దానికి కావల్సిన జవాబులను తయారు చేసుకోండి.




మీరు దరఖాస్తు పెట్టుకొని ఇంటర్వ్యూకు పోతున్న సంస్థకు సంబంధించిన విషయాలను - చరిత్ర, పురోభివృద్ధి, ప్రస్తుతం సాధించిన విషయాలు ప్రణాళికలు, అమ్మకాలకు సంబంధించిన వివరాలు- గురించి అన్ని విషయాలను తెలుసుకోండి. ఈ విధంగా ఆ సంస్థ పట్ల మీకున్న ఆసక్తిని మీరు వ్యక్తపరచగలిగితే మిమ్మల్ని ఇంటర్వ్యూ చేస్తున్న వ్యక్తులు ప్రభావితం అయ్యే అవకాశం ఉంది. ఆ సమయం వచ్చేంత వరకూ, మీ ఊహాశక్తిని లేదా కల్పనను ఆధారం చేసుకుని ఎంతో ఆత్మవిశ్వాసంతో అధికారయుక్తంగా జవాబులు ఇస్తూ రండి.

మీ వాదనను ధైర్యంగా ఇంటర్వ్యూ బోర్డు ముందు ఉంచడానికి సన్నిద్ధులుగా ఉండండి. మీ అనుభవాలను ఒకసారి గుర్తుకు తెచ్చుకోండి. ఉదాసీన భావాన్ని విడనాడండి. సాధ్యమైనంతవరకు ఒకటి రెండు మాటలతో కూడిన ముక్తసరి జవాబులను ఇవ్వడం మానండి. మిమ్మల్ని ఇంటర్వ్యూ చేస్తున్నవారు మీ వ్యక్తిత్వాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తారు. మీరు మాట్లాడుతున్నప్పుడు మీ గురించి అంచనావేయడానికి వారికి అవకాశం ఇచ్చినవారవుతారు.

'మీకు ఈ ఉద్యోగం ఎందుకు కావాలి?' అన్న ప్రశ్నకు తయారుగా ఉండండి. జీతం, పదోన్నతి, అవకాశాల మెరుగు ఆకర్షణీయంగా ఉన్నాయన్న విషయాన్ని ఒప్పుకోవడంలో తప్పేమీలేదు.

కానీ ఇతర కారణాలను గురించి చెప్పడం కూడా మంచిదే. ఉదాహరణకు

''సంతోషంగా ఉండవలసిన సమయం ఇదే. సంతోషంగా ఉండవలసిన చోటు ఇదే. ఇతరులను సంతోషపరచడమే సంతోషానికి మార్గం.'' - రాబర్ట్ గ్రీన్ ఇంగర్‌సాల్

"సవాలుతో కూడిన ఉద్యోగాన్ని నేను ఇష్ట పడతాను లేదా ఈ విధమైన పని నా అభిరుచికి తగిన పని. ఇది నాకు ఇష్ట మైన పని లేదా ఈ సంస్థతో అనుబంధం కలిగి ఉండడానికి గర్వపడుతున్నాను".

మీ దరఖాస్తులో మీకు సంబంధించిన అన్ని వివరాలు ఇచ్చే ఉంటారు. అయినా మీ ప్రస్తుత కార్యకలాపాలకూ, ఇతర అభిరుచులకు సంబంధించిన ప్రశ్నలకు జవాబు ఇవ్వడానికి తయా రుగా ఉండండి.

మీ దుస్తులు – మీరు బయటకనపడే తీరు:

ఇంటర్వ్యూకు వెళుతున్నప్పుడు చురుకు దనం ముఖ్యత్వాన్ని మీరు తెలుసుకోవాలి. అందంగా దుస్తులు వేసుకుని చక్కగా – చిందరవందరగా లేకుండా తల దువ్వు కోండి. అంతేకాని మితిమీరిన స్టైలుకు లేదా ఆడంబరానికి పోకండి.

ఇంటర్వ్యూ చేసే వారికి వారి సొంత మైన ఇష్టాయిష్టాలు, విలువలు ఉంటాయి. కొంతమంది చక్కటి చేతివ్రాత ముఖ్యమను కుంటారు. కొంతమంది సరైన సమయపా లనను ఇష్టపడితే, మరికొంతమంది తాము ఇంటర్వ్యూ చేస్తున్న వ్యక్తి తమ కళ్ళలోకి సూటిగా చూస్తున్నాడా లేదా అని గమ నిస్తూ ఉంటారు. సౌమ్యత, ఇతరుల అభిప్రాయాలను గౌరవించడం అన్నవి, ఇతరులను తప్పక ప్రభావితం చేయగలు

---

## ప్రజాస్వామ్యాన్ని పనిచేసేలా చెయ్యాలి




*ప్రజాస్వామ్యం తనకు తానే ఆచరణలో పెట్టుకునే పద్ధతి కానే కాదు. దానిని పనిచే సేలా చేయాల్సి ఉంటుంది. అది పనిచేసేలా ఉండాలంటే దానిని అర్థం చేసుకోవాలి. హుందాతనంతో కూడిన ఆలోచనలూ, నిర్భ యమైన విమర్శ అన్నవి విమర్శనాయుత ఆలో చనాపరులూ, ఆలోచించే విమర్శకులూ లేన ప్పుడు సంభవం కానేకాదు. స్వాతంత్ర్యానికి అవసరం అయినట్లే వివేకం అవసరం కూడా ఎడతెగనివిధంగా ఉంది. అయితే నిరంతరమైన జాగరూకత, అంతులేని ఆత్మవిశ్లేషణ అన్నవి స్వాతంత్ర్యానికి సంబంధించిన అంతులేని ఆత్మ పరీక్షలాంటిది. కారణం స్వయంపరిపాలన ద్వారా జరిగే పని ఎప్పటికీ నశించదు.*

– అడ్లాయ్ స్టీవెన్సన్

''మనసును లగ్నం చేయగల మనిషి ఎక్కడ ఉన్నాసరే తన చుట్టూ ఉన్న పరిస్థితుల నుండీ సదా ఎదగగలడు అతడే శాశ్వతలో విశ్రమించగలడు.'' – శ్రీరామకృష్ణ

గుతాయి. కాబట్టి ఈ రెండు గుణాలను కలిగి ఉండండి.

స్పష్టమైన గొంతుక:

స్పష్టమైన గొంతుక, మాట ముఖ్యత్వాన్ని గుర్తుంచుకోండి. ఈ రెండు గుణాలు లేనివారిని ఇంటర్వ్యూ చేసేవారు ఇష్టప డరు. అందుకే ప్రతిరోజు మీరు గట్టిగా చదువుతూ గొంతును సరిగ్గా ఉంచుకోండి. మీ గొంతుకు మీ మాట మీకు ప్రతికూ లించవచ్చుననుకొన్నప్పుడు మాట్లాడే విధా నానికి సంబంధించిన స్వల్పకాలిక కోర్సులో చేరి శిక్షణను పొందండి. మనిషి మాటల స్థాయి అందులోని విషయం అన్నవి అతడి ప్రాతిపదికకూ (Back ground) చదువుకూ, మానసిక చురుకు దనం సామర్థ్యాలకు అద్దంపడతాయి.

వైఖరి:

ఇంటర్వ్యూలో మీకు ఉద్యోగం వస్తుందా రాదా అన్న విషయం ఖచ్చితంగా మీ వైఖ రిపై ఆధారపడి ఉంటుంది.

మీరు భయపడుతున్న వైఖరినీ బయట పెడుతున్నారనుకోండి. అప్పుడు మీలో ఎంతటి ఆత్మవిశ్వాసం ఉందో తెలుసుకోవ డానికి ఆరాటపడే ఇంటర్వ్యూ చేసేవారు తెలుసుకోలేకపోతారు. అంతేకాకుండా మీలో వణుకులాంటిది పుడితే మీరు ఏ పనిని ఎప్పుడూ బాగా చేయలేరు. భయం మీ సామర్థ్యాన్ని బయటకు రానివ్వదు. ఆ కారణంగా మీరు అనర్గళంగా అభి ప్రాయాన్ని వ్యక్తపరచడంలోనూ, స్పష్టంగా ఆలోచించడంలోనూ కుంటుపడతారు.

ఇంటర్వ్యూను ఎదుర్కోవడం కష్టమైన పని అన్న భయాన్ని మీలో నుండీ పార ద్రోలండి. దానిని ఒక సవాలుగానూ, ఆసక్తికరమైన విషయంగానూ భావించండి. మీలో ఉన్న లోపాలను ఎత్తి చూపి మిమ్మల్ని ఇబ్బంది పెట్టడానికే ఇంటర్వ్యూ చేసే వ్యక్తులు అక్కడున్నారని అనుకోకండి. వారు తమకు కావల్సిన సరైన వ్యక్తి కోసం వెతుకుతారు. వారు వెతుకుతున్న, వారు అపేక్షిస్తున్న గుణాలు మీలో ఉంటే వారు చాలా సంతోషపడతా రని తెలుసుకోండి.

సక్రమమైన ఆలోచనలు:

ఈ పద్ధతిలోనే మీరు సక్రమమైన ఆలో చనలను కలిగి ఉండండి. భయానికి సంబంధించిన వక్రమైన ఆలోచనలు దూసుకువస్తే వాటిని బయటికి తరమండి.

---

## అంతర్జాతీయ పెట్టుబడి కేంద్రం వాల్‌స్ట్రీట్

***అంతర్జాతీయ పెట్టుబడి కేంద్రమైన వాల్ స్ట్రీట్ (Wall Street) పొడవు 500 మీటర్లు. 17వ శతాబ్దంలో రక్షణను కల్పించే గోడ అక్కడ కట్టబడింది. ఆ విధంగా ఆ వీధికి వాల్‌స్ట్రీట్ అన్న పేరు వచ్చింది.***

''ప్రశంస చాలా అద్భుతమైనది. ఇతరులలో ఉన్న గొప్ప నాకు కూడా అన్వయిస్తుందన్న భావనను కలుగజేస్తుంది.''

– ఓల్టైర్

ఆత్మవిశ్వాసంతో మాట్లాడేలా చూసుకోండి.

మీ వంతు రావడానికి ముందు లేదా ఇంటర్వ్యూ ప్రారంభం కావడానికి ముందు వేచి ఉండే గదిలో ఇతర ధరఖాస్తుదారులను కలిసే అవకాశం ఉంటుంది. మీ ఆలోచనలను మీ నుండి వేరు చేయబడడానికీ మీరు ఆ ఇంటర్వ్యూ నుండి బయటపడేందుకూ, మిగతావారితో స్నేహపూర్వకంగా ఉండడం మీకు సహాయపడుతుందని భావించండి.

సంతోషంతో కూడిన వైఖరి ఇంటర్వ్యూ జరిగే ముందు ఉద్రిక్తతకు గురి కాకుండా ఉండేలా చేస్తుంది. అంతే కాదు మీకు ఇంటర్వ్యూలో విజయం లభించనప్పుడు మిమ్మల్ని నిరాశపాలు కాకుండా కాపాడగలదు. అంతమాత్రాన మీరు పనికిరానివారు కారు.

ఇంటర్వ్యూకు వెళుతున్న వ్యక్తి విజయం అనేక విషయాలపై ఆధారపడి ఉంటుందన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. మరో విషయం కూడా మరచిపోకూడదు. మీరు ఎన్నిక కాకపోతే వారి ప్రస్తుత అవసరాలకు సరిపోయే గుణాలున్న వాడిని ఎన్నుకొన్నారని అర్థం చేసుకోండి.

(సంక్షిప్తీకరణ) 'సైకాలజిస్ట్ మాగజైన్' సౌజన్యంతో

## మొత్తం ఆఫీసు ఉద్యోగులు కుక్క కోసం పోయారు




ఒక విదేశీ పర్యాటకుడు ఒక చిన్న గ్రామంలో తన విలువైన కుక్కను పోగొట్టుకున్నాడు. స్థానిక పత్రికలో తన కుక్కను వెతికి పట్టి ఇచ్చిన వారికి 10,000 రూపాయల బహుమతిని ప్రకటించాడు. ఆ రోజు సాయంకాలం అయింది. కానీ పత్రిక మాత్రం వెలువడలేదు. కాస్సేపు ఆ పత్రిక రాకకై ఎదురు చూసి ఆ తరువాత పత్రిక ఆఫీసు చేరుకున్నాడు. కాపలాదారుడు తప్ప మరెవ్వరూ లేకపోవడం అతడు గమనించాడు

"ఈ రోజు సాయంకాలం పత్రిక వెలువడదా?" అని వాచ్‌మన్‌ను అతడు అడిగాడు.

"రావడం సందేహమేనండీ. ఆఫీసులోని ఉద్యోగులు అంతా కుక్కను వెతికి పట్టుకునే ప్రయత్నంలో ఉన్నారు" అని వాచ్‌మెన్ జవాబిచ్చాడు.

"తాను మోసపోయానని ఒప్పుకునేవాడు బహుశా ఎవడూ ఉండడు. అయినా నేను తప్పు చేసానని ఒప్పుకునే వ్యక్తిని వెతికి పట్టుకోవడం కష్టమైన పని."

